# ఋగ్వేద ఆర్యులు



రాహుల్ సాంకృత్యాయన్

# ఋగ్వేద ఆర్యులు

(చారిత్రక, సాంస్కృతిక అధ్యయనం)

మూలం :

రాహుల్ సాంకృత్యాయన్

అనువాదం :

విక్కలనేని సుబ్బారావు




విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్

4-1-435 విజ్ఞాన భవన్, బ్యాంక్ స్ట్రీట్

హైదరాబాద్ 500 001.

ప్రచురణ నెం. 1139
ముద్రణ జనవరి 1986
2000 ప్రతులు

వెల : రు. 16-00

ప్రతులకు :

విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్
4-1-435 విజ్ఞాన భవన్, బ్యాంక్ స్ట్రీట్
హైదరాబాద్ 500 001.

విశాలాంధ్ర బుక్ హౌస్
విజయవాడ, హైదరాబాద్, విశాఖపట్టణం,
గుంటూరు, తిరుపతి, హన్మకొండ, అనంతపురం.

ము ద్ర ణ :
రామా ప్రింటింగ్ ప్రెస్.
విజయవాడ-520 002.

సమర్పణం

వేదమర్మాలను బాగా ఎరిగినవాడు

వ్రాయటమంటే మహా బద్ధకస్తుడు

అయిన

శ్రీశ్రీశ్రీ క్షేత్రేశ చంద్ర చటోపాధ్యాయునికి

సాదరంగా ప్రేమతో—

# విషయసూచిక



## ఒకటవ భాగం-భౌగోళికం



## రెండవ భాగం-సాంఘిక ఆర్థిక జీవితం



## మూడవ భాగం-రాజకీయం



## నాల్గవ భాగం-సాంస్కృతికం

# భూమిక

## నమః ఋషిభ్యః పూర్వజేభ్యః

[10 - 10 - 15)

రెండేళ్ళనాడు నేను యిలాంటి పుస్తకాన్ని వ్రాస్తానని ఎవరైనా అంటే నాకు నమ్మకం ఉండేది కాదు. నిజంగా ఇలాంటి పుస్తకం మన భాషలో కాని, ఇతర భాషల్లో కాని లేనందున నేను వ్రాయాలని వచ్చింది. ఋగ్వేదం నుండి మన లిఖిత సామగ్రి ప్రారంభమవుతుంది. దేవుడు అబద్ధం. కాని అనేక దేవుళ్ళు కమనీయ కళకు ఆధారాలైనందున వారు మనకు అమూల్యంలూ, ఆదరపాత్రులు అవుతున్నారు. ఋగ్వేదం దేవుని సృష్టికాదు; దివ్యపురుషుల వాణికాదు. కాని అది మన సంస్కృతికి, విజ్ఞానానికి చరిత్రకు ఖాజానా. అందుచేత మనకది సర్వోత్కృష్టమైన, అమూల్యమైన నిధి. దీన్ని రచించిన వారు, దీన్ని తర తరాలవరకు కంఠస్తంచేసి అతి జాగ్రత్తగా కాపాడినవారు మన హృదయపూర్వక కృతజ్ఞతకు పాత్రులు.

దేశ విదేశాల్లోని భాషావేత్తల్లో స్వబుద్ధితో వేదాధ్యయనం చేసేవారిలో ఋగ్వేద కాలాన్ని గూర్చి పెద్దగా వివాదంలేదు. కాని ప్రతివిషయంలోను ఆధ్యాత్మిక తత్వాన్ని, రహస్యాన్ని చూచుటకు పూనుకునేవారిని బాగుచేయలేం. వారు తమ నమ్మకాలకు అంటిపెట్టుకొని వుండవచ్చు. వారిని కదిలించగలవారు లేరు. కాని ఈ తరంవారు ముందు తరాలవారిని ప్రతి విషయాన్ని మరింతగా వైజ్ఞానిక దృష్టితో పరిశీలించండని కోరుతారు. వారికొరకే నా యీ ప్రయత్నం.

ఋగ్వేదాన్ని గురించి తెలుసుకొన కోరువారు నా ఊహకు ఉన్న పరిమితులను ముందుగా తెలుసుకొనుట అవసరం. ఋగ్వేదం మన దేశంలోని తామ్రయుగ మిచ్చిన నిధి. తామ్రయుగం చివరి పాదంలో 'సుదాసు'— దాశరాజ్ఞ యుద్ధంలో విజయుడై ఆర్యుల గణవ్యవస్థకు బదులు ఏకతాబద్ధమైన సామంత వ్యవస్థను నెలకొల్పటానికి యత్నించినప్పుడు సప్తసింధు (పంజాబు) ఋషులు ఋక్కులను (రచించారు) సప్తసింధులోని ఆర్యుల సంస్కృతి ముఖ్యంగా పశుపాలకుల సంస్కృతి. ఆర్యులకు వ్యవసాయం తెలుసు. వారు యవధాన్యాన్ని పండించేవారు కూడ. కాని వారి జీవితానికి వ్యవసాయం ముఖ్యవృత్తి కాదు. గౌణం మాత్రమే. గోవులు, గుర్రాలు, గొర్రెలు, మేకలు- వారికి గొప్ప ధనం. ఇవే వారి తిండికీ,

బట్టహూ అతి ముఖ్య సాధనాలు. ఇవే తమ దేవుళ్ళను సంతోషపర్చటానికి వారికి అవసరం. 'పశుధనమే పరమ ధనం' అనుకొన్నందున ఆర్యులకు నగరాలతో పని లేకుండా పోయింది. వారికి పచ్చికబీడులున్న గ్రామాలే అవసరం. ఈ విధంగా ఋగ్వేద ఆర్యుల సంస్కృతి పశుపాలకుల సంస్కృతి, గ్రామీణ సంస్కృతి. మనం ఈ హద్దులను దృష్టిలో ఉంచుకోవాలి.

ఋగ్వేదాన్ని గురించి, విశ్లేషణ చేసేటప్పుడు మనం గుర్తుంచుకోవాల్సిన విషయాలు:-

భాషలోను, భావాల్లోను ఋగ్వేద ఆర్యులతో సంబంధమున్న వారు భారతదేశం లోనే కాదు. భారతదేశానికి వెలుపల కూడా వున్నారు. భారతదేశానికి వెలుపల ఉన్నవారిలో వారికి అత్యంత దగ్గరగా ఉన్నవారు పర్షియనులు అనగా ఇరానీయులు. వారి మతాచారాలను తెలుసుకొనుటకు అదృష్టవశాత్తు 'అవెస్తా' ఉంది. పార్శీ మతస్తులు ఇప్పుడు కూడా ఉన్నారు. వేదాన్ని 'అవెస్తాను' పోల్చుకొని అధ్యయనం చేస్తే భాషలోను, మతంలోను ఆర్యులు పారశీకులు ఒకరికొకరు చాలదగ్గర అనిపి స్తుంది. పారశీకుల తర్వాత ఆర్యులకు, స్లావులతో దగ్గర సంబంధముంది. స్లావు శబ్దం స్లాకావు (శకులు + లావులు) శబ్దంయొక్క అపభ్రంశరూపం. రష్యనులు, ఉక్రైనులు, బైలో రష్యనులు, బల్గారులు యుగోస్లోవులు, చెకోస్లోవులు, పోలులు- అందరూ స్లావు జాతివారే. వీరు శకుల సంతానం. 7-8 వందల యేళ్ళ క్రితం వీరు తమ పూర్వీకుల మతాన్ని వదిలి క్రైస్తవ మతాన్ని పుచ్చుకొన్నారు. అనాడు వీరి పూర్వులకు లిపి తెలియదు. కావున వారు తమ పవిత్ర నమ్మకాలను గురించి దేవుళ్ళను గురించి వేదం అవెస్తావంటి ఏ ప్రాచీన గ్రంథాన్ని తయారుచేసుకోలేదు. కాని వీరికి పాత గాథలో సామం అనగా ఏగేయ సాహిత్యమో వుండవచ్చు. క్రైస్తవమత స్వీకారంతోపాటు పాత నమ్మకాలు, ఆ పురాణగాథలు నశించిపోయాయి. పేరున్. సూర్యుడు మొదలగు దేవ విగ్రహాలుకూడ పూర్తిగా ధ్వంసమైనాయి. అవి పురాతన వస్తు ప్రదర్శనశాలల్లో కూడ కానరావు.

పారశీకులు, శకులు తర్వాత ఆర్యులకు లెట్- లిథువేనియనులతో దగ్గర సంబంధముంది. ఆర్య లిథువేనియను భాషలు తోబుట్టువులు. చాల దగ్గర సంబంధం కలవి. కాని ప్రాచీన పాదరీలు మత మౌఢ్యంతో కావాలని పట్టుబట్టి వారి సాహి త్యాన్ని నాశనం చేశారు. మన భారతీయ చరిత్రకు వాటిద్వారా ఎంతో సహాయం లభించేది. 16వ శతాబ్ది వరకు వారు తమ మతాన్ని అంటిపెట్టుకొని ఉన్నారు. వారి దేవతల్లో వేద దేవతలు ధ్వనిస్తారు. బాబరు, హుమాయూన్, విద్యాపతి, జాయసీల కాలం వరకు వారు తమ సంస్కృతి నిధిని వృద్ధి జేస్తూనే ఉన్నారు. కాని ఒకసారి

క్రీస్తుమతం పుచ్చుకోగానే వారికి తమ పాత మత సంబంధాలను నాశనం జేయక తప్పిందికాదు. ఎంతో కాలానికి క్రైస్తవులు సంస్కృతీ విలువను గుర్తించారు. వారిలో సహనం పెరిగింది. తమ యొక్కయు, పటుల యొక్కయు సంస్కృతీ విషయాలను కాపాడాలను ఆలోచన కల్గింది. భాషాదృష్టితో లిథువాను భాష రష్యను భాష మాదిరిగ వైదిక భాషకు అంత దగ్గరకాదు. కాని ఆ భాష వ్యాకరణంలో తన ప్రాచీనతను అట్టిపెట్టుకొంది.

తర్వాత పశ్చిమ యిరోపాలోని ప్రాచీన గ్రీకు, లాటిను భాషలకు, ఆధునిక జర్మను ఫ్రెంచి ఇంగ్లీషు మొదలైన భాషలకు- వైదిక భాషతో సంబంధముంది. వేదార్థం తెల్పుటకు ఈ భాషలన్నిటికీ హక్కువుంది. మన సంస్కృత భాషలోని ఎన్నో ధాతువులు అనగా మూలక్రియల ప్రయోగాలు ప్రాచీన సంస్కృత సాహిత్యంలో గాని, ఆధునిక సంస్కృత సాహిత్యంలోగాని కానరావు. కాని మన దేశానికి బయట ఉన్న భాషల్లో వాని ప్రయోగం కన్పడుతుంది. ఉదాహరణకు 'దబాయించు' అను ధాతువును తీసుకొందాం. ఇది మన ఆధునిక భాషలన్నిటిలో వాడుకలో ఉంది. రష్యను భాషలో కూడ వుంది. 'దబ్ల్యాత్' రష్యను క్రియా శబ్దం. హిందీలో 'దబానా' అయింది. కాని సంస్కృత భాషలో ఈ ప్రయోగం లేదు. 'సప్తసింధు' వేదంలో మాత్రమేకాదు. అవెస్తాలోను, పారశీకుల ప్రాచీన సాహిత్యంలోను— 'హప్తహిందు' వుంది. ఈ శబ్దానికి అర్థం ఏడు నదుల దేశం: ఆ ఏడు నదుల దేశంలో ఉండే ప్రజలు అని. జైమిని మహర్షి వేదాలను ఒప్పుకుంటాడు. ఆయనకు వేదాలు ప్రమాణాలు. ఆయన కూడా శబ్దార్థం చెప్పుటకు ఎన్నోచోట్ల ఆర్యుల ప్రయోగాన్ని విడిచి మ్లేచ్ఛుల ప్రయోగాన్ని స్వీకరించాడు.

"చోదితం తు ప్రతీయే తా
విరోధా త్ప్రమాణేన"—

మీ మాంస (1-36-10).

ఒకానొక శబ్దానికి అర్థం ఆర్యుల్లో అనగా భారతీయుల్లో వాడుకలో లేనందున యిక్కడ లభించదు. కాని మ్లేచ్ఛ భాషల్లో ప్రయోగం విల్చివుంది. కాబట్టి దాన్ని ప్రామాణికంగా మనం అంగీకరించాలి. ఇందుకు జైమినీ తెల్పిన ఉదాహరణలు- పిక. నేమ (సగం) మొ॥ శబ్దాలు.

ఆర్యులు సప్తసింధులో వున్నప్పుడు మెసపొటేమియాలో హిట్టయిటు జాతి వారుండేవారు. వారుకూడ 'నాసత్య' అనగా అశ్వనీకుమారులు, ఇంద్ర, వరుణ మిత్రాది దేవతలను పూజించేవారు. కావున ఋగ్వేద ఆర్యులను గురించి తెలుసు కొనేటప్పుడు ఎదురగు చిక్కులను విడిదీయుటకు మన సాహిత్య మొక్కటే చాలదు.

ఆర్యులు రాకపూర్వం భారతదేశంలో ఆర్యులకంటె ఎంతో ఉన్నతమైన ప్రాచీనమైన సంస్కృతి ఉండేది. ఆ సంస్కృతికి చెందిన కొన్ని అవశేషాలు ప్రధమంగా హరప్పా, మొహింజెదరాల్లో దొరికాయి. ఇప్పుడు గంగా, యమునా తీరాల్లోను సౌరాష్ట్రాది ప్రదేశాల్లోనుకూడ దొరుకుతున్నాయి. ఆర్యుల గ్రామీణ సంస్కృతికంటె సప్తసింధులోని ఆ నగర సంస్కృతి ఎన్నోరెట్లు గొప్పగా వుంది. ఆర్యులకు తమ పశుపాలక సంస్కృతితో, ఆ జీవితంతో అంటిపెట్టుకొని వుండాలను పట్టుదల లేకపోతే వారు ఆ నగర సంస్కృతికి అభిమానులై వుండేవారు. అయినప్పటికీ, అధ్యయనం చేసినకొలది ఆర్యులపై ఆ సంస్కృతి ప్రభావం పడినట్లే తెలుస్తుంది. ఆ సంస్కృతి, దానికి సంబంధించిన ఎన్నో విషయాలను ఆర్యులు స్వీకరించి ఉండవచ్చు. ఋగ్వేద ఆర్యులను గురించి అధ్యయనం చేయుటకు సింధు తీర ప్రాచీన సంస్కృతి ఉపకరిస్తుంది.

ఆర్య సంస్కృతికి చెందిన ప్రాచీన వస్తువులు దొరికితే సప్తసింధులోని ఆర్య జీవితాన్ని గురించి మనం ఎక్కువగా తెలుసుకోగలం. గ్రామ జీవితాన్ని ప్రేమించేవారయినప్పటికీ ఆర్యులు సోమంకొరకు ఆహార పానీయాల కొరకు రకరకాల మట్టి, కొయ్య, రాగి పాత్రలు ఉపయోగించారు. బంగారు నగలను, రత్న భూషణాలను పెట్టుకొన్నారు. రాగి ఆయుధాలను ఉపయోగించారు. వాటి అవశేషాలు తవ్వక దొరికి తీరాలి. పొగమూసిన మట్టిపాత్రలు ఆర్యులవె నంటున్నారు. అవి 'రోపర్'లోను, కురుక్షేత్రంలోను దొరికాయి. గంగానదికి తూర్పున ఇటువంటివి దొరికితే అవి ఋగ్వేద కాలం తర్వాతవని అనుకోవాలి. వీటిని మాత్రమే ఆధారం చేసుకొని ఇవి సప్తసింధులోని ఆర్యులవేనని అంటే విశ్వసించలేము.

మనం ఇంతవరకు ఆ ప్రాచీన అవశేషాలను ఎక్కువగా సంపాదించుట గాని, గుర్తించుట గాని చేయలేక పోయినప్పటికీ అవి సప్తసింధులో తప్పక దొరుకుతాయి. సప్తసింధులోని నగభాగం మాత్రమే భారతదేశంలో వుంది అయినప్పటికీ ఆనాటి ప్రముఖ ఆర్యగణాలైన పురు, త్రుక్సు, కుశికులు యీ నగభాగంలోనే ఉండేవారు.

ఆర్యులకు నాడు సింధు సంస్కృతి ప్రజలతోనే కాదు, మరొక జాతితోకూడ సంబంధంవుంది. ఆ జాతితో కూడ వారు యుద్ధం చేసినట్లు ఋగ్వేదం చెప్పుతూ వుంది. ఋగ్వేదంలో వారు దాసులుగా, దస్యులుగా చెప్పబడ్డారు. కిర, కిరాత- లేక కిలాత, చిలాత పేర్లు అప్పుడుకూడ ప్రసిద్ధంమై ఉండవచ్చు. ఆ ప్రజల అవశేషాలు హిమాలయంలో ఇప్పుడు కూడ దొరుకుతున్నాయి. కొద్ది వైదిక ఆర్యుల చరిత్రను వెలుగులోనికి తెచ్చుటకు ఆ జాతుల వారు తమ భాషద్వారా హక్కును కల్గిఉన్నారు. హిమాలయంలో యిప్పుడు కిరాతులు తక్కువ సంఖ్యలో ఉన్నారు. కాని వారూ, వారితో కూడ ఉండే ఖస్సులూ యిప్పుడు కూడ ఎన్నోచోట్ల ఎంతో సంస్కృతిని

కల్గి ఉన్నారు. వారి జీవిత విధానాన్ని మత విశ్వాసాలను సహాయంగా తీసుకొంటే ఋగ్వేద ఆర్యులను గురించి తెలుసుకొనుట సులభమవుతుంది. ముఖ్యంగా వైదిక దేవతలకు, ఆర్యులకు ఉన్న సంబంధంలాంటిదే ఇప్పుడుకూడ ఈ హిమాలయ జాతుల్లో అనేక అంశాల్లో ఉంది.

ఋగ్వేదం స్వతః ప్రమాణం. అది తన ప్రదేశాన్ని గురించి అధికార పూర్వకంగా చెప్పగల్గినట్లు మరొకరు చెప్పలేరు. ఋగ్వేదం సామవేదం, యజుర్వేదం— యీ మూటిని కలిపి వేదత్రయం అంటారు. బుద్ధుని కాలంలో అనగా క్రీ.పూ. 6-5 శతాబ్దాల్లో మూడు వేదాలని స్పష్టంగా చెప్పబడింది. ఋగ్వేదాన్ని, సామవేదాన్ని పోల్చిచూస్తే సామవేదం ఋగ్వేదానికి భిన్నంకాదని తెలుస్తుంది. సామవేదంలో 2,814 మంత్రాలున్నాయి. అందులో 75 మంత్రాలను మినహాయిస్తే మిగిలిన అన్నీ ఋగ్వేదం లోనివే. సోమపానం, సోమయాగం చేసేటప్పుడు పాట అవసరం. ఋగ్వేదంలో కూడ సోమాన్ని గురించిన అనేక ఉక్తులు, స్తోత్రాలు అనగా స్తుతి వాక్యాలు ఉన్నాయి. సూరదాసుకవి హిందీలో రచించిన భాగవతానికి సూరసాగరమని పేరు. అందులోని అనేక పదాలను స్వరబద్ధంచేసి వేరుగా సంకలనం చేసినట్లు సంగీత స్వరకల్పనను దృష్టిలో పెట్టుకొని ఋగ్వేదం నుండి సామవేదాన్ని వేరు చేసారు.

యజుర్వేదంలోని వాజసనేయ సంహితలో 40 అధ్యాయాలు, 1988 కండిక లేక మంత్రాలున్నాయి. ఇవి గద్య, పద్య మిశ్రితం. పద్య భాగంలో ఋగ్వేదంలోని ఋక్కులే ఎక్కువ. సామవేదం గేయ మంత్రాల సంహిత. యజుర్వేదంలోకూడ ఋగ్వేదంలోని అనేక ఋక్కులను, ఇతర రచనలను కలిపి యజ్ఞాల్లో ఉపయోగపడుటకు ఒక సంహితను తయారుచేసారు. దర్శపూర్ణమాస, అగ్నిష్టోమ, వాజపేయ, రాజసూయ, సౌత్రామణి, అశ్వమేధ, సర్వమేధ, పితృమేధ మొదలగు యజ్ఞాల్లో ఉపయోగపడు మంత్రాల సంకలనం యజుర్వేదం. చివరి అధ్యాయం మాత్రం అనగా 40వ అధ్యాయం బ్రహ్మజ్ఞానాన్ని గురించి ఉంది. అదే ఈశావాస్యోపనిషత్తు. వేదాలకు అంతంలో ఉన్నందున దీనికి వేదాంతమనుపేరు వచ్చింది తర్వాత బ్రహ్మవిజ్ఞానం ఉపనిషత్తులను గురించి వ్రాసిన విమర్శనా గ్రంథాలను కూడ వేదాంతం అన్నారు. ఋగ్వేదంలో చెప్పిన సోమపానాది అనుష్ఠానాల్లో దివ్యాదివ్యాలు అనగా దేవ, మానవుల అంశాలు కలిసి ఉన్నాయి. ఋగ్వేద కాలం తర్వాత యీ విధానం దివ్యత్వంగా మారిన కాలంలో యజుర్వేదం వ్రాయబడ్డది. శుక్ల యజుర్వేదం కంటే కృష్ణయజుర్వేదం చాల పురాతనం. యజుర్వేదం, అథర్వవేదం బ్రాహ్మణములు—వీని రచనాకాలం క్రీపూ. 1000-700 కావచ్చును. ఋగ్వేదం తర్వాత వున్న యీ గ్రంథాలద్వారా కూడ ఋగ్వేదాన్ని గురించి అప్పటి ఆర్యుల గురించి

సూచనప్రాయంగా తెలుస్తుంది. ఋగ్వేద కాలంనాటి చారిత్రక సామగ్రిని తారుమారు చేసే పోకడ యజుర్వేద కాలంలో ఆరంభమైంది. మహాభారతం, రామాయణం పురాణాల్లో ఈ ధోరణి విస్పష్టంగా కన్పడుతుంది. కాబట్టి మనం వీటిని ఉపయోగించుకొనుటలో మిక్కిలి జాగ్రత్త వహించవలసివుంటుంది.

ఈ అధ్యయనం అసంపూర్ణం. ఋగ్వేదంలోని ఆరవ వంతు మాత్రమే ఈ గ్రంథ రచనకు ఆధారంగా తీసుకొన్నాం. ఇందులకు రెండువేల ఋక్కులు ఉపయోగ పడ్డాయి. ఇంతకంటె ఎక్కువ ఋక్కులు చారిత్రక జ్ఞానాన్ని పెంపొందించటానికి వుపయోగ పడవచ్చు. ఇందు ఉపయోగించిన కొన్ని ఉపయోగ కరమైన ఋక్కులను గ్రంథం చివర అర్థంతో సహా పొందుపర్చినాం. అవి విద్యార్థులకు, పరిశోధకులకు కూడ ఉపయోగపడతాయి. పేర్ల పట్టికలోను. దేవతల పట్టికలోను ఎంతో ఉపయోగపడు సామగ్రిని సేకరించి ఇచ్చుటకు ప్రయత్నించాం. 'మనం-మన పూర్వీకులు అను శీర్షిక క్రింద సాంస్కృతిక మార్పులను గురించి కొన్ని అవసరమైన వాస్తవాలను ఇచ్చాం.

—•—

# మనం - మన పూర్వీకులు

నేడు మనదేశంలో మానవుని చూస్తున్నాం. అతని సాంఘిక, రాజకీయ, మత జీవితాన్ని ఎరుగుదుం. అతని ఆహారం, వేషభాషలు, నిత్యావసరాలు ఏమిటో మనకు తెలుసు. "తనకు సంబంధించిన ప్రతి విషయంలోను మార్పు జరుగుతూ వుంది" అనే సంగతిని ఎవరూ కాదనలేరు. కాని ఆ మార్పు ఎంత తీవ్రంగా జరిగిందో తెలుసుకొనుట కష్టం. ఇందుకు నూరు సంవత్సరాల తేడాతో చారిత్రక కాలాన్ని, అంతకంటె ఎక్కువ తేడాతో చరిత్రకు పూర్వమున్న కాలాన్ని సాంఘిక, ఆర్థిక, మతదృష్టితో పరిశీలిస్తే, ఆ మార్పు నమ్మకంగా తెలుస్తుంది. మనం క్రీ॥ శ॥ 1956 నుండి కాకుండా క్రీ॥ శ॥ 1950 నుండి వెనక్కు పయనించుదాం. ఇక్కడ 1957 ను గురించి ఒకమాట చెప్పాలి. 1857 లో ఆంగ్లేయులకు వ్యతిరేకంగా తిరుగుబాటు జరిగింది; 1757 లో ప్లాసీయుద్ధంలో విజయులైనందున మనదేశంలో ఆంగ్లరాజ్య స్థాపన జరిగింది. కాబట్టి చాలమంది మేధావులు '57' ను చాల చెడుగా భావిస్తారు. కాని 1657, 1557, 1457 మొదలైన సంవత్సరాల్లో ఇటువంటి అనిష్టాలు మనదేశంలో ఏమీ కానరావు.

## 1) క్రీ॥ శ॥ 1950.

1. ఇప్పుడు మనం రాతియుగం, రాగియుగం, ఇనుపయుగం, తుపాకిమందు అన్ని యుగాలను దాటి పరమాణుయుగంలో ఉన్నాం.
2. వాయు మండలంపై మనకు అధికారముంది, గంటకు 500 మైళ్ళ వేగంతో పోయే విమానాలు ఆకాశంలో పరుగులు తీస్తున్నాయి. ఇక రైళ్ళు, మోటారువాహనాల సంగతి చెప్పేదేముంది?
3. మనది ప్రజాస్వామ్య గణతంత్ర వ్యవస్థ.
4. మన గణరాజ్యానికి రాష్ట్రపతి డా॥ రాజేంద్రప్రసాదు. ఆయన మనదేశ రాజధాని ఢిల్లీలో వుంటారు.
5. మనకు ముఖ్యమైన సమన్వయ భాష హిందీ. దేశంలోని వివిధ రాష్ట్రాలలో అసామీ, బెంగాలీ, ఒరియా, తెలుగు, తమిళం, మలయాళం, కన్నడం, మరాఠీ, గుజరాతీ మొదలైన సాహిత్య భాషలున్నాయి. ఇవేకాకుండా మైథిలి, మాగధీ, భోజపురి, వ్రజ, మాళవీ, రాజస్థానీ, కౌరవీ, పహాడీ మొదలైనవి కూడ సాహిత్య భాషలే. (అవికూడ సాహిత్యభాష లవుతున్నాయి)
6. మనం పెట్టుబడిదారీ వర్గవ్యవస్థలో వున్నాం.

7. మన దేశంలో రాజ్యాధికారాన్ని అట్టిపెట్టుకొనుటకు యుద్ధ విమానాలు, అణు బాంబులు పరమాస్త్రాలుగా వున్నాయి. భీషణ ఫిరంగులు, మెషీనుగన్నుల సంగతి చెప్పనవసరంలేదు.

8. మన దేశంలో హిందూ మతం, ఇస్లాం మతం, ముఖ్య మతాలు. కాని విద్యావంతులకు ఆ మతాలపై పూర్వంవలె విశ్వాసంలేదు.

9. చదువుకొన్నవారు ఆహార పానీయాల్లో అంటును పాటించరు, వివాహాల్లో కూడ కులగోత్రాలు కూలుతున్నాయి.

10. సాహిత్యాకాశంలో రవీంద్రుడు, జయశంకరప్రసాదు అస్తమించారు. హిందీలో నిరాలా, సుమిత్రానందన పంతు యిప్పుడుకూడ దేదీప్యమానంగా ప్రకాశిస్తున్నారు.

11. పురుషుల దుస్తులు:- కోటు, ప్యాంటు, అచకన్-పాయిజామా, చొక్కా-ధోవతి. గౌరవ దుస్తులు : కోటు, ప్యాంటు మాత్రమే.
స్త్రీల దుస్తులు:- చీరె, అప్పుడప్పుడూ సల్వారు పైవేయగ వుంటుంది. జాకెట్టు-పరికిణీ, కుర్తా-పాయిజామా, ప్రాంతీయ చీరెలను స్త్రీలు యింకా వాడుతున్నారు.

12. జనాలలో ఎక్కువ మంది మాంసాహారులు. అయితే వారి మందికి సంవత్సరంలో 1-2 పర్యాయాలకంటె ఎక్కువసార్లు అది దొరకదు. తరతరాల నుండి మాంసం తిననివారు, మొదట గుడ్డుకు, తర్వాత క్రమంగా మాంసానికి, చేపలకు అలవాటు పడుతున్నారు. ప్రాచీనకాలంలో మాంసాన్ని, చేపలను భక్ష్యములన్నారు. కాని గుడ్డు మాత్రం అభక్ష్యం. నాగరిక ప్రపంచంలో చైనావారు మొట్టమొదట గుడ్డు తినటం మొదలెట్టారు. తర్వాత యూరోపియులు, మహమ్మదీయులు అంగీకరించారు. ఇది 1800 వ సంవత్సరం.

2) క్రీ॥ శ॥ 1850

1. మనం ఆవిరియుగంలో వున్నాం.

2. మన దేశంలో యిప్పుడిప్పుడె రైళ్ళు ఆరంభం. ఆవిరితో నడిచే ఓడలు మన ఓడరేవుల్లో తిరుగనారంభించాయి.

3. మన రాజధాని కలకత్తా.

4. ఇంగ్లాండురాణి విక్టోరియా మహారాజ్ఞి తరపున గవర్నరు జనరలు మన పాలకుడు.

5. ఇంగ్లీషు రాజభాష అయింది. క్రింది పనులకు ఉర్దూ, బెంగాలీభాషలు వాడుతున్నారు.

6. పెట్టుబడిదారులైన యింగ్లాండు వారిచేతుల్లోకే మనదేశం పరాధీనమైంది.

7) 1853లో రైలుకూడ యుద్ధసాధనంగా వుంది. పూర్వంకంటే శక్తికల ఫిరంగులు, తుపాకులు వున్నాయి. కాని తోటాలు గుళ్ళలాంటివి ఇంకా వాడుకలోలేవు.

8) హిందు, యిస్లాం మతాలు ముఖ్యమైన మతాలు. ప్రజలకు మతాచారములందు అపరిమితమైన నమ్మకం.

9) ఎక్కువమంది మాంసాహారులు. అస్పృశ్యత, కులవిభక్తత తీవ్రంగావుంది. మహమ్మదీయునిచేతి నీళ్ళు త్రాగగానే హిందువు మతభ్రష్టుడవుతున్నాడు. చాలమంది వ్యాపారస్తులు, పురోహితులు మాంసాన్ని తినుటలేదు.

10) నవ సాహిత్య గగనంలో మహాకవి గాలిబు వున్నాడు. కళలందు ప్రాచీనతను అనుకరిస్తున్నారు.

11) పెద్దలకు మిర్జయి, మతన్ ప్రధాన దుస్తులు. స్త్రీలు వారి ప్రాంతాలనుబట్టి, వర్గాలనుబట్టి దుస్తులు వేసుకొంటున్నారు. పాశ్చాత్య రాజవంశీకుల, నవాబుల స్త్రీలు కుచ్చిళ్ళ వున్న పాయజామాపైన పేషవాజు ధరిస్తున్నారు. ఇతర స్త్రీలు జాకెట్టు-పరికిణి, చీరెలు వేసుకొనేవారు. ఇది క్రి. శ. 1850.

(3) క్రీ. శ. 1750.

తుపాకియుగం. రాజధాని ఢిల్లీ. బలహీనుడైన అహమ్మదుషా మొగలాయి చక్రవర్తి. పార్శీభాష. రాజకీయ సామంతవాద వ్యవస్థ. దాసత్వం వుంది. వర్తిలో వున్న ఫిరంగులు మనకున్న పరమాస్త్రాలు. హిందు, యిస్లాంలు ప్రధాన మతాలు. హిందువుల సంఖ్య ఎక్కువ. మాంసాహారులు ఎక్కువ. అంటు ఎక్కువ. హిందువులు, మహమ్మదీయులు ఒకరి చేతినీరు మరొకరు త్రాగరాదు. తిండి, పెళ్ళి స్వకులంలోనే. చొలంకీ మిర్జయి, నుత్తన్ గొప్పవారి దుస్తులు. ఉత్తర దేశపు సామంతరాజుల స్త్రీలు పాయజామ, పేషవాజు ధరించేవారు. ఇతరులు పరికిణి-జాకెటు: ప్రాంతీయ చీరెలు వేసుకొనేవారు. ఇది క్రి. శ. 1750.

(4) క్రీ॥ శ॥ 1650

మనం యినుపయుగంలోని తుపాకీ ఉపయుగంలో వున్నాం. రాజధాని ఢిల్లీ. రాజు షాజహాను చక్రవర్తి. రాజభాష పార్శీ. సామంతవాద నిరంకుశత్వం, దాసత్వ ఆచారం బాగా వ్యాప్తిలో వుంది. కత్తితోవున్న ఫిరంగులు మనకున్న శక్తివంతములైన పరమాయుధాలు. హిందు, యిస్లాంలు ప్రధానమతాలు. ఎక్కువమంది మాంసాహారులు. అంటరానితనం ప్రబలంగావుంది. హిందువుల్లో తిండి, పెళ్ళి వారిజాతివరకే పరిమితం. సాహిత్యాకాశంలో తులసీదాసు అస్తమించాడు.

ఉత్తరదేశంలో సామంతుల దుస్తులు—మిర్జయి, ముత్తన్, స్త్రీల దుస్తులు-పాయజామా, పేషవాజు, ఇతర స్త్రీలకు వారి ప్రాంతీయ దుస్తులు. ఇది క్రీస్తు శకం 1650.

5. క్రీ॥ శ॥ 1550

మనం యినుపయుగపు తుపాకీ ఉపయోగంలో వున్నాం. రాజధాని ఢిల్లీ. సూర్ వంశీకుడు ఇస్లాంషా గద్దెపై వున్నాడు. రాజభాష పార్శీ. సామంతవాద పాలనలో అఖండ బానిసత్వం వ్యాపించివుంది. ఫిరంగులు పరమాస్త్రాలు. హిందు యిస్లాం ముఖ్యమతాలు. ఎక్కువమంది మాంసాహారులు. ఆహార పానీయాల్లో అంటువుంది. తిండి, పెళ్ళి స్వజాతిలో, స్వప్రాంతంలో మాత్రమే. హిందీ సాహిత్య గగనమందు యిప్పుడే 'జాయసీ' అస్తమించాడు. సామంత వర్గంలోని పురుషుల దుస్తులు మిర్జయి, ముత్తన్. స్త్రీలకు పాయజామా, పేషవాజు. ఇది క్రీస్తు శకం 1550.

(6) క్రీ॥ శ॥ 1450

భారతదేశంలో తుపాకీమందు యుగానికి నాంది. రాజధాని ఢిల్లీ. పాలకుడు బహలోల్‌లోడి. సామంత వ్యవస్థ, బానిస ఆచారం మన సాంఘిక వ్యవస్థకు ముఖ్య రూపాలు. ఫిరంగి పరమాస్త్రం, కాని వాటి తక్కువ వాడుక. హిందువులు అధికం, మహమ్మదీయులు కూడ ఎక్కువే. మాంసాహారులు ఎక్కువ. ఆహార పానీయాల్లో అంటు ఎక్కువ. తిండి, పెళ్ళి స్వజాతిలో, సొంతప్రాంతంలో మాత్రమే. సాహిత్య గగనంలో కబీరుదాసు అస్తమించాడు. ఉత్తర భారతంలో సామంతుల వేషధారణ— చౌబందీ పొడవు మిర్జయి, చోగా, పాయజామా, ధోవతి. స్త్రీలు ప్రాంతీయ దుస్తులను, పరికిణీ, జాకెటు, ఛేలి, సల్వారు మొ॥ ధరించేవారు. ఉన్నత వర్గాల్లో హిందు, ముస్లింల దుస్తులు వేరుగా ఉండెవి. ఇది క్రీస్తుశకం 1450.

(7) క్రీ॥ శ॥ 1350.

ఐరోపాలో తుపాకీమందు వాడుకలోకి వచ్చింది. కాని మన దేశంలోకి యింకా రాలేదు. మనం పూర్తిగా యినుప యుగంలో వున్నాం. రాజధాని ఢిల్లీ. రాజు మహమ్మదు తుగ్లకు. రాజభాష పార్శీ. సామంతపాలన. దాస, దాసీల అనగా బానిస విక్రయం బహిరంగం. విల్లు, బాణం బల్లెం, కత్తి- మనకున్న మారక ఆయుధాలు. ప్రధానమైంది హిందూమతం. పంజాబు, ఢిల్లీలో మహమ్మదీయులు ఎక్కువ. మాంసాహారులెక్కువ. అంటరానితనం ప్రబలంగావుంది మహమ్మదీయుని, లేక అస్పృశ్యుని చేతినీరు త్రాగరాదు. తిండి, పెళ్ళి స్వజాతిలో, సొంత ప్రాంతంలోనే. మహమ్మదీయుల దుస్తులు చోగా, పాయజామా. వారి స్త్రీలకు

కూడ అనే దుస్తులు. హిందువుల్లో సామంతుల దుస్తులు:— చౌబంది, సుత్తన్: చౌబందీ ధోవతి స్త్రీలు పరికిణీ జాకెట్టు, చీరె, ఇది క్రీస్తుశకం 1350.

(8) క్రీ॥ శ॥ 1250

ఇనుపయుగం. ఢిల్లీ రాజధాని. రాజు సుల్తాన్ నాసిరుద్దీన్ ఖిల్జీ. రాజభాష పార్సీ. సామంత వ్యవస్థ. దాస, దాసీజనం ఉన్నారు. బాణం, విల్లు పరమాయుధాలు. హిందూమతం ప్రధానం. బౌద్ధంకూడ వుంది. ఇస్లాంమతం ప్రవేశం. ఎక్కువ మంది మాంసాహారులు. అంటరానితనం చాల వ్యాప్తిలో వుంది. మహమ్మదీయుల చేతినీరు హిందువులు త్రాగరాదు. తిండి, పెళ్ళి స్వజాతిలో, సొంత ప్రాంతంలోనే. మహమ్మదీయ సామంతులు, వారి స్త్రీలు చోగా పాయజామా వేసుకొనేవారు. హిందువులు చౌబందీ సుత్తన్. ధోవతి ధరించేవారు. వారి స్త్రీలు ప్రాంతీయ దుస్తులు, పరికిణీ, రవికె వేసుకొనేవారు ఇది క్రీస్తు శకం 1250.

9. క్రీ॥ శ॥ 1150

ఇనుపయుగం. రాజధాని కన్యాకుబ్జం. రాజు మహారాజ్ గోవిందచందు గద్వార్. రాజభాష సంస్కృతం. భారతదేశ సమన్వయభాష (సామంత వర్గభాష) మధ్యదేశ్ (అపభ్రంశం) అనగా పాంచాలి, కర్నాటీభాషలు. బాణం, విల్లు పర మాస్త్రాలు, హిందు మతంయొక్క రెండురూపాలు:— బ్రాహ్మణమతం, బౌద్ధమతం దేశమంతటా వ్యాప్తిలో వున్నాయి. కాని బ్రాహ్మణ మతస్తుల సంఖ్య ఎక్కువ. మహమ్మదీయమతం పంజాబ్‌లో మాత్రం కొద్దిగా వ్యాపించివుంది. అఫ్ఘనిస్తాన్ హిందూమతంనుండి యిస్లాంమతంలోకి వెళ్ళిపోయింది మాంసాహారులు ఎక్కువ. కులతత్వం, అస్పృశ్యత ప్రబలివుంది. బౌద్ధమతంవలన హిందూమతంలోని భాగ మైన అస్పృశ్యతాభావానికి కొంతబాధ కల్గింది. హిందువులు భారతదేశం బయటవున్న ఏ విదేశీయ బౌద్ధులపట్ల అస్పృశ్యతాభావాన్ని చూపలేదు. తిండి, పెళ్ళి స్వజాతి బ్రాహ్మణులందు, బౌద్ధులందు మాత్రమే జరిగేవి. కన్యాకుబ్జ మహా కవి హర్షుడు యింకా వయస్సులోనే వున్నాడు. పురుషుల దుస్తులు:- చౌబందీ, ధోవతి, స్త్రీలు ఎక్కువగా గాగరా, రవికె వేసుకొనేవారు. ప్రాంతాల్లో వారి వారి దుస్తులుండేవి. కన్యాకుబ్జంలోని వేషభాషలు, ఆహారపానీయాలు, ఆచారవ్యవహారాలు అపభ్రంశ ప్రాయాలు, ఇది క్రీ. శ. 1150.

10) క్రీ. శ. 1050

ఇనుపయుగం. కన్యాకుబ్జం రాజధాని. ప్రతీహార వంశం పతనమైంది. దేశపరిస్థితి తారుమారుగ ఉంది. సంస్కృతం రాజపూజితం అయినప్పటికి దేశం అంతట పాంచాలి (మధ్యదేశీయ) అపభ్రంశం ఉపయోగిస్తున్నారు. సాహిత్యంలో కూడ అది స్వీకృత భాష. సామంత వ్యవస్థ. బానిస పద్ధతి వుంది. బాణం,

విల్లు, పరమాస్త్రాలు. ప్రధాన మతాలు బ్రాహ్మణం, బౌద్ధం. ఎక్కువమంది మాంసాహారులు. ఆహారాదుల్లో అంటువుంది. అస్పృశ్యుని తాకరాదు. అతని చేతినీళ్ళు త్రాగరాదు. తిండి, పెళ్ళిలో హిందువులకు, బౌద్ధులకు భేదంలేదు. కాని పెళ్ళిమాత్రం స్వజాతిలోని స్వవర్గంలో: సాహిత్య గగనంలో కవిరాజు రాజశేఖరుడు అస్తమించారు. పురుషుల దుస్తులు: చొటంకీ, సుత్తన్, ధోవతి, స్త్రీలకు పరికిణి, జాకెట్టు: చీరె, రవిక. ఇది క్రీ. శ. 1050.

11) క్రీ. శ. 950

ఇనుపయుగం. కన్యాకుబ్జం రాజధాని. రాజు మహారాజ్ దేవపాల ప్రతీహారుడు. సంస్కృతం రాజపూజితం. కాని పాంచాలీ (మధ్యదేశీ) అపభ్రంశం సాహిత్యంలోను, వ్యవహారంలోను దేశమంతటిలో వాడుకలోవుంది. సామంత పాలన. బానిసవిధానం వుంది. విల్లు, బాణం, పరమాయుధాలు. బ్రాహ్మణం, బౌద్ధం ప్రధానమతాలు. వాటిలో శైవం, తాంత్రిక బౌద్ధం ప్రధానములు. తూర్పున బౌద్ధులు. పడమర పాశుపతులసంఖ్య ఎక్కువ. ఎక్కువమంది మాంసాహారులు. అన్యమతాలవారిపట్ల, అస్పృశ్యులపట్ల అంటరానితనం వుంది. తిండి, పెళ్ళి స్వజాతిలో, స్వవర్గంలోనే. పురుషుల దుస్తులు చొటంకీ, ధోవతి, సుత్తన్. స్త్రీల దుస్తులు గాగరా, చీరె, అద్దకపుచీరె, రవిక. ఇది క్రీ. శ. 950.

13) క్రీ. శ. 850

ఇనుపయుగం. కన్నోజు రాజధాని. రాజు మిహిరభోజుడు. సంస్కృతం రాజపూజితం. దేశమంతట వాడుకలో కన్నోజు (మధ్యదేశీ) అపభ్రంశ భాషవుంది. సామంత వ్యవస్థ. బానిసలున్నారు. బాణం, విల్లు పరమాయుధాలు. శైవం, బౌద్ధం ప్రధానమతాలు. తూర్పున బౌద్ధులు పడమర శైవులు ఎక్కువ. పురుషుల దుస్తులు. చొటంకీ, సుత్తన్, ధోవతి. స్త్రీల దుస్తులు. చీరె, గాగరా, అద్దకపుచీరె, చొటంకీ, రవిక. ఇది క్రీ. శ 850.

13) క్రీ. శ. 750

ఇనుపయుగం. రాజధాని కన్యాకుబ్జం రాజు ప్రతాపవంశీయుడు యశోవర్మ. సంస్కృతం రాజపూజితం. సర్వత్రా వాడుకలోనున్న భాష పాంచాలీ (మధ్యదేశీ) అపభ్రంశం. సామంత వ్యవస్థ. బానిసత్వముంది. విల్లు, బాణం పరమాస్త్రాలు. శైవం, బౌద్ధం ప్రధానమతాలు. బౌద్ధం తూర్పున, శైవం పడమర ఎక్కువ. బౌద్ధంలో మహాయానం పైచేయిగవుంది. తంత్రయానంపైకి వస్తూవుంది. ఆహార పానీయాల్లో హరిజనులపట్ల అస్పృశ్యతను పాటిస్తున్నారు. ఇతర విషయాల్లో దానికంత ప్రాముఖ్యతలేదు. మాంసాహారులు ఎక్కువ. పేదలకు ఎప్పుడో అది దొరుకుతుంది. సాహిత్య గగనభాస్కరులు— భవభూతి, వరహప, పురుషుల

దుస్తులు: చొబంకీ, సుత్తన్, ధోవతి. స్త్రీల దుస్తులు : చీరె, చొబంకీ, రవిక. ఇది క్రీ. శ. 750.

14) క్రీ. శ. 650

ఇనుపయుగం. రాజధాని కన్యాకుబ్జం. హర్షవర్ధనుడు చనిపోయి మూడేళ్ళయింది. సింహాసనం కొరకు తగాదాపడుతున్నారు. సంస్కృతం రాజపూజితం. సార్వత్రిక భాష పాంచాలీ అపభ్రంశం. సామంత వ్యవస్థ. బానిసత్వముంది. బాణం, విల్లు పరమాస్త్రాలు, బౌద్ధం, శైవం, బ్రాహ్మణం ప్రబలంగావున్నాయి. మాంసాహారులు ఎక్కువ. అంటరాని తనం హరిజనులపట్ల మాత్రమే. విదేశీయుల పట్ల యిది కానరాదు. తిండి, పెళ్ళి స్వజాతిలో, సొంత ప్రాంతంలో, కాని బయట వారితో విషేధం లేదు. కొద్ది కాలం క్రితమే సాహిత్యాకాశం నుండి మహాకవి బాణుడు అస్తమించాడు. పురుషుల దుస్తులు : చొబంకీ, ధోవతి, సుత్తన్, స్త్రీలకు : చీరె. పొట్టి అంగీ, రవిక. ఇది క్రీ. శ 650

15) క్రీ. శ. 550

ఇనుపయుగం. రాజధాని కన్నౌజ్ రాజా ఈశానవర్మ మౌఖరీ. సంస్కృతం రాజపూజితం. ప్రాకృతం తన స్థానాన్ని పాంచాలీ అపభ్రంశానికి వదిలేస్తూవుంది. సాహిత్యంలో సంస్కృతం తర్వాత ప్రాకృతానికి అధికగౌరవం. సామంతవ్యవస్థ బానిసత్వంవుంది. విల్లు, బాణం పరమాయుధాలు. బౌద్ధం, శైవం, బ్రాహ్మణం ఎక్కువ. బౌద్ధులు మహాయాన శాఖవారు. శైవులు లకులీశపాశుపతులు. బ్రాహ్మణులు వైదిక, పౌరాణిక కర్మకాండులు. మాంసాహారులు ఎక్కువ. హరిజనులపట్ల అస్పృశ్యత ఎక్కువ. అన్యులతో భోజనాలున్నాయి. పెళ్ళిమాత్రం స్వవర్గంలో, స్వప్రాంతంలో. బయటకూడ విషేధంలేదు. అజంతా శిల్పకళ ఉన్నత స్థితిలోవుంది. పురుషుల దుస్తులు : చొబంకీ, ధోవతి, సుత్తన్, స్త్రీలకు : గాగరా, చీరె, కంచుకం (రవిక). ఇది క్రీస్తు శకం 550.

16) క్రీ. శ. 450.

ఇనుపయుగం. రాజధాని పాటలీపుత్రం. రాజా గుప్తవంశజుడు పరమ భట్టారక కుమారగుప్తుడు. సంస్కృతం రాజపూజితం. ప్రాకృతం సాహిత్యంలోను, వాడుకలోను సర్వసమ్మతభాష. సామంత వ్యవస్థ. బానిసవిధానం వుంది. విల్లు, బాణం ముఖ్యమైన ఆయుధాలు. బౌద్ధం బ్రాహ్మణం ప్రధాన మతాలు. తూర్పున బౌద్ధులు, పడమర బ్రాహ్మణమతస్తులెక్కువ. దాదాపు అందరు మాంసాహారులే. ఆహార పానీయాలందు, వివాహాదులందు, హరిజనులందు అంటున్నది. మిగిలినవారి పట్ల అంతగా పట్టింపులేదు. పెళ్ళికి వర్గం ముఖ్యం. విదేశీసామంతులు కూడ భారతీయ సామంతులతో యిచ్చిపుచ్చుకుంటున్నారు. మన సాహిత్యగగన మహా

నక్షత్రం కాళిదాసు అస్తమించి ఎక్కువకాలం కాలేదు. శిల్పం, చిత్రలేఖనం పారమును అందుకొన్నాయి. పురుషుల దుస్తులు : చౌదంచీ, ధోవతి, సుత్తన్. స్త్రీలకు : చీరె, కంచుకం. సామంతులు చోగా కూడ ధరించేవారు. ఇది క్రీ. శ. 450.

17) క్రీ. శ. 350

ఇనుపయుగం, రాజధాని పాటలీపుత్రం. రాజు గుప్తచక్రవర్తి సముద్ర గుప్తుడు. సంస్కృతం రాజ పూజితం, మాగధీ ప్రాకృతం సర్వసామాన్య భాష, సామంత వ్యవస్థ. బానిస విధానం ఎక్కువగావుంది విల్లు, బాణం పరమాయుధాలు, బౌద్ధం, బ్రాహ్మణం ప్రధాన మతాలు. తూర్పున బౌద్ధం. పడమర బ్రాహ్మణం ఎక్కువ. దాదాపు అందరు మాంసాహారులే. హరిజనులవరకే అస్పృశ్యత, పెళ్ళిలో వర్ణం ముఖ్యం, కాని అంతగ పట్టింపులేదు. శిల్పం, చిత్రలేఖనం పరాకాష్టాన్ని అందు కొంటున్నాయి. మహాకవికాళిదాసు రాబోతున్నాడు. పురుషులకు దుస్తులు : చౌదంచీ, ధోవతి. కాని చక్రవర్తి యితర సామంతులు శకుల చోగా, సుత్తన్ వేసు కొంటున్నారు. స్త్రీలకు. చీరె, కంచుకం. ఇది క్రీ. శ. 350.

18) క్రీ. శ. 250

ఇనుపయుగం, రాజధాని మధుర. రాజు వీరసేన నాగుడు సంస్కృతం పూజితం, సార్వత్రిక భాష శౌరసేన ప్రాకృతం. సామంతవ్యవస్థ. బానిస విధానం బాణం, విల్లు పరమాయుధాలు. బౌద్ధం, బ్రాహ్మణం ప్రధానమతాలు. హరిజనులఎడ్ల మాత్రం అస్పృశ్యత. మిగిలినవారితో తిండికి అంటులేదు. దాదాపు అందరు మాంసాహారులే. కాని కొద్దిమందికే ప్రతిరోజు అది లభిస్తుంది. వివాహాంలో కులతత్వం చాల తక్కువ. పాలకుల్లో అసలులేనేలేదు. దేశీయులకు, విదేశీయులకు మధ్య బాహాటంగా పెళ్ళిళ్ళు జరుగుతున్నాయి. సాహిత్యాకాశంలో నాటకర్త భాసుడు దేదీప్యమానంగా వెల్గుతున్నాడు. పురుషులకు దుస్తులు : చౌదంచీ. ధోవతి. శకుల చోగా, పాయజామా. స్త్రీలకు చీరె, కంచుకం. ఇది క్రీస్తుశకం 250.

19) క్రీస్తు శకం 150

ఇనుపయుగం. రాజధాని మధుర. రాజు శకసామ్రాట్టు హువిష్కుడు. సంస్కృత ప్రాబల్యం అంతగలేదు. శౌరసేన ప్రాకృతం సర్వసమ్మతభాష. సామంత వ్యవస్థ బానిసత్వం ఎక్కువగవుంది. బాణం, విల్లు పరమాయుధాలు. బౌద్ధం, బ్రాహ్మణం ప్రధాన మతాలు. కాని బౌద్ధంవైపు మొగ్గు చూపుతుంది. మహా యానం యింకా బయటపడలేదు. హరిజనుల వరకు అంటు భోజనాలకు, వివాహాలకు నియమబంధనాలు లేవు. విదేశీయులైన శకులు భారతసమాజంలో ఎక్కువగా కలిసిపోయి ఏకమవుతున్నారు. పురుషులకు దుస్తులు : చౌదంచీ, ధోవతి, చోగా, సుత్తన్. స్త్రీలకు : చీరె, కంచుకం. ఇది క్రీ. శ. 150

20) క్రీ. శ. 50

ఇనుపయుగం. రాజధాని మధుర. రాజు శకరాజు 'వీమకదఫీసు'. సార్వత్రిక భాష శౌరసేనీ ప్రాకృతం. ఈ భాష యిప్పుడిప్పుడే పాలీనుండి వేరై పోయింది. సామంత వ్యవస్థ. బానిసవిధానం వుంది. బాణం, విల్లు పరమాయుధాలు. బ్రాహ్మణం, బౌద్ధం ప్రధాన మతాలు. బౌద్ధానికి మొగ్గు ఎక్కువ. ఎక్కువమంది మాంసాహారులు. అస్పృశ్యత హరిజనుల వరకే. తిండి, పెళ్ళిలో స్వదేశం, పరదేశం అనుభేదంలేదు. సాహిత్యగగనంలో అశ్వఘోష మహాకవి ప్రకాశిస్తున్నాడు. పురుషుల దుస్తులు : ధోవతి, చద్దరు (దుప్పటి), శకులాగా, సుత్తన్. స్త్రీలకు : చీరె, కంచుకం ఇది క్రీస్తు శకం 50.

21) క్రీ. పూ. 50

ఇనుపయుగం. రాజధాని పాటలీపుత్రం. రాజు 'శుంగపామిమిత్రుడు' సార్వత్రికభాష శౌరసేనప్రాకృతం. సామంత వ్యవస్థ. బానిసవిధానం వుంది. బాణం, విల్లు పరమాస్త్రాలు. బౌద్ధం, బ్రాహ్మణం ప్రధాన మతాలు. దాదాపు అందరు మాంసాహారులు. హరిజనులందు మాత్రం అస్పృశ్యత, పెళ్ళిలో వర్గం ప్రధానం: జాతికిగాని, దేశానికిగాని ప్రాముఖ్యం లేదు. పురుషుల దుస్తులు : ధోవతి, చద్దరు. స్త్రీలకు : చీరె, కంచుకం. స్త్రీలు అప్పుడప్పుడు చీరెను రెండుముక్కలు చేసి ఒక ముక్కను ఉత్తరీయంగా, రెండవదానిని పంచెగా ధరించేవారు. ఇది క్రీస్తుకు పూర్వం 50.

22) క్రీ. పూ. 150.

ఇనుపయుగం. రాజధాని పాటలీపుత్రం. రాజు శుంగవంశీయుడు పుష్యమిత్రుడు. సంస్కృత భాషకు ప్రాముఖ్య మిచ్చుటకు ప్రయత్నం జరుగుతూవుంది. కాని మాగధీపాలీభాష సర్వమాన్య భాష. సామంత వ్యవస్థ. బానిసత్వం వుంది. విల్లు, బాణం, పరమాయుధాలు. బౌద్ధం, బ్రాహ్మణం ప్రధాన మతాలు. దాదాపు అందరు మాంసాహారులు. హరిజనులపట్ల అస్పృశ్యత వుంది వివాహంలో వర్గం ముఖ్యం. కాని దేశ, జాతి విచక్షణ లేదు. వ్యాకరణకర్త పతంజలి ప్రకాశిస్తున్నాడు. పురుషుల దుస్తులు : ఉత్తరీయం, పంచె. స్త్రీలకు కూడ అవే. స్త్రీ పురుషులు జుట్టు ముడులపై తలపాగ ధరించేవారు. ఇది క్రీ. పూ. 150

23) క్రీ. పూ. 250

ఇనుపయుగం. రాజధాని పాటలీపుత్రం. రాజు దేవానాం ప్రియదర్శి అశోకుడు. మాగధీ పాలి సర్వమాన్యభాష. సామంత వ్యవస్థ. బానిసత్వముంది. విల్లు, బాణం పరమాస్త్రాలు. బౌద్ధ, జైన, బ్రాహ్మణంలు ముఖ్య మతాలు. వీనిలో బ్రాహ్మణ

మతం ప్రధానం ప్రజలు మాంసాహారులు. అస్పృశ్యత చాల తక్కువ. వివాహంలో కులస్తులు, దేశస్తులు అనుబంధన లేదు. 'స్త్రీరత్నం దుష్కులాదపి' -హీనకుల మైనప్పటికి స్త్రీని రత్నమన్నారు. పంచె, ఉత్తరీయం, స్త్రీ పురుషుల దుస్తులు. వారు తలపై జుట్టును కొప్పుగా పెట్టుకొని పాగ ధరించేవారు. ఇది క్రీస్తుకు పూర్వం 250.

24. క్రీ. పూ. 350

ఇనుపయుగం. రాజధాని పాటలీపుత్రం. రాజు మహానందుడు. మాగధీపాలి రాష్ట్రభాష. సామంతపాలన. బానిసత్వం వుంది. బాణం, విల్లు పరమాస్త్రాలు. బ్రాహ్మణమతం ప్రధానం. జైనులు, బౌద్ధులు తమ ప్రాభవాన్ని పెంచుకొంటున్నారు. ప్రజలు మాంసాహారులు. ఆహారపానీయాల్లో అంటులేనట్లే. వివాహంలో కులమని, దేశమని లేదు. స్త్రీ పురుషుల దుస్తులు. ఉత్తరీయం, పంచె. పొడవైన జుట్టు కొప్పు పై తలపాగను ధరించేవారు. ఇది క్రీ. పూ. 350.

25. క్రీ. పూ. 450

ఇనుపయుగం. రాజధాని పాటలీపుత్రం. రాజు శిశునాగవంశీయుడు ఉదయి. మాగధీపాలి రాష్ట్రభాష. సామంత వ్యవస్థ. బానిసత్వం వుంది. విల్లు, బాణం పర మాయుధాలు. ప్రధానమతం బ్రాహ్మణం. జైన, బౌద్ధ, ఆజీవికమునులు కూడ కొద్దిగా ప్రచారంలోకి వస్తున్నాయి. అందరు మాంసాహారులు. అస్పృశ్యత చాల తక్కువ. అది చండాలురవరకు పరిమితం. వివాహంలోవర్గం ముఖ్యం. స్త్రీ పురుషులు ఉత్తరీయం, పంచె ధరించేవారు. జుట్టుముడులపై తలపాగలు పెట్టుకొనేవారు. ఇది క్రీ. పూ. 450.

26) క్రీ. పూ. 550

ఇనుపయుగం. దేశమంతట ఒకేరాజ్యం లేదు. రాజధానులు రాజగృహం, వైశాలి. రాజు బింబిసారుడు రాజగృహంలో పాలిస్తున్నాడు. వైశాలిలో గణ రాజ్యం. ముఖ్యభాష కోసలీపాలి. సామంత వ్యవస్థ. బానిస విధానం ఎక్కువగ వుంది. విల్లు, బాణం పరమాస్త్రాలు. ప్రధాన మతం బ్రాహ్మణం. ఆజీవక, నిర్గ్రంథ బౌద్ధమతాల ప్రచారం మొదలైంది. అందరు మాంసాహారులు. అంటరానితనం లేనట్లే. వివాహంలో వర్గం ప్రధానం భారతీయ మహాతత్వ చింతకులైన బుద్ధుడు, తీర్థంకర మహావీరుడు పనిచేస్తున్నారు. స్త్రీ పురుషులు ఉత్తరీయం, పంచె ధరించేవారు. జుట్టుపై తలపాగ ఉండేది. ఇది క్రీ. పూ. 550

27) క్రీ. పూ. 650

ఇనుపయుగం. వేర్వేరు రాజ్యాలు. వేర్వేరు రాజధానులు. ముఖ్యమైన రాజధానులు శ్రావస్తి, కోసల, కోసలీపాలి బహుళ ప్రచారంలో వుంది.

సామంతవ్యవస్థ. బానిసత్వం వుంది. రాజతంత్రం, గణతంత్రం - రెండు వున్నాయి. బాణం, విల్లు పరమాస్త్రాలు. బ్రాహ్మణమతం ప్రధానం. అస్పృశ్యతాభావన లేనట్లే వివాహంలో వర్గం ముఖ్యం. ప్రజలు మాంసాహారులు. ఉత్తరీయం, పంచె, తలపాగ స్త్రీ పురుషుల దుస్తులు. ఇది క్రీ. పూ. 650

28) క్రీ. పూ. 750

ఇనుపయుగ ప్రారంభం. కురు, పాంచాలదేశాల సాంస్కృతిక, రాజకీయ ప్రాధాన్యత. ఛందభాష (వైదిక భాష) పైవర్గం (ఆర్యుల్లో)లో బహుళ ప్రచారంలో వుంది. కాని ద్రావిడం కూడ బాగా మాట్లాడుతున్నారు. సామంత వ్యవస్థ. బానిసత్వం వుంది. గణతంత్రం, రాజతంత్రం - రెండు వున్నాయి. బాణం, విల్లు పరమాయుధాలు. ఆర్యుల్లో బ్రాహ్మణమతం, వైదిక కర్మకాండ వున్నాయి. ఇతరులు—ద్రావిడులు, కిరాతులు దేవతలను నమ్మేవారు. అందరు మాంసాహారులు. వర్ణాన్ని గురించి తీవ్రంగా ఆలోచించేవారు. ఆర్యులు ఇతర జాతులతో వివాహమాడుటను వ్యతిరేకించేవారు. ఉపనిషత్తులు, మహర్షి యాజ్ఞవల్క్యుడు వున్నకాలం. దుస్తులు: ఉత్తరీయం, పంచె, తలపాగ, ఉన్నిబట్టలందు ఆర్యులకు మక్కువ. ఇది క్రీ. పూ. 750.

29) క్రీ. పూ. 850

ఇనుపయుగం యిప్పుడే మొదలు. కురు జనపదం ప్రసిద్ధికెక్కింది. ఆర్యులది ఛందభాష. ఇతరులది ప్రాచీన ద్రావిడం కిరాతభాష. గణతంత్రం, రాజతంత్రం - రెండూ వున్నాయి. బానిస ప్రధానమైన సామంత వ్యవస్థ బాణం, విల్లు పరమాస్త్రాలు. బాణం ములికికి రాగిస్థానే యినుము వేస్తున్నారు. ఆర్యుల్లో వైదికమతం వుంది. ఇతరుల్లో వారివారి మతాలున్నాయి. ఇప్పటి దక్షిణాఫ్రికా, దక్షిణ అమెరికా, అమెరికా సంయుక్త రాష్ట్రాల్లో మాదిరిగ వర్ణభేదం విపరీతంగా వుంది. దుస్తులు ద్రాపి (చోగాలాంటివి), పంచె, ఆర్యులు ఎక్కువగ ఉన్నిబట్టలు వేసుకొనేవారు. స్త్రీపురుషుల దుస్తుల్లో భేదంలేదు. పొడవైన జుట్టును ముడివేసుకొని తలపాగ (ఉష్ణీషం) ధరించేవారు ఇది క్రీ. పూ. 850.

30) క్రీ. పూ. 1150.

ఇప్పుడు మూడువందల సంవత్సరాలు వెనక్కుపోతున్నాం. ఇది తామ్రయుగం. సప్తసింధు (పంజాబు)లో భరతగణాల రాజు సుదాసు. ఆర్యులది ఛందభాష. ఇతరులవి ద్రావిడ, కిరాతభాషలు. ఆర్యులు గణవ్యవస్థనుండి యిప్పు డిప్పుడే సామంత వ్యవస్థలో ప్రవేశించారు. ఎక్కువమంది అనార్యులు దాసులు (బానిసలు)గ వున్నారు. రాగి ములికగల బాణం, విల్లు పరమాస్త్రాలు. వైదిక దేవుళ్ళను ఆర్యులు

పూజిస్తున్నారు. కిరాతులు, ద్రావిడులు (మొహింజెదరోవాసులు) పురుషాంగాలను, యితర దేవతలను పూజిస్తున్నారు. అందరు మాంసాహారులు, ఆర్యులు అనార్యులు, తెల్లవారు నల్లవారు అనుభేదం వుంది. వారిమధ్య సాయుధ పోరాటం యింకా సాగుతూవుంది వశిష్ఠ, విశ్వామిత్రులు మహాకవులుగా, రాజనీతిజ్ఞులుగ విరాజిల్లుతున్నారు. ఉన్ని, తోలుతో తయారైన ద్రాపి, పంచె, తలపాగ వారిదుస్తులు. ఇది క్రీ. పూ. 1150.

31) క్రీ. పూ. 1450.

మరి 300 ఏండ్లు వెనక్కుపోతున్నాం. రాగియుగం సింధుతీర మైదానంలో పంచ (అయిదు) ఆర్యగణాలపాలన ఏర్పడింది. ఆర్యులది ప్రాచీన వైదికభాష. హిమాలయ కొండల్లో కిరాతభాష. క్రింది భాగంలో ప్రాచీన ద్రావిడం, ఆర్యభాష వాడుకలో వున్నాయి. హిమాలయ కిరాతుల్లో గణవ్యవస్థవుంది. ఇతరుల్లో సామంత వ్యవస్థ, గణవ్యవస్థ లున్నాయి. దాసత్వం (బానిస విధానం) హద్దు లేకుండా వుంది. రాగిములికి బాణం, విల్లు పరమాస్త్రాలు వైదిక దేవుళ్ళు, ప్రాగ్ద్రావిడ కిరాతదేవతలు వారి వారిజాతుల్లో పూజింపబడుతున్నారు. అందరు మాంసాహారులు. ఆర్య అనార్యులమధ్య వర్ణభేదం తీవ్రరూపంలో వుంది ద్రావిడుల్లో వర్గభేదం వుంది. ఆర్య స్త్రీ పురుషులు ఉన్ని తోలుతో తయారైన ద్రాపి, పంచె, తలపాగ ధరించేవారు. కిరాతులు ఉన్ని, తోలుతో తయారైన పొడవైన దుప్పటలను ధరించేవారు. ప్రాగ్ ద్రావిడులు నూలు ఉత్తరీయం, పంచె ధరించేవారు. బహూశా తలపాగకూడ వుండేది. ఇది క్రీ. పూ. 1450

32) క్రీ. పూ. 1550

రాగియుగం. సింధుతీరమైదానంలో ద్రావిడ సామంతులు పాలిస్తున్నారు. వారి రాజధానులు మొహెంజెదరో, హరప్పాదులు. మైదానప్రాంతంలో ప్రాగ్ ద్రావిడం, హిమాలయ కొండల్లో ప్రాగ్ కిరాతభాష. ప్రాగ్ ద్రావిడుల్లో బానిస విధానమున్న సామంత వ్యవస్థ. కిరాతుల్లో గణతంత్ర వ్యవస్థ. ప్రాగ్ ద్రావిడుల్లో ఆర్థిక ప్రాబల్యం వర్గాలను ఏర్పరచింది. ప్రాగ్ కిరాతుల్లో పితృస్వామిక వ్యవస్థగాని, గణతంత్ర వ్యవస్థగాని వుంది. రాగిములికి బాణం, విల్లు పరమాస్త్రాలు. ప్రాగ్ ద్రావిడదేవతలు, ప్రాగ్ కిరాత దేవతలు పూజింపబడుతున్నారు. అందరు మాంసాహారులు. ప్రాగ్ ద్రావిడులు పత్తినూలుతో నేసిన ఉత్తరీయం, పంచె ధరించేవారు. కిరాతులు తోలుతో, ఉన్నితో తయారైన దుప్పట్లను చలికాలంలో ధరించేవారు. ఇతర కాలాల్లో నగ్నంగా ఉండేవారు. ఇది క్రీ. పూ. 1550

33) క్రీ. పూ. 2,550

ఇప్పుడు వేయి సంవత్సరాలు వెనక్కు వెళ్ళుతున్నాం. ఇప్పుడే రాగి యుగారంభం. ఉత్తరభారతంలో ప్రాగ్ ద్రావిడజాతి అక్కడక్కడ నివసిస్తూవుంది.

కొండల్లో- కాశ్మీరం నుండి అస్సాం వరకు, యింకా ముందు వరకు కిరాతజాతి అక్కడక్కడ వుంది. వారు తమతమ భాషలు మాట్లాడుతున్నారు. ప్రాగ్ ద్రావిడులు పితృస్వామిక గణవ్యవస్థలో ఉన్నారు. ప్రాగ్ కిరాతులు వారికంటె వెనుకబడి వున్నారు. రాతిసమ్మెట, బాణంపైన చెకుముకి రాయి యింకా వాడుకలో వున్నాయి. అప్పుడప్పుడు బాణం మొలికికి రాగి ముక్కలను అతికించేవారు. బాణం, విల్లు వరమ యుధాలు. చలికాలంలో ఉన్నితోళ్ళ దుస్తులు వేసుకొనేవారు. ఇతర కాలాల్లో నగ్నంగా వుండేవారు జీవనం: వ్యవసాయం, వేట. ఇది క్రీ. పూ. 2,550

34) క్రీ. పూ. 3050.

ఇప్పుడు మనం 500 సంవత్సరాలు వెనక్కు పోతున్నాం. కొత్తరాతియుగం. భారతదేశంలో వేర్వేరు ప్రాంతాల్లో వేర్వేరు గణాలు నివసిస్తున్నాయి. కిరాతులు కొండల్లో, కొండచరియల్లో, అడవుల్లో వుంటున్నారు. ముండాలు, నిషాదులు మైదాన ప్రదేశాల్లో, భయంకరమైన అరణ్యాల్లో వుంటున్నారు. ప్రాచీన కిరాతభాష, ముండా, నిషాద భాషలు వాడుకలో వున్నాయి. పితృస్వామిక గణవ్యవస్థ. శిలాముఖి బాణం, విల్లు వరమాస్త్రాలు. మృతాత్మలను, చెట్లను, పశువులను పూజించేవారు. ఇది తినవచ్చు. అది తినరాదు అను విచక్షణ లేదు. మాంసాహారం ప్రధానం. పొలంలో ధాన్యం పండిస్తున్నారు. కాని వాటి ఉపయోగం చాల తక్కువ. చలికాలంలో తోళ్ళ దుస్తులు వేసుకొనేవారు. మిగిలిన కాలాల్లో నగ్నంగా వుండేవారు. ఇది క్రీ. పూ. 3,050.

35) క్రీ॥ పూ. 10,050

ఇప్పుడు మనం 7,000 ఏండ్లు వెనుకకుపోతున్నాం. మనం ఎక్కువ పాతరాతి యుగంలో వున్నాం. భారతదేశపు అడవుల్లో కిరాతకులు, నిషాదులు కొద్దిమంది వున్నారు. వారు వారి భాషల్లో మాట్లాడుకుంటున్నారు. కొన్ని వందల మాటలు మాత్రమే వారి భాషా సంపద. మాతృస్వామిక వ్యవస్థ. ఆ స్త్రీ, శ్రమ సమిష్టిగా వుండేది. చెక్కబడిన రాతి ఆయుధాలు. గొడ్డళ్లు, కత్తులు మొదలైనవి వరమాయుధాలు, చని పోయినవారిని, భీతిని గొల్పు వస్తువులను తృప్తిపర్చుటకు మానవుడు ప్రయత్నిస్తున్నాడు. వేటాడి తెచ్చిన మాంసం, అడవిలోని పండ్లు-వారికి జీవనాధారం. చలి కాలంలో తోళ్ళ దుస్తులు, నిప్పును ఉపయోగించేవారు. క్రూరజంతువులను తరుముటకు నిప్పు ఉపయోగపడేది.

ఈ ప్రకారం గడచిన 12,000 సంవత్సరాల్లో భారతదేశంలో మానవుని సమాజ వికాసం జరిగింది. ఈ విషయాన్ని దిగువ పట్టికలో యిస్తున్నాం.

| యుగము 1 | కాలము 2 | రాజధాని 3 | రాజు 4 | భాష 5 | వ్యవస్థ 6 | పరమాస్త్రములు 7 | మతం 8 | అస్పృశ్యత 9 | కవి (కళ) 10 | వేషము 11 |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| రాతి | క్రీ. పూ. 10,050 | — | — | — | మాతృ స్వామిక | రాతి గొడ్డలి | — | — | — | నగ్నం |
| కొత్త రాతి | " 8,050 | — | — | — | పితృ స్వామిక | శిలాముఖ బాణము, ధనుస్సు | — | — | — | " |
| రాగి | " 2,550 | — | — | — | బానిసత్వం | కొత్తరాతి గొడ్డలి. బాణము | — | — | — | " |
| రాగి | " 1,550 | — | — | ప్రాగ్ ద్రావిడం | సామంత. దాసత్వం | రాగి ములికి గల బాణం | ప్రాగ్ ద్రావిడ | — | — | ఉత్తరీయం పంచె (నూలు) |
| రాగి | " 1,450 | — | — | వైదిక | గణ సామతం | రాగి బాణం | వైదిక మతం | వర్ణ సంఘర్షణ | — | ద్రాపి, పంచె |
| రాగి | " 1,150 | సప్తసింధు | సుదాస్ | వైదిక | సామతం దాసత్వం | రాగి బాణం | వైదిక మతం | వర్ణ సంఘర్షణ | వశిష్ఠుడు విశ్వామిత్రుడు | " " |

| యుగము | కాలము | రాజధాని | రాజు | భాష | వ్యవస్థ | పరమా ప్రములు | మతం | అస్పృశ్యత | కవి (కళ) | వేషము |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 |
| జనప | క్రీ. పూ 850 | కురు | — | వైదిక | సామంత బానిసత్వం | జనప బాణం | వైదిక | వర్ణ సంఘర్షణ | — | ద్రావి పంచె |
| జనప | " 750 | " | — | " | " | " | " | " | యాజ్ఞ వల్క్యుడు | " |
| " | " 650 | శ్రావస్తి | కోసల రాజు | కోసలీ పాలి | " | " | " | " | — | ఉత్తరీయం పంచె తంపొగ |
| " | " 550 | రాజ గృహం | బింబి సారుడు | మాగధీ పాలి | " | " | బ్రాహ్మణ, బౌద్ధ జైన | " | బుద్ధుడు | " |
| " | " 450 | పాటలీ పుత్రం | ఉదయి | " | " | " | " | " | — | " |
| " | " 350 | " | మహా నందుడు | " | " | " | " | " | — | " |
| " | " 250 | " | అశోకుడు | " | " | " | " | " | — | " |
| " | " 150 | " | పుష్య మిత్రుడు | " | " | " | " | " | పతంజలి | " |
| " | " 50 | శుంగ | భూమి మిత్రుడు | " | " | " | " | అస్పృశ్యత | — | " |

| యుగము | కాలము | రాజధాని | రాజా | భాష | వ్యవస్థ | పరమాయుధము | మతం | అస్పృశ్యత | కవి (కళ) | వేషము |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 |
| ఇనుప | క్రీ. శ. 50 | మధుర | విమకద ఫిసు | శౌరసేని ప్రాకృతం | సామంత, జానినత్వం | ఇనుప బాణం | బ్రాహ్మణ, బౌద్ధ, జైన | అస్పృశ్యత | అశ్వ ఘోషుడు ధోవతి, | చోగా చౌబంకీ మత్తన్ |
| " | " | 150 " | హువిష్కుడు | " | " | " | " | " | - | " |
| " | " | 250 " | వీరసేనుడు | " | " | " | " | " | భాసుడు | " |
| " | " | 3.0 పాటలీ పుత్రం | సముద్ర గుప్తుడు | మాగధీ ప్రాకృతం | " | " | " | " | - | " |
| " | " | 450 " | కుమార గుప్తుడు | " | " | " | " | " | కాళిదాసు | " |
| " | " | 550 కన్నౌజ | ఈశాన వర్మ | మధ్య దేశీయే అపభ్రంశం | " | " | " | " | అజంతా | " |
| " | " | 650 " | అర్జున | " | " | " | " | " | భవభూతి | " |
| " | " | 750 " | యశోవర్మ | " | " | " | " | " | — | " |
| " | " | 850 " | మిహిర భోజుడు | " | " | " | ,, | ,, | - | " |
| ,, | ,, | 950 ,, | దేవపాలుడు | ,, | ,, | ,, | ,, | ,, | - | ,, |
| ,, | ,, | 1050 ,, | ప్రతీహారుడు | ,, | ,, | ,, | ,, | ,, | హర్షుడు | ధోవతి |
| ,, | ,, | 1150 ,, | గోవిందచందుడు | ,, | ,, | ,, | ,, | జాతి భేదం | - | ,, |
| | | | | | | | | | - | ,, |

| యుగము 1 | కాలము 2 | రాజధాని 3 | రాజా 4 | భాష 5 | వ్యవస్థ 6 | పరమాస్త్రము 7 | మతం 8 | అస్పృశ్యత 9 | కవి (కళ) 10 | వేషము 11 |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| ఇనుప | క్రీ. శ. 1250 | ఢిల్లీ | నాసిరుద్దీన్ | పార్శీ | సామంత బానిసత్వం | ఇనుపబాణం | హిందు ఇస్లాం | జాతి విచక్షణ | | చోగా సుత్తన్ |
| ,, | ,, 1300 | ,, | మహమ్మదు తుగ్లక్ | ,, | ,, | ,, | ,, | ,, | | ,, |
| తుపాకి మందు | ,, ,, 1450 | ,, | బహలోల్ లోది | ,, | ,, | ఫిరంగి | ,, | ,, | కబీరు | ,, |
| ,, | ,, 1550 | ,, | ఇస్లాంషా | ,, | ,, | ,, | ,, | ,, | జాయసీ | ,, |
| ,, | ,, 1650 | ,, | షాజహాన్ | ,, | ,, | ,, | ,, | ,, | | ,, |
| ,, | ,, 1750 | ,, | అహమ్మదుషా | ,, | ,, | ,, | ,, | ,, | | ,, |
| ఆవిరి | ,, 1850 | కలకత్తా | ఆంగ్లేయులు | ఇంగ్లీషు | పెట్టుబడి దారీ | రైలు (1853) టెలిగ్రాం | హిందు, ఇస్లాం, క్రైస్తవ | | గాలిబు | ,, ,, ,, |
| పరమాణు | ,, 1950 | ఢిల్లీ | రాజేంద్ర ప్రసాద్ | హిందీ | ,, | పరమాణువు, విమానము | మత నమ్మకం తగ్గింది | తగ్గింది | నిరాలా | కోటు ప్యాంటు |

ముస్సోరీ
12-5-1958

రాహుల్ సాంస్కృత్యాయన్.

# ఒకటవ అధ్యాయం

# సప్తసింధు

## ఆర్యులు రాక

పారశీకులు ఆర్యుల రక్త సంబంధీకులు, పొరుగువారు. వారు 'స' ధ్వనిని 'హ' గ ఉచ్చారణ చేసేవారు. అందుచేత సప్తసింధు ప్రదేశంలో నివాస మేర్పరుచుకొన్న తమ సోదరుల దేశాన్ని వారు 'హప్త హిందు' అన్నారు. అదే క్లుప్తంగా 'హిందూ' అయింది. ఆకాలంలో పశ్చిమదేశాలకు శిరోభూషణంగావున్న గ్రీకులు 'హ'ను పలుకలేక 'అ' అన్నారు. అంతట 'హిందు' శబ్దం 'ఇందు' లేక 'ఇండ్' అయింది. ఈనాడు మనదేశానికంతటికీ యీపేరే ప్రపంచమంతట వాడుకలో వుంది. ఋగ్వేదంలో సప్తసింధు పేరు అనేక పర్యాయాలు వచ్చింది కొన్నిచోట్ల ఏడునదులు అను అర్థంలోను, మరికొన్ని చోట్ల ఏడునదుల ప్రదేశం అను అర్థంలోనువుంది. ఆకాలంలో దేశంపేరుగాని, జనపదం పేరుగాని గణం పేరిటవుండేవి (గణాన్ని జనం అంటారు.) కాబట్టి ఆపేరు బహువచన రూపంలో వుంటుంది. ఇదే పద్ధతి బుద్ధుని కాలంవరకే కాదు, ఇంకా తర్వాత చాలకాలంవరకు వాడుకలో వుం . ఉదాహరణకు 'కోసలందు' అనుటకు సంస్కృతంలో 'కోసలేను' అనీ, కాశీలో అనుటకు 'కాశీను' అనీ బహువచనంలో వాడేవారు. ఋగ్వేద ఋషుల్లో చిట్టచివర ఋషి హిరణ్యస్తూపుడు. అతడు సూర్యుని స్తుతిస్తూ 'అష్టౌ వ్యఖ్యత్ కకుభః పృథివ్యా త్రిధన్వ యోజనా సప్తసింధూన' (1-35-8) అనగా అతడు పృథ్వియొక్క అష్టదిక్కులను, మూడు మరుభూములను, ఏడునదులను ప్రకాశింపచేశాడు. ఇందు "సప్త సింధూన" బహువచనం.

సప్తసింధు — ఏడునదులు లేక అందు నివసించు గణాం గురించి చెప్పే ముందు ఋగ్వేదకాలంనాటి ఆర్యుల పరిస్థితిని గురించి కొంత చెప్పవలసి వుంటుంది. 'ఆర్యులు భారతదేశానికి బయటనుండి వచ్చారు' అని అంగీకరించక పోయిన యితర ఆర్యభాషా పరివారానికి చెందిన భాషలు వారు యిక్కడ నుండి బయటకు వెళ్ళారని ఒప్పుకొనక తప్పదు. దీని వలన యింకా అనేక చిక్కులు వస్తాయి. వాటికి సమాధానం చెప్పటం కష్టమవుతుంది. ఆర్యభాష, భారత యిరోపా భాషలు, వానికి సంబంధించిన యితర సామగ్రియందు శ్రద్ధ లేకుండుటయే పై వాదనకు ముఖ్యమైన కారణంగా తోస్తుంది. ఇందుచేత మన శాస్త్రవేత్తలు కలియుగాన్ని, మహాభారత కాలాన్ని నమ్మిన మన చరిత్రను వేల సంవత్సరాలు వెనుకకు తీసుకొని పోవుటకు ప్రయత్నిస్తున్నారు. ఆసియా మైనరులో హిట్టైయిటులు, గ్రీసులో యవనులు, ఈరానులో ఈరానీయులు ప్రవేశించిన కాలాన్ని పరిశీలిస్తే ఆర్యులు భారతదేశంలో

ప్రవేశించింది క్రీ. పూ. 1500 కంటే పూర్వం కాదనేది వాస్తవమనిపిస్తుంది. భరద్వాజ, వశిష్ఠ, విశ్వామిత్రులను ప్రాచీన ఋగ్వేద ఋషులని అనుకొంటే వారికాలం పైన చెప్పినకాలానికి 300 ఏండ్లు తర్వాత అవుతుంది.

## 2. ఆర్యులరాక తర్వాతనే ఋగ్వేదం

ఋగ్వేదంలో కన్పడు ఉచ్చారణలో మార్పు రావటానికి ఎంతోకాలం గడవాలి. అప్పుడుగాని అంతపెద్ద మార్పురాదు. భారతీయ ఆర్యులు భారోపీయ వంశానికి చెందిన తూర్పు లేక, శతంశాఖవారు. ఈ శాఖలోనే రష్యనులు మొదలైన స్లావులు, ఈరానీయులు కూడ వున్నారు. స్లావులు, ఈరానీయులు మూర్ధన్య వర్ణములను అనగా 'ట'వర్గాదులను పలకలేరు. ఋగ్వేదం యొక్క మొదటి ఋక్కులోనే 'ళ' వుంది.

'అగ్నిమీళే పురోహితం' యజ్ఞస్యదేవ మృత్విజం హోతారం రత్నధాతమం' (1-1.) గాయత్రి, ఇది మధుచ్ఛంద విశ్వామిత్రకృతం. దీని అర్థం— యజ్ఞదేవుడు, హోతా, ఋత్విజుడు, పురోహితుడు బహురత్నములను ధరించువాడు అగు అగ్నిని స్తుతిస్తున్నాను. భారతీయ ఆర్యులకు యీ మూర్ధన్య వర్ణోచ్చారణ సప్తసింధులోని ప్రాచీన వాస్తవ్యులతో అనగా మొహెంజదారో, హరప్పా ప్రజలతో దగ్గర సంబంధం వల్లనే వచ్చింది. ఈరాను ఆర్యులు తమ మొదటి నివాసం 'ఆర్యానావేజా'ను గుర్తించుకొన్నారు. కాని భారతీయులు మర్చారు. ఋగ్వేదంతో ఎక్కడకూడ వారు తమ మొదటి నివాసాన్ని గురించి చెప్పలేదు. దీనికి కారణం లేకపోలేదు. భారతీయ ఆర్యులు తమ మూలస్థానం నుండి తిన్నగా మధ్యలో ఎక్కడా ఆగకుండా భారతదేశానికి రాలేదు. వారు మధ్యలో అక్కడక్కడ వుండిపోయారు. కాబట్టి వారికి ఆ మొదటి నివాసస్థానం సంగతి గుర్తులేకుండా పోయింది. ఋగ్వేదకాలం నాటి ఆర్యుల్లో అందరికంటె పశ్చిమాన వున్నవారు పక్తులు, భలానులు. వారు భారతదేశ పశ్చిమద్వారాలైన ఖైబరు, బోలను కనుమలకు చాల దూరంగా వెనుక భాగంలో వున్నారు. వారికి మరింత పడమరగ ఆర్యగణాలు వుండవచ్చు. సందర్భం రాలేదు, కావున ఋగ్వేద ఋషులు వారిని గురించి చెప్పలేదు. ఋగ్వేద ఋషుల వుద్దేశం చరిత్ర వ్రాయుట కాదు, వారు తమ దేవుళ్ళను, దాతలను సంతోష పెట్టాలనుకొన్నారు. ఆ సందర్భంలో అనేక చారిత్రక భౌగోళిక సంగతులు వచ్చాయి. కావున ఋగ్వేదం నిస్సందేహంగా చెప్పింది. ఋగ్వేదానికి, మిగిలిన వేదాలకు పోలికపెట్టరాదు. మహాభారతం, పురాణాదులకు ఋగ్వేదకాలాన్ని గురించిన జ్ఞానం అత్యల్పం, అవిశ్వసనీయం. ఋగ్వేదకాలాన్ని గురించి చెప్పటానికి ఋగ్వేదమే

పరమప్రమాణం. ఎక్కడైనా ఏవిషయమైనా ఋగ్వేదానికి విరుద్ధంగా వుండేదాన్ని వెంటనే త్యజించాలి. చరిత్రకారులు ఋగ్వేదాన్ని, మహాభారత పురాణాదులను సమన్వయం చేయటానికి ప్రయత్నించి రకరకాలుగ పొరబడుతున్నారు. దివోదాసు, సుదాసు-వీరిద్దరు తండ్రీ కొడుకులు. వారు ఋగ్వేద మహానాయకులు. వారు తృత్సు, భరతగణములకు (జనములకు) రాజులు. ప్రతాపవంతులు. వారి రాజ్యపు సరిహద్దున పరుష్ణి అనగా యీనాటి రావీనది ప్రవహిస్తూ వుండేది. సింధుకు అవతలవుండు ఆర్యగణాలు-పక్తులు. భలానులు, అలినులు, విషాణులు: సింధుకు యివతల నివసించు శివులు వారికి పొరుగువారు. వీరంతా కలిసి ఒకసారి తృత్సులపై దాడి చేయటానికి పరుష్ణి నదీతీరాన్ని చేరుకున్నారు. (4-22-2) తృత్సులు ఎంతో శ్రమపడి వారిని తరుమగల్గారు. పరుష్ణి తటాన వుండె రాజులను మహాభారతం గంగా తీరమందున్న పాంచాల (అనగా యీనాటి కాంపిల్య, కన్నోజ, రోహిలఖండ) రాజులుగా పేర్కొంది. చరిత్రకు సంబంధించిన యిటువంటి అవకతవకలను సరిచేయాలను యత్నం వృథా అవుతుంది. ఋగ్వేద చరిత్రను గురించి మహాభారతమే యిట్లుంటే యిక పురాణాల నాల్గు అడుగులు అదనంగా చేర్చివవనుటలో సందేహంలేదు. వానికి చారిత్రక విలువలేదని చెప్పటకాదు. అవి ఋగ్వేదకాలం తర్వాత వున్న కాలాన్ని గురించి మాత్రమే ప్రామాణిక సామగ్రిని అందిస్తున్నాయి. మానవ తత్వాదులకు సంబంధించిన పరిశోధనకు కూడ అవి సహాయపడగలవు.

# 3. ఋగ్వేదం పరమ ప్రమాణం

ఋగ్వేద రూపంలో ఆకాలానికి సంబంధించిన అమూల్యమగు సామగ్రి మనకు వుంది. దమారు మూడువేల సంవత్సరాలనుండి మన పూర్వీకులు యీ నిధిని ఎటువంటి మార్పులేకుండా శక్తికొలది కాపాడుతూవుంటారు. కాని యీ సామగ్రి మనల్ని దివోదాసు సుదాసులకు పూర్వమున్న కాలానికి తీసుకుపోలేదు. ఆర్యులకు పూర్వం వున్న చరిత్రకు లిఖితసామగ్రి లేకపోలేదు. మొహెంజెదరో, హరప్పాలలో వేలాది ముద్రలు దొరికాయి. వాటిపై అక్షరాలు చెక్కబడివున్నాయి. కాని మనం వాటిని చదువలేకపోతున్నాం. (చదువుటకు ప్రయత్నం చేస్తున్నారు) ఈ ప్రాచీన నగరాల్లో అనాటి మానవ జీవితానికి సంబంధించిన సామగ్రి చాల దొరికింది. రాగి, యిత్తడి యుగాల్లో వుండినారు సింధు వాస్తవ్యులు ధనధాన్యములతో నిండిన సుందర భవనాల్లో స్వేచ్ఛగా వుండేవారు. వారికి నేటి వారి వారసులకంటె ఆరోగ్య పారిశుధ్య నియమాలు బాగా తెలుసు. వారు పత్తినూలుతో తయారైన అందమైన బట్టలను ధరించే

వారు. వారిని జయించిన ఆర్యులు మాత్రం ఉన్ని, తోళ్ళ దుస్తులను ధరించేవారు. మొహెంజెదరో, హరప్పాల (సింధు) నాగరికత ఉచ్ఛస్థితిలో నున్న కాలం క్రీ. పూ. ం 2,000 లు అని నిర్ధారణ చేశారు తర్వాత వేయి సంవత్సరాలకు ఆర్యులు ఆ ప్రదేశంలో ప్రవేశించారు అనంతరం కనీసం 300 సంవత్సరాలకు అనగా క్రీ. పూ. 1200 లలో భరద్వాజ, వశిష్ఠ, విశ్వామిత్రులు తమ ఋక్కులను రచించారు. ఆర్యులకు, ప్రాచీన సింధు జానులకు మధ్య జరిగిన పోరాటం దేవాసుర సంగ్రామ రూపంలో ప్రతిధ్వనిస్తున్నట్లు మనకు బోధపడుతుంది. అప్పటినుండి దివోదాసు, సుదాసుల కాలం (క్రీ. పూ. 1200) వరకు ఉన్న చరిత్ర అంధకారంలో వుంది. ప్రాశిథిలాల త్రవ్వకాలు ఆకాలాన్ని గురించి తెలుపగలవని విశ్వసిద్దాం.

ఆనాటి ప్రాచీన వస్తుసామగ్రి దొరకకుట అరుదు. దీనికి కారణం విజేతలైన ఆర్యులు పశుపాలకులు, దేశద్రిమ్మరులగుటయే. వారు యవలు మొదలైన కొన్ని ధాన్యాలపేర్లు ఎరుగుదురు. కాని వారిపై నగరజీవిత ప్రభావం ఆలస్యంగా పడివుంటుంది. ఈ విషయం చంఘీసుఖాను, మంగోలులనుండి మనకు తార్కికంగా తెలుస్తుంది. మధ్య ఆసియాలో ఒక సప్తసింధు ఇలి-చు మొదలగు ఏడు నదుల పరిసర ప్రదేశంలో వుంది. నేటి రష్యనుభాషలో వున్న సేమిరేచ్యే అనగా ఏడునదుల ప్రదేశం యిదే కావచ్చు. అనాదినుండి వస్తే పేరుకు యిది అనువాదం అయి వుండవచ్చు. 13 శతాబ్ది మొదటిపాదంలో మంగోలుల దండయాత్రకు పూర్వం ఆ ప్రదేశంలో బహు సమృద్ధమైన గ్రామ నగరాలు వుండవచ్చు. పశుపాలకులగు మంగోలులకు అవి ఉపయోగించవు. కావున వారు వాటిని ధ్వంసం చేశారు. వాటి పరిసరాలను పచ్చిక బయళ్ళుగా మార్చారు. ఆకాలంలో పర్యటించిన యాత్రికులెందరో ఎన్నో బస్తీలను చూశారు. వాటి గోడలు యింకా నిల్చొని వున్నాయి. వాటిబయట మంగోలుల డేరాలు వేసుకొని వున్నారు. మొదట వేలున్న చోటున కొత్తపచ్చిక బయళ్ళు ఏర్పడ్డాయి. అక్కడ వారి పశువులు మేస్తున్నాయి. ద్రిమ్మరులైన ఆర్యులు కూడ యీ మాదిరిగానే వ్యవహరించి వుంటారు. మంగోలులు తమ డేరాలను ఓర్డు అన్నారు. తర్వాత ఆ శబ్దం ఉర్దూగా మారింది. ఆర్యుల తమ నివాస సముదాయాన్ని గ్రామం అన్నారు. గ్రామం అనగా సమూహ మని అర్థం. కాంస్యయుగం చివరిపాదంలో వున్న ఋగ్వేద ఆర్యులకు ఉన్ని: నూలు డేరాలు ఎక్కువ ఖర్చుతో కూడినవై వుంటాయి. కాని ప్రకృతి సిద్ధమైన అడవులున్న దేశంలో కఱ్ఱ, గడ్డితో నిర్మించిన గుడిసెలు చౌకగా వుండేవి. వర్షాకాలంలో డేరాలకంటె గుడిసెలు ఎక్కువ ఉపయోగం. సప్తసింధులో కురిసేవాన మధ్యఆసియాలో కురిసే వానలాంటిది కాదు. కాబట్టి గుడిసెలే సౌకర్యం. ఇటువంటి గుడిసెల్లో నివసించే ప్రాచీన ఆర్యగ్రామ విశేషాలు మొహింజెదరో, హరప్పా శిధిలాలవలె ఉండవు. మూడులేక మూడున్నర వేల సంవత్సరాలనాటి

వారి సామగ్రి మనకు దొరకుట అరుదు. పంజాబులో మాత్రమే ఆ సామగ్రి దొరకవచ్చు. దివోదాసు, సుదాసుల కాలంలో కూడ ఆర్యులు నాగరికులు కాలేదు. వారికి గోవులు, గుర్రాలు ధనం. వాటికొరకు వారు తమ దేవుళ్ళను స్తుతించేవారు. |

అనేక ఆర్యగణాల పేర్లు ఋగ్వేదంలో వున్నాయి. కాని బుద్ధుని కాలంనాటి జనపదాలను గుర్తించినట్లు సప్తసింధు జనపదాలను మనం గుర్తించ జాలం వైదిక కాలం తర్వాత సప్తసింధు భూమిలో ఆ జనపదాల పేర్లను కావాలని తుడిచివేశారు.

ఆర్యగణాల్లో మిక్కిలి ప్రాచీన గణాలు అయిదు (1-108-8).
యదింద్రాగ్నీ యదుషు తుర్వశేషు యద్ద్రుహ్యుష్వనుషు పూరుషుస్థః।
అతః పరివృషణా వాహియా తమథాసోమస్య పిబతం సుతస్య॥ (త్రిష్టుప్)
— కుత్స ఆంగీరసుడు.

అనగా ఓ యింద్రాగ్నులారా! మీరు యదు, తుర్వశ, ద్రుహ్యు, అను, పురులందు వుంటుండి. అయినప్పటికి కామిత వర్షకులారా! మీరు రండి. సుతులచే వడగట్టబడిన సోమాన్ని త్రాగండి.

ఇట్లు వారు యదు, తుర్వశ, ద్రుహ్యు, అను, పురుగణాలు, వారు సప్తసింధుకు ప్రధానమైన యజమానులు. కాని నేడు మనకు వారి జాడకూడ తెలియదు. ఆ కాలం నాటి చిన్నగణాలకు చెందిన పక్తులు యిప్పుడు కూడ వున్నారు. వారి వంశీకులైన పక్తూనులు నేడు పక్తూనిస్తాన్ కావాలంటున్నారు. ఇందుచేత ఆఫ్ఘనిస్తాన్కు, పాకిస్తానుకు మధ్య చెడుతూవుంది. మరోగణం భలానులు. వీరినిబట్టి బోలను కనుమ అన్నారు. ఆ కాలంలో పక్తులు నేడున్నంత విశాల భూభాగంలో విస్తరించి వుండరు. గణాలు సహజ సంతానాభివృద్ధి ద్వారా వృద్ధి చెందవు. అప్పుడప్పుడు చిన్నగణాలు తమ అభివృద్ధికై, శ్రేయస్సుకై బలమైన పెద్దగణాల్లో కలిసిపోతాయి. మధ్య ఆసియాలోని ద్రిమ్మరులు, తురుష్కులు, మంగోలుల చరిత్ర యిందుకు నిదర్శనం. సప్తసింధుల్లోని ఆర్యగణాల్లోకూడ యీ విధంగానే జరిగివుండవచ్చు. సప్తసింధులోని నదులపేర్లు కూడ యిట్లే అయినాయి 1) పరుష్ణీనది (4-22-2) పై ఇంద్రునికి అమితమైన దయ. అది నేడు రావి అనగా ఐరావతి అయింది. 2) అసిక్నీ నది చనాబ్ అనగా చంద్రభాగానది అయింది. 3) విపాట్ అనగా విపాశీనది విశ్వామిత్రుని స్తుతికి ప్రసన్నురాలై సుదాసు సైన్యానికి దారి యిచ్చింది (3-33-16). ఆ నదియే నేడు వ్యాసమహర్షి పేరుకు ముడిపెట్టబడి బియాస్ అనగా వ్యాస అయింది. 4) వితస్తానది జీలం అయింది. 5) కాని సింధు నాడు-నేడు ఒక్కటిగానే వుంది. 6) శుతుద్రి సట్లెజ్ అయింది. 7) ఏడవ నది సరస్వతి పశ్చిమకు పాయమై కురుక్షేత్రం గుండా ప్రవహిస్తోంది ఈ ఏడు నదులను భరద్వాజుడు 'సప్త స్వసా సరస్వతి' (ఏడు తోబుట్టువుల సరస్వతి) అన్నాడు (6-6-10) సరస్వ పశ్చిమలో కలిసి కొంత దూరం ప్రవహించి రాజస్తాన్ ఎడారిలో అదృశ్యమవుతుంది. చీనాబ్-సట్లెజ్ సంగమానికి కొద్దిమైళ్ళ

లోను, సింధు నదికి కొద్ది దూరంలోను యింకిపోయిన ఆ సరస్వతీ ప్రవాహం గుర్తు చాల దూరంవరకు కన్పడుతుంది. ఋగ్వేదకాలంలో సరస్వతి నది ప్రవహించి తిన్నగా సింధులో కలిసి వుండవచ్చు. ఈ నది తన తోబుట్టువులైన ఆరు నదులవలె హిమాలయంలోని హిమనీ నదాల్లో పుట్టలేదు ఘగ్గరకు రెండు పాయలు--ఒకటి మరకండా, రెండవది సరస్వతి. ఈ రెండూ శివాలిక్ కొండల్లో పుట్టాయి. వానా కాలంలో రెండు నెలలు మాత్రం యివి మహావేగంగా ప్రవహిస్తాయి. లరాయిలో పుట్టి ఎతారివరకు ప్రవహించే నదిపేరు ఋగ్వేదంలో సరస్వతి. సట్లజ్‌కు ముందు మూడు పేర్లు వరుసగా చెప్పబడ్డాయి (3-23-4) అందులోని 'అపయా' మరకండా నది అయి వుండాలి. అట్లే దృషద్వతినది ఘగ్గరా అయివుంటుంది.--

ఉతనః ప్రియా ప్రియాను సప్త స్వసానుజుష్టా
సరస్వతీ స్తోమ్యా భూత్॥ (6-61-10) గాయత్రి: భరద్వాజుడు.

అనగా మరియు ప్రియమైన వాటిలో ప్రియమైంది, ఏడుగురు తోబుట్టువులు కలది, సుప్రసన్నరాలు అగు సరస్వతి మాస్తుతికి యోగ్యురా లగుగాక.

నిత్వాదధేవర ఆ పృదివ్యా ఇగా యాస్పదే సుదినత్వే అహ్నాం ।
దృషద్వత్యాం మానుష అపయాయాం సరస్వత్యాందేవదగ్నే్య ది దీహి ॥
(3-23-4) దేవశ్రవ, దేవవాత, భారత.

అనగా ఓ అగ్నీ, దినాల్లో మంచి దినం కొరకు పృథ్వియొక్క శ్రేష్ఠమైన ధాన్యప్రదేశంలో నిన్ను నేను వుంచుతున్నాను. నీవు దృషద్వతి (ఘగ్గరా), అపయా (మరకండా), సిరస్వతీ నదులపైన మానవులకై ధనయుక్తుడవై దీప్తి మంతుడవు కమ్ము.

సప్త సింధుభూమి ఏడు తోడబుట్టిన నదుల ప్రవాహంచేత తడుపబడు ప్రదేశం. ఇట్లు ఆర్యగణాల (జనుల) భూమి సరస్వతి (ప్రస్తుత అంబాలా) నుండి సింధునదీ తీర మైదానంవరకు విస్తరించివుంది. ఋషిత్రయంలో అత్యంత వృద్ధుడైన భరద్వాజుడు యమునానదిని పేర్కొన్నాడు. కాని యమున సప్తసింధు భూమికి వెలిహద్దులో వున్న నది మాత్రమే. చివర ఋషుల్లో ఒకరు- ప్రియమేధుని కుమారుడు సింధు క్షితుడు గంగానదిని కూడ పేర్కొన్నాడు. (10-75-6). కాని అది సప్తసింధు నదుల్లోనిది కాదు. ఆకాలంలో గంగానదికి ఏగౌరవం లేదు. ఇప్పుడింత పవిత్రమైన గంగానది నాడు అనార్య (బహుశా కిరాత) పేరుతో వుండెదను విషయంకూడ చెప్ప దగిందే.

ఇమం మేగంగే యమునే సరస్వతి శుతుద్రి ।
స్తోమం సచతా పరుష్ణ్యా సింధుకిత్ ప్రియమేధ పుత్ర ॥

అనగా ఓ గంగా, యమునా, సరస్వతి పరుష్ణి (రావి)సహితంగా శుతుద్రీ ! నా యీ స్తోమాన్ని స్వీకరించండి.

గంగానది పేరు ఋగ్వేదంలో ఒకపర్యాయం నదుల పట్టికలో వచ్చింది. ఈ నదుల పట్టిక ముఖ్యమైందనుటలో సందేహంలేదు. ఈ పట్టికలో గంగానది మొదలు కొని అప్ఘనిస్తానపు కొండల్లోని నదులవరకు తూర్పున మొదలుకొని పడమరకు లెక్కించబడ్డాయి. అనగా ముందు గంగ, తర్వాత క్రమంగా పడమరన వున్న యమున, సరస్వతి, శుతుద్రి (సట్లజ్), పరుష్ణి (రావి) అసిక్ని (చనాబ్), మరుద్ వృధా, వితస్తా (జీలం), ఆర్జికీయ, సుసోమ, తృష్టామ, రసా శ్వేత్యా, సింధు, కుభా, గోమతి, క్రుము, మేహత్ను నదులు. సుసోమ సోహన్ అయి వుండవచ్చు. ఇది చాల చిన్న నది. రావల్పిండి కొండల్లో పుట్టి 'అటక్'కు చాల దిగువ వరకు ప్రవహించి సింధులో పడు తుంది. ఈ నదికి ఎగువభాగంలో ఖుషాల్‌గఢ్, మక్కడ్ వున్నాయి. అక్కడనే పాతరాతియుగం మానవ చిహ్నాలు- వారి ఆయుధాల రూపంలో దొరికాయి. సింధుకు పడమరవున్న కుభా (కాబూలు), క్రుము (కుర్రం), గోమతి (గోమల్) నదులను గుర్తించగల్గాం.

## 4. సప్తసింధుభూమి

సప్తసింధు భూమిలోని నదుల పట్టిక యింతటితో పూర్తికాదు. విశ్వామిత్ర మహర్షి పుత్రుడు అష్టకుడు 'సప్త ఆప', (పంచ ఆప అనుట ఒప్పుగ, పంజాబ్ తప్పుగ గుర్తించండి) మరియు 99 నదులను పేర్కొన్నాడు. (10-104-8)

సప్తాపో దేవీ! సురణా అమృక్తా యాభిః సింధుమ తరఇంద్ర
నవతింస్రోత్యా నవచ స్రవంతీర్దేవే భ్యోగాతుం మనుషే పూర్భిత్
చవిందః ॥ అష్టక విశ్వామిత్ర పుత్రః.

అనగా ఓ పురందర మిత్రా! నీవు సురమ్యం, అత్యంత వేగంగల ఏడు నదులతోపాటు సింధునదిని దాటితివి. దేవుళ్ళకు, మానవులకు ఉపకరించుటకు 99 ప్రవహించు నదు లను పొందినావు. ఈ 99 నదుల్లో కొన్నిటి పేర్లు ఋగ్వేదంలో యీ విధంగా వున్నాయి:— "అంశుమతి. అంజసి, అనితభ, అసిత. అశ్మన్వతి, ఉద్రీ, ఊర్ణావతి, శిశుకులిశ, క్షిప్రా, ద్రేష్టి, పురీషిణీ, యవ్యావతి, రసా, విబాలీ, వీరపత్ని, శిఫా, శ్వేత్యావరి, సరయు, సీలమావతి, సువాస్తు, సుసర్తు, హరియూపియా." సువాస్తు యీనాటి స్వాతి, ఋగ్వేదంలోని క్షిప్రానది ఉజ్జయినిలోని క్షిప్రానది అనుకొనుట భ్రమ అవుతుంది. అట్లే సరయూనదిని యిప్పటి ఉత్తరప్రదేశంలోని సరయూగా అనుకో రాదు. ఈ సరయు పర్షురానదియే. మూలభూమిలోని పేర్లను ప్రవాసీయులు తమ

మాతన వలసలకు పెట్టుకొంటారు. బృహత్తర భారతంలోని చంద్రా, కంబోజ, విదేహా పేర్లు పై విషయాన్ని స్పష్టం చేస్తున్నాయి. ఆధునిక కాలంలో ఆస్ట్రేలియా, అమెరికా, కెనడాలకు వెళ్ళిన ఆంగ్ల ప్రవాసీయులు తమ మూలనివాసముల పేర్లను తమ వలస దేశాలకు పెట్టుకొనుట మనకు తెలిసిందే కదా! సరయు సప్తసింధులో ఒకటి. స్తుతి సూనుగయుడు (10-64-9) సరస్వతి, సరయు, సింధు నదులను 'దేవీఆప' అనగా దివ్యనదులని చెప్పాడు ఇతడు నవీనఋషి. ప్రాచీనఋషుల్లో శ్యావాశ్యుడు (5-53-9) వరుసగా కుభా (కాబూలు), క్రము (కుర్రం), సింధు సరయు, పురీషిణి పేర్లను చెప్పాడు. దీని ప్రకారం సరయు సింధునదికి పడమర వున్న నదియై వుండాలి. సింధునది తర్వాత వచ్చుటచేత అది సింధు, వితస్తా (జీలం) నదుల మధ్యవున్న నదియై వుండాలి. సరయూనది ఆవతల అర్ణ, చిత్రరథులు చంపబడ్డారు :—

మా వో రసానితభా కుభా క్రముర్మావః సింధుర్ని రీరమత్ ।
మావః పరిష్ఠాత్ సరయూః పురీషిణ్యస్మే ఇత్ సుమ్న మస్తువః ॥

--శ్యావాశ్వ ఆత్రేయ

అనగా ఓ మరుత్తులారా! రసా, అనితభా, కుభా (కాబూల్), క్రము (కుర్రం), లు మిమ్ము ఆపకుందుగాక, సింధు మిమ్ము ఆపకుందుగాక, జలవతి సరయు మీకు అవరోధం కల్పించకుండ వుందుగాక. మీరు యిచ్చే సుఖం మాకు వుందుగాక.

ఋగ్వేద ఋషులు - చివరపాదంలో వున్నవారు కూడ-గంగానదికి తూర్పున వున్న ఏ భూభాగాన్ని. నదిని ఎరుగరు అనేది తిరుగులేని మాట. మహమ్మదు గజనీ కాలంలో మహమ్మదీయులు పంజాబులోనే స్థిరపడ్డారు. దాదాపు రెండువందల యేళ్ళ వరకు వారు ముందుకు పోలేదుగదా! అట్లే సప్తసింధు ఆర్యులు స్థిరపడిపోయి కొన్ని వందల ఏండ్లవరకు తూర్పుకు వెళ్ళలేదు. పడమరన ఖైబరు నుండి తూర్పున యమునాతీరంవరకు ఆర్యుల ప్రభావం విస్తరించివుంది. ఉత్తరాన హిమవంతుడు (10-12-4) లేక గొప్ప పర్వతం (1-77-3) వారి మార్గానికి అడ్డు తగిలింది. అక్కడె వీరుడగు శంబరుడు దివోదాసును అష్టకష్టాలు పెట్టాడు. అతనికి వున్న నూరు పర్వతదుర్గాలు (6-31-4) ఆర్యులకు దుర్గమం అయ్యాయి. ఋగ్వేదంలో ఆర్యులు శంబరునిగూర్చి కృష్ణయోని (నల్లని సంతానం), కృష్ణత్వక్ (నల్లని చర్మంగలవాడు) (1-130-8) అన్నారు. కాని అతడు ప్రాగ్ ద్రావిడ జాతికి చెందినవాడు కాదు. అతడు కిరాతజాతివాడు. క్రీ. పూ. 2,000 సంవత్సరములనాడు హిమాలయమంతా కిరాతభూమి అనగా కిన్నెరదేశం. కాంగడాలోని ప్రసిద్ధ దేవాలయం 'వైద్యనాథ్'ను గురించి చెబుతూ శాసనంలో ఆ బస్తీపేరు 'కిర' గ్రామం అని వుంది చంబా-లాహల్ నుండి అస్సాం వరకు వున్న కొండ ప్రాంతంలో యీనాడు కూడ కిరాతభాషీయుల శిధిలావశేషాలు ఎన్నో దొరకుతున్నాయి. నేటి శాస్త్రవేత్తలు

ఆ కిరాతులను మోక్షేర్లు అంటున్నారు శంబరుడు యివతల వున్న కిరాతగణాలకు నాయకుడు. అతను వీరుడు, శూరుడు. తర్వాత పురాణగాధలో అతన్ని దానవునిగ చిత్రించారు. భయంకర శరీరం కలవాడని వర్ణించారు. పారంపర్యంగా చెప్పుకొనుటలో తర్వాతను అతిన్ని జలంధర రాక్షసుడన్నారు. అందువలన ఆ పర్వతభాగానికి జలంధరఖండమను పేరు వచ్చింది. కాంగడాలో అతని చెవిపడింది. కావున దానిపేరు కాన్‌గఫ్, కన్‌గడ్, కాంగడా అయింది. పర్వత ప్రాంతంలో వ్యాస, రావీ నదుల మధ్య నున్న ప్రదేశానికి శంబరుడు రాజు. మైదాన ప్రదేశంలో పై రెండు నదుల మధ్యస్థ దేశానికి దివోదాసు రాజు. అందుచేత వారిరువురకు వైరముండుట సహజం.

హిమాలయం పశ్చిమహద్దులో నున్న సులేమాన్ కొండలు (కృష్ణగిరి) ఋషులకు పరిచితములు. కాని వాటి వివిధ శ్రేణుల్లోని ముంజివత, శర్యణావతుల పేర్లను మాత్రం పేర్కొన్నారు. ( 0-34-11 10-35-2) వారి సోమానికి ముంజివతు ప్రసిద్ధి. శర్యణావతు సుసోమనది యొక్క ఎగువ భాగం ప్రదేశం పేరుగ తోస్తుంది. అది ఆర్జికీయ క్షేత్రంలో వుంది.

సప్తసింధుకు దక్షిణహద్దు రాజస్తాన్ మరుభూమి (ఎడారి). వేదంలో 'మరు'ని ధన్వ అన్నారు. కాని యీ 'మహా ధన్వ'ను ఎక్కడ స్పష్టంగా వర్ణించలేదు. మధ్య ఆసియాలోని ద్రిమ్మరులవలె ఆర్యులు వ్యాపారం (పణ్యం)ను, వ్యాపారస్తులను (పణులను) ఏవగించుకొనేవారు. (2-24-6). సముద్రంలో వ్యాపారం కొరకు నావలు తిరుగుతున్న సంగతి వారికి తెలుసు. (8-58-3) ఆ కాలంలో నదులకు వాడుకలో వున్న పేరు సింధు. అయితే సింధునదికి కూడ అదేపేరు వుంది. నదులను 'అర్ణ' (అర్ణవం) అనికూడ అన్నారు. తర్వాత యీ పేర్లే సముద్రానికి పెట్టారు. కాని యీ మహాసాగరాన్ని ఆనాడు కూడ సముద్రం అన్నారు. సప్తసింధునుండి పెద్ద పెద్ద నావలు సింధునది గుండా సముద్రాన్ని చేరుతుండేవి. దిగువ సింధు తీరప్రదేశమైదానం వరకు ఆర్యులు నిస్సందేహంగా వెళ్ళారు. అక్కడే వారి శత్రువుల మహానగరముంది. ఆ నగర భవ్య శిధిలావశేషాలే నేటి మొహంజెదరో. దిగువ సింధుభాగం సప్తసింధు లోనిదని చెప్పుట కష్టం. అక్కడ ప్రసిద్ధ గణాలు నివశించినట్లు గట్టిగా చెప్పలేం. అది సప్తసింధులోనిది కానప్పటికీ అది ఋగ్వేద ఆర్యుల అధీనంలోనే వుందని ముమ్మాటికి చెప్పగలం. ఆ మార్గాన వ్యాపారం కొరకై వెళ్ళే వ్యాపారులు ఆర్యుల దృష్టిలో హీనులు. కాని ఆ పణులు ఆర్యులకు పశుధనం, ధాన్యంకంటే విలువైన ధనం చేకూర్చిపెట్టేవారు. వారి సహాయం లేకుంటే ఆర్యులు నిష్కగ్రీవులు, రుక్మవక్షులు (ఛాతీపై బంగారు ప్రేలాడ వేసుకొనువారు) అయ్యేవారు కారు. పణులు ఆర్యులకు ప్రాచీనమైన, దక్షిణ దిశలోనున్న శత్రుకోటిలోనివారు. ఋగ్వేద కాలానికి చాలముందు వారిమధ్యన వున్న పోరాటం సమసిపోయింది. కాబట్టి ఋగ్వేదకాలంలో వారికున్న సంఘర్షణమంతా పార్వతేయులతో అనగా హిమాలయవాసులైన కిరాతులతోనే వుంది.

# రెండవ అధ్యాయము

# ఆ ర్య గ ణ ము లు

## 1. సింధు నాగరికత

ఆర్యులు మొట్టమొదట సప్తసింధుకువచ్చి నివాసమేర్పరచుకొను కాలంలో ఋగ్వేదంలేదు. ఆర్యులు సప్తసింధులో కాలూనుట శాంతియుతంగా జరుగలేదు. తమకంటె అధిక నాగరికులతోను, నాగరికులు కాబట్టి తమకంటె మృదుస్వభావుల తోను, క్రీ. పూ. 1600 ప్రాంతంలో ఆర్యులు భయంకరమైన యుద్ధం చేశారు. హరప్పాలో యిటువంటి భయంకర హత్యాకాండకు సంబంధించిన అవశేషాలు దొరికినవి. మోర్టిమోర్ హ్వీలరు 'ఇండసువ్యాలీ సివిలిజేషను' అను పుస్తకంలో పై విషయాన్నే వ్రాశారు. ఋగ్వేదంలో ఇంద్రవృత్ర యుద్ధరూపంలో పై సంఘర్షణను గురించి మనకు ఛాయామాత్రంగా తెలుస్తుంది. దానినే ఇంద్ర-శంబరయుద్ధంలో కలిపివేశారు. జన (గణ) యుగానికి చెందిన జాతులు తమ ఘన విజయముల శ్రేయస్సు అంతా తమ దేవతలందే అన్నారు. దివోదాసు భరతులతోను, యితర ఆర్యజనములతో కలిసి పార్వతేయుడైన కిరాతశంబరునితో 40 సంవత్సరాలు భయంకర సంఘర్షణ జరిపి విజయం సాధించగల్గాడు. ఆనాటి ఆర్యపురోహిత వర్గము యీ విజయ శ్రేయస్సు అంతా తమ యిష్టదైవమైన యింద్రునికే కట్టబెట్టాలనుకొన్నారు. ఇందుకు సంబంధించిన ఘట్టాలను చదివితే పరాక్రమ వంతుడగు దివోదాసు యింద్రుని ఆయుధానికి మించి మరేమీ కాడని తెలుస్తుంది.

ఋగ్వేద ఋషులగు భరద్వాజుడు, వసిష్ఠుడు, విశ్వామిత్రుడు, వారి యజమానులగు దివోదాసు, సుదాసులు: ఆర్యులు సప్తసింధులో ప్రవేశించిన చాలా కాలానికి అంటే వారిభాషలోని మూర్ధన్య ఉచ్చారణమైన 'ట' వర్గము 'ళ' గా పెద్ద మార్పు చెందిన తర్వాత: అనగా మొదటి యుద్ధము సంగతి చాలవరకు గుర్తు తప్పుతున్నప్పుడు పుట్టారు. విజేతలు పరాజితులతో ఎంతటి ప్రగాఢ సంబంధం పెట్టుకొన్నారో యీ మార్పు మనకు తెల్పుతుంది. ఋషులుగాని, సామాన్య ప్రజలుగాని యిటువంటి గాఢ సంబంధాన్ని ఒప్పుకొనరు. కాని ఆర్యులకు తప్పని సరి అయింది. వారికి పని చేయుటకు దాసులు (నౌకరులు) కావాలి. విరోధులయొక్క ఎన్నో విలాస-

వస్తువులను వాడుకొనుటకు వారికి అభ్యంతరంలేదు. ఆర్యులు నిజంగా ప్రాచీన సింధు నాగరికతను ధ్వంసం చేసి సమాజ చక్రాన్ని వెనుకకు త్రిప్పటానికి ప్రయత్నించారు. వారు తమవెంట తెచ్చుకొన్న గ్రామ్యక జీవితాన్ని స్థాపించు కొన్నారు. చెంఘీసుఖాను యొక్క మంగోలుల మాదిరి ఆర్యులు నగర జీవితాన్ని, నాగరిక జీవిత విధానాన్ని ఏవగించు కొనేవారు. వారి విజేతలగు దివోదాసు, సుదాసులకు ఏదైనా నగరమున్నట్లుగాని, రాజధాని వున్నట్లుగాని ఎక్కడా పేర్కొన లేదు. గుర్రాలను, గోవులను పరమ ధనంగా నమ్మినవారు నగరాల్లో ఎట్లా వుండ గల్గుతారు. అశ్వ, గోపాలురైన ఆర్యులు ఎటువంటి నాగరికత, సంస్కృతి గల స్థానమును ఆక్రమించు కొన్నారు. సింధు నాగరికతలోని ధనికులకు మొహెంజెదరోలో వున్న భవ్య నగరాలు వున్నాయి. అక్కడ వున్న యీ నాటి శిథిలములను చూచిన ఆంగ్లేయు డొకడు మనం లాంకషైరు శిథిలముల మధ్య ఉన్నట్లు ఉన్నది అని అన్నాడు అక్కడ ఉత్తరాన్నుండి దక్షిణానికి పోయే రోడ్డు చాలా విశాలంగా వుంటుంది. దానిపైన చక్రాల బండ్లు, పాదచారులు హాయిగా, తాపీగా వెళ్ళవచ్చు. నగరం ప్రణాళికా బద్ధంగా కట్టబడింది. రోడ్ల వెడల్పు 9 అడుగులు మొదలు 34 అడుగులు. కొన్ని రోడ్లు అరమైలు వరకు తిన్నగా వున్నవి. ఒక రోడ్డు మరొక రోడ్డును సమకోణం దగ్గర తాకుచు చౌరాస్తాకు అవకాశం కల్గిస్తుంది. ప్రతి వీధిలోను, రోడ్డుపైన ప్రజల వుపయోగార్థం బావులున్నవి. వారి యిళ్ళలో స్వంత బావులు, స్నానపు గదులున్నవి. నీరు పోవుటకు కాలువలు, మోరీలు కలవు. అవి చూచి యీ నాటి పట్టణాలు ఎంతో ఈర్ష్యపడతాయి. శిథిలములను చూచి యివి ధనికుల భవనాలు, వ్యాపారస్తుల గృహాలు, శిల్పుల మందిరాలు, కూలీల పేటలు అని చెప్పగలం. పట్టణాన్ని చూడగనే అది ప్రజాతంత్ర పెట్టుబడిదారీ సమాజపు నగరంగా తోస్తుంది. ఎక్కువ యిళ్ళు కాల్చిన యిటుకతో కట్టినవి. ఆకారంలో ఆ యిటుకలు యిప్పటి వానితో పోలివున్నవి. రంగులో మబ్బుగా ఎర్రగా ఉన్నవి. చాకుబ్లేడును దూర్పించుటకు కూడ వీలులేని విధమున ఆ యిటుకలు ఒకదానికొకటి అతికించబడి వున్నవి. ప్రతి యిల్లు సౌఖ్యంగా, శుభ్రంగా వున్నవి. అన్నిటి కంటె చిన్న యింటిలో రెండు గదులున్నవి. పెద్ద యిళ్ళు మేడలను పోలి వున్నవి. మధ్యలో యిటుకలు పర్చిన నడవ. దాని అంచులందు గదులు, ద్వారములు, కిటికీలు వున్నవి, సింహద్వారం రోడ్డు వైపుకు వున్నది ప్రతి యింటి స్నానపు గది రోడ్డుకు దగ్గరలో వున్నది. క్రింది అంతస్తులోనే కాదు, పై అంతస్తులో కూడ స్నానపు గదులు కలవు. పంజాబులోని పాత మిద్దెలకు వలె పాయఖానా మాత్రం మేడ కప్పుపైన వుండేది. పట్టణాల్లో రాత్రిళ్ళు రోడ్లపైన దీపాలు వెలిగించేవారని కనుగొనబడింది. ప్రజలు గోధుమలు, యవలు పండించే వారు వరి, నువ్వులు, బటాణీ కూడ పండేవి. కనీసం వారు ఖర్జూర పండును ఆహారంలో తినుకొనే వారు. నదుల్లో, సరోవరాల్లో దొరికే తాజా చేపలను, ఆవు, మేక, గొర్రె, పంది, కోడి.

తాబేలు మొసలి మొదలగు వాని మాంసాన్ని వారు తినేవారు. గేదెలు, ఒంటెలు, ఏనుగులు వీని ఎముకలు అక్కడ దొరికినవి కాబట్టి వారు ఆ జంతువులను ఉపయోగించే వారు.

వారు ఉన్ని, నూలు వస్త్రాలు ధరించేవారు. సాధారణంగా వారు ఒక వస్త్రాన్ని ధోవతిగా ధరించి, రెండవ వస్త్రాన్ని ఉత్తరీయంగాగాని, దుప్పటిగాగాని, యజ్ఞోపవీతం ధరించినట్లు కుడిభుజాన్ని ఖాళీగా వదలి వేసుకొనేవారు. స్త్రీల వేషం పురుషుల మాదిరి వుండేది. కుషాణులు రాక పూర్వం మనదేశపు స్త్రీలు ధరించిన విధంగా వారు తమ తలపైన తలపాగను చుట్టేవారు, లేక తలపైన గుడ్డను కప్పుకొనే వారు. పురుషులకు పొడవైన జుట్టు వుండేది. పాపట తీసుకొనేవారు. మీసాలు తీసి వేసేవారు. గడ్డము చిన్నదిగా లేక పూర్తిగా క్షవరం చేయించుకునేవారు. స్త్రీలకు బంగారం, వెండి, రాగి, ఇత్తడి, మట్టి, రాతి నగలంటే వాళ్ల యిష్టం. పురుషులు మురుగులు, కంటె, ఉంగరము పెట్టుకొనేవారు. కేశములను అలంకరించుకొను ఆ భూషణములంటే వారికి మక్కువ. స్త్రీలు ముఖచూర్ణమును (ఫేస్ పౌడరు), కాటుకను ఉపయోగించేవారు. అధర రాగమును (లిప్‌స్టిక్కు) కూడ వాడే వుంటారు.

రాగి లేక ఇత్తడి సూదులు, గొడ్డలి, రంపము, కొడవలి, బాకు, చేప ముల్లు (సొరముల్లు) మొదలైన వాటిని ఉపయోగించేవారు. కొలత తూకము సామానులు చూస్తే అవి మనం నేటివరకు వాడుకొన్న రూపాయికి పదహారణాల లెక్క ననుసరించి వున్నట్లుగా తోస్తుంది.

యుద్ధం చేయుటకు రాగి లేక ఇత్తడి, గండ్ర గొడ్డళ్ళు, బల్లెములు, కత్తులు, కటారులు కలవు విల్లు బాణము వుండేవి. రాగితో పల్చని కవచములను తయారు చేయుట వారికి తెలుసు. రాతి గదలు వారికి గలవు.

బంగారం వెండి, యితర లోహములు, రత్నాలు — వీని కొరకు వారు మైసూరు, కాశ్మీరు, తూర్పు భారతదేశం, మధ్య ఆసియా, పశ్చిమ దేశాలతో సంబంధం పెట్టుకొనేవారు. వారికి నావలు సముద్రంలో నడిచేవి. మెసపుటోమియాతోను, బహుశా ఈజిప్టుతోను వారికి వ్యాపార సంబంధ ముండేది. వారి వున్నత వర్గాల్లో పురోహితులు, యోధులు, వ్యాపారులు ఉన్నారు. వ్యాపారస్తుల సంపద, పలుకుబడి తక్కువగా ఉండెదికాదు. పురోహితుల, యోధుల పలుకుబడి ఆర్యుల విజయానంతరం తగ్గివుండవచ్చు. కాని వ్యాపారస్తుల ప్రభావం మాత్రం అప్పుడు కూడ వుండేది. ఆర్యులు వారిని 'పణు' లన్నారు. వారి ఆశను ఏవగించుకొనేవారు. పణి శబ్దము బహుశా ఆర్య భాషాశబ్దముకాదు. అది విభాషా శబ్దమోమరి సంస్కృతంలో 'పణ్' ధాతువు క్రయ విక్రయములకు వస్తుంది. అయినప్పటికీ ఈ శబ్దం

భారతదేశానికి వెలుపల భారత–ఐరోపా భాషా పరివారానికి చెందిన భాషల్లో లేదు. కాబట్టి యీ శబ్దము బయట నుండి ఎరువు తెచ్చుకున్నదే.

సింధు నాగరికతా కాలం క్రీ॥ పూ॥ 2800–2500 అని ఫాబ్రీ అభిప్రాయం. హ్వీలరు యీ కాలాన్ని క్రీ॥ పూ॥ 2,300-1500 అన్నాడు. అంటే ప్రాచీన సింధు నాగరికత అంతం, ఆర్యుల రాక ఒకే కాలమవుతున్నది. ఆర్యులు ఎటువంటి నాగరికతను, భౌతిక జీవితాన్ని పాడు చేయటానికి యత్నించారో మనం చూచాం. కాని వారు సుత్రం మినహా మరొక వస్తువును యివ్వలేక పోయారు. మొహింజెదారో, హరప్పా, మరియు యిటువంటివి ఎన్నో నగరాలను ధ్వంసం చేసిన పిమ్మట సప్తసింధులో గెల్చుకున్న భూమిని పశుపాలకులగు ఆర్య జనములు తమలో తాము పంచుకొని దానిని గోచర భూమిగా మార్చి వేశారు. ఎన్నో నగరాలు నిర్మానుష్యమై పాడుపడినవి. గ్రామాల్లో వుండే అనేక మంది తూర్పుకు, దక్షిణానికి పారిపోయారు. ఉన్న వారిని ఆర్యులు దాసులుగా, కూలీలుగా చేసుకొన్నారు. మొహెంజెదారో భూమిని పేరు లేని ఏ ఆర్య గణమో పాలించి ఉంటుంది. అందుకనే వారి పేరు ఋగ్వేదంలో రాలేదు. ప్రధానమైన జనములు సింధుకు తూర్పున వున్న భూభాగంపై పెత్తనాన్ని సంపాదించారు. ఎక్కడ ఏ జనం నివాస మేర్పరచు కొన్నదో, ఆ భూమికి లేక ఆ జన పదానికి ఆ జనం పేరు పెట్టుకొన్నారు. జనముల పేర్లు కూడ మొదట్లో ఏ పూర్వీకుని పేరనో, లేక ప్రధానమైన వ్యక్తి పేరనో వచ్చివుండాలి. ప్రాచీన ఆర్యులు యిటువంటి పేర్లను పెట్టుకొనుటను గమనించుట అవసరం. కురు (కోరోశ్), మద్ర (మేద) వంటివి యీరానులో కూడ వాడుకలో వున్నవి. కొన్ని ఆర్య జనములు భారతదేశానికి బయటకూడా అదే పేరుతో ప్రసిద్ధి పొందినట్లు తెలుస్తుంది. సింధు విజయం నాటి వారి పేర్లు తెలియుటలేదు. ఋగ్వేద కాలంలో ఆర్యుల్లో ఐదు ముఖ్య జనము (గణము) లుండేవి. పంచజన, పంచ చర్షణీ, పంచక్షితి ఆర్యజన మంతటికినీ ప్రయోగింపబడిన పదాలు. వీనిని బట్టి చూస్తే ఆర్యులు మొదట్లో బహుశా ఐదు జనములుగా విభక్తమై వుండవచ్చు. కాని ఋగ్వేద గణముల సంఖ్య ఒక డజనుకు పైగా వుంది. వానిలో అతి పురాతన గణము లేవో చెప్పలేము.

సింధును జయించిన మూల ఆర్యగణములు ఐదే. తర్వాత వారి సంతానం డజను అని చెప్పుకొన్నచో అప్పటికి ఆర్యులు వచ్చి చాల కాలమైనట్లు తెలుస్తుంది. ఋగ్వేద ప్రముఖ ఆర్యజనములు దిగువ సింధు లేక దాని సమీపమందున్న భూభాగంలో అంటే మొహింజెదారో, లేక హరప్పాలో వుండే వారు కాదు. వారు సింధు నదికే కాదు. వితస్తా (జీలం), అసిక్నీ (చినాబ్) కి కూడ తూర్పున వుండే వారని చెప్పవలసి వుంటుంది. పురులు ఐదు జనముల్లోను ప్రతాపవంతులు. వారు సప్త సింధుకు తూర్పు భాగాన వుండేవారు. అంటే ఋగ్వేద కాలంలోనే ఆర్యుల

ప్రతాప కేంద్రం తూర్పుకు చాలవరకు జరిగిందన్నమాట. బ్రాహ్మణములు, ఉపనిషత్తుల కాలంలో (క్రీ. పూ. 700) యీ కేంద్రం మరింత తూర్పుకు జరిగి పశ్చిమ ఉత్తర ప్రదేశానికి (కురు-పాంచాల) చేరుకొన్నది. తర్వాత శతాబ్దంలో అక్కడనుండి (బుద్ధునికి కొంచెం ముందు) కాశీ, కోసలకు, ఆ తర్వాత శతాబ్దములో మగధకు చేరి మన చారిత్రక కాలంలో కలిసింది.

## 2. పంచ జనములు (గణములు)

1. పురులు : పరుష్ణీ నదికి (రావీ) తూర్పున ఋగ్వేద కాలానికి కొంచెం ముందు యీ గణము లున్నట్లు తెలుస్తుంది. ఋగ్వేద కాలమునకు యీ 'జనము'న కనేక శాఖలు ఏర్పడినవి. వానిలో భరత, త్రుత్సు, కుశిక పేర్లు మనకు తెలుసు. కుశికుల నాయకుడు విశ్వామిత్రుడు. సుదాసును బాగా బలపర్చాడు. భరతుల నాయకులు బధ్రశ్వ, దివోదాసు, సుదాసు ఈ ముగ్గురు తాత, తండ్రి, కుమారులు. దివోదాసు, సుదాసులను పురు, భరతులనికూడ అంటారు. వారు త్రుత్సులకుకూడ నాయకులు. అప్పటివరకు యీ గణముల్లో అంతగా వైరం కల్గలేదని తెలుస్తుంది. తర్వాత మూల జనులైన పురులు వారి శాఖ అయిన భరతజనులు నుండి బాగా విడిపోయారు దాశరాజ్ఞ యుద్ధంలో వారు భరతులకు కాకుండా వారి శత్రువులకే సహాయము చేశారు.

భరతులు ఒకప్పుడు పరుష్ణీ (రావీ) తీరమందు నివసించేవారు. కాని యీనాడు వారి పేరట మన దేశాని కంతటికిని భరతదేశమను పేరు వచ్చింది. భారత దేశానికి బయట మన దేశానికి తన పేరుతో సింధు ప్రసిద్ధిని సంపాదించి పెట్టింది. స్వదేశంలో పరుష్ణీతీర వాసులగు భరత జనములు తమ పేరును మన దేశానికిచ్చారు. భరతులద్వారా పురులు ఓడుటలో వసిష్ఠునిపాత్ర చాలవున్నది. "అగ్నులు భరతుల ప్రార్థన విన్నారు. వారు యుద్ధంలో పురులను అణచారు" అని వసిష్ఠుడు చెప్పారు. (7-8-4) దుష్టవచనములను పలికే పురులను యుద్ధంలో ఓడించుటకు దాశరాజ్ఞ యుద్ధంలో వసిష్ఠుడు యింద్రుని స్తుతించాడు (7-18 13).

వినద్యో విశ్వా దృహి తాన్యేషా మింద్ర పురః సహసా సప్త దర్దః ।
వ్యానవస్య తృత్సవే గయం భాగ్జేష్మ పూరుం విదథే మృధ్రవాచం ॥

(ఇంద్రుడు యీదస్యుల బలమైన ఏడు పురములను వెంటనే బలంగా నాశనం చేశాడు. అనవు (అనుల) లస్థానములను తృత్సులకు యిచ్చాడు. అసత్య పరులైన పురులను మేము యుద్ధంలో గెల్చెదము గాక.)

దివోదాసు కాలంలో పురులకు, త్రుత్సులకు అంతగ చెడలేదు. దివోదాసు పుత్రుడు పరుచ్ఛేప ఋషి దివోదాసుని మూల జనంతో సంబంధ ముండుట చేత

'పురు' అన్నారు (1-130-7), తర్వాత ఎప్పుడో దివోదాసుకు పురులకు తగాదా వచ్చింది. (7-8-4). పురురాజులు ముగ్గురు. వారి పేర్లు ఋగ్వేదంలో వచ్చినవి. పురుకుత్సుడు, అతని పుత్రుడు త్రసదస్యుడు. త్రసదస్యుని పుత్రుడు కురుశ్రవణుడు. కురుశ్రవణుని పేరువలన భావి కురువంశాభివృద్ధి పురుజనుల వలన జరిగినట్లుగ తెలుస్తుంది.

2. యదులు : ఈ ఋగ్వేద గణము తర్వాత కాలంలో కూడ వున్నట్లు తెలుస్తుంది. మధురలోని యదువంశం కృష్ణుని వలన బహుప్రశస్తిని పొందింది. 'కరోళి' రాజులు 'వ్రజ'లో వున్నారు. వారు గౌరవముగల యదు వంశీయులు. జైనుల పేరులోని భాటులు కూడ యదు వంశీయులే. వారి బంధువులైన నాహన (సిర్మౌర్) పర్వత రాజులు కూడ యాదవులే. మహమ్మదీయుల చేత ధ్వంసం చేయబడిన దేవగిరి (దౌలతాబాదు) రాజులు సైతము యాదవులే. ఇట్లు యాదవులు మధుర, రాజస్థాన్, హిమాలయం, దక్షిణమున మహారాష్ట్ర వరకు విస్తరించి వున్నారు. కాని ఋగ్వేదకాలంలో వారు సప్తసింధులోనే వుండేవారు. వారు మాత్రం చాల పరమరగా వుండేవారు. పురులు యింటిలోనే విరోధులు. కాని తండ్రి, కొడుకులైన దివోదాసు, సుదాసులు అందరికంటె ఎక్కువగా యదు, తుర్వశులతో సంఘర్షణ చేయవలసి వచ్చింది. తుర్వశ, యదులు జంట అనుటవలన వారొకే స్థానములో వున్నట్లుగాని, లేక వారిమధ్య స్నేహం ఎక్కువగా వుందని గాని అనుకొనవచ్చును. చాలచోట్ల సంగరా చరణములోను లేక శాపంలోను యీ గణముల పేర్లు జంటగా వచ్చినవి. అగస్త్యుడు (వసిష్ఠుని తమ్ముడు కావచ్చు) ఒకే చోట (1-174-9) పై యిరువురికి యింద్రుని వలన శుభం కోరుతూ స్తుతించారు.

త్వం దునిరుద్రపుని పతీః ఋజోరోపః సీరావ స్రవంతిః।
ప్రయత్ సముద్రమతికూర పర్షిపారయా తుర్వశం యదుం స్వస్తి॥

(ఓ యింద్రుడా! ధ్వనిచేయు నీవు నదుల వలె ధ్వనిచేయు జలములను ప్రవహింప చేశావు. ఓ శూరుడా! నీవు సముద్రంలో పొంగును కల్పించునప్పుడు తుర్వశ, యదులను శుభముగా దాటించుము).

సవ్య ఆంగిరసు కూడ (1-54-6) 'శతక్రతూ, నీవునవ్వ, తుర్వశయదులను రక్షించావు. నీవు తుర్వశులను రక్షించావు' అని ఇంద్రుని స్తుతించారు. కణ్వపుత్రుడగు వత్సుడుకూడ తుర్వశయదుల సుఖాన్ని కోరాడు (8-7-18).

యే నావతుర్వశం యదుం యేనకణ్వం ధన స్పృతక్వానామే సుకస్యదిమహి॥

(ఓ మరుత్తులారా, మీరు తుర్వశయదులను, ధనము కోరిన నా తండ్రిని రక్షించారు. ధనము కొరకు నేనూ మిమ్ములను ప్రార్థిస్తున్నాను.)

కణ్వుడు, అతని పుత్రుడు వత్సుడు మొదలగువారు తుర్వశయదులకు పురోహితులు. కావున వారు తమ యజమానుల శుభాన్ని కోరారు, అశుభాన్ని కోరలేదు. కాని వశిష్ఠుడు తద్విరుద్ధంగా యింద్రుని యిట్లు ప్రార్థించాడు—

"ఓమఘవన్, నీవు అతిధి సేవాపరాయణుడు సుదాసుని క్షేమం కోరువాడవు. నీవు తుర్వశయదులను ఓడించుము."

3. తుర్వాసులు : ఋగ్వేదంలో తుర్వశుల పేరు యదులతోపాటు వచ్చింది కణ్వుడు, ఆయన పుత్రుడు వత్సుడు వారి వంశీకులు— వారికి పురోహితులు. భరతులు, పురులు మాత్రమే అనార్య శత్రువులను ఎదిరించలేదు; తుర్వశులు కూడ ఎదిరించి పంచగణాల్లో తమపేరు సార్థకం చేసుకొన్నారు. పురులు శుతుద్రికి తూర్పున నివసించేవారు. వారి పురోహితులు అత్రి, అతని వంశీకులు. వారు ఋగ్వేద పంచ మండలం కర్తలు. కాని అవస్యు ఆత్రేయుడు యదుతుర్వశులను కూడ ప్రశంసించాడు. (5-31-8)

త్వమ పో యదవే తుర్వశాయారమయః సుదుఘాః పార ఇంద్ర ।

అనగా ఓయింద్రా! నీవు యదు, తుర్వశులకు కోరినంతగ జలాలను (నదులను) యిచ్చావు.

భరద్వాజుడు భరతుల పురోహితుడు. ఆయన తుర్వశుల విజయాన్ని కాంక్షిస్తూ గానం చేయలేదు. ఆయన సృంజయుల చేతిలో తుర్వశులు ఓడినట్లు చెప్పాడు. (6-27-7.) "ఆ యింద్రుడు సృంజయులకు తుర్వశులను ఒప్పగించాడు."

భరద్వాజుడు బృహస్పతి పుత్రుడు. బృహస్పతి, అతని వంశీయులు 'శంయు'లు కూడ యింద్రుని స్తుతిస్తూ తుర్వశ, యదులను కీర్తించారు (6-45-1)

య ఆనయ త్పరావతః సునీతీ తుర్వశం యదుం। ఇంద్ర స నో యువా సఖా॥

అనగా సుదూరం (పరమర) నుండి తుర్వశ యదులను సురక్షితంగా తీసుకొని వచ్చిన ఆ యువ యింద్రుడు మాకు సఖుడు. భరతులకు తుర్వశులు, యదులు బలవద్విరోధులు. భరతుల నాయకులు దివోదాసు, ఆయన కుమారుడు సుదాసు. తుర్వశులు సృంజయుల చేతిలో ఓడిపోయారు. దీన్నిబట్టి భరతుల స్థానం తుర్వశుల భూమికి దగ్గర వున్నట్లుగా తెలుస్తుంది. ఈ రెండు గణాలవారు శుతుద్రి (సట్లజ్), పరుష్ణి (రావి) నదులకు దిగువ భాగంలో నదులకు యిరు ప్రక్కల వుండేవారు. అక్కడ నుండి సట్లజ్ బియాస్‌ల మధ్యప్రదేశంలో సృంజయులు

వుండవచ్చు. శంయుని స్తుతి ప్రకారం మొదట్లో యీ రెండుగణాలు చాల దూరాన (సింధు సమీపంలో) వుండేవారు. తర్వాత వారు యీ ప్రదేశానికి వచ్చి నివాసం యేర్పరుచుకొన్నారు. తుర్వశులు కూడ యింద్రుని చేత తేబడినవారు. భరతులు, సృంజయులు కూడ యింద్రుని భక్తులే. అయినప్పటికిస్వార్థం వారిమధ్య విరోధాన్ని కల్గించింది. భరతులు తమ ప్రభుత్వాన్ని సప్తసింధు అంతటా విస్తరింపజేసి సమైక్యతను స్థాపించా లనుకొన్నారు. ఈ సందర్భంలో తుర్వశులు, యదులు వారిని గట్టిగా ఎదిరించారు.

4. ద్రుహ్యులు:- వీరు కూడ పంచగణాల్లోని వారే. వీరు వీరులు, వీరి పురోహితుడు భృగుమహర్షి. కుత్స అంగీరసుడు యింద్రాగ్నులను స్తుతిస్తూ పంచగణాలను పేర్కొన్నాడు (1-108-8)

యదింద్రాగ్నీ యదుషు తుర్వశేషు, ద్రుహ్యు. షనుషు, పూరు షస్థః॥

అనగా ఓ యింద్రాగ్నులారా! మీ రిద్దరు యదులందును, తుర్వశులందును, ద్రుహ్యులందును, అనులందును, పురులందును వుంటున్నారు.

దీనిని బట్టి యదు, తుర్వశులకు సమీపంలో ద్రుహ్యు, అనుల జనపదాలుండేవని తెలుస్తుంది. పంచగణాలందరు యింద్రునికి, అగ్నికి కూడ భక్తులే. ద్రుహ్యులు, పురులు, త్రుత్సులు మహాశక్తివంతులని శంయువార్హస్పత్యుని ఋక్కువలన బోధ పడుతుంది. (6-46-8)

"ఓ యింద్రా! శత్రువులను ఓడించుటకై మాకు త్రుత్సు లేక ద్రుహ్యు లేక పురుగణాల శక్తిని యిమ్ము" తన యజమాని సుదాసుకు వారు శత్రువులు, కనుక వసిష్ఠుడు వారిబలాన్ని ఏమీ గుర్తించలేదు. దాశరాజ్ఞ యుద్ధంలో వారికి చాల కష్ట నష్టాలు కల్గాయి. ఈ విషయం వసిష్ఠుని ఋక్కుద్వారా తెలుస్తుంది— 'ధనం కొరకు తుర్వశ, భృగు, ద్రుహ్యులు యింద్ర, సఖుడైన సుదాసుని ఎదిరించారు. (7-18-6). 'శ్రుతకవష, బృద్ధ, ద్రుహ్యులను వజ్రబాహుడు యింద్రుడు నీటిలో (నదిలో)ముంచి చంపాడు-(12), ఆవులను అపహరించుకొని పోవాలనుకున్న అనులు, ద్రుహ్యులయొక్క 66,066 మంది వీరులు నిద్రపోయారు (మరణించారు) 14:

పురోళా ఇత్తుర్వశోయక్షురాసీద్రాయే మత్స్యాసోనిశితా అపీవ।<br>
శ్రుష్టిం చక్రుర్భృగవో ద్రుహ్యవశ్వ సఖా సఖాయ మతరద్విషూచః॥ (6)<br>
అధశ్రుతం కవచం బృద్ధమప్స్వను ద్రుహ్యుని వృణక్ వజ్రబాహుః।<br>
వృణానా అత్ర సఖ్యాయ సఖ్యం త్వాయం తో యే అరుదన్ననుత్వా॥ (12)

నిగవ్యవో న హోద్రుహ్యపశ్చ షష్టిః శతాను షుపుః షట్ సహస్రా।
షష్టిర్వీ రాసో అధిషడ్ దువోయు విశ్వేదింద్ర స్య వీర్యాకృతాని॥ (14)

అనులు, ద్రుహ్యులు, పురోహితులగు భృగులుకలిసి సుదాసుపై దండెత్తి వట్లుంది. వారు సరిహద్దున వున్న పరుష్ణి (రావి) నదిని దాటి భరతుల భూమిలోకి ప్రవేశించి వుండవచ్చు. నదిదగ్గర యుద్ధం జరిగింది. వారి నాయకులు శ్రుతకవషుడు మొదలైనవారు ఓడిపోయి పారిపోతూ నదిలో మునిగి చనిపోయి వుండవచ్చు. యుద్ధ రంగంలో వారి వీరులు అరవై ఆరువేల కంటె ఎక్కువమంది చనిపోయారు. ద్రుహ్యు, అనుల భూమి పరుష్ణికి పశ్చిమాన వితస్తా (జీలం) వరకు వ్యాపించివుంది. ద్రుహ్యులకు వుత్తరంగా అనులు, దక్షిణాన తుర్వసులు వున్నట్లు తోస్తుంది. ఋక్కుల్లో వారి స్థానాలను పేర్కొనలేము. ఇంతమ ది వీరులు ఏ నీటిలో మునిగిపోయారో తెలుపలేదు. కాని దాశరాజ్ఞయుద్ధంలో పడమరవున్న గణాలు పరుష్ణినదిని ఒకసారి బంధించి సుదాసుకు కష్టాలను కల్పించారు. ఈ విషయం మనకు సూక్తుల ప్రకరణంలో తెలుస్తుంది. కాబట్టి ద్రుహ్యుల నివాసం పరుష్ణి నదికి పడమర అనుకోవచ్చు.

5. అనులు : వీరు పంచగణాల్లోని వారు. ద్రుహ్యులకు స్నేహితులు. చనిపోయిన 66 వేలమందిలో అనువీరులు కూడ వున్నారు. అనస్యు అత్రే ముని యీ ఋక్కులో వీరి గొప్పతనం కానవస్తుంది (5-31-4)

అనవస్తే రథమశ్వాయ తక్షన్త్వష్టా వజ్రం పురూహోత ద్యుమంతం
బ్రహ్మాణం ఇంద్రాం మహయంతో అర్కైరవర్ధయన్నహయే హంతవాఉ॥

అనగా ఓ యింద్రా ! అనులు నీ గుర్రాలకై రథాన్ని, అహి (రాక్షసుడు)ని చంపుటకు త్వష్టను (ప్రకాశించు వజ్రాయుధాన్ని): బ్రాహ్మణులు స్తుతులచేత నిన్ను గొప్పచేసారు.

ఇట్లు అనులు రథ నిర్మాతలుగ వున్నారు. కణ్వుడు తుర్వసులకు పురోహితుడు. అతని వంశీకుడు దేవాతిథి తన యజమానులను శ్లాఘిస్తూ అనుపక్షం వహిస్తూ, కీర్తించాడు — ఓ యింద్రుడా ! నిన్ను తూర్పునుంచి, పడమరనుంచి ఉత్తర దక్షిణాలనుంచి ఆహ్వానిస్తున్నారు. కాని నీవు తుర్వసుల కొరకు: ఎక్కువగా అనుల కొరకు ఆహ్వానింపబడుతున్నావు (8-4-61). కాని నూరు మాయలెరిగిన శతయాతు వసిష్ఠుడు 'అసత్యవాదులైన అనులపై ఆయుధాన్ని వేయమని' అశ్వని దేవతలను కోరుతున్నాడు (6-62-9)

7. యక్షు (గంగా యమునల మధ్య గాంగ్య దేశంలోని ఆర్యేతర రాజ్యం)

8. దుశ్మ ?

9. వేతంసు ?

10. సరస్వతీవత్, సారస్వత (కురుక్షేత్రంలోని సరస్వతీ తీరాన వున్న దేశం.)

11. సింధు (దిగువ సింధు ప్రాంతం.)

అధర్వవేద కాలంలో ఆర్యులు అంగ, మగధ అనగా బెంగాలు సరిహద్దువరకు విస్తరించారు. కాని ఋగ్వేద కాలంలో వారు సప్తసింధులోనే వుండేవారు. అక్కడనే వారి గణాలు స్వతంత్ర పశుపాలక జీవితాన్ని గడుపుతూవుండేవి.

---

# మూడవ అధ్యాయం

# వర్ణం — వర్గం

## 1. వర్ణం (రంగు)

ఋగ్వేద కాలంలో (అనగా క్రీ. పూ 1200-1000) భారత దేశంలో నాలుగు జాతులుండేవి. వాటిలో కోలులు లేక కోలారీలు (నిషాదులు, ఆస్ట్రికులు) సప్త సింధుకు చాలదూరంగా వుండేవారు. కాబట్టి వారికి ఆనాటి ఆర్యులతో ఎటువంటి సంబంధం లేదు. ఆర్యులతో గాఢసంబంధం వున్న వారు, సంఘర్షణ చేసినవారు:— 1. మొహింజెదరో, హరప్పాలోని నాగరికజాతులైన ద్రవిడులు. 2. కాశ్మీరం నుండి అస్సాం వరకు, యింకా ఆపైన కొండల్లోను, లోయల్లోను నివసించు జాతులైన కిర, కిరాతులు (మోనఖ్మేరులు) ముఖ్యులు. ఆర్యులు నాగరికులైన ద్రవిడులతో ముందుగ పోరాడవలసివచ్చింది. సప్తసింధులో స్థిరపడిన తర్వాత వారు హిమాలయ ప్రాంతాలకు, లోపలి ప్రదేశాల్లోకి ప్రవేశించునప్పుడు కిరాతులతో పోరు సల్పవలసి వచ్చింది. ఆర్యులకు కిరాతులతో వారి నాయకులైన శంబర, చుముర మొదలైనవారితో యీ విధమైన సంబంధం వుందని చెప్పుతున్నాం. ఋగ్వేదం ద్రవిడులకు, కిరాతులకు భేదం చూపలేదు. వారిని కృష్ణచర్ములు, కృష్ణయోనులు, కృష్ణవర్ణులు అన్నది. కిరాతుల రంగు నలుపుకాదు. వారిది మంగోలుల రంగు పాండు వర్ణం. వారి ముఖాలకు ద్రవిడుల ముఖాలకు చాల తేడావుంది. ద్రావిడులను, కిరాతులను నల్లవారు, దస్యులు, దాసులు అని ఆర్యులన్నారు. జయించిన జాతి ఓడిపోయిన జాతితో పొత్తు కుదుర్చుకొనకపోయినప్పుడు వర్ణభేదం ఏర్పడుతుంది. నేడు దక్షిణాఫ్రికాలో ఎక్కువగా, ఆఫ్రికాలోని యితర ప్రాంతాల్లో తక్కువగా యీరంగు భేదం కానవస్తుంది. ఈ వైజ్ఞానిక యుగంలో— మానవ చైతన్యం వున్న దినాల్లో యిటువంటి అన్యాయం జరుగుతూ వుండే నేటికి మూడువేల సంవత్సరాలకు పూర్వం సంగతి యింక చెప్పవలసిన పని లేదు!

ఋగ్వేద ఆర్యులు

1. ఆర్యుల వర్ణం : ఋగ్వేదంలో ఆర్యుల రంగును గురించి స్పష్టంగా చెప్పలేదు. ఆర్య దేవతల రంగును గురించి వర్ణనలున్నాయి. వాటినిబట్టి ఆర్యుల రంగుకూడ అదే ఐ వుండవచ్చు, అని చెప్పవచ్చు. మానవుడు తన దేవుడిని తన రూపంలోనే చూస్తాడు. 'యదన్నం పురుషోహ్యతి, తదన్నం తస్యదేవతా' అన్నా

మానవుడు ఏ అన్నం తింటే అతని దేవుడుకూడ అదే తింటాడు. 'యద్ రూపం పురుషో భవతి, తద్రూపా తస్య దేవతా' అనగా మానవునికి ఏ రూపం వుంటుందో అతని దేవునికి కూడ అదే రూపం వుంటుంది. ఋగ్వేద ఆర్యుల తర్వాత ఆరు వందల ఏండ్లకు బుద్ధుడు జన్మించాడు. వేయి సంవత్సరాలకు పతంజలి పుట్టాడు. వీరి కాలంలో చెప్పబడిన రంగు పైన చెప్పినదానిని స్పష్టపరుస్తుంది. విశిష్టమైన ఆర్యుల రంగును గూర్చి పతంజలి ఇట్లు వర్ణించాడు:—

"గౌరః శుచ్యాచారః కపిలః ఇత్యేతాన్
అభ్యంతరాన్ బ్రాహ్మణ్యేగుణాన్ కుర్వంతి"

(2-2-6) అనగా ఎర్రనివాడు, పవిత్రమైన ఆచారపరుడు, కపిల పింగళ కేశములవాడు— ఇవి బ్రాహ్మణునికి వుండవలసిన గుణాలు. పతంజలి బ్రాహ్మణుని యొక్క వర్ణముల గురించి చెప్పింది ఆర్యులందరికి వర్తిస్తుందనుట స్పష్టం. దీనికి కారణం వుంది. తర్వాత కాలంలో బ్రాహ్మణులకు, బౌద్ధులకు రంగును గురించి వివాదం జరిగింది. అందు బ్రాహ్మణునకు గౌరవర్ణం ప్రకృతి సిద్ధం అని చెప్పి వర్ణవ్యవస్థ సహజమని ఋజువుపర్చుటకు ప్రయత్నం జరిగింది. బుద్ధునిది బంగారు వర్ణం. కళ్ళు అవిసె పూల నీలంరంగు, కొత్తగా వచ్చిన ఆర్యులు అంతకు పూర్వం అచ్చటి నివాసులతో కలియకూడదను నియమం కలవారు. అందుచేత ఋగ్వేదంనాటి ఆర్యుల రంగు ఖచ్చితంగా కపిలం (తెలుపులో చేరింది), కేశములు పింగళ వర్ణములు (బంగారు రంగు), కన్నుల రంగు బుద్ధునికివలె బహుశా నీలం కావచ్చు.

1) కేశముల రంగు : ఋగ్వేదంలో ఇషఋషి (5-7-7) అగ్ని దేవుని మీసాలను, గడ్డాన్ని ఇట్లు వర్ణించాడు — అతడు పింగళ వర్ణ కేశ గడ్డమున్న వాడు, తెల్లని దంతాలు కలవాడు, గొప్పవాడు, అప్రతిహత పరాక్రమశాలి.

అంగిరస గోత్రుడగు వరుడు ఇంద్రుని మీసాలను, కేశాలను ఇట్లా వర్ణించాడు:— పింగళ వర్ణంగల మీసాలతో, కేశములతో వున్న ఇంద్రుడు దృఢమైనవాడు. (10-96-8). విశ్వామిత్రుడు అగ్నికేశాలను పింగళవర్ణం అన్నాడు (3-2-13):— "మేము ఆ విచిత్రగతితో, హరిత పింగళ కేశాలతో ప్రకాశించుచున్న అగ్నిని నూతన ధనం కొరకు ప్రార్థిస్తున్నాం." గోతమ రాహూగణుడు ఇలా అన్నాడు:— "అగ్ని హిరణ్యకేశుడు, మేఘాలను చెదరగొట్టగల కంపనుడు, వాయువువలె శీఘ్రగామి, శుభ ప్రకాశయుతుడు." (1-79-1) హరికేశుడు

హిరణ్యకేశుడు- వీని అర్థం ఒక్కటేనని స్పష్టమైంది. ఒకే మంత్రంలో అగ్నిని హరితకేశుడన్నారు. ఇక్కడ పింగళ వర్ణానికి హరి, హరిత శబ్దాలు కూడ ప్రయోగించబడ్డాయి. సంస్కృతంలో హరిత, పార్శీలోని జర్ద, రష్యను భాషలో జోల్టా, ఆంగ్లంలో గోల్డు— ఒకే మూల శబ్దానికి భిన్నరూపాలు. అభారతీయమైన భారోపీయ భాషల్లో పింగళ శబ్దానికి అర్థం బంగారం. ఇంద్రుడు, అగ్ని ఋగ్వేద ఆర్యులకు ప్రాచీన దేవుళ్ళు. ఆ దేవుళ్ళ మీసాలు, గడ్డాలు పింగళ వర్ణం కాబట్టి వారి భక్తులైన ఆర్యుల మీసాలు, గడ్డాలు పింగళ వర్ణమని చెప్పుతున్నాం. అగ్ని శిఖల సహజ వర్ణం పింగళం కాని యింద్రుని రంగు అదేనని చెప్పలేం. ఇంద్రుని రూపం ఆర్యుని రూపమే కాబట్టి భరద్వాజుడు అతని ముక్కు, ముఖం పింగళవర్ణం అన్నాడు (6-29-6) వసిష్ఠుడు ఆర్యులని శ్వేతవర్ణం (తెల్లనిది) అన్నాడు (7-33-1) తన వంశీకులను గురించి చెప్పుకొంటూ శ్వేత వసిష్ఠ సంతానం తనకు ఆనందం కల్గిస్తోందన్నాడు. మరుత్తులను స్తుతిస్తూ 'సూర్యునివంటి చర్మం గలవారా! అనుట వలన (7-59-11) వారి వర్ణం గౌర వర్ణం అని స్పష్టపడుతుంది. పింగళం, హిరణ్యం, హరితం— ఇవి పింగళ వర్ణాన్ని సూచిస్తున్నాయి. గృత్సమదుడు పుత్ర సంతానం కొరకు ప్రార్థించాడు – (2-3-10) త్వష్టా! మాకు పింగళ వర్ణుడు, దృఢకాయుడు, ఆయుష్మంతుడు, దేశభక్తుడు, చురుకుదనం గలవాడు అయిన సంతానాన్ని ప్రసాదించుము.

2. శరీరం : ఇంద్రుని శరీరం ఆర్య వీరవరుని శరీరాన్ని పోలివుంది. ఆయనను గూర్చిన వర్ణన చదివితే అతడు సప్తసింధులోని మల్లయోధుని పోలివున్నాడు. అరివిక్షరుషి యింద్రుని "శరీరాన్ని వర్ణించాడు (8-17-8)– పెద్ద మెడ, పుష్టిగల పొట్ట, అందమైన బాహువులు గల యింద్రుడు." ప్రగాథ కణ్వ పుత్రుడు యింద్రుని శరీరాన్ని వర్ణించాడు— "అతడు వృషభుడు, యువకుడు, తువిగ్రీవుడు (పొడవు మెడ గలవాడు), వికారుగ వున్నవాడు". పై వర్ణనలు చదివితే ఆర్యుల రంగు, శరీరం ఎట్లుందో మనకు తెలుస్తుంది. అనేక ఋక్కుల్లో శత్రువులను గురించి చెప్పబడింది. కావున వారి రంగుకూడ మనం తెలుసుకో గల్గుతున్నాం.

## అనార్యుల రంగు

విశ్వామిత్రుడు ఆర్య శత్రువుల్ని, కృష్ణ వర్ణులను సంహరించమని ఇంద్రుని నుతించాడు (2-31-21).

అంగిరస శునహోత్ర పుత్రుడు గృత్సమదుడు ఆర్య శత్రువులు కృష్ణయోనులు అన్నాడు.

# 2. వర్గాలు

1. దాస-దాసీలు: యుద్ధంలో గెల్చినవారు ఓడిపోయిన శత్రు స్త్రీ, పురుషులను ఎక్కువమందిని దాసీలుగా, దాసులుగా చేసుకొని పనిచేయించుకొనేవారు. బానిస వ్యవస్థ కాలంలో అంతటా యీ పద్ధతి వున్నట్లు మనం గమనించాం. మనదేశంలో యీ బానిసత్వం (వెట్టిచాకిరి, ఊడిగం రూపంలో) 19 వ శతాబ్దం రెండవపాదంలో అంతమైంది. ఋగ్వేదకాలంలో గెల్చినవారికి, ఓడినవారికి రూపం, రంగు, స్వార్థంలో చాల తేడా వుంది. కావున అప్పటిలో బానిసవిధానం అతిక్రూరంగా వుండనుట వాస్తవం. బాలఖిల్య సూక్తాల్లో వృషత్ర ఋషి యింద్రుని ప్రార్థించాడు— "నాకు నూరు గాడిదలు, నూరు గొర్రెలు, నూరు మంది దాసులను ప్రసాదించుము." (14-88-3). ఆర్యులు తమ శత్రువులనుకూడ దాసులు, దస్యులు అనేవారు. తర్వాత కాలంలో అమ్ముడు పోయినవారిని దాసులు (బానిసలు) అన్నారు. పైన ఋషి నూర్గురు దాసులను కోరినందున నిస్సందేహంగా వారు జాతిలోను, పనిలోను దాసులే. గృత్స మద ఋషి (2-2-4) 'దాసః విశా' దాస ప్రజలన్నారు. ఆయన వేరొకచోట దాసుల రంగు నికృష్టం అన్నాడు. ఋగ్వేదంలో త్రసదస్యుడు కణ్వపుత్ర శోభరికి 50 మంది వధువులను యిచ్చినట్లుంది. (8-19-36,37). ఇచ్చట వధూ శబ్దానికి అర్థం దాసి.

## ఆర్యుల జీవిత విధానం

ఆర్యుల ముఖ్య ధనం ఆవులు, గుర్రాలు, గొర్రెలు, మేకలు. వారు కొద్దిగా వ్యవసాయం చేస్తూవుండేవారు. వారు తినే రొట్టెకు యవలపిండి కావాలి. బాగాడబ్బు పలుకుబడి వున్న ఆర్యులు పశుపాలనకు, వ్యవసాయానికిగాను దాస దాసీల సేవలనుపయోగించుకొనేవారు. కాబట్టి వారికి 50 మంది దాస దాసీలు అవసరమయ్యారు. కాని ఆర్యుల్లో సామాన్యులు మాత్రం తామే వ్యవసాయం, పశుపాలనను చూచుకొనేవారు. ఆర్యులకు ఉన్ని, తోలు దుస్తులు కావాలి. సప్తసింధులోని ఎండవేడిమి నాడు కూడ ఓర్చుకొనుట కష్టంగా వుండేది. అయినప్పటికి ఆర్యులకు వున్ని దుస్తులయిష్టం. వారికి వున్నిదుస్తులు ధరించుట అలవాటు అందాం. లేకుంటే సప్తసింధులో ఆర్యులకు ముందున్న ద్రవిడులు నూలుబట్టలు ధరిస్తే ఆర్యులు కూడవాటిని ధరించవచ్చుగదా ! నేటి గొర్రెల కాపరులు కూడ మండుటెండలో కంబళ్ళు వేసుకొని

గొర్రెలను మేపుట మనం చూస్తున్నాం. ఇట్లే సప్తసింధు ఆర్యులుకూడ చేసేవారేమో! ఆర్యులుకూడ బట్టలు నేసేవారు. అంగిరస శిశుఋషి యీ క్రిందివారిని పేర్కొన్నాడు— వడ్రంగి, వైద్యుడు, బ్రాహ్మణుడు, సోమాన్ని ఎదగట్టు యజమాని, కమ్మరి, కవి, పిండి విసిరేవారు, ఉపమంత్రిలు, (9-113-1-4) దీన్నిబట్టి ఆకాలంలో వివిధ వృత్తులవారు వున్నట్లు మనకు తెలుస్తుంది.

2. చాతుర్వర్ణాలు : డా॥ బటేకృష్ణఘోష ఋగ్వేద భాషను గురించి యిలా వ్రాశారు— మొత్తంమీద మొదటి 9 మండలాల భాష సమంగా వుంది అచ్చటచ్చట ర, ల భేదముంది 10వ మండలం భాషాదృష్టితో, యితర విషయాల్లోను యిటీవలిది అని విద్వాంసుల అభిప్రాయం. మొదటి 9 మండలాల్లో నాల్గు వర్ణాలపేర్లు లేవు. కాని 10వ మండలంలో వున్నాయి.(The Vedic Age — P 336)

బ్రాహ్మణో అస్యముఖ మాసీద్, బాహూరాజన్య కృతః ।
ఊరూ తదస్యయద్ వైశ్యః, పద్భ్యాం శూద్రో అజాయతః ॥ (10-90-12)

అనగా యీ పురుషుని ముఖం బ్రాహ్మణుడు, బాహువుల క్షత్రియుడు, తొడలు వైశ్యుడు. కాళ్ళనుండి శూద్రుడు పుట్టాడు. ఋగ్వేద ప్రారంభకాలంలో బ్రాహ్మణులు, పురోహితులు వున్నారు. కాని వారు కూడ యితర ఆర్యులవలె యుద్ధంలో పాల్గొనేవారు. భరద్వాజుడు, వసిష్ఠుడు విశ్వామిత్రుని పుత్రులు, వంశీకులు దివోదాసు, సుదాసు చేసిన అనేక యుద్ధాల్లో పాల్గొని ఆయుధాలను ప్రయోగించారు ఆనాడు బ్రాహ్మణులకు క్షత్రియులకు భేదం లేదు. ఉపనిషత్తుల కాలంలో తర్వాత కాలంలో లేక యీ పురుషసూక్త కాలంలో వున్నట్లుగా ప్రారంభంలో అటువంటి భేదం లేదు. 'విశ్' అనగా ప్రజ లేక లోకం. ఇది ఆర్య జాతి యావత్తు వస్తుంది. రాజును 'విశాంపతి' అంటారు. 'విశ్' శబ్దంనుండి వచ్చి వైశ్యశబ్దానికి తర్వాత వాడుకలో కొత్తఅర్థం వచ్చింది శూద్రశబ్దం దాసుడను అర్థంలో వుపయోగించబడింది మొదట్లో దాసులు ఆర్యులకు శత్రువులు. ఓడినతర్వాత దాసులు, బానిసలు. కాబట్టి చాతుర్వర్ణకల్పన తర్వాతకాలంలో జరిగిందనుట స్పష్టం. ప్రారంభంలో ఆర్యుల్లో బ్రాహ్మణులున్నారు. వారికి, క్షత్రియులకు భోజనాదుల్లో వివాహాదుల్లో భేదంలేదు కాని నాల్గువర్ణాల భావన ఏర్పడగానే వారిలో హెచ్చు తగ్గులు వచ్చాయి. ఈ భావనతోపాటు ధనం, అనుభవం వాటాల్లో హెచ్చుతక్కువలొచ్చాయి. ఈ భేదాలవల్ల విరోధం పుట్టుటసహజం. ఆర్యఋషులు యీభేదాను తొలగించాలను కొనలేదు

కాని ఆర్యుల్లోమాత్రం సమానత్వంకొరకు ప్రయత్నం జరిగింది. ఋగ్వేదంలోని అంతిమ సూక్తంలో సంవనన ఋషి ఈ విషయాన్ని చెప్పాడు. 'మీరు కలిసి నడవండి, కలిసి మాట్లాడండి, పూర్వకాలంలో దేవతలు కలిసి ఉపాసించినట్లు మీ మనస్సులు కలిసి ఆలోచించాలి.' (10-191)

చరిత్ర వ్రాసే ఉద్దేశం ఋగ్వేద ఆర్యులది కాదు. దేవతలను తృప్తి పర్చుటకు వారు స్తోత్రాలు వ్రాశారు. కాబట్టి వారి ఆర్థిక, సాంఘిక, అన్యజీవిత విధానం మనకు గౌణంగానే తెలుస్తుంది. ఆర్యులకు, ఆర్యేతరులకు (ద్రవిడులు, కిరాతులకు) మధ్య ఆర్థిక, సాంఘిక భేదం ఎక్కువగా ఏర్పడింది. ఆర్యులు విజేతలు, గెల్చినవారు, యజమానులు. కాబట్టి వారు అందరికంటె ఎక్కువ సంపత్తి సుఖం తమకే వుండాలని అనుకొనేవారు. వారికి కావలి మాత్రం యితరుల కుండేది. పణులు వ్యాపారం చేసేవారు. 'పణి' శబ్దంనుండి వణిక్ పుట్టింది. ఇప్పుడు బనియా అయింది. వీరు ఐశ్వర్యవంతులు. వీరి చేతుల్లో వర్తకం వుండేది. వీరికి ఆవులుకూడ వున్నాయి. వాటిని అపహరించుట ఆర్యులు తమ ధర్మంగా పెట్టుకొన్నారు. ఇందుకు ఏదో నెపాన్నికూడ వెతుక్కోనవసరం లేదు. సరమ, పణుల సంవాదం యీ విషయాన్ని స్పష్టపరుస్తుంది. పూర్తిగా అపహరిస్తే వీరి వ్యాపారం సాగదు. కాబట్టి ఆర్యులు వీరి పెట్టుబడిని, వ్యాపారాన్ని, వృత్తి సాధనాలను మాత్రం అపహరించేవారు కారు. ఆర్యులకు బంగారం కావాలి. మణులు, రత్నాలు అంటే వారికి మక్కువ. పణులు వాటిని తెచ్చి ఆర్యుల కిచ్చేవారు. అందుచేత ఆర్యులు వారిని కాపాడుతూ వుండేవారు. పణులు ఆర్య పురుషులకు కృతజ్ఞతా పూర్వకంగా ఉదారంగా దాన మిచ్చేవారు

## 3. పరాజితులు (ఓడినవారు)

పణులు ద్రావిడ జాతివారు. ఆ జాతి అంతా పణుల మాదిరి ధనికులు కాదు, వారిలో చాలమంది ఆర్యుల దయా దాక్షిణ్యాల మీద రైతులుగా, శిల్పులుగా వుండి జీవిస్తూవుండేవారు. కాని పర్వతరాజు శంబరుని ప్రజలు కిరాతులు. వారుమాత్రం స్త్రీ పురుషులతో సహా యుద్ధానికి తయారయ్యేవారు. వారికి ఆర్యులనుండి తప్పించుకొనుటకు అవకాశం వుంది. కాంగ్రా పర్వత సమీప ప్రాంతంలో, కొండల్లో వారు చాలామంది ఆర్యులతో యుద్ధం చేశారు. నలభై ఏండ్లు యుద్ధం చేసిన తర్వాత దివోదాసు శంబరుని చంపగల్గాడు. కిరాతులు ఓడిపోయారు. అప్పటి యుద్ధంలో పట్టుబడిన వారందరూ దాసులయ్యారనుట సత్యం. కాని ద్రావిడుల మాదిరి కిరాతులందరు ఒకే

కోట వుండనవసరంలేదు. ఉత్తరాన యింకా దుర్గమ పర్వతాలు, పచ్చికబయళ్ళు పచ్చికతోనున్న కొండప్రాంతాలు వారికి వున్నాయి. శంబర వంశీకులు అక్కడకు పోతూ వుండేవారు. సరిగ్గా అంతే జరిగింది కిరులు (కిరాతులు) కాంగ్రా దిగువ కొండల్లో 'కిరగ్రామం' (వైద్యనాథ్) వదలిపెట్టారు. ఈనాడు కాంగ్రాకు కొన్ని వందల మైళ్ళ దూరంలో లాహుల్, కులాణా (కులూ), కన్నౌరులో మనకు వారి వునికి కన్పడుతుంది. కాబట్టి ఆర్యుల దాస వర్గంలో కిరాతుల సంఖ్య తక్కువ, ద్రవిడుల సంఖ్య ఎక్కువ అనిపిస్తుంది.

## 4. దోపిడీ - వర్ణభేదం

పరాజితులు ఆర్థిక దోపిడీకి గురి అవుతారు. సాంఘికంగా నీచంగా చూడబడతారు. 'దేవతలు దాసులను నీచ వర్ణంగా చేశారు', అని గృత్సమదుడు చెప్పిన దాని అర్థం యిదే. ఈనాడు అమెరికాలో తెల్లజాతివారు తమ జాతీయులను నీగ్రోలతో కలియకుండా జాగ్రత్త వహించుటను చూస్తే ఆనాడు ఆర్యులకు పరాయి జాతి రక్త మిశ్రమం అంటే వుండే భయం మనకు అర్థమవుతుంది అమెరికా తాను ప్రజాస్వామిక దేశమని డప్పు కొట్టుకుంటుంది. కాని దీపం క్రింద చీకటి మాదిరి అక్కడనే జాత్యహంకారముంది. నీగ్రోలు తెల్లవారితో కలిసి విశ్వ విద్యాలయాల్లో చదువరాదు. తెల్లజాతి యువతి నీగ్రో యువకుని ప్రేమిస్తే ఆ యువకుని కాల్చివేస్తారు. చట్టం లేదు, న్యాయం లేదు. ఏటా యిట్టి భయంకర దురంతాలు అక్కడ జరుగుతూనే వుంటాయి. దక్షిణాఫ్రికాలో తెల్లవారు యీ విషయంలో మరింత క్రూరంగా, సిగ్గు విడిచి ప్రవర్తిస్తారు. అక్కడ జనాభాలో అధిక సంఖ్యాకులు ఆఫ్రికనులు. అల్ప సంఖ్యాకులు తెల్లవారు. కాని వారు ఆఫ్రికనులను మనుష్యరూప జంతువుగ చూస్తారు. తమ యిళ్ళ దగ్గరలోగాని, బస్తీల సమీపంలోగాని వుండనివ్వరు. రైళ్ళు, యితర వాహనాలు తెల్లవారికి ప్రత్యేకించి వున్నాయి బ్రతుకుటకు కాస్త తిండిపెట్టి ఆఫ్రికనులను అంటరానివారిగా వుంచారు. వర్ణభేదం యొక్క యీ రెండు రూపాలు అమెరికాలోను, దక్షిణాఫ్రికాలోను వున్నాయి. ఆర్యులు యీ రంగు భేదాన్ని శాశ్వతంగా ఉంచ యత్నించారు. కాని యిప్పుడు మన జాతుల్లో యీ రంగుభేదం ఎక్కడా కానరాదు. బ్రాహ్మణుల్లో కూడ బొగ్గువలె నల్లనివారున్నారు. శూద్రుల్లో, అస్పృశ్యుల్లో ఎర్రనివారున్నారు. ఒకే రకమైన, శుభ్రమైన దుస్తులు వేసి బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్ర బాలురను నిల్చోపెట్టితే వారెవరైందీ మనం తెలుసుకోలేం. అయినప్పటికి పాత శాస్త్రాలను వల్లిస్తూ, పాతకాలపు యీ వర్ణభేదాన్ని శాశ్వతంగా వుంచుటకే యిప్పుడు

కూడ ప్రయత్నం జరుగుతూవుంది. పెద్దకులం, గొప్పజాతి అంటే బాగా ధనికులు, చిన్నజాతి, చిన్నకులం అంటే డబ్బులేనివారు. డబ్బు లేదంటే అతనికి యితర మానవహక్కులు లేవన్నమాట. చదువు, సంస్కృతి వుండవు. ఈ విధంగా ప్రతి దేశంలోను ఓడినవారి పట్ల గెల్చినవారు కటువుగ వ్యవహరిస్తూ వుంటారు. జాతి భేదం, రంగుభేదం లేకపోతే కొన్నాళ్ళకు ఓడినజాతి గెలుపొందిన జాతిలో కలిసి పోతుంది. వారిమధ్య సంబంధాలు మెరుగవుతాయి. ఉదాహరణకు చారిత్రక కాలంలో మన దేశానికి వచ్చిన శక, యవన, శ్వేతహూణులను తీసుకొందాం. వారంటే మొదట్లో కొంత భేదముండేది. కాని రంగుభేదం లేదు. ఆర్యులది, వారిది ఒకేరంగు. క్రమేణా వారు ఆర్యుల్లో కలిసిపోయారు. డబ్బు వున్నవారు కాబట్టి వారు అగ్ర వర్ణాల్లోనే కలిసిపోయారు. వారు అస్పృశ్యులుగ చూడబడలేదు వారు ధనవంతులగుటయే యిందులకు ముఖ్య కారణం.

ఇక్కడ నప్రసంగు ఆర్యులకు పరాజితులకు మధ్య ఎక్కువ రంగుభేదం వుంది. కాబట్టి వారు అశ్వేతరులతో కలియుటను అంగీకరించలేదు. వారిశ్రమనుమాత్రం వద్దన లేదు. దక్షిణాఫ్రికాలో తెల్లజాతివారు యీపనే చేస్తున్నారు. సింధుప్రదేశంలో వున్న వారు విజయులైన ఆర్యులకంటె భౌతిక సంస్కృతి, నాగరికతలో మిన్నగ వున్నారు. వారి శిల్పులు తామ్రయుగానికి చెందిన మొహింజెదరో, హరప్పావంటి నగరాలను నిర్మించారు. 'శిల్పవిద్య' ఆకళాకౌశలంవలన ఆర్యులకు లాభంకాబట్టివారు ఆ లాభాన్ని వదలుకోదల్చలేదు. భారతదేశానికి రాకపూర్వమే ఆర్యులకు బట్టలు నేయుట, వైద్యం చేయుట, ఆయుధాలు తయారుచేయుట తెలుసు. ఇప్పుడు సింధులో స్థావరం ఏర్పరచు కొన్నాక వారు అభివృద్ధికరమైన కొన్ని కళలనుకూడ నేర్చుకొన్నారు. ముఖ్యంగా ఆ శిల్పులచేత దాసులచేత పనులు చేయించుకొని బాగా లాభపడ్డారు. మనలో భోజనాదు లందు యీనాడు వున్న అంటు ఆనాడు వుండని చెప్పలేం. మన అనుభవంలో ఉత్తర భారతమందు 'శూద్రాః సంస్కర్తాం'వుంది. అనగా శూద్రులు మంచివారు. కాబట్టి భోజనమందు అతిశూద్రులకో భేదంకాని శూద్రులతో గాదు ఇక్కడ రంగుభేదంకాదు, అపరిశుభ్రత ముఖ్య కారణం. ఋగ్వేద ధనికుల యిండ్లలో దాసీలు వంటచేసేవారు. వారి వంటకాలు తినుటకెవ్వరికీ ఆక్షేపణ లేదు. అంటు అనేది ఆ దినాల్లో క్రమేణా పెరి గింది. సూత్రగ్రంధాల్లో శౌచానికసీళ్ళు తీసికొనిపోవాలను నియమంలేదు. 'గురు కులంలో మశికితుడగు స్నాతకుడు ఎండు కర్రను వుపయోగించాలి. అంటే అప్పటికి నీళ్ళు ఆచరణలోనికి రాలేదు. వచ్చినాటికి, వండిననాటికి అప్పటిలో అంటులేదు

ఉన్నివస్త్రాలు పవిత్రములు. ఆర్యులు నూలువస్త్రాలను ఉపయోగించకుండా ఉన్ని బట్టలను ఉపయోగించుటవలన రెండుభావాలు ప్రచారంలోకి వచ్చాయి. కాలం గడచిన కొలది వున్ని పవిత్రం అను భావన కల్గింది. నూలుగుడ్డ అపవిత్రం అయింది. వంట యింటిలోకి నూలు గుడ్డలు మార్చుకొని వెళ్ళాలి. కాని వున్ని స్వతః పవిత్రం. దాన్ని మార్చుకో నక్కరలేదు. కాశ్మీరులో చలి ఎక్కువ. తడిగుడ్డ వేసుకొనుటకు వీలుండదు. అక్కడ వున్నివస్త్రమే మడివస్త్రం. ఉన్నిబట్టతో కప్పిన నీళ్ళు భోజనం మహమ్మదీయుడు తెచ్చినప్పటికీ పవిత్రములే. ఒకప్పుడు ఉన్నివస్త్రం వలె ఎద్దుతోలు పవిత్రంగా వుండేది. పారస్కర కల్ప సూత్రాల్లో వధూవరులను ఎద్దు చర్మంపై కూర్చోపెట్టి మధుపర్కాలను యిచ్చే విధానం వుంది. గోవు చర్మం వెనుకకుపోయి లేడి చర్మానికి (మృగాజినానికి) పవిత్రత పెరుగుతూవుంది. ఇవి ఆర్యుల చర్మపు దుస్తులు. కాబట్టి పవిత్రములు.

—•—

# నాల్గవ అధ్యాయము

# ఆహార పానీయాలు

## 1. ఆహారం

1. మాంసం - ఋగ్వేద ఆర్యులు వ్యవసాయం చేసేవారు. కాని గోవులు, గుర్రాలు, గొర్రెలు, మేకలు- వారికి అతి ముఖ్యమైన ధనం. కాబట్టి వారిలో మాంసం తిననివారు ఏ ఒక్కరు వుండకపోవచ్చు. గొప్ప గొప్ప ఋషులకు ఆతిథ్యమిచ్చుటకు కూడ మాంసం అవసరం. అందుచేతనే తర్వాతకాలంలో ధర్మసూత్రకారులు 'నామాంసో మధుపర్కో భవతి' అన్నారు. అనగా మాంసం లేకుండా మధుపర్కం కాదు. (ఆశ్వలాయన గృహ్య సూత్రం 1-4). అతిథి సత్కారానికై తయారుచేసే ఆహారాన్ని మధుపర్కం అనేవారు. ఋగ్వేదం తర్వాత బ్రాహ్మణముల కాలంలో కూడ అనగా క్రీ. పూ 800లో మాంసం ఆర్యులకు ముఖ్యమైన ఆహారం. దీన్ని గురించిన మహిమలు కూడ అమల్లో వుండేవి. బృహదారణ్యకంలో (6-4-18) ఇట్లు చెప్పబడింది:—

య ఇచ్ఛేత్ పుత్రో మే పండితో విగీతః సమితింగమః
శుశ్రూషితాం వాచం భాషితా జాయేత,
సర్వాన్ వేదాం అనుబ్రవీత, సర్వమాయురి యాదితి
మాంసౌదనం పాచయిత్వా సర్పిష్మంతం అశ్నీయాతామ్
ఈశ్వరౌ జనయిత వా ఔక్షేణ వాఽ ఽర్షభేణ వా॥

అనగా పండితుడు, ప్రసిద్ధుడు, సామాజికుడు, శ్రోతలున్న వక్త, వేదపారి, దీర్ఘాయుష్మంతుడు అగు పుత్రుని కోరికగల తల్లి ఆబోతు లేక ఎద్దు మాంసోదనం నేతితో వండుకొని తినవలయును. ఇందు సందేహించ నవసరంలేదు. శంకరాచార్యులు పైదానికి ఇట్లు టీకా వ్రాశారు:- 'మాంసమిశ్రమోదనమ్' తస్మాంస నియమార్థమాహ- ఔక్షేణవా మాంసేన, ఉక్షా సేచన సమర్థః పుంగవస్తదీయం మాంసమ్

ఋషభ స్తతో- వ్యధికవయాః తదీయమార్షభం మాంసమ్- అనగా మాంసం వయస్సులో నున్న లేక ముదురు వయస్సులోనున్న ఎద్దుదై వుండవలయును.

నేడు గోమాంసం అంటే ఎంతో ఏవగింపు వుంది. కాని ప్రాచీన కాలంలో యిటువంటి భావంలేదు. ఇది బుద్ధుని కాలంలోకూడ వాడుకలో వున్న ఆహారం. మధ్య మనికాయంలో యిట్లు చెప్పబడి వుంది - గోఘాతుకుడు లేక అతని శిష్యుడు గోవుని చాతుర్యంగా చంపి లోపలిమాంసం కాని, బయటచర్మంకాని దెబ్బతినకుండాచేసి తర్వాత అతడు మాంసాన్ని వేరుచేశాడు. (3-6-4) గోమాంసాన్ని నరికి బజారులో పోగు పెట్టినట్లుకూడ వర్ణించబడింది. గోవును చంపే స్థలానికి సూనా అనిపేరు. అక్కడ కుక్కలు ఎముకలకొరకు కాచుకొని వున్నవట. ఆవును వధించే కత్తిని గోవికర్తనం అన్నారు. (మధ్యమనికాయం 2-4-6) ఋగ్వేదంలో ఋషి ఇట్లు చెప్పాడు:- విపర్వశః చకర్తగామివాసిః- అనగా కత్తి ఆవును కణుపు కణుపునా కోయుగాక (10-79-6) ఇదికూడ పై విషయాన్ని స్పష్టపరుస్తుంది. తర్వాత చాలా కాలానికి భవభూతి అతిధి కొరకు ఆవుపెయ్యను చంపినట్లు వర్ణన చేయుట మాత్రం కాలవిరుద్ధంగావుంది. కాని ఋగ్వేద కాలంలోను, అనంతర కాలంలోనుమాత్రం గోమాంసభక్షణ వాడుకలోవుంది. ఇది సామాన్య విషయం. ఆగమంలోని 'ఉపానగదపా'నుబట్టి కూడ పై విషయం నిశ్చయ మవుతుంది. ఒక ధనవంతురాలు పుట్టింటినుంచి రెండుఆవుదూడల మాంసాన్ని తెప్పించుకొంది అనుటవలన ఆర్యులు వచ్చింది మొదలు క్రీస్తుశకారంభం వరకు గోమాంసం తినుట వాడుకలోవుంది అని ఎక్కువగా చెప్ప నవసరంలేదు. కాని ఆర్యులకు మిక్కిలి యిష్టం బలిసినగొర్రె లేక మేకమాంసం. 'పీవానం మేషము పచంతవీరాః అనగా వీరులు బలిసినమేకను వండుకొంటున్నారు. (1 -27-17)

ఆ కాలంలో ఆర్యులు గుర్రపు మాంసాన్ని కూడ తినేవారు:-

యేవాజినం పరిపశ్యంతి పక్వం య ఈం మాహుః
సురభిం నిర్హ రేతి, యేచార్వతో మాంసభిక్ష ముపాసతే॥ (1-162-12)

అని దీర్ఘతమఋషి చెప్పారు అనగా మాంసాన్ని తినువారు, అది వుడుకుతుండగ చూస్తున్నవారు దాని సుగంధాన్ని బాగా వర్ణిస్తున్నారు. మాంసాహారులైన ఆర్యులు ఎద్దు గుర్రం, మేక. గొర్రె మాంసాన్నే కాక నేపలుకూడ తినేవారు. కాని యీ విషయాన్ని వా ఏ ఋక్కుల్లోను చెప్పలేదు. ప్రసంగవశాత్తు దేవతా స్తుతుల్లో యీ పైసంగతులు కూడ వచ్చాయి.

8)

వారు పాలతో చేసిన అనేక వంటలను తినేవారు. నెయ్యి ముఖ్యం. పురోడాశం (4-24-5) వారికి, వారి దేవతలకు చాల యిష్టం. పురోడాశాన్ని బహుశా పాలు, అన్నంతో తయారు చేసేవారు. తర్వాత యిది పాయసానికి పర్యాయపదం అయింది. ఋగ్వేదంలో వరి ధాన్యం గురించి లేదు. యవలు గురించి ఎక్కువగా చెప్పబడింది. కావున యవల నూకలను పాలలో వేసి వండిన పదార్థం పురోడాశమేమో! విశ్వామిత్రుడు పురోడాశం వండుటను వర్ణించాడు. (3-28-2). పాలు లేక పెరుగుతో ఒక రకం ఆహారం చేసేవారు. దాన్ని అశిర మన్నారు. దీన్ని గురించి అనేకచోట్ల వచ్చింది. (1-134-6, 3-53-14, 8-2-10,11 9-75-5, 23, 81: 10-49-10, 67). గవాశిరం, దధ్యాశిరం మొదలైనపేర్లు అనేకం వున్నాయి. పాలు, పెరుగు లేక యితర వస్తువులను చేర్చి సోమం తయారు చేసేవారు. ఒకచోట క్షీరపాకమని వచ్చింది. (8-77-10). నేడు పాలలో వుడికిన బియ్యం క్షీరపాకం. ఆనాడు యవలను పాలలో చేర్చి వుండవచ్చు. పశుపాలకులైన ఆర్యుల ఆహారంలో ముఖ్యంగా మాంసం, పాలు, పెరుగు, నెయ్యి వుండేవి. తర్వాత మాంసంలో మసాల నుపయోగించు పద్ధతి వచ్చింది. అప్పటిలో వెల్లుల్లి, నీరుల్లి వుపయోగించినట్లు లేదు. నేతిలో పోపు వేయుట వుంది. ఉప్పు కావలసినంత వుంది. సప్తసింధులో ఉప్పుకొండ వుంది. నిప్పులో మాంసాన్ని కాల్చుకొనే పద్ధతి కృషి యుగానికి పూర్వం వాడుకలోవుంది. ఋగ్వేద కాలంలో మాంసం వండుటకు ఉఖా (కుండ) వుపయోగించారు. (1-162-13) అందువలన ఉడికిన మాంసం అన్నారు. 'సురభిపక్వం మాంసం' యీ విషయాన్ని స్పష్టం చేస్తూవుంది.

2) అన్నం :- పూర్వకాలంలో అన్నం అంటే భోజనం. ఇప్పుడు ధాన్యాలు ఎక్కువ పండుటచేత రక రకాలనుకూడ అన్నం అంటారు. 'బహవన్నామ కృషీవలాం' (10-146-6)' అనుట చేత ధాన్యాలకు రైతులకు సంబంధం వున్నట్లు తెలుస్తుంది. భరద్వాజుడు, విశ్వామిత్రుడు, వాసుదేవుడు మొదలైన ప్రాచీన ఋషులు దానా, కరంభ అపూపలను అనేక పర్యాయాలు పేర్కొన్నారు. దానా, కరంభ అపూప (8-90-2) దానా, కరంభ (3-52-1,7): కరంభ (5-7-2: 6-56-1). దానా అంటే వేయించిన ధాన్యం. దీన్ని యిప్పుడు దానా అంటున్నారు. కరంభ అంటే పిండి (సత్తు) అపూప మంటే రొట్టె, నేడు నేతితో తయారుచేసిన రుచిగల పదార్థాన్ని పువా లేక మాల్‌పువా అంటాం. ఆనాడు ఆర్యుల రొట్టెను పిడకమీదో, పెనంమీదో కాల్చుకొనే

వారు. అది వారి అపూపం. కృషియుగం ప్రారంభంలో మధ్య ఆసియాలోని అనుంకు తందూరి రొట్టె తెలుసు. నేడు కూడ సప్తసింధు తందూరు రొట్టెకుప్రసిద్ధి. ఆర్యులు తందూరురొట్టెలు చేసికొని వుండవచ్చు. వారు అందుకుసత్తు (పిండి)ను అనగా కరంభను వుపయోగించేవారు (10-71-2), 'సక్తుమివతిత ఉనా' అనుటచేత పిండిని జల్లించేవారని తెలుస్తుంది. ఆహారాన్ని తయారుచేసుకొనుటకు సామగ్రి:- ఓఖం (రోలు) (1-28-1): తితఉ (జల్లెడ), చషాల (ఒకరకం కుండ): ఉఖా (కుండ), పేర్కొనబడ్డాయి. పాత్రలు యింకా ఎక్కువగా వుండవచ్చు, మొహింజెదారో వాసులు ఉపయోగించిన పాత్రలు ఆర్యుల కళ్ళముందున్నవి గదా ' కృషీవల (రైతు) శబ్దాన్నిబట్టి ఆర్యులు వ్యవసాయం చేస్తున్నట్లు స్పష్టమైంది (10-146-6) భూమిని రెండుగా విభజించారు:— క్షేత్రం, అరణ్యం (6-61-14) క్షేత్రంలో యవలు పండించేవారు. అరణ్యంలో పశువులను మేపుకొనేవారు. హిమేవపర్ణా ముషితావనాని (10-68-10) అనగా చలికాలంలో వనంలో ఆకులురాలేవి. నేడుకూడ ఎత్తయిన కొండలపైన ఆకులు రాలుటను చూస్తున్నాం. సప్తసింధులో కనీసం మధ్యభాగంలోను, తూర్పున హిమకాలంలో చెట్లకు ఆకులులేని స్థితిని కల్పించే చలివుండనేవుండను. అక్కడ చెట్లు చలికాలం చివరిలోనే ఆకులు రాల్చేవి. పశుపాలకులకు ఆకుల, గడ్డి చాలా అవసరం కావున ఋతువుల మార్పును వారు గమనించేవారు.

యవధాన్యం వారి వ్యవసాయంలో ముఖ్యమంట. వారు ఎద్లతో పొలం దున్నేవారు— 'గోభిర్యవంన చర్కృషత్' (1-23-15). వ్యవసాయానికి కాలువలుండేవి. అవి చిన్నవై వుండవచ్చు. వాటిని 'కుల్య' అన్నారు (5-83-8) నేడు కొండజాతివారు వాటిని 'కూల' లేక 'గుల్' అంటారు. వాసుదేవుడు (4-57-4) నాగలి, నాగలితో దున్నిన చాలు కర్రు (4-57-8)ను పేర్కొన్నారు. నేటి నాగలికి యినుప కర్రు వుంటుంది. అనాడు వారికి యినుం తెలియదు. రాగి చాల ప్రియం. కాబట్టి గట్టి కర్రను కర్రుగా వుపయోగించి వుండవచ్చు.

ఆర్యులు పండ్లను కూడ ఆహారంలో వుపయోగించేవారు. పండ్లు వ్యవసాయం లేక పశుపాలన తెలియని వారికి కూడ దొరికేవి. స్వాదోః ఫలస్య జగ్ధ్వాయ (10-146-5) ఆర్యులు రుచిగల పండ్లను తినువంగతిని చెప్పుకొన్నారు. పండు ఎక్కువ తీపిగా వుండుటకు మానవుడు కృత్రిమ పద్ధతులను అవలంబించాడు. అడవిలో తియ్యని పండ్లు ఎప్పుడైనా దొరికినప్పటికీ అవి అంత తియ్యగా వుండవు. అడవిరేగు, బేరికాయ, ద్రాక్ష, నేరేడు, సీతాఫలం, మామిడి మొదలైన వాటిని చూస్తే

మనకీ సంగతి తెలుస్తుంది. పండును తీపి చేయాలనుకొంటే తోటలు వేయాలి. ఈ విషయం ఋగ్వేదంలో లేదు. తర్వాత చాల కాలం వరకు యీ విధంగా జరుగలేదు. కాబట్టి ఆర్యులు అడవుల్లో సహజంగా పెరిగిన చెట్ల తియ్యని పండు తిని తృప్తి పడేవారు. పక్వ ఫలవృక్షాన్ని గురించి కూడ చెప్పారు (3-54-1). ఇట్లు పండ్లు ఆర్యుల ఆహారంలో ఒక భాగం. వాటిని ఎండబెట్టుకొని వారు యితర సమయాల్లో తినేవారు. పంజాబులో ప్రకృతిసిద్ధమై వృక్షాలను లెక్కించుట కష్టం. మామిడి, దొండ, వాక్కాయ, నేరేడు మొదలైనవి వుండవచ్చు. పనస వుండదు. అడవిరేగు తప్పకుండ వుంటుంది.

పానీయం : పాలకు సంబంధించిన పాలు, పెరుగు, మజ్జిగ వారికి చాల యిష్టం. అవి వారికి సులభంగా దొరికేవి. పిండితో పెరుగు వుపయోగించేవారు. ఆవులెక్కువ కాబట్టి పెరుగు, మజ్జిగ బాగా దొరికేవి. (జున్ను) సంగతి ఎక్కడా చెప్పలేదు. కాని తర్వాత కాలంలో 'ఆమిక్ష'ను గురించి చెప్పారు. పూర్వకాలం నుంచి ఆర్యులకు మధువు అనగా తేనె తెలుసు. ఆర్యుల పూర్వ బంధువులగు రష్యను లకు కూడ తెలుసు. వారి భాషలో 'మేదు' వుంది. ఇది మన మధు శబ్దమే.

1. సోమపానం : సోమపానం ఆర్యులకు అతియిష్టం. దీన్ని గురించి ఋగ్వేదంలో 9వ మండలం పూర్తిగాను, యింకా యితర మండలాల్లో వందలాది సూక్తాలు వున్నాయి. సోమం దొరకంది కాదు. కుండలనిండ వుండేది, (9-20-6). సోమాన్ని వడగట్టేవారు. ఆ విధంగా వడగట్టిన సోమం వారికి యిష్టం, పవిత్రంకూడ. మధుచ్ఛందః ఋషి ఇలా అన్నాడు— స్వాదిష్ఠయా మదిష్ఠయా పవస్వ సోమధారయా ఇంద్రాయ పాత వేసుతః (9-1-1) అనగా ఇంద్రుడు త్రాగుటకు వడగట్టబడిన ఓ సోమమా! నీవు స్వాదిష్టం, మదిష్టం అయిన ధారతో ప్రవహించు, సోమం రుచిగా వుంటుంది. మత్తును కల్గిస్తుంది. 'అపామసోమం అమృతాఅభూమ' అనగా మేము సోమం త్రాగి అమరుల మయ్యాం (4-48-3).

ఆర్యులకిది నిత్యం వుండేది. సోమయాగంలో సోమం త్రాగే విధానం చెప్ప బడింది. ఇది తర్వాత కాలం నాటి విషయం. సోమం త్రాగుట, సాయంకాలం నృత్యం, పానగోష్టి ఆర్యుల సుఖజీవితానికి అభిన్నమైన అంగాలు. సోమాన్ని మనం భంగు అన్నాం అనుకోండి. మన పూర్వాచార పరాయణులు వులికిపడతారు. కాని మన ప్రాచీనులు మాత్రం సోమాన్నిగురించి చాలచాల కబుర్లు చెప్పారు. చంద్రునిపేరుకూడ సోముడు. కాబట్టి సోమానికి చంద్రునికి లంకె కల్పించారు. సోమలత చంద్రుని

మాదిరి శుక్లపక్షంలో పెరుగుతూ, పౌర్ణమినాటికి పూర్ణతను పొందుతుంది. కృష్ణపక్షంలో తరుగుతూ తరుగుతు అమావాస్యకు పూర్తిగా క్షీణిస్తుంది. కాని యీ లక్షణాలున్న వనస్పతి ప్రపంచంలో మన కెక్కడా కానరాదు. లజ్జావతి సూర్యుని వెలుతురుకుగాని, చేతితో తాకినప్పుడుగాని ముడుచుకొంటుంది. కొన్ని చెట్లు పురుగులను ఆకర్షించి వాటిని తింటాయి. కాని చంద్రుని వృద్ధిక్షయాలనుబట్టి పెరుగుట తరుగుట మనకు అనుభవంలో లేని విషయం. మూడున్నర వేల సంవత్సరాల పూర్వం కుండల కొలది రసం యిచ్చే సోమలత యిప్పుడు దొరకదంటే వీల్లేదు. ఈ భంగు అంతట దొరుకుతుంది తర్వాతకాలం సోమానికి అనేక దివ్యగుణాలు ఆపాదించారు. దీన్ని భంగు అంటే మనపెద్దలు పూరుకోరు. కాని ఆ దివ్యసోమం యీనాటికి భంగు పేరుతో వుంది. నేడు టిబెట్టులో సోమరాజం దొరకుతుంది. పఠానులు భంగును ఓమా అంటారు. సోమం హోమం అయి చివరకు ఓమా అయివుంటుంది. సోమంలో పాలు, తేనె కలిపి సోమరసాన్ని తయారుచేసేవారు. ఇట్లు ఆర్యులు సోమరసాన్ని స్వాదిష్టంగా, మదిష్టంగా తయారు చేసేవారు.

ఆర్యులు ఆరోగ్యాన్ని ప్రేమించేవారు. పశుపాలకులు కాబట్టి శ్రమయెక్కువ. సైనికజీవితం గడపవలసి వచ్చేది. అందుచేత ఆర్యుల్లో బలహీనులకు గౌరవముండేది కాదు. ఇంద్రుడు వారికి యిష్టదైవం. పౌరుషానికి విలయం. కావున వారి ఆహారం పౌష్టికమై, ఆరోగ్య ప్రదంగా వుండేది. పిండి, రొట్టె, పాలు, పెరుగు, మాంసం— వారికి పుష్కలంగా వుండేవి.

కృషి, గోరక్షణ వారి జీవయాత్రకు సాధనాలు. ఇతరుల గోవులను దొంగిలించుట వలన వారి ఆదాయం అప్పుడప్పుడు పెరిగేది. కాని యిప్పుడు సప్తసింధు భూమి అంతా వారిది. వారి అధీనంలో ఆర్యేతరులు కూడ వున్నారు. ఇప్పుడు వారు మూడు శతాబ్దములకు పూర్వం వున్నట్లు లేరు. వారి గోవులను కూడ యితరులు దొంగిలించేవారు. ఉత్తరాది కొండల్లోని శంబరుడు, అతని జాతివారు ఆర్యులకు శత్రువులు. ఈ కారణంగా ఆర్యులు తమ శ్రమజీవితం విడిచిపెట్టలేరు.

2. సురాపానం ఆర్యులు సురను సేవించేవారు. కాని వారు దాన్ని మంచిదనలేరు. దాన్ని గురించి 14వ అధ్యాయంలో చదవండి.

# అయిదవ అధ్యాయం - ఋగ్వేద ఋషులు

1. ప్రధాన ఋషులు - ఇంద్రుడు, అగ్ని మొదలగు మానవాతీత కల్పిత పేర్లను వదలినప్పటికీ ఋగ్వేద ఋషుల సంఖ్య మూడు వందల ఏభై కంటే కొంచెం ఎక్కువ. అంగిరా, భృగూగణ, కుశిక ఋషులు మిక్కిలి ప్రాచీనులు. కాని మంత్రాలు తక్కువ. వీరి తర్వాత ప్రధాన ఋషులు— ఒకే సూక్తంలో పేర్కొన బడినవారు- భరద్వాజుడు, కశ్యపుడు, గోతముడు, అత్రి, విశ్వామిత్రుడు, జమదగ్ని, వసిష్ఠుడు, ఋగ్వేదంలో పది మండలాల క్రమాన్నిబట్టి చూస్తే మండల ప్రముఖులు - రెండవ మండలానికి గృత్సమదుడు, మూడవ దానికి విశ్వామిత్రుడు, నాల్గవదానికి వామదేవుడు, అయిదవదానికి అత్రి, ఆరవదానికి భరద్వాజుడు, ఏడవ మండలానికి వసిష్ఠుడు, ఎనిమిదవ దానికి కణ్వుడు. ఒకటవ, తొమ్మిదవ, పదవ మండలాలకు ఒకే ఋషికిగాని, అతని గోత్రీకులకుగాని ప్రాధాన్యత లేదు. బౌద్ధ త్రిపిటకంలో దీర్ఘనికాయం తే విజ్జ సూత్త (1-13)లోను, యితరత్రా యిట్లు చెప్పబడింది- మొత్తం మంత్రకర్తలు పదిమంది. అష్టక. వామక, వామదేవ, విశ్వామిత్ర, జమదగ్ని, అంగిర, భరద్వాజ, వసిష్ఠ, కశ్యప, భృగుఋషులు. ఇందులో చెప్పబడిన వామక ఋషి ఎవరో తెలియదు. మిగిలినవారి మంత్రాలు ఋగ్వేదంలో వున్నాయి. ఎక్కువ మంత్రాలకు కర్తలు వామదేవుడు, విశ్వామిత్రుడు, భరద్వాజుడు, వసిష్ఠుడు. మంత్రాల ఆధిక్యత ప్రకారం వసిష్ఠునికి ప్రథమస్థానం. ఆయన 103 సూక్తముల కర్త. రెండవ స్థానం భరద్వాజునికి 60 సూక్తముల కర్త. వామదేవుడు 50 సూక్తాలకు, విశ్వామిత్రుడు 48 సూక్తాలకు, గృత్సమదుడు 40, కక్షీవానుడు 27, అగస్త్యుడు 26, దీర్ఘతముడు 25, గోతముడు 20, మేధాతిథి 20, శ్యావాస్యుడు 16, కృత్సుడు 14, మధుచ్ఛందుడు 10, ప్రస్కణ్వుడు 9, పరాశరుడు 5, జమదగ్ని 5 సూక్తాలకు కర్తలు. ఇంతకంటె తక్కువ సూక్తకర్తలు- కవషుడు-4, బృహస్పతి-2, హర్యతుడు-1, అపాలా-1, అష్టకుడు-1, కుశికుడు-1, ప్రజాప-1.

# ఋగ్వేద కాలంలో ఆర్యగణములు వారి పురోహితులు

| పురోహితుడు | — | గణము | — | ప్రదేశము |
|---|---|---|---|---|
| 1. భృగుడు | — | ద్రుహ్యు | — | పరుష్ణి-అసిక్నిల మధ్యప్రదేశం |
| 2. అత్రి, గృత్సమదుడు —5వ మండలం | — | పురు | — | విపాశ్-శుతుద్రి |
| 3. భరద్వాజుడు —6వ మండలం | | భరత (దివోదాసు, సుదాసు) | | పరుష్ణి-విపాశ్‌ల మధ్యప్రదేశం |
| 4 వసిష్ఠుడు —7వ మండలం | | భరత (సుదాసు) | | " |
| 5. విశ్వామిత్రుడు —3వ మండలం | | భరత (సుదాసు) | | " |
| 6. దీర్ఘతమమామతేయ | | భరత, త్రుత్సు | | " |
| 7. కణ్వుడు 8వ మండలం | | తుర్వశ, యదు | | పరుష్ణి-అసిక్నిల మధ్యప్రదేశం |

ఈ పై వారంతా చారిత్రక ప్రముఖులు. ఎక్కువ మంత్రాలు చెప్పారు. కాబట్టి యీ ఆర్యగణ పురోహితులకు చాల ప్రాముఖ్యం యివ్వాల్సివుంది. వయస్సులో వీరు చిన్న, పెద్దలుగ వున్నారు కాని సమకాలికులు. భరద్వాజ, వసిష్ఠ, విశ్వామిత్రులు వీరిలో మరింత ప్రాముఖ్యం కలవారు. శంబర యుద్ధకాలంలోను, తర్వాత జరిగిన దాశరాజ్ఞ యుద్ధ కాలంలోను వీరున్నారు. వసిష్ఠ విశ్వామిత్రులు యిద్దరు యుద్ధంలో బాగా సహాయం చేశారు. ఆర్యులు సప్తసింధుకు వచ్చింది క్రీ. పూ 1500. దాశరాజ్ఞ యుద్ధకాలం సుమారు క్రీ. పూ 1200 కావచ్చు. అంటే విశ్వామిత్ర కాలానికి ఆర్యులు వచ్చి 14-15 తరాలు గడచాయి. మనం ఋషులను పూర్వీకులను చూస్తే ఏ ఒకరి తరం ముత్తాతను దాటదు. భరద్వాజుని తండ్రి బృహస్పతి, తాతలోక నామ, ముత్తాత అంగిర. కశ్యపుని తండ్రి మరీచి. అంతవరకే మనకు తెలుసు. గోతముని తండ్రి రహూగణుడు. తర్వాత తెలియదు. విశ్వామిత్రుని నాలుగు తరాలు తెలుసు. తండ్రి గాంధి. తాత కుశికుడు. ముత్తాత ఇషీరథుడు. వసిష్ఠుని తమ్ముడు అగస్త్యుడు.

తంత్రి మిత్రా వరుణులని చెప్పబడింది. ఇది దేవతల పేరయితే వారి పూర్వీకుల సంగతి మనకు తెలియదు. భృగు తంత్రి వరణుడు. ఈ విధంగా వాల్మీకరాలు అనగా ఒక శతాబ్దం పూర్వం లేక క్రీ. పూ. 1300లకు ముందున్న ఋషుల పూర్వీకు లెవరో మనకు తెలియదు. తర్వాత కాలంలో మాత్రం ఋషుల పారం పర్యాన్ని కాపాడుటకు ప్రయత్నం జరిగింది. పూర్వీకులను ఎందుకు గుర్తుగ అట్టిపెట్టుకోలేదో -ఆశ్చర్యం కల్గుతూవుంది కాని ఆశ్చర్యపడనవసరం లేదు సప్తసింధులోకి వచ్చేటప్పటికి ఆర్యులది ద్రిమ్మర జీవితం. ఇంకా గణయుగం నుంచి- జనయుగా న్నుంచి బయటపడలేదు. ఆవులు, గుర్రాలు, గొర్రెలు, మేకలు పెంచుట వారి జీవ యాత్రకు ప్రధాన సాధనం. వ్యవసాయం పేరుకు మాత్రం వుంది. అవసరమైన ఆహారధాన్యాదులను సమకూర్చుటకు ఓడి - సింధు వాసులు వారికి వున్నారు. జీవితానికి విలాసానికి కావలసిన వస్తువుల నెన్నిటినో ఆర్యులు వారి నుండి స్వీకరించారు. ఇప్పుడిక వారు సామంత వ్యవస్థకు - ఆర్థిక జీవితానికి దూరంగా ఎట్లుంటారు? సామంత వ్యవస్థ పైపుకు సాగటానికి గణతంత్ర వ్యవస్థ గోడలు బద్దలు చేయాలి. అంటే వేర్వేరుగావున్న గణాల నన్నిటిని ఏకం చేయ్యాలి ఏకీకరణం చేసే కృషికి అంతిమ పరిణామం దాశరాజ్ఞయుద్ధం. ఈ అవగాహనతో మనం పరిశీలిస్తే ఋషుల మొదటి 3-4 తరాల వరకు మాత్రమే తెలియటానికి కారణం తెలుస్తుంది.)

నాటినుండి ఆర్యులు గణ యుగంనుండి సామంతయుగం పైపుకు దృఢంగా అడుగు పెట్టారు. ఋగ్వేద ప్రధాన ఋషులు ముగ్గురు. వారికి ముందు 300 ఏండ్లో అంధకార బంధురంగా వుంది. అట్లే వారి తర్వాత కూడ 300 ఏండ్లవరకు చారిత్రక సామగ్రి దృష్టితో అంధకారం వుంది. ఋగ్వేద ఋషులు సప్తసింధు ఋషులు. సప్త సింధు అప్పటి ఆర్యుల నివాసం, ప్రభుత్వ క్షేత్రం, అంటే సరస్వతీనది మొదలుకొని సింధునది పరిసర ప్రదేశంవరకు (హరియానా, పంజాబు పఖ్తూ నిస్తాన్ వరకు) విస్తరించి వుంది. 300 ఏండ్ల తర్వాత యజుర్వేద, అధర్వవేద ఐతరేయ శతపథ బ్రాహ్మణములవంటి ప్రాచీన గ్రంథాలు లభిస్తున్నాయి. ఐతరేయ మహీదాసు, యాజ్ఞ వల్క్యుడు యీ బ్రాహ్మణములకు కర్తలు. అయితే వీరు సప్తసింధులో పుట్టలేదు ఆర్యుల స్థావరం కురుపాంచాల (పశ్చిమ ఉత్తరప్రదేశ్)లో వున్నప్పుడు పుట్టారు. తూర్పున విదేహ (ఉత్తర బీహారు) వరకు, దక్షిణాన భోజ (మధ్య నర్మదా పరిసర ప్రదేశం) వరకు వారి ప్రాబల్యం ప్రాకింది. మరుగునపడిన ఆ 300 ఏండ్ల సంగతులు మనకు తెలిస్తే ఆర్యులు సప్త సింధునుండి తూర్పు దిశకు ఎట్లు సాగారో తెలిసేది.

ఆర్యులు సప్తసింధులో ప్రవేశించిన సంగతి కూడ ఋగ్వేదంలో ఎక్కడా చెప్పలేదు. దాన్ని గురించి తెలుసుకోవటానికి మనం తులనాత్మక భాషా విజ్ఞానం, నృతత్వశాస్త్రం సహాయంగా తీసుకోవలసి వచ్చింది. ఒక్కసారిగ గంతువేసి మూడు వందల ఏండ్ల తర్వాత దివోదాసు, సుదాసులు: వారి పురోహితులు భరద్వాజ వసిష్టులు మొ॥ వారి సంఘర్షణలు, పోరాటాలు గురించి మళ్ళీ మనకు తెలుస్తుంది. మళ్ళీ 300 ఏండ్లు "చరిత్ర సరస్వతి" లుప్తమైంది. తర్వాత బ్రాహ్మణాల రూపంలో మనకు చారిత్ర కాంశాలు ప్రత్యక్షమౌతాయి. అప్పుడు మనకు కురు పాంచాల సమృద్ధగణాలు, రాజ్యాలు కనబడతాయి ఇదే కాలంలో ఆర్య తాత్వికులు ఆర్య దేవతలనుంచి విడివడి ఉపనిషత్తుల రూపంలో పైకి పోతున్నట్లు తోస్తుంది.

ప్రధాన ఋషుల రాజకీయ జీవితాన్ని గురించి వారి యజమానుల యుద్ధ సందర్భంలో చెప్పుకొందాం. ఆర్య పురోహితులు ధర్మకర్తలు, కవులు మాత్రమే కాదు, వారు తమ గణాలకు ప్రధాన మంత్రులు. సేనా నాయకులు కూడ. ముసలితనంలో వారు ప్రత్యక్షంగా యుద్ధంలో పాల్గొనలేక పోయినప్పుడు తమ యువతను, వంశీకులను యుద్ధంలో పాల్గొనుటకు ఆహ్వానించేవారు. శక్తివంతులైన వారి కులస్థుల ఖడ్గాల ధనుర్బాణాలతో విజయం సాధించుటకు వారి అండదండలు ఎంతగానో తోడ్పడేవి.

## ఋషుల వంశ వృక్షం






1. భరద్వాజుడు : 60 సూక్తాలకర్త. బృహస్పతి పుత్రుడు, ఋగ్వేదంలో రెండవవాడు. దివోదాసు (సుదాసు తండ్రి) పురోహితుడు. ఆర్యగణాల అంతర్యుద్ధంలో వసిష్ఠుడు సుదాసుకు ఎంతో సహాయం చేశాడు. అట్లే భరద్వాజుడు దివోదాసు విజయాలకు తోడ్పడ్డాడు. ఋగ్వేదం 6వ మండలమంతా ఆయనది, ఆయన వంశీకులది అందు భరద్వాజుడు దివోదాసు విజయాలను వర్ణించాడు. 'తరేమ, తరేమ, తవావసా తరేమ (6-15-15). అనగా మేము తరించాలి, మేమంతా మీ రక్షణలో తరించాలి, అనేది ఉద్దేశ్యం. మేము మంచివీరులతో నూరు శరత్తులు ఆనందంతో వుండాలి' అనేది రెండవ వుద్దేశం—

తా సూరిభ్యో గృణతే రాసి సుమ్నం మదేమ శతహిమాః సువీరాః॥ (6-4-8)
అమా చైన మరణ్యే పాహి రిషో మదేమ శతహిమాః సువీరాః॥ (6-24-10)

ఆయన అరదజను పార్లకుపైగా "అద్రోధవాచ" అనగా అమిత్ర్యవాది శబ్దాన్ని ప్రయోగించాడు. (6-5-1). చాల ఋక్కుల్లో దివోదాసుని పేర్కొన్నాడు. కాని దాసుని గురించి చెప్పలేదు. ఆయన అప్పటికి బహుశా చనిపోయి వుంటాడు, లేక సుదాసుని కిడుకోరి వుంటాడు. కిడుకోరి వుంటే ఆ ఋక్కులు సంకలనం చేయబడక పోవచ్చు. లోభ ద్వేషాల్లో ఆ ఋషి పురోహితులు నేటి వారి వంశీకులకు తీసిపోరు. సుదాసు

ఆయన్ని రాజపురోహిత పదవినుండి పదికిరాని వానిగా తీసివేస్తే ఆయన శాపనార్థాలు పెట్టకుంటా వుంటారా ఏమిటి ? ఋషి పురోహితులు తమతమ యిష్ట దైవముల మహిమను వర్ణించిన ఋక్కులే ముఖ్యంగా ఋగ్వేదంలో సంగ్రహించ బడ్డాయి. భరద్వాజుని దేవతలు విఫలులయ్యారు. ఆ ఓటమిని తెలిపే అతని స్తుతులను సురక్షితంగా ఎందుకు వుంచాలి ?

భరద్వాజుడు ఆధ్యాత్మిక శక్తిని కోరువాడు కాదు. 'అశ్మాభవతు న స్తనూః' అనగా మా శరీరాలు రాయివలె దృఢంగా వుండుగాక (6-75-12) అని ప్రార్థించాడు. ఆయన యజమాని దివోదాసుకు, ఆర్యగణా లందరికీ దస్యులరాజు శంబరుడు మహా శత్రువు. శంబరుడు విపాశ-పరుష్ణి నదుల మధ్యస్థ ప్రాంతం అనగా నేటి కాంగడాకు రాజు. అతడు ద్రావిడుడుకాదు, కిరాతుడు అని యిదివరలోనే చెప్పుకొన్నాం. ఆయనకు నూరు దుర్గాలున్నాయి. 19 శతాబ్దివరకు శత్రు దుర్భేద్యంగా వున్న కాంగడావంటి దుర్గం వాటిలో ఒక టైవుండవచ్చు. వాటిని పురాలన్నారు. పురాలను గురించి చెప్పేటప్పుడు ఆయసీ అనగా రాగివలె దృఢమైనవి, అశ్మన్మయీ అనగా రాయివలె గట్టివి అని తెలిసింది. ఆ కొండ దుర్గాలు రాతివే అయి వుంటాయి.

భరద్వాజుడు ఆర్యులకు శత్రువులైన మరి కొంతమంది అసుర రాజులను పేర్కొన్నాడు- చుముురి, ధుని, శుష్ణ, అశుష, పిప్రు. వీరంతా కొండరాజులు. శంబరునికి సహాయం చేశారు. నిస్సందేహంగా శంబరుడు అందరికంటె ప్రధాన శత్రువు. భరద్వాజుడు భీషణ యుద్ధాల్లో నాయకుడు, పురోహితుడు. కవచం, విల్లు, విల్లుత్రాడు, అంబులపొది, రథం, గుర్రం, గొడ్డలి మొదలైన యుద్ధ పరికరాలను ఆయన వర్ణించుట సహజమే.

భరద్వాజుడు క్షేత్రాలను, అరణ్యాలను గురించి చెప్పాడు (6-1-14). దీన్ని బట్టి ఆర్యులకు వానితో సంబంధమున్నట్లు తెలుస్తుంది. పొలాల్లో వారు యవలు, యితర ధాన్యాలు కొద్దిగా పండించేవారు. వాటిని కరంభ (పిండి) చేసు౯ని పెరుగుతో తినేవారు. పాలు, పెరుగు, నెయ్యి, మాంసం- వారి ఆహారంలో ముఖ్యమైనవి. అందువల్లనే ప్రతి కుటుంబానికి వేలాది గోవులుండేవి. అందుచేత వారికి పొలాల కంటె పచ్చిక బయళ్ళు బాగా అవసరం. గుర్రం యుద్ధానికి, సవారీకి (వాహనంగా) వుపయోగపడేవి. దాని మాంసం కూడ వారి ఆహారంలో భాగమే. దివోదాసు కుమారుడు సుదాసు. వసిష్ఠుడు సుదాసుచేత అశ్వమేధ యజ్ఞం చేయించాడు. (ఐతరేయం 8-4-21) ఈ యజ్ఞ వర్ణన అత్యంత ప్రాచీన మని చెప్పాలి. వాయుమాన

అభ్యావర్తిరాజు రెండువేల ఆవులను దానంగా యిచ్చాడు. అప్పటిలో గోదానం గొప్ప. ఆర్యఋషులు మంచి గోవులను, గుర్రాలను కోరుకొనేవారు. దివోదాసుని, సోమ గోష్ఠులంను తాను పాల్గొన్నట్లు భరద్వాజుడు చెప్పాడు. (6-16-5) నాడు సోమపానం సర్వ సాధారణ విషయం. సోమయాగం అని చెప్పి దానికి దివ్యపూజా రూపం యివ్వవలసిన అవసరం అప్పుడు లేదు.

దివోదాసు తండ్రి బధ్ర్యశ్వుడు. అతడు ఆర్యుల్లో గణవ్యవస్థను అంతంచేసి ఏకం చేయటానికి ప్రయత్నించాడు. ఆ యత్నాన్ని యదు, తుర్వశ గణాలు రెండూ ఎదిరించాయి. దివోదాసు వారిని అణచగల్గాడు. అతడు 60 వేల దాసులను (అసుర లను) సంహరించాడు. బార్హస్పత్య భరద్వాజుడు ఏడు తోబుట్టువుల సరస్వతీ నది గురించి చెప్పాడు (6-61-2). పురుకుత్సుడు దాసుల ఏడు పురాలను ధ్వంసం చేశాడు (6-20-10). పురుగణాల రాజు పురుకుత్సుడు. దీన్నిబట్టి భరద్వాజుడు తన రాజు వద్ద మాత్రమేకాదు, యితర గణాల్లోకూడ గౌరవం వున్నట్లు తెలుస్తుంది. బృహస్పతి దేవత పేరుకూడ. భరద్వాజుని తండ్రికూడ బృహస్పతి. ఆయన్ని దేవుడను కొంటేమాత్రం భరద్వాజుని తండ్రి ఎవరైందీ మనకు బోధపడదు. కాని ఋషుల వంశావళిని పరిశీలిస్తే భరద్వాజుని తండ్రి బృహస్పతి, తాత లోకనాను, ముత్తాత అంగిర అని స్పష్ట పడుతుంది. అంగిర రెండవ పుత్రుడు ఘోరఋషి-అంగిర సంతానంలో వున్నవారు- తిరశ్చి, హిరణ్యస్తూప, వసుశ్రుత, శ్రుతకక్ష. తిరశ్చికి సంతానం యిద్దరు. ఋజిశ్వా, సుమిత్ర. కాని అంగిర పుత్రుల్లో ప్రసిద్ధులు— ఘోర, లోకనామ. ఘోర పుత్రుడు కణ్వుడు. ఆయన ప్రఖ్యాత ఋషిపుత్రులు— వత్స, మేధాతిధి- ప్రస్కణ్వ, ప్రగాధ. ప్రగాధునికి అనేక ఋషిపుత్రు లున్నారు. అంగిర మనుమడు భరద్వాజుడు. ఆయనకు కూడ మంచి యోగ్యులైన సంతానం వుంది. ఆయన పుత్రుల్లో గర్గ, ఋజిశ్వ, శిరిమ్బిర ఋషులు.

2. వశిష్ఠుడు : ఆయన అందరికంటె ఎక్కువ సూక్తాలు చెప్పాడు. ముందుగ ఆయన్ని చెప్పి, ఆయనకు పోటీ అగు భరద్వాజుని తర్వాత చెప్పాలి. భర ద్వాజుడు 60 సూక్తాలే రచించాడు. ఈ ఋషులు తమ జీవితకాలంలో రచించిన ఋక్కుల నన్నీ వారి వంశీకులు సంగ్రహించలేక పోయారని అనుకోవాలి. వారి రచనా కాలానికి రెండువందల సంవత్సరాల పిమ్మట అనగా క్రీ.పూ. 1000లో వారి ఋక్కులు సంగ్రహించే వారు. కాని అవి వ్రాయబడలేదు. శ్రుతిరూపంలో కంఠస్థం చేయ బడిన వాటినికూడ లిపిలో వ్రాయటానికి తర్వాత వాలు శతాబ్దాలు పట్టాయి. ఇట్లు

వేదాలు లిపిబద్ధం అయ్యాయి. కాని వేదపారకులు నేటికూడ స్వర యుక్తంగా కంఠస్థం చేసి వుంచుకొంటున్నారు. నానాటికి వేద పారకుల సంఖ్య తగ్గిపోతూ వుంది. దీన్నిబట్టి రెండు మూడు వందల ఏండ్లతర్వాత ఏ ఒక వేదపారకుడు దొరకని స్థితి ఏర్పడ వచ్చునని తోస్తూంది.

వసిష్ఠుని తండ్రి మిత్రావరుణ. మిత్రావరుణుని దేవత అంటారు. వసిష్ఠుని తమ్ముడు అగస్త్యుడు. వసిష్ఠుని పుత్రులు చిత్రమహ, మృళీక. వీరి ఋక్కులున్నాయి. ఆయన పుత్రుల్లో పెద్దవాడు, సమర్థుడు శక్తి. శక్తికి యిద్దరు పుత్రులు పరాశర, గౌరవీతి. వీరందరు ఋగ్వేద ఋషులు. ఋగ్వేదం తర్వాత ఉన్న సాహిత్యంలో అంటే మహాభారత, రామాయణ, పురాణాల్లో యీ ఋషుల, వీరి సమకాలిక రాజుల వంశావళిలో చాల తారుమారు జరిగింది

వసిష్ఠుడు ఋగ్వేదం ఏడవ మండలం ఋషి. ఒక్కొక మండలానికి ఒక ఋషి ప్రధానంగా వున్నారు. అయితే వారికీ, వసిష్ఠునికీ తేడా వుంది. ఇతర ఋషులు, తాము, తమ పుత్రపౌత్రులు మండలాలను రచించారు. కాని వసిష్ఠుడు ఒక్కడే ఏడవ మండలం అంతా అనగా మొత్తం 104 సూక్తాలను రచించాడు. 32వ సూక్తం శక్తి రచించింది అని అంటారు. 101, 102 సూక్తాలు కుమార ఋషి రచనలని సందేహం ప్రకటిస్తున్నారు. వసిష్ఠుని రచన ద్వారా నాటి చరిత్ర, భూగోళం తెలిసినట్లు యితర ఋషుల సూక్తాలద్వారా మనకు తెలియదు. "యూయం పాతస్వస్తిభిః సదానః" అనగా మీరు మాకు సదా ఆరోగ్యాన్ని యిచ్చి కాపాడండి— అను మకుటంతో డజను పర్యాయాలకు పైగా మంత్రాల్లో చెప్పాడు. ఇంద్రుడు ఆర్యులకు, యితర ఋషులకు యిష్టదైవం. వసిష్ఠునికి కూడ ఆయన యిష్టదైవం. ఆయనకున్న యితర దైవాలు— మిత్ర, సూర్య, అగ్ని, విశ్వేదేవ, వరుణ, అశ్విద్వయ, ఉష, సరస్వతి.

ఈ కాలంలో చనిపోయిన తర్వాత శైవులు కైలాసానికి, వైష్ణవులు వైకుంఠానికి, కొందరు కృష్ణభక్తులు గోలోకానికి పోవచ్చినట్లు ఆ కాలంలో ఆర్యులు యింద్రలోకానికి పోవాలనుకొనేవారు.

ఋగ్వేదం తర్వాత వచ్చినవి సామవేదం, యజుర్వేదం, అధర్వవేదం కాని వీటి వలన మనకు చరిత్ర ఎక్కువగా తెలియరాదు. వీటి తర్వాత వచ్చినవి బ్రాహ్మణములు. ఐతరేయ బ్రాహ్మణం ఋగ్వేదానికి చెందింది. బ్రాహ్మణములు బ్రహ్మ సంబంధమైన గ్రంథాలు. బ్రహ్మ అనగా మంత్రం, యజ్ఞం. బ్రాహ్మణములు

యజ్ఞాల్లోని వివిధ క్రియలను, ఆ సందర్భంలో వాటిలో వేద మంత్రాల వినియోగాన్ని గురించి తెల్పుతాయి. వసిష్ఠుని పేరు ఐతరేయ బ్రాహ్మణంలో అరడజనుసార్లు కంటె ఎక్కువగా వచ్చింది. 7-13-16 ఋక్కునుబట్టి చూడండి– హోత విశ్వామిత్రుడు, అధ్వర్యుడు జమదగ్ని, బ్రహ్మ వసిష్ఠుడు, ఉద్గాత అయాస్యుడు. పురోహితుడు సుయవస పుత్రుడు అజీగర్తుడు. అజీగర్తుడు దురాశపడి 300 గోవులకై తనకొడుకు శునశ్శేపుని తన చేతులతో వధికి బలి యిచ్చుటకు అంగీకరించాడు. కాని కొడుకు తన తండ్రి నుండి తప్పించుకొని విశ్వామిత్రుని తండ్రిగా చేసుకొను తలంపుతో వెళ్ళి ఆయన ఒడిలో కూర్చొన్నాడు. అజీగర్తుడు విశ్వామిత్రుని అడిగాడు- ఓ ఋషి, నా పుత్రుని నాకు యివ్వండి.

విశ్వామిత్రుడు– ఇవ్వను. దేవతలు యితన్ని నాకు యిచ్చారు

ఇట్లు చెప్పి ఆయన శునశ్శేపుని పేరు మార్చి దేవరాత వైశ్వామిత్ర నామకరణం చేశాడు.

అంతట అజీగర్తుడు కొడుకును బ్రతిమలాడు కొంటాడు — పుత్రా! (తల్లి దండ్రులం) మేమద్దరం నిన్ను పిలుస్తున్నాం. నీవు అంగిరస అజీగర్త పుత్రుడవు. ఓ ఋషీ! నీవు నీతండ్రి తాతల గృహాన్ని విడువవద్దు. మావద్దకు రమ్ము.

శునశ్శేపుడు : నేను శూద్రుడుకూడ ముట్టని ఆ వస్తువును (కత్తిని) నీచేతిలో వుండగా చూశాను. ఓ అంగిరసా! నీవు 300 ఆవులను నాకంటె ఎక్కువనుకొన్నావు.

అజీగర్తుడు : పుత్రా! చేసినదాని కి నేను పశ్చాత్తాప పడుతున్నాను. ఆ పాపాన్ని నివారించుకొని నీకు 100 ఆవులను ఇస్తున్నాను.

శునశ్శేపుడు : ఒకసారి పాపం చేయకల్గినవాడు మరొకసారి పాపం చేస్తాడు. నీవు శూద్రత్వం నుండి ముక్తిని పొందలేవు. నీవు చేసిన పాపం ఏ విధంగాను నివారింప బడదు.

ఐతరేయ బ్రాహ్మణంలోని యీ ప్రసంగాన్ని బట్టి వసిష్ఠ, విశ్వామిత్ర జమదగ్ని, అయాస్య, అజీగర్త, శునశ్శేప ఋషులు ఒకే కాలంలో వున్నట్లు తెలుస్తుంది. 7-9-34 ఋక్కులోని రెండవ పాదం ప్రకారం వసిష్ఠుడు సుదాసుపై జనులకు ఒక యజ్ఞ విధిని చెప్పినట్లుంది. ఎనిమిదవ మండలంలో ఒక గొప్ప విశేషం తెలుస్తుంది (8-4-1). ఇంద్ర మహాభిషేకంతో వసిష్ఠుడు సుదాసుకు మహాభిషేకం చేశాడు.

అతడు భూమినంతా జయించాడు. అశ్వమేధం చేశాడు. సుదాసు తండ్రి దివోదాసు. భరద్వాజుడు దివోదాసుకు పురోహితుడు. అతడు సుదాసుకు మహాభిషేకం ఎందుకు చేయలేదు ? వసిష్ఠుడే ఎందుకు చేశాడు ? దివోదాసుని మరొక పుత్రుడు ప్రతర్దనుడు. ఇతడూ కాశీరాజు ప్రతర్దనుడు ఒక్కడే అని అనుకోకండి. కుల పురోహితుడగు భరద్వాజుని విడిచిపెట్టి వసిష్ఠుని పురోహితునిగ చేసుకొన్నందు వలన సింహాసనం కొరకు అన్నదమ్ముల మధ్య తగాదా వచ్చినట్లుంది. ప్రతర్దనుడు పెద్దవాడై వుంటాడు. దివోదాసుని గద్దెపై అతన్ని భరద్వాజుడు కూర్చోపెట్టి వుంటాడు. గుప్త చంద్ర గుప్తుని వలె సుదాసు కూడ తన తండ్రికి సమర్థుడైన వారసుడై వుండివుండాలి. తగాదాలో భరద్వాజుడు ప్రతర్దనుని పక్షం వహించాడు. సుదాసుని పక్షాన బహు చతురుడు, సంతాన వంతుడు వసిష్ఠుడు వున్నాడు. ఐతరేయ బ్రాహ్మణంలో ఇంద్ర మహాభిషేకంతో సుదాసుకు మహాభిషేకం చేశాడు. అనుటవలన పై విషయం మరింత బలపడింది. ఋగ్వేదంలో ప్రతర్దనునికి, వసిష్ఠునికి తగాదా వచ్చినట్లు చెప్పలేదు. సింహాసనం ఎక్కుటలో అన్నతో సుదాసు తగాదా పడినట్లు కూడ చెప్పలేదు. కాని సుదాసుకు వసిష్ఠుడు పురోహితుడగుట, దాశరాజ్ఞ యుద్ధానికి తోడ్పడుట పై విషయాన్ని బలపరుస్తున్నాయి.

వశిష్ఠుని రచనల ప్రకారం సుదాసుకు తండ్రి దివోదాసు (7-4-7). దివోదాసు 100 అయపేపురాలను నాశనం చేశాడు. ఇట్లు భరతగణాల ప్రతాప వృద్ధికి ఆయన తోడ్పడుచున్నందున వసిష్ఠుడు చాల గర్వపడ్డాడు—

దండా ఇవేద్గో అజనాస ఆసన్
పరిచ్ఛిన్నా భరతా అర్భకాసః
అభవచ్చ పుర ఏతా వసిష్ఠ
ఆ దిత్తృత్సూనాం విశో అప్రథంత ॥(7-33-6)

అనగా మొదట్లో భరతులు కర్రతో కొట్టబడిన ఆవులవలె విడివిడిగా వున్నారు. వసిష్ఠుడు వారికి పురోహితుడైనాడు. త్రుత్సుల సంతానం వృద్ధిచెంద నారంభించింది.

వసిష్ఠుడు 7వ మండలంలో అనేక చోట్ల భరతుల విజయాన్ని గురించి చెప్పాడు. భరతులు పురులను ఓడించారు (7-8-4). సుదాసుతో చేసిన యుద్ధంలో 66 వేలమంది ద్రుహ్యులు, అనులు హతమయ్యారు (7-18-14)

విగవ్యవో ఽ నవో ద్రుహ్యవశచ, షష్టిః శతాసుషుపుః షట్సహస్రః
షష్టిర్వీరాసో అధిషడ్ దువోయు, విశ్వేదింద్రస్య వీర్యాకృతాని ॥

త్రుత్సులు యమునకు అవైపున భేద, అజ, శిగ్రు, యక్షులను ఓడించారు (7-18-19).

ఆవ దింద్రం యమునా తృత్సవశ్చ పాత్రభేదం సర్వతా ముషాయత్।
అజాసశ్చ శిగ్రవోయక్షవశ్చ బలిం శీర్షాణి జభ్రురశ్వ్యాని.

వసిష్ఠుడు అనార్యులను శిశ్నదేవులన్నాడు— మా శిశ్నదేవా అపి గుర్ ఋతం నః- అనగా శిశ్న పూజకులు మా యజ్ఞమందు జోక్యం కల్గించు కొనకుండా వుందురుగాక (7-21-5). శిశ్నదేవులనగా లింగపూజ చేయువారు. వసిష్ఠుని 7-33-3 ఋక్కునబట్టి దాశరాజ్ఞయుద్ధం సింధుతీరాన జరిగింది —

ఏ వేన్నుకం సింధుమే భిస్తతారే వేన్నుకం భేదమే భిర్జఘాన ।
ఏవేన్నుకం దాశరాజ్ఞే సుదాసంప్రావ దింద్రో బ్రహ్మణా వో వసిష్ఠాః॥

అనగా అతడు వీరితో యీ ప్రకారం సింధును దాటాడు. వీరితో యీ ప్రకారంగా భేదుని చంపాడు. ఓ వసిష్ఠులారా! మీ ఋక్కు ద్వారా యింద్రుడు దాశరాజ్ఞ యుద్ధంలో యీ ప్రకారంగా సుదాసుని రక్షించాడు. సుదాసుని రక్షించాడు అంటే సుదాసు గెల్చాడు పౌరాణిక యుగంలో వసిష్ఠుని వేశ్యాపుత్రు డన్నారు. గణ యుగంలో దేవకన్యలు సదా కన్యలుగా వుండేవారు. వారి ప్రేమ స్థిరంకాదు. కాబట్టి వారిని దేవగణికలు అన్నారు. వసిష్ఠుడు మైత్రావరుణుడు అనగా మిత్రవరుణ సంతానానికి ఊర్వశికి జన్మించాడు (7-33-11)—

ఉతాసి మైత్రావరుణో వసిష్ఠోర్వశ్యా
బ్రహ్మన్ మనసోఽధి జాతః ।
ద్రవ్యం స్కన్నం బ్రహ్మణా దైవ్యేన
విశ్వేదేవాః పుష్కరేత్వా దదంత॥
సప్రకేత ఉభయస్య ప్రవిద్వాన్ త్సహస్రదాన ఉత వా సదానః ।
యమేన తతం పరిధిం వయిష్యన్నప్సరసః పరిజజ్ఞే వసిష్ఠః॥ (7-33-12)

ఈ ఋక్కునందు వసిష్ఠుడు అప్సరసకు పుట్టినట్లు చెప్పబడింది. అతడు దేవతలకు లేక దేవకన్యలకు పుట్టాడు- అని చెప్పుకొంటే మనకు అతని తల్లి దండ్రు లెవరైందీ తెలియకుండా పోతుంది. వసిష్ఠుడు యాతుధాన, యాతుమావాన (ఇంద్ర జాలికుడు) వర్ణన చేశాడు (7-104-15, 7-1-15). పార్శీ భాషలో 'దరోగ' శబ్దానికి అర్థం అబద్ధం. వసిష్ఠుడు 'ద్రోధవాచ' శబ్దాన్ని వుపయోగించాడు (7-33-10).

తర్వాత వచ్చిన సాహిత్యంలో వసిష్ఠుడు, అగస్త్యుడు అన్నదమ్ములన్నారు.

విద్యుతో జ్యోతిః పరిసంజిహానం
మిత్రావరుణా యదపశ్యతాం త్వా।
తత్తేజన్మోతైకం వసిష్ఠా గస్త్యో
యత్వా విశ ఆజభార॥ (7-33-10).

ఋగ్వేదంలోని యీ ఋక్కు పై విషయాన్ని బలపరుస్తుంది. దాశ రాజ్ఞ యుద్ధంలో సుదాసుని గెలుపు వసిష్ఠుని జీవితంలో గొప్ప విజయం గొప్ప విశేషం. సప్తసింధులో వేర్వేరుగా వున్న ఆర్య గణాలను ఏకం చేసుట. అప్పుడు పదిమంది రాజులు కలిసి ఎదురుతిరిగి సుదాసుతో యుద్ధం చేశారు (7-83-7).

దశరాజానః సమితా అయజ్యవః
సుదా సమింద్రా వరుణావ యుయుధుః
సత్యా నృణామద్ మసదాముప స్తుతిర్దేవా
ఏషా మభవన్ దేవహూతిషు॥ (7)
దాశరాజ్ఞే పరియత్తాయ విశ్వతః
ఇంద్రా వరుణావ శిక్షతం।
శ్విత్యంచో యత్ర నమసా కపర్దినో
ధియా ధీవంతో అసపంత తృత్సవః॥ (8)

అనగా ఇంద్ర వరుణులారా! యుద్ధమందు యజ్ఞ విముఖులైన పదిమంది రాజులు సుదాసుతో పోరాడసేరు యజ్ఞానికై వున్న మా స్తుతి సత్యం. వీరు దేవతలను పిల్వగానే దేవగణాలు వచ్చాయి (7-83-7).

ఓ యింద్ర వరుణులారా! దాశరాజ్ఞ యుద్ధంలో చుట్టూ ముట్టడి వేయబడ్డ సుదాసుని మీరు సహాయం చేశారు. ముసులు వేసుకొన్న గౌరవర్ణం గల త్రుత్సులు దాశరాజ్ఞ యుద్ధంలో మిమ్ములను స్తుతి పూర్వక స్తోత్రంతో పూజిస్తున్నారు. (7-83-8)

త్రుత్సుల దేశంలో దాశరాజ్ఞ యుద్ధంలో సుదాసు పోరాడినట్లు చెప్పబడింది.

3. విశ్వామిత్రుడు: ఋక్కుల సంఖ్యనబట్టి ఎక్కువ ఋక్కులను రచించినవారిలో మూడవవాడు గోతమ పుత్రుడు వామదేవుడు కాని యిక్కడ ముందుగ

విశ్వామిత్రుని గురించి ఆయనకున్న ప్రాముఖ్యతనుబట్టి చెప్పుకున్నాం. ఆయన ఇషీరథుని మునిమనుమడు, కుశికుని మనుమడు, గాధిపుత్రుడు. అతను పెద్దరికంలో భరద్వాజ, వశిష్ఠులకు సమానుడు. అతడు ఋగ్వేద మూడవ మండలం ఋషి. రామాయణంలోని విశ్వామిత్రునికీ, ఋగ్వేద ఋషికీ ఏమీ సంబంధంలేదు. అది పౌరాణిక కల్పనమాత్రమే, చారిత్రక సత్యంకాదు అతడు ఇంద్ర, వరుణ బృహస్పతి, పూష,సవిత,సోమ,మిత్రాది దేవతలను స్తుతించాడు. 3,339 దేవుళ్ళను(33 కోట్లు కాదు) 33 దేవతలను ఆయన ముందుగ పేర్కొన్నాడు త్రిశతం త్రిశ్చదేవాన్ (3 6-9), త్రీణి శతా త్రిసహస్రాణ్యగ్నిం త్రింశచ్చదేవా నవచాస పర్యేన్ (3-6-9) అనగా 3,339 దేవుళ్ళను అగ్ని పూజించాడు. తన సహచరుడైన జమదగ్నిని (10-161-163), తన వంశీకులగు కుశికులను (3-26-12) పేర్కొన్నాడు. తూర్పున వున్న కుశికులు సంఖ్యలోను, బలకుటిలోను అధికులు. వశిష్ఠుడు సుదాసుకు మహాభిషేకం చేసి దాశ రాజ్ఞ యుద్ధంలో అతనికి సహాయం చేశారు. అటువంటి వసిష్ఠుని విడిచి కుశికులు విశ్వామిత్రునివైపు మొగ్గారు. పౌరుషవంతులు, శౌర్యార్థులు అగురాజులు ఒక పురోహితుని వదలిపెట్టి మరియొకరిని చేపట్టుట సహజం, ఈ మార్పును వసిష్ఠపుత్రుడు శక్తి వ్యతిరేకించాడు ప్రాణాలు పోగొట్టుకున్నాడు కాని ఫలితం లేకపోయింది.

నదులను ప్రార్థించి లోతు తెలుసుకొనుటగాని, దాని చేసుకొనుటగాని వసిష్ఠునికి తెలుసు (7-18-5)- 'సుగాపే అర్ణాంసిగాధాని అకరోత్' విశ్వామిత్రుడు కూడ అట్లే చేశాడు. విపాశ్ శతుద్రి నదులను తక్కువ లోతు కమ్మని ప్రార్థించిన సందర్భంలో చెప్పిన ఋక్కులు ప్రశ్నోత్తర శైలి అనగా ప్రశ్న-జవాబు పద్ధతిలో వున్నాయి. అవి ఋగ్వేదంలో అందమైన, రమణీయమైనఋక్కులు. మంచి కావ్యం. సమల గుండెలను కరిగించగల కవిత్వం చెప్పినవాడు వసిష్ఠుడుకాదు, విశ్వామిత్రుడు.

ఇక్కడ ఆ సూక్తంలో కొన్ని అంశాలను దచిమాద్దాం.-

విశ్వామిత్రుడు : (3-33-5) విపాశ్-శుతుద్రి నదులు కొండల నుండి నీటితో- కట్లు విప్పుకున్న గుర్రాలవలె అట్టహాసం చేస్తూ, దూడలను వాత్సల్యంతో నాకటానికి ఆరాటపడుతున్న గోమాతవలె సముద్రం దిశగా పరుగుతీస్తున్నాయి. ఓ నదులారా! మీరు రథికులవలె యింద్ర ప్రేరితములై స్తుతులను వింటూ స్వచ్ఛమైన సముద్రం వైపుకు వెళ్ళుకున్నారు. మీరు చంచల తరంగాలతో ముందుకు సాగుతూ దగ్గర దగ్గరగా వెళ్ళుకున్నారు. మీరు నా సౌమ్య వాణులను వినటానికి ముహూర్త

కాలం వరకును ఆపండి. కుశిక పుత్రుడను నేను నా మనస్సులోని కోర్కెను చెప్పటానికి విశాల నదులైన మిమ్ము ఆహ్వానిస్తున్నాను.

నదులు : వజ్రహస్తుడు ఇంద్రుడు మా కొరకు పర్వతాలను వధించి నీటిని లోతు చేశాడు. సుపాణి సవిత్రుడు మమ్ము కొంపోతున్నాడు. ఆయన ఆజ్ఞానుసారంగా మేము విశాలరూపం ధరించి వెళ్ళుతున్నాం.

విశ్వామిత్రుడు : భగినులారా! ఆగండి. కవిమాట వినండి. ఇతడు ఎద్దుబండిపై చాల దూరంనుండి వచ్చి వున్నాడు కొంచెం క్రిందకు తగ్గి మీరు దాటటానికి వీలు కలుగచేయండి బండి అర్ధవరకు మాత్రమే లోతు కల్గి వుండండి

నదులు :- ఓకవీ! నీవు దూరంనుండి శకటంపై వచ్చావు. నీమాటని ఆలకిస్తున్నాం. బిడ్డకు పాలిచ్చు కోరికతోనున్న తల్లివలె లేక పురుషుని ఆలింగనంచేయు తరుణివలె నీకోసం మేము లోతు తగ్గుతున్నాం (3-33-10).

విశ్వామిత్రుడు :- ప్రియులారా! యుద్ధంలో ఆవులను కోరునట్టి యింద్రుని ప్రేరణచే భరతులు మిమ్ము దాటకల్గినచో మిమ్ములను నేను యజ్ఞార్హులుగా ఎంచుకొని స్తోత్రం చేస్తాను (3-33-12).

విశ్వామిత్రుడు సుదాసుని గొప్పచేశాడు. సింధునదిని స్తంభింపచేశాడు (3-53-9. తర్వాత సుదాసుకు కల్గిన విజయాల్లో ఆయన చాల సహాయం చేశాడు. ఆయన తన సమకాలికులైన పై యిద్దరు ఋషులవలె పుత్ర, పౌత్ర, సంతాన, సుఖములకై ప్రార్థించాడు విశ్వామిత్రుని యీ బ్రాహ్మ (మంత్రం, వాక్కు) భరతగణాలను రక్షించును- అని ఆయన నమ్మకం. (3-53-12).

"విశ్వామిత్రస్య రక్షతి బ్రహ్మేదం భారతం జనం".

దేవుడు విశ్వామిత్ర సూక్తులను ప్రచారం చేసినట్లు ఐతరేయ బ్రాహ్మణం వలన తెలుస్తుంది. (ఐతరేయం 6-4-18). దీన్నిబట్టి విశ్వామిత్రుడు అందరకు మిత్రుడు. ఆయన గొప్ప గొప్ప యుద్ధాలను నడిపించాడు ఆయన అందరకు మిత్రుడెట్లా అవుతాడు? అవును, ఆయన శునశ్శేపుని ప్రాణాలు రక్షించాడు. అంటే ఆయనకు నరబలి అయిష్టం అని తెలుస్తుంది. విశ్వామిత్రునికి నూర్గురు పుత్రులనుట నమ్మతగింది కాదు కొడుకులు, మనుమలు, ముని మనుమలు అందరు కలిపి వుంటారేమో! మధుచ్ఛంద, ఋషభ, రేణు, ఋత ఋషులు ఆయన పుత్రులు

అనిపిస్తుంది. మనుమలలో మధుచ్ఛందుని కొడుకులు అఘమర్షణ, జేత- ఋషులు. ఋతపుత్రుడు ఉత్కీలుడు కూడ ఋషి.

ఐతరేయ బ్రాహ్మణమందు యిట్లు వ్రాయబడివుంది- విశ్వామిత్రునికి నూర్గురు కొడుకులు. వారిలో ౫౦ మంది మధుచ్ఛందునికంటె వయస్సులో పెద్దవారు, మిగిలిన వారు చిన్నవారు. శునశ్శేపుని దత్తత చేసుకొనటను పెద్దవాళ్ళు ఒప్పుకొనలేదు. అంతట విశ్వామిత్రుడు 'మీసంతానం అభక్ష్య భక్షణం చేయుగాక' అని వారిని శపించాడు. ఆంధ్ర, పుండ్ర, శబర, పులింద మొ॥ దస్యులు వారి సంతానం అని అంటున్నారు. మధుచ్ఛందుడు, అతనికంటె చిన్నవారు- అందరు విశ్వామిత్రునితో యిట్లు చెప్పారు- "ఓ తండ్రీ! మేము మీరు చెప్పిన ప్రకారం చేస్తాం శునశ్శేపుని జ్యేష్ఠునిగా అంగీకరించి మిమ్ము అనుసరిస్తాం"

వారి జవాబును విని ప్రసన్నుడై విశ్వామిత్రుడు తన పుత్రులను గురించి స్తుతించాడు- నాబిడ్డలారా ! మీరు పశువులతోను, సంతానంతోను వర్ధిల్లండి. నేను చెప్పినట్లు విని మీరు నన్ను పుత్రవంతునిగ చేశారు. ఓ గాధిపుత్రులారా ! దేవరాత సంరక్షణలో మీరు పుత్రవంతులుకండు. ఇతడు (శునశ్శేపుడు) మిమ్ము సత్యమార్గాన కొంపోతాడు. ఓ కుశిక సంతానంలారా ! వీరుడైన దేవరాతుని అనుసరించండి. ఇతడు మీకు మార్గదర్శకుడై మన విద్యలందు దాయభాగం కలవా డగుచున్నాడు. దేవరాతుని సహచరులయిన విశ్వామిత్రుని సత్పుత్రులు, గాధిపౌత్రులు ధనం, యశం, కీర్తి పొందెదరుగాక (7-3-18).

ఐతరేయ బ్రాహ్మణం శునశ్శేపుని దేవరాత వైశ్వామిత్రునిగా ప్రఖ్యాతి కల్గించటానికి ప్రయత్నించింది. కాని ఋగ్వేద ఋషి శునశ్శేపుడు మాత్రం శునశ్శేప అజీగర్తుడుగానే ప్రసిద్ధికెక్కాడు.

4. వామదేవుడు: గోతముని పుత్రుడు వామదేవుడు.ఇతడు వసిష్ఠ, విశ్వామిత్రుల తర్వాత తరంవాడు కావచ్చు. కాని యితడు ఋషిత్రయానికి తీసిపోడు. విశ్వామిత్ర సూక్తాలకు యితడు బహుళ ప్రచారం కల్గించాడు. ఇతడు తన ఋక్కుల్లో 'గోతమాల్పితః' (4-4-11) అనీ, 'మామతేయ' (4-4-13) అని చెప్పుకొనుట వలనయితని తండ్రి గోతమ మామతేయుడని తెలుస్తుంది. వామదేవుడు ఒకచోట తనపేరుతో, యింకొకచోట తనపేరు లేకుండా దివోదాసు, సుదాసుల విజయాలను వర్ణించాడు-

అహం పురో మందసానో వ్యైరం నవ
సా కమ్నవతః శంబరస్య ।

శతతమం వైశ్యం సర్వతాతా
దివోదాస మతిథిగ్వం యదావం - (4-26-3)

అనగా అతిథిగ్వ దివోదాసు 100 పురాలను జయించాడు. ఈ నూరు అయస్ పురాలు. (4-27-1).

శతమశ్మ న్మయీనాం పురామింద్రో వ్యాస్యత్ !
దివోదాసాయ దాశుషే॥ (4-30-20)

అనగా ఇంద్రుడు దివోదాసు కొరకు నూరు అశ్మన్మయి పురాలను జయించాడు. యుద్ధంలో 30,000 మంది మూర్ఛిల్లారు. పరుష్ణి (రావి నది రావీనది)పై యింద్రుడు దయచూపాడు (4-22-2). వామదేవుడు భరతుం మహిమను, వారిరాజు గొప్పతనాన్ని కీర్తించాడు.. సహదేవపుత్ర కుమార సోమకుని (కుమారః సాహదేవ్యః (4-15-79), సృంజయులరాజు దేవవాతుని, వైదథి ఋజిశ్వా, ఆర్జునేయ కుత్సులనుకూడ వామదేవుడు కీర్తించాడు. వీరిలో కొందరు ఆయనకు సమకాలికులు దాతలు అయివుండవచ్చు.

త్వం పిప్రుం మృగయం శూశువాం సమృజిశ్వనై వైదథినాయ రంధీః ।
పంచాశత్ కృష్ణా నివపః సహస్రాత్కం న పురోజరిమా విదర్దః ॥ (4-16-13).

అనగా ఓ ఇంద్రా' నీవు విదథి పుత్రుకు ఋజిశ్వా కొరకు బలవంతుడగు పిప్రు మృగయుని చంపావు. 50,000 కృష్ణులను అనగా నల్లని శరీరం గల అసురులను చంపావు. చినిగిన చొక్కావలె పురాలను ధ్వంసం చేశావు.

వామదేవుడు 50,000 కృష్ణులు చంపబడినట్లు చెప్పారు. అసిక్నిని పేర్కొన్నాడు (4-17-15). "ఏతదస్యా అనః శయే సుసంపిష్టం విపాశయా ససారసీం పరావత. (4-30-11) అనగా ఉదయకాలపు ఉషాదేవి ఆకాశంలో వెళ్ళుతుండగా ఆమె శకటం విపాశ్ నదీ తీరంలో పడిపోయిందను వార్త ఆతనికాలం ఋషులందు బాగా ప్రచారంలో వుంది.

ఉతదాసం కేలితరం బృహతః పర్వతానధి ।
అవాహన్నింద్ర శంబరః॥ (4-30-14)
ఉతదాసస్య వర్చినః సహస్రాణి శతావధీః
అధిపంచ ప్రధీరివ॥ (4-30-15).

దాసుల్లో కేలితర శంబరుని, వర్చిని పేర్కొన్నాడు. తుర్వశయదులు మంచి పలుకుబడి గలవారు అని చెప్పారు. కృష్ణ తులాంగలః (4-57-4), సీతా సుఫలా

(4-57-6,7), ఫాల (4-57-8) అనగా నాగలి దున్నుట, నాగలి వాళ్ళు పలించుట, నాగలి కర్ర. వీనిని గురించి చెప్పుతూ వామదేవుడు ఆర్యుల వ్యవసాయ విస్తరణను వివరించాడు. ఇతడు నవ్వుతున్న అందమైన ఆడవాళ్ళను పేర్కొన్నాడు — యోషాః కల్యాణ్యః స్మయమానాః (4-58-8). వామదేవునికి, నోధా ఋషికి తండ్రి గోతముడు. తాత రహూగణుడు. వామదేవుని పుత్రుల్లో మూర్ధన్వ, బృహద్దివ, బృహదుక్థుల ఋషులు అని మనకు తెలును.

## ఇతర ఋషులు

5. గృత్సమదుడు: ఇతడు శౌనక పుత్రుడు. ఈయన్నికూడ శౌనకు డన్నారు (9-86-46, 48). బహుశా యితడు అత్రి వంశకుడై వుంటాడు.

అత్రిమ నుస్వరాజ్యమగ్ని ముక్థాని వా వృధుః ।
విశ్వ అధిశ్రియో దధే॥(2-8-5)

ఇతడు దివోదాసు, శంబర యుద్ధాన్ని గురించి చెప్పాడు.

సరంధయత్ సదివః సారథయే
శుష్ణమశుషం కుయం కుత్సాయ ।
దివోదాసాయ నవతించ నవేంద్రః
పురో వ్యైరచ్ఛం వరన్య॥ (2-19-6)

అనగా ఆ దివ్య ఇంద్రుడు కుత్ససారధి కొరకు శుష్ణ, అశుష, కుయంలను చంపాడు. దివోదాసు కొరకు శంబరుని 99 పురాలను నాశనం చేశాడు. దివోదాసు శంబరుని 99 పురాలను జయించాడు. శంబరుని 100 పురాలు ధ్వంసమయ్యాయి. (2-14-67). శత్రువులు కృష్ణయోనులు (నల్లజాతులు, దస్యులు). (కృష్ణయోనః 2-20-7).

అధ్వర్యవో యః స్వశ్నం జఘాన
యః శుష్ణ మశుషం యోవ్యంసం ।
యః పిప్రు నముచిం యో రుధికాం
తస్మా ఇంద్రాయాం ధసో జుహోత॥ (2-14-5)

అనగా ఓ అధ్వర్యులారా, స్వశ్న, శుష్ణ, అశుష, వ్యంస, పిప్రు, నముచి రుధికలను సంహరించిన ఆ యింద్రునికి అన్నం సమర్పించండి.

స్వప్నే నాభ్యాస్య చుమురిం ధునించ
జఘంధ దస్యుం ప్రదవీతి మావః
రంభీచిదత్ర వివిదే హిరణ్యం
సోమస్య తామద ఇంద్రశ్చకార ॥ (2-15-9).

ఇట్లు గృత్సమదుడు స్వశ్న, శుష్ణ, అశుష, వ్యంస, పిప్రు, నముచి, చుముని, ధుని, శుయ మొదలైన దస్యురాజులను పేర్కొన్నారు.

పర్వతరాజు శంబరుని 40వ సంవత్సరంలో పట్టుకొన్నారు అనుటవలన అతడు గొప్ప పరాక్రమశాలి, 40 సంవత్సరాలవరకు లొంగలేదని తెలుస్తుంది. (2-12-11).

గృత్సమదుడు సోమాన్ని వడగట్టుటను వర్ణించాడు — సోమోమేశ్యః పునానః కలశేషు సేదతి (9-83-47), అనగా వున్నిబట్టలో వడగట్టిన సోమాన్ని కలశాల్లో వుంచారు. దీనినిబట్టి సోమాన్ని నలగగొట్టి, మిశ్రమం చేసి, వున్నివస్త్రంతో వడగట్టి కలశాల్లో వుంచేవారని స్పష్టమవుతుంది.

6. కక్షీవానుడు : ఆయన దీర్ఘతమ ఔచథ్య పుత్రుడు. తర్వాత వరం పరనుబట్టి చూస్తే దీర్ఘతముడు, గోతముడు- ఒకే వ్యక్తి పేర్లు అని తెలుస్తుంది. కక్షీవానుడు గోతముని పేర్కొన్నాడు. కాని అతనితో పితృ సంబంధం వున్నట్లు తెలియదు. రెండుసార్లు భరద్వాజుని, రెండుసార్లు అత్రిని పేర్కొన్నాడు. కాని అతన్ని భరద్వాజుడు లేక అత్రి వంశీకుడని చెప్పలేం. దివోదాసుని గురించి కూడ చెప్పాడు. (1-116-15,16,18). నౌశతారిత్రా (1-116-5). అనగా నూరు తెడ్లుగల నావ. ఇందువలన ఆర్యులు సప్తసింధులో కూడ సముద్రానికి పోవు నావలను చూచేవారని తెలుస్తుంది. విశ్పలా (1-117-7), ఘోషా (1-117-7,11) లాంటి మేధా సంపన్నులైన ఆర్య మహిళలను పేర్కొన్నారు.

అమందాన్ స్తోమాన్ ప్రభరే మనీషా
సింధావధి క్షియతో భావ్యస్య
యోమే సహస్ర మమిమీత సవానతూర్తో
రాజాశ్ర వ ఇచ్ఛమానః॥ (1-126-1)

అనగా సింధుతీరవాసి భావ్యుడు పురోహితునకు చాల గొప్పదానం యిచ్చాడు. కక్షీవానునికి అందులో వాటా దొరికింది. గాంధారీ అవికా (గాంధారి గొర్రెలు) (1-126-7) అనుటవలన నేటి వఖ్తానిస్తాన్ గొర్రెలవలె ఆ కాలంలో కూడ అవి

మంచి వున్నికి శ్రేష్టమై వుండవచ్చు. గోతముడు, దీర్ఘతముడు ఒకరే అయివుంటే గోతమపుత్ర వామదేవ, నోధాలతోపాటు ఆయన పేరుకూడ చెప్పి వుండేవారు.

7. అగస్త్యుడు : ఆయన మిత్రావరుణుని పుత్రుడు. వసిష్టుని తమ్ముడు, ఋగ్వేదంలో 26 సూక్తాలను రచించాడు. ఆయన రచనలు ప్రధమ మండలంలో (165-191) సూక్తాల్లోవున్నాయి. తన రుక్కుల్లో వసిష్టుని పేర్కొనలేదు. భార్య—లోపాముద్రను పేర్కొన్నాడు (1-179-4) ప్రసిద్ధ ఆర్యమహిళ విశ్వలాను పేర్కొన్నాడు (1-182-1). తుర్వశయదుల గురించి చెప్పాడు (1-164-9). కాని పోరాటాలగురించి ఏమీ చెప్పలేదు. సుదాసు తుర్వశయదులు మొదలైనవారితో దాశరాజ్ఞ యుద్ధంచేసిన సంగతి చెప్పలేదు. వసిష్టుడు సుదాసుకు పౌరవి, తనకు అన్నగారు. కాబట్టి ఆయన రచనల్లో యుద్ధం సంగతి ఏకొంచెం అయినా చెప్పాల్సివుంది. కాని చెప్పలేదు. కరంభ (పిండి), లాభదాయకమైన తృణధాన్యాలు, శర, కుశర, దర్భ, ముంజ —వీటిని చెప్పాడు (1-187-10,1-191-3) అగస్త్యుని గురించి పురాణ కధల్లో చెప్పినవి ఏవీ కూడ లేశమాత్రమైనా ఆయన రుక్కుల్లో ఛాయా మాత్రంగాకూడ లేవు. అతడు కొండలకు గురువు, చివరి దినాల్లో దక్షిణానికి వెళ్ళాడనీ చెప్పుకొను సంగతులు ఏమీ కానరావు. అతను 'పంచక్షిత'— ఆర్యుల పంచగణాలతో అంటిపెట్టుకొన్నట్లు తోస్తుంది (1-176-3).

8. దీర్ఘతముడు : ఇతడు ఉచధ్యుని పుత్రుడు. 25 సూక్తాలకు కర్త. ఔచధ్యుడు, మామతేయ దీర్ఘతముడు అనుటవలన ఇతని తల్లిదండ్రులు ఉచథ్య మమతలు. దాసులను (1-15-8) వీరులను (1-140-12) పేర్కొనుటవలన యుద్ధం అంటే యీయనకు ఆసక్తి వున్నట్లుంది. 'వాజినమ్ పక్వమ్ సురభిమాంసమ్' (1-162-12) అనగా వండిన సువాసనగల గుర్రం మాంసం. దీన్నిబట్టి ఆ కాలంలో ఆర్యులు గుర్రంమాంసం తినేవారు, 'నమ్రియతే వాజ' (1-16-21).

అనగా (గుర్రం చావను) ఓ అశ్వమా! యజ్ఞంలో నీవు చంపబడ్డావు. కావున నీవు చచ్చుటలేదు. చంపబడలేదు. సుగమ మార్గాన దేవుళ్ళ దగ్గరకు పోతున్నావు.

9. గోతముడు : ఇతడు రహూగణపుత్రుడు. దాదాపు 20 సూక్తాలను రచించాడు. ప్రథమ మండలం :- 1-74-93,173; 1- 3-1,5; 1-8 -16, 1-84-1,14; 1-91-12; 1-93-4.

10. మేధాతిథి : ఇతడు కణ్వ పుత్రుడు. తన వంశీకులను కణ్వనః అని స్మరించాడు. తాతఘోర. ముత్తాత అంగిర.

11. శ్యావాశ్వుడు : అత్రిపుత్రుడు. ప్రసిద్ధ ఋషి. 15 సూక్తాలకు కర్త. ఇతడు మంచి దాతను 'అర్హత్' అన్నాడు (5-52-5). అంటే ఆ కాలంలో అర్హత్ శబ్దానికర్థం 'ముక్తపురుషుడు' కాదు. తర్వాత బౌద్ధులు, జైనులు ఆ శబ్దాన్ని ముక్త పురుషుడను అర్థంలో వాడారు. సప్తసింధు భూగోళం తెలుసుకొనుటకు ఇవి ఋక్కులు వుపకరిస్తాయి. సప్తసింధుకు తూర్పున సరిహద్దునది యమునను, సింధుకు అతి పడమరలో ప్రవహించే కుభ (కాబుల్), క్రము (కుర్రం), సింధు, సరయు నదులను పేర్కొన్నారు. (5-53-11). ఒకచోట సుదాసు పేరుకూడ చెప్పారు (5-53-2). అత్రి వంశీకుల్లో యీయన గొప్ప ఋషి.

13. కుత్సుడు : ఇతడు అంగిర పుత్రుడు. 15 సూక్తాలకు కర్త. తన ఋక్కుల్లో చాలచోట్ల 'కుత్స' అని చెప్పుకొన్నాడు (1-104-2); (1-106-6). అర్హత్ (1-135-1), శుష్ణ, పిప్రు, వృత్ర, శంబర- వీరిని పేర్కొన్నారు. కుయ అసురునికి యిద్దరు భార్యలున్నట్లు చెప్పాడు (1-104-3).

13. మధుచ్ఛంద ఋషి : ఇతడు విశ్వామిత్రుని పుత్రుడు. తండ్రికి భక్తుడు. 10 సూక్తాల కర్త. ముష్టిహత్య (1-8-2), స్వాదిష్ట మదిష్ఠ సోమం (1-9-1) గురించి చెప్పారు. ఇతని పుత్రుల్లో ఋషులు- జేత, అఘమర్షణ. వీరు ఒక్కొక్క సూక్తానికి కర్తలు.

14. ప్రస్కణ్వుడు : ఇతడు కణ్వ పుత్రుడు. 10 సూక్తాలకు కర్త. తన మంత్రాల్లో అరు పర్యాయాల కంటె ఎక్కువగా కణ్వుని తలచుకొన్నాడు అత్రి, అంగిర వంటి ఋషులను; తుర్వశ, వక్షగణాలను పేర్కొన్నాడు. ఆయన చెప్పిన దశవ్రజ, గోశర్య ప్రదేశాలు బహుశా సప్తసింధుకు పశ్చిమోత్తర భాగంలో వుండవచ్చు. 'సింధూ నా క్షోదే'- సింధువుల రేవులో (1-46-8) అని చెప్పటవలన మనం సింధు నది అని చెప్పలేం.

అప్పటిలో సింధు శబ్దానికి అర్థం 'నది' వాడుకలో వుండేది. శంవః కరత్స్వతే మేషామేష్యే వృభ్యో నారిభ్యో గవే (1-47-6) అంటూ గుర్రాలకు గొర్రెలకు మానవులకు, మహిళలకు, గోవులకు మేలుకోరాడు సుదాసుకు, తుర్వశ గణాలను పేర్కొన్నాడు. కణ్వుడు, ప్రస్కణ్వుడు తుర్వసులకు. యదులకు పురోహితులు. వారుకూడ సుదాసుతో భయంకర యుద్ధం చేశారు. తండ్రీ కొడుకూ తమ యజమా

# ఆరవ అధ్యాయం

# దస్యులు

1. సింధుజాతి వారు (పణులు) : ఆర్యులు హరప్పా, మొహెంజొదారో నగరాలతో భయంకర పోరాటం చేశారు. సింధుజాతి నగరాలను, సంస్కృతిని ధ్వంసం చేశారు. కాని ఋగ్వేద ఋషులు వర్ణించిన భయంకర యుద్ధం మైదాన ప్రదేశంలో వున్న, సంస్కృతి సంపన్నులైన సింధుజాతి ప్రజలతో చేసింది కాదు. కొండజాతితో చేసిన యుద్ధం మాత్రమే. సింధుజాతితో ఆర్యుల సంఘర్షణ క్రీ. పూ. 1500లో జరిగింది. కొండజాతుల పురాలను ధ్వంసం చేసిన కాలం, దానికి మూడువందల ఏళ్ళ తర్వాత కాలం. అంటే ప్రాచీన ఋగ్వేద ఋషుల కాలం. అప్పటికి ఆర్యులు కన్నగొంతు సింధును దాటి పాంచాల వరకు వ్యాపించి అంతా క్రమంగా (యమున నుండి సింధు పశ్చిమ భూభాగం) ఆక్రమించుకొన్నారు.

ఆర్యుల శత్రు విరోధుల సంఖ్య— సింధు జాతి వారిని, కొండ జాతి వారిని కృష్ణ యోనులు, దస్యులు, దాసులు అన్నారు. పణుల విషయంలో కొంత గౌరవభావం కనబరుస్తూ వున్నది. పణులు శత్రు కోటిలోని వారు కారు. వారు పాలిస్తే గొప్పది. అన్యవర్ణులు కనుక ఎప్పుడప్పటికీ ఆర్యులకు వారంటే గౌరవం లేదు. పణులు సింధు జాతి ప్రతినిధులు.

పణులు : పణి శబ్దానికి సంబంధించినవి—పణనము (అమ్మటం), పణ్యము (అమ్మే వస్తువు), ఆపణము (బజారు-మార్కెట్టు), వణిక్ (వర్తకుడు) శబ్దాలు. ఈ పణులు సంస్కృతి సంపన్నులైన, ధనికులైన సింధు జాతి వారు. వీరు ప్రభుత్వాన్ని పోగొట్టుకొన్నారు. దాసత్వం నుంచి తప్పించుకొని వ్యవసాయం, వర్తకం చేసుకొంటూ జీవిస్తూ వుండేవారు. ఇందులో వర్తకమే లాభదాయకం. ఋగ్వేదంలో అనేక చోట్ల పణుల గురించి చెప్పబడింది. భరద్వాజ, వసిష్ఠ, దీర్ఘతమ, గౌతమ, పరాశరుల, గృత్సమద, హిరణ్యస్తూప, అయాస్య కేవల మొదలగు ప్రసిద్ధ ఋషులు పణులను గురించి చెప్పారు.

పణులు ఉదార స్వభావులు కారు. లుబ్ధులు, ఆర్యుల దాలించి, దోచుకొని వారిమంది ధనాన్ని, విలువైన రత్నాలను, ఆవులను దాక్కొనేవారు. కంటు ఋషి

సూక్తం (6-45-31) ప్రకారం పణుల నాయకుడు బ్రుబువు. అతడు ఆర్యుల నుండి రాబోవు ప్రమాదాన్ని గుర్తించి శంయు ఋషికి వేయి గోవులను దానమిచ్చాడు, అని తెలుస్తుంది.

ఋగ్వేద పదవ మండలంలోని 'పణిసరమా' సంవాద సూక్తం చదివితే పణులకు ఆర్యులకు వున్న సంబంధ మెట్టిదో బోధపడుతుంది. సరమా దేవతల కుక్క. అది ఆర్యుల హింసాపూరిత లోలుప ప్రవృత్తికి ప్రతినిధి. రచన ఏ ఋషిదో తెలియదు. ఇంక సంవాదం చదవండి (10-108)

పణిగణం : సరమా, నీవు ఏమి అభిలషించి వచ్చావు. చాల దూరం నుండి వచ్చావు. కంటి చూపుకు అందని దూరం. మా వద్ద ఏముంది. నీవు దారిలో నున్న జలాన్ని ఎట్లు దాటావు ?

సరమ : పణులారా నేను యింద్ర దూతికను. మీ నిధులను కోరి వచ్చాను. మీరు చాలా కూడబెట్టారు. అందుకే వచ్చాను. జలం రక్షించింది. నేను నదీ జలాలను దాటి వచ్చాను.

పణులు : సరమా, నీవు దూతివై దూరంనుండి వచ్చుటకు కారణభూతుడైన ఆ యింద్రు డెవ్వరు ? అతడే వస్తే అతన్ని మిత్రునిగా చేసుకొంటాం. అతడు మా గోవులను తీసుకొని మాకు గోపతి అవుతాడు.

సరమ : నాకు యిదంతా తెలియదు. నే నెవ్వరి దూతికనై వచ్చానో అతన్ని ఎవరు గెల్వగలరు ? లోతైన నదులు అతన్ని అడ్డుకోలేవు. ఓ పణులారా! మీరు ఆ యింద్రునిచే హతులై నిద్రపోతారు.

పణులు : ఓ సుభగా! ఆకాశం యొక్క అవతలి భాగంనుండి నీవు వేనిని కోరి వచ్చావో. వాటిని- ఆ గోవులను- యుద్ధం చేయకుండా హరించగలవా రెవ్వరు ? మా ఆయుధాలు పదునుగా వున్నాయి.

సరమ : పణులారా, మీ మాటలు సైనికులు పల్కేవి కావు మీ శరీరాలు పాపభూయిష్ఠాలు. మీరు వచ్చేది రహదారి కాదు. బృహస్పతి మిమ్ము బాధిస్తాడు.

పణులు : సరమా, మా నిధి పర్వతాలచే రక్షితమై వుంది. మాకు గుర్రాలు గోవులు, వసువులు (ధనము) వున్నాయి. వీటిని సురక్షకులగు పణులు కాపాడుతున్నారు. మా వద్దకు నీవు అనవసరంగా వచ్చావు.

సరమ : సోమపాన మత్తులైన ఆయాస, అంగిరస, నవగు వంటి ఋషులు యిక్కడకు వచ్చి మీ ఆవులను తోలుకుపోతారు. కాబట్టి పణులారా మీ మాటలు వట్టి బూకరింపు లవుతాయి.

పణులు : ఓ సరమా, దేవతలు భయపడి నిన్ను ఇక్కడకు పంపారు. నిన్ను మా తోబుట్టువుగా చేసుకుంటాం. నీవు పోవద్దు. ఓ సుందరీ, నీకు మేము ఆవులను ఇస్తాం.

సరమ : నాకు అన్నచెల్లెలు సంబంధం తెలియదు. ఘోర, అంగిరస వంశీకులు యింద్రునికి తెలుసు. వారు ఆవులను కోరి నన్ను ఇక్కడకు క్షేమంగా పంపారు. నేను వచ్చాను. పణులారా మీరు ఇక్కడనుండి దూరంగా పారిపొండు. ఆవులు బాధతో కష్టపడుతున్నాయి. దాచిన యీ గోవులను బృహస్పతి, సోముడు, సోమాన్ని తయారుచేసేవారు, విప్రఋషులు పొందెదరుగాక.

ఈ సంవాదం చదివిన తర్వాత నాకు పణుల స్థితి 19వ శతాబ్దం పూర్వార్థంలో ఉత్తరాన్నుండి వచ్చే బ్రిట్షరుల ముందు మధ్య ఆసియాలోని గ్రామ నగర వాసుల పరిస్థితిని పోలివున్నది. వారు దోపిడీ చేసిన ధనాన్ని ధర్మార్జితం అనుకొనేవారు.

## 2. శంబరుడు - కొండజాతివారు

ఋగ్వేద ఆర్యులకు బద్ధశత్రువు శంబరుడు, అతని కొండజాతివారు. శంబరుడు దివోదాసుకు పోటీ. అతనికి పూర్వం అతని వంశీకులైన కొండజాతివారు ఆర్యుల పురోగమనాన్ని అపుటకు సంఘర్షణ ప్రారంభించారు. ఈ కొండవారిని ఆర్యులు దస్యులు, దాసులు అన్నారు. సింధుజాతి పణులనుకూడా యిట్లే అన్నారు. ఋగ్వేదఋషుల ఉద్దేశం క్రమబద్ధంగా చరిత్ర వ్రాయాలని కాదు. అప్పుడప్పుడు ప్రసంగవశాత్తు వారు చెప్పిన వాటినిబట్టి మనకి విషయాలు తెలుస్తాయి. సింధుజాతి అనీ, కొండజాతి అనీ వారు స్పష్టంగా చెప్పలేదు కాని ఆనాటి పరిస్థితిని పరిశీలించితే మనకు యీ విషయాలు బోధపడతాయి.

పణుల రాజకీయ సంఘర్షణ విడిచిపెట్టిన సింధుజాతివారు. ఇంక కత్తిని ఎత్తినవారు కొండజాతివారే. శంబరునికి నూరు అజేయ పర్వత దుర్గాలున్నాయి. దివోదాసు వాటిని ధ్వంసం చేశాడు. దివోదాసు గణం పురుశాఖకు చెందిన భరతులు. వారిని త్రిత్సు అనికూడ అంటారు. పరుష్ణి (రావీ) వీరికి పడమర హద్దు. మహాముని

కాలంలో ఒక పర్యాయం శక్తులు, యితర ఆర్యగణాలు ఆ నదీ తీరానికి పోయి త్రిత్సులను చికాకుపర్చారు. తూర్పున త్రిత్సుల హద్దు శతుద్రి (సట్‌లజ్) విపాశ (వ్యాస) నదులు. పడమర శక్తులకు, భలానసులకు పడమటి కొండలున్నాయి. భరతులకు దగ్గరగా కాంగడా కొండ మాత్రమే వుంది. కాబట్టి ఆర్యులను అష్టకష్టాలు పెట్టిన కొండజాతివారు కాంగడా కొండవారే అయివుంటారు. కాని నేడు అక్కడ వున్న ఖస్సులను లేక ఇండో ఆర్య నివాసులను మూడువేల సంవత్సరాలనాటి, ఆ తామ్రయుగజాతికి చెందినవారేనని చెప్పలేం. అప్పుడు యీ కాంగడా కొండలో ఏ జాతివారు ఉండేవారు? సింధుజాతి వారే యిక్కడకూడ ఉండేవారా? వీరినికూడ కృష్ణత్వక్కులు, కృష్ణయోనులు అనటవలన వీరు బహుశా మొహింజెదారో, హరప్పావాసులకు బంధుకోటిలోని వారేమో అనుభావం కల్గుతుంది. కాని వీరు మాత్రం వేరే జాతివారు. తామ్రయుగంలోని హిమాలయ కిరాతులను గురించి పరిశీలిస్తే యీ విషయం స్పష్టపడుతుంది.

## 3. మోన్‌ఖ్మేరులు (కిరాతులు)

ఒకప్పుడు హిమాలయమంతా కిరాత జాతులే వుండేవి. పడమర చంబా మొదలుకొని తూర్పున నాగభూమి వరకు, తర్వాత బర్మా, థాయిలాండు నుండి ఇండోచైనా వరకు యీ జాతి వున్నట్లు నేడు సైతం తెలుస్తుంది. నేటి సంస్కృత పండితులు కిరాతులను మోన్‌ఖ్మేరు లంటారు. కిర లేక కిరాత జాతిని ఋగ్వేదం పేర్కొంది. అయితే నాడు యీ కొండల్లో కిరాతులే వుండేవారు. నేడు యీ జాతి అవశేషాలు టిబెట్టు సరిహద్దుల్లోను, తరాయిలోను అనేక చోట్ల వున్నాయి. పడమరనుండి తూర్పుకు వెళ్ళిన కొలది వీరి సంఖ్య పెరుగుతుంది. తూర్పు నేపాలును యీనాడు కూడ కిరాత దేశ మంటారు.

కిరాతులకు చైనా- మంగోలు, టిబెట్టు జాతితో సంబంధ ముంది. ఈ సంబంధం ఇండో ఆర్యులకు, పశ్చిమ యూరోపియులకు వున్న సంబంధం వంటిది. కిరాతులు లేక మోన్‌ఖ్మేరుల ముఖాలపై మంగోలుల ముఖ ముద్ర వుంది. కాబట్టి టిబెట్టు సరిహద్దులో వున్న మోన్‌ఖ్మేరులను అనేక పండితులు టిబెట్టు లన్నారు. ఇంక సామాన్యుల సంగతి చెప్పనవసరం లేదు. మోన్‌ఖ్మేరులు ఎందరో తమ భాషను విడిచి పెట్టారు. కొందరు తమ ముఖశ్రీని కూడ అల్ప సంఖ్యాకు లగుట చేత విడిచి వారనుటలో ఆశ్చర్యం లేదు. కాని చాలమంది యిప్పుడు కూడ తమ

భాషనే మాట్లాడుతున్నారు. ఇట్టి వారిలో ముఖ్యులు— చంబాలోని బాహులీలు, బాహులు దిగువ భాగంలో ఉండేవారు, కుల్లూలోని మలాణ గ్రామస్తులు, ఎగువ సట్‌లజ్ నివాసులైన కిన్నరులు లేక కన్నౌరులు, మాణాసీతిలోని మారఛాలు, అస్కోటు (అల్మోరా) లోని రాజీలు, లేక రాజ కిరాతులు, పశ్చిమ నేపాలులోని మగరులు, గురంగులు- మధ్య నేపాలులోని తమంగులు, నేపాలు లోయలోని నేవారులు. తూర్పు నేపాలులోని మూడు కిరాత జాతులు- లింబూ, యఖా, రాయీలు. సిక్కింలోని లేపచాలు, అస్సాంలోని నాగాలు మొదలైనవారు. లెక్క పెట్టుట, మహాభూతాల పేర్లు మొదలైనవి ఎన్నో వీరి భాషలో వున్నాయి. టిబెట్టు భాషలో వున్నవి కూడ కలుస్తాయి. కాని వీరివి ఎన్నో స్వతంత్ర శబ్దాలు వున్నాయి. వీరు నీటిని 'తి' అంటారు. ఈ శబ్దం చంబా మొదలు నాగభూమి వరకు వాడుకలో వుంది. నేవారులు మాత్రం నీటికి యీ పదాన్ని వాడరు. కాని మాంసం నీటిని 'లా-తి' అంటారు. దీన్నిబట్టి 'తి' ప్రయోగం వారిలో కూడ వుందని తెలుస్తుంది. బదరీనాథు నుండి కైలాసానికి వెళ్ళేదారిలో ఒక మజిలీ పేరు 'తి- పాని'. ఇందు కిరాత-హిందీ భాషలు రెండూ వున్నాయి. ఈ జాతి వారు యిప్పటికీ కిరాత భాష మాట్లాడుతారు. అనేక చోట్ల వీరిని కిరాతులనే అంటారు. కొందరు కిరాతులు మాత్రం తమ భాషను విడచిపెట్టి పహాడీ లేక టిబెట్టు భాష మాట్లాడుతున్నారు. టిబెట్టు భాషను మాట్లాడు కిరాతులను గురించి యిదమిత్థంగా చెప్పలేం. వారి ముఖాలు, టిబెట్టుల ముఖాలు ఒక్కటిగానే వుంటాయి. టిబెట్టు వారు క్రీ॥ శ॥ 7 వ శతాబ్దం ఉత్తరార్థంలో పదపద మానసరోవరం, నేపాలు కొండల వైపు వెళ్ళినట్లు మనకు తెలుసు. వారు యిక్కడ వున్న ప్రాచీన నివాసులను మోన్లాలని, వారి దేశాన్ని మోన్‌యుల్ (మోన దేశం) అని అంటారు. ఖాట్మండూ నుండి తిన్నగా ఉత్తరాన టిబెట్టు సరిహద్దులో వున్న యిలాకాను యిప్పటికీ మోన్‌యుల్ అంటారు. ఈ మోన్ శబ్దము బర్మాలోని ప్రాచీన నివాసులకు కూడ వాడే వారు. మోనులనూ, కంబోడియా (కాంభోజ)లోని ఖ్మేరులను తీసుకొని పండితులు వీరికి గాను 'మోన్‌ఖ్మేరు' అను శబ్దాన్ని కల్పించారు. స్పితీ ప్రజలు కూడ మొదట్లో మోనులని పిస్తున్నది. గంగోత్రి మొదలు ఎగువ 'నేలంగు' వరకు ఉండేవారు మోనులే. కాని వారిప్పుడు మోన్ భాష మాట్లాడరు. పితీమాణాలోని తోచ్చాలు కూడ పహాడీభాష మాట్లాడుతారు. అల్మోరాలోని మిఠములు కూడ అంతే. కాని వీరి ముఖాకృతి కిరాతులను పోలి వుంటుంది. వీరు కిరాతుల్లో మిగిలినవారు. నేపాలులోని మోన్వాలు బాగా దక్షిణాన ఖస్సు భాష మాట్లాడేవారి మధ్యలో వున్నారు కాబట్టి వారుకూడా క్రమంగా వారి భాషను మరచిపోతున్నారు.

కిరాతులు లేక మోనులు ఒకనాడు హిమాలయంలో దిగువ టెరాయిలో నివసిస్తున్నారు. వారిని థారులు లేక భోగ్నాలంటారు. థారులు హరిద్వారం లేక యమునకు పడమరగ లేరు. కాని తామ్రయుగంలో వారి పూర్వీకులు జమ్మూవరకు ఉండి ఉంటారు. ఈ థారులు నైనిటాలు టెరాయినుండి దర్భంగా ఉత్తర టెరాయివరకు వున్నారు. వీరికి తూర్పునవున్న మేచి, కోచి మొదలైనవారు కూడ మోనులే. థారులు వారికి దక్షిణంగా దగ్గరలో వున్న పొరుగువారి భాష మాట్లాడుతారు. ఆ భాషల్లో మైథిలీ, భోజపురి. అవధి ఎక్కువ వాడుకలో వున్నాయి. కాని వారి ముఖ ముద్రలు చూస్తే వారు ఆ పొరుగు ప్రాంతీయులు కారని తెలుస్తుంది.

పై వివరణనుబట్టి కిరాతులు లేక మోనులు హిమాలయంలో యీ నాడు కూడ వున్నట్లు తెలుస్తుంది పశ్చిమాన వారి సంఖ్య తగ్గినమాట నిజం. దీనికి కారణం వారి భూముల్లోకి యితరులు దౌర్జన్యంగా ప్రవేశించుటమే. ఋగ్వేద ఆర్యులు కాంగడాలోని కిరాతుల దుర్గాలను ఆక్రమించుకొనుటతో దీనికి ఆరంభం అయింది. కాంగడా జిల్లాలో కల్లూ సబ్ డివిజన్‌లో మాత్రం మలానా లోయలో కిరాత భాషను మాట్లాడు మలానా గ్రామమున్నది. అది చాల పెద్ద గ్రామం. చుట్టూ ఖస్సులున్నారు. కాబట్టి వారు తమ పవిత్రతను కాపాడుకొనలేరనుట తథ్యం. మిలములు, ఖస్సు భాష మాట్లాడుతారు. వారి ముఖాలు మోనులవి. ఇక్కడి మలాణులు ముఖాలు ఖస్సులవి. భాష కిరాత భాష. ముఖ్యంగా యీనాడు కాంగడాలో కిరాత ముఖంగాని. కిరాత భాషీయులుగాని కనబడరు. కాని ప్రదేశాల పేర్లు వున్నాయి. వైద్యనాథ్ మందిరం చరిత్ర ప్రసిద్ధమైంది. ఆ గ్రామాన్ని యిప్పుడు వైద్యనాథ్ అంటారు. కాని 10-11 వ శతాబ్ది శిలా శాసనాలను చూస్తే దాని పూర్వం పేరు 'కిర' గ్రామం వైద్యనాథ్ టెరాయికి చాల దూరంగా లోపల లేదు.

పరుష్ణి, విపాశ్ - శతుద్రిల మధ్యనున్న భరత, త్రిత్సుల భూమికి పొరుగున వున్న కొండజాతివారు కాంగడా వారే అయివుంటారు. వారు అనాడు కిరాతులే. కిరాతులు నల్లగా వుండరు. వారిది కొంచెం పసుపురంగు ఋగ్వేద ఆర్యులు వీరిని కూడ పణులతోపాటు నల్లనివారని ఎందుకు అన్నారో మనమిప్పుడు వూహించగలం ఆర్యులు ఐరోపీయులవలె తెల్లగా వుండేవారు. వారికి యీ యిద్దరు నల్లగా కన్పడుటలో ఆశ్చర్యపడవవసరం లేదు.

పణుల ధన సంపత్తులు ఆకర్షించినట్లుగా కిరాతుల ధన సంపత్తులు ఆర్యులను ఆకర్షించినవని చెప్పలేం. ఆనాడు కొండలోకూడ మంచి పచ్చికబయళ్ళు, అడవులు

వున్నప్పటికీ అవి పంజాబులోని పచ్చికబయళ్ళతో, అడవులతో పోటీ చేయలేవు. కాని ఆర్యుల సంఖ్య, వారి గొర్రెల సంఖ్య గుర్రాల సంఖ్య నిరంతరం పెరుగుటచేత వారు వుత్తరానికి కూడ పోవలసివచ్చింది. అప్పుడు పశుపాలకులైన మోనులకు, ఆర్యులకు తగాదావచ్చింది. ఆర్యులు బలాన్ని వుపయోగించి కొండకు దిగువనున్న మోసులను తరుమగల్గారు. సప్తసింధు (యమున నుండి సింధుకు అవలనున్న భూమివరకు) ఉత్తరానవున్న టరాయిలో ఎక్కడ కూడ ధారులు మొదలైన మంగోలు జాతి కనపడలేదు. దీనికి కారణం పై విజయమని చెప్పాలి. వారు కూడ ద్రిమ్మరులే, పశుపాలకులే, యుద్ధ ప్రవృత్తి కలవారే. వారు కూడ ప్రతీకార బుద్ధితో ఆర్యుల గ్రామాలపై దండెత్తి వుండవచ్చు. అప్పుడు ఆర్యులకు ముందుకు చొచ్చుకొని పోవుట తప్పనిసరి అయింది. ఇంకేముంది, తర్వాత మోనుల కొండ పురాలలో పోరుజరిగింది. ఇదే శంబర యుద్ధం.



# ఏడవ అధ్యాయం

# ఆదిమ ఆర్యరాజులు

ఋగ్వేదకాలంలో అతి ప్రాచీన ఋషులు భరద్వాజ, వసిష్ఠ, విశ్వామిత్రులు. అది ప్రాగైతిహాస (చరిత్రకు పూర్వంవున్న) కాలం. ఆప్రాచీన ఋషులకు సమకాలికులు దివోదాసు, ఆయన పుత్రుడు సుదాసు. వీరికాలంవరకు చేరుకున్న పిమ్మట మనం ఊహా ప్రపంచంలో కొట్టుకులాడుతాం, మనం అనుకున్నట్లు — అంతకంటె ఎక్కువగా బయటవున్న భారోపీయభాషల్ని, యితర సామగ్రిని ఆధారం చేసుకొని- ఆర్యులు సప్తసింధు ప్రాంతంలో ప్రవేశించిన కాలం క్రీ.పూ. 1500 అనుకొనుట సరియైందిగ తోస్తుంది.

ఋగ్వేద ఋషులు తమకు పూర్వం వున్న ఋషులను గురించి చాలా తక్కువ చెప్పగల్గారు. అంటే వారు పైకాలానికి చాలా తర్వాతనే వున్న సంగతి నిశ్చయం- ఋగ్వేద ఋషులు తమ యిష్టదేవతలను స్తుతించుటకు మాత్రమే తమ ఋక్కులను చెప్పారు. వాటిలో అక్కడక్కడ చెదరిపడివున్న చారిత్రక అంశాలను మనం ఏరుకొని పోగుచేసుకోవాలి. ఋగ్వేదానికి సమకాలీన రాజులు దివోదాసు, త్రిసదస్యు మొదలైన వారినిచూస్తే వారి రెండుమూడు తరాల వారుమాత్రం మనకు తెలుస్తారు.

ఋగ్వేద ప్రాచీన గణాలు అయిదు — ద్రుహ్యు, అను, యదు, తుర్వశ, పురుగణాలు. వారికి ఆ పేర్లు వారి పూర్వీకులగు ఏ నాయకుని పేరు మీదనో వచ్చి వుండవచ్చు. ఉజ్బెక్కుల వలెనే ద్రిమ్మర జాతుల్లో ఎక్కువగా యిటులనే ఉంటుంది సప్తసింధు ఆర్యులు కూడ ద్రిమ్మరులే. ఇంత ఎందుకు ; ఋగ్వేదకాలంలో వారి వారనులుకూడా సగం ద్రిమ్మరులు. వారి గ్రామాలు వీడానికి అవుల గుర్రాల సౌకర్యం కొరకు తాత్కాలిక ఉపయోగార్థం వేసుకొన్న యిళ్ళ సముదాయం మాత్రమే. ఆ గ్రామాల దగ్గర్లో కొద్ది పొలంలో యవలు పండించేవారు. ఈ ఐదు ప్రధాన గణాలు, ఆ తర్వాత కాలంలో పంచ జన శబ్దం మానవునకు పర్యాయ పదమైంది. ఈ పంచగణాల్లో అందరికంటె తూర్పున ఉన్నవారు పురుగణం. ఋగ్వేదం కాలంలో వారిలో కుశిక, భరత, తృత్సు మొదలైన స్వతంత్ర శాఖలు ఏర్పడ్డాయి. వారిలో కుశికులు యమునకు దగ్గరగా సరస్వతీ ఉపత్యకలో ఉండేవారు. సరిహద్దులో శత్రువుల

భయం ఎక్కువ ఉంటుంది. గణంలో సంఖ్యాబలం పరాక్రమం కలవారే అక్కడ ఉండగల్గుతారు. తర్వాత యీ పురుగణంలో 'కురు'లు జన్మించారు వారు గంగా యమునల ఉపత్యకలో తమ ప్రభుత్వాన్ని విస్తరింప చేశారు. అయితే యిది ఋగ్వేద కాలం తర్వాత జరిగిన విషయం.

ఋగ్వేద కాలంలో మొదటి రాజులు ఎవరు అని ఆలోచిస్తే మనకు ఐదుగురు ప్రతాపం గల అజాతిక నబడుతున్నారు - మనువు, పురూరవుడు, నహుషుడు యయాతి, మాంధాత. పురూరవుని సంబంధం పురుగణముతో ఉండవచ్చు. మనువు సంతానాన్ని మానవులన్నారు. ఇది మనుష్యులకు పర్యాయపదమైంది. వేదంలో నాహుషి ప్రజ అంటే అర్థం మనుష్యులని అంటారు. దీనినిబట్టి నహుషుని గొప్పతనం తెలుస్తుంది.

# 1. మను వు

ఋగ్వేదంలో మనువు పేరు 31 చోట్ల వచ్చింది. కొన్నిచోట్ల యిది ప్రాచీన రాజు అర్థంలో రాలేదు. ఋగ్వేదానికి ముందున్న 300 సం॥ల కాలంలో 3-4 రాజులపేర్లు మనకు లభ్యమవుతున్నాయి. అంటే అప్పటికి రాజతంత్రం లేదన్న మాట. గణతంత్రం ఉంది. భరద్వాజుడు. గోతముడు, కుత్సుడువంటి ప్రాచీన ఋషులు మనువుని పేర్కొన్నారు వామదేవుడు, దివోదాసు పుత్రుడు లేక వంశీకుడైన పురుచ్ఛేపుడు, గృత్సమదుడు, సదాపృణుడు, కశ్యపుడు కూడ ఆయనను ఉల్లేఖించారు.

ఋక్కులనుబట్టి మనువు దేవతల భక్తుడనిపిస్తుంది. సదాపృణఋషి (5-45-8) విశిశ్రుని జయించినట్లు చెప్పాడు. విశిశ్రుడు ఆర్యశత్రువో, అనార్య శత్రువో మనకు తెలియదు. అనార్యుడైతే ఉత్తరాన ఉన్న కాంగ్రా కొండవాడా లేక మైదానంలోని వాడా ? అను సందేహం కల్గుతుంది. అంగిరస గోత్రుడగు కుత్సుడు, గృత్సమదుడు మనువుని పిత అని, పితరుడని అన్నారు. కుత్సుడు పితమనువు రుద్రుని పూజించెనని చెప్పాడు. గృత్సమదుడు మరుత్తుల ఔషధాలను మనువు స్వీకరించెనని చెప్పాడు. భరద్వాజుడు (6-21-16). అగ్నిదేవుడు మనువుని దాసులకు పైన ఉంచెనని చెప్పాడు. కశ్యప మారీచుడు (9-92-5) పవమానసోముడు మనువును దస్యులనుండి కాపాడెనని చెప్పాడు. పై ఋక్కులవలన మనువు దస్యులతో లేక దాసులతో సంఘర్షణ చేశాడనీ, అందువల్లనే అతనికి గొప్పతనం వచ్చిందని తెలుస్తుంది. కాబట్టి మనువు ఆర్యుల మొదటి రాజా లేక ప్రతాపంగలరాజు అనుటలో సందేహంలేదు. కాని సప్తసింధులో ఆయనరాజ్య మెక్కడనున్నదో మనకు తెలియదు.

# 2. పు రూ ర వు డు

అంగిరాగోత్రీకుడగు హిరణ్యస్తూపఋషి (1-31-4) అగ్ని మనువుకు 'ద్యో'ను పురూరవునకు 'సుకృత' (స్వర్గం)మును నిర్మించెనని చెప్పాడు. పురూరవుడు వీరుడు విలాస పురుషుడు. ఊర్వశి అను అప్సరసతో అతనికున్న ప్రేమ కలాపాన్ని ఋగ్వేద సంకలన కర్తలు మరువలేదు. ఇది వాస్తవంగా జరిగిన దనుటలో ఆశ్చర్యపడనక్కరలేదు. అట్లనుకొంటే ఊర్వశి అప్సరస కానేరదు. మానవకన్య. ఊర్వశి బలపరాక్రమం కల గణకన్య అయి ఉంటుంది ఆ గణం పురూరవుని గొప్ప తనాన్ని గుర్తించకపోవచ్చు. అప్పుడు యీ ప్రేమికు లిరువురు అగ్ని పరీక్షకు లోనయి వుండవచ్చు అతడు తన ప్రియురాలి హృదయాన్ని చూరగొనుటలో సఫలీకృతుడయినాడు. కాని శాశ్వతంగా కాదు.

ఇందునుగురించి ఋగ్వేదం 10 వ మండలంలో 95 వ సూక్తముంది. ఈ సూక్తం పురూరవ, ఊర్వశి సంవాద రూపంలో ఉంది. ఇందు ఎవరు ఏ ఋక్కులు పల్కినారో, అవి వారి రచనలే అంటున్నారు.

ఇవి రసవత్తరములైన ఋక్కులు. ఇంక చదవండి.

పురూరవుడు : ఓజాయా ! ఓ కఠినురాలా ! మనస్సు యిటువుంచి ఆగు. మన మిద్దరం మాట్లాడు కొందాం. మనం మాట్లాడు కోనట్లయితే రాబోవు కాలం మనకు సుఖప్రదం కాదు.

ఊర్వశి : ఈ మన మాటలతో ఏమిటిలే ! ప్రథమ ఉషస్సువలె నీ దగ్గరకు వచ్చాను. ఓ పురూరవా, నీవు ఇంటికి మరలిపో. ఇక నేను గాలివలె నీకు దక్కను.

పురూరవుడు : నీవు లేకుంటా అంబుల పొదినుండి బాణాన్ని తీసి విసర లేను. లక్ష్మి లభించదు. వందలాది ఆవులను జయించి తేలేను. వీరత్వంలేని నాపనులు రాణించవు.

ఊర్వశి : ఓ ఉషా ! మామకు ధనమీయదలిస్తే ఊర్వశి దగ్గరనున్న యింటిలోనుండి పడకటింటికి వెళ్ళి రాత్రింబవలు సుఖపడేది.

ఓ పురూరవా ! నీవు నన్ను ప్రతిదినం మూడుసార్లు కర్రతో కొట్టేవాడవు. నాకు ఏ సవతితోను పోరులేదు. నీవు నాయింటికి వచ్చేవాడివి. ఓ వీరుడా ! అప్పుడు నీవు నావాడివి.

పురూరవుడు [illegible] సమర్థమైన నదులు అతన్ని పెంచాయి. ఓ పురూరవా! భయంకర పోరాటంలోకి దస్యులను సంహరించటానికి దేవులు నిన్ను పెంచి పెద్దచేశారు.

పురూరవుడు : పురూరవుడు మానవుడు. అతడు అమర్త్య స్త్రీలను కోరగా వారు వేళ్ళవలె లేక రథానికి కట్టిన గుర్రాలవలె పీతల్లి పారిపోయారు.

అతడు మర్త్యుడు. అమర్త్యుల సంపర్కమును కోరి వారి వద్దకు పోతే వారు అదృశ్యమయ్యారు. వారు తమ దేహాలను చూపకుండా క్రీడిస్తున్న గుర్రాలవలె పారిపోయారు. మెరుపులాంటి కాంతిని ధరించి ఊర్వశి నా కోర్కెలను నెరవేర్చుతుండేది. ఆమె నా కొరకు సుజాతుడను మనుష్య పుత్రుని కన్నది. ఆమె అతనికి దీర్ఘాయువు నొసంగుగాక.

ఊర్వశి : ఓ పురూరవా! నీవు రక్షణకొరకు అతన్ని యిట్లు పుట్టించావు నాలో ఓజస్సు నింపావు. నాకు తెలిసి నీకు చెప్పాను. నీవు అప్పుడు నామాట వినలేదు, ఇప్పుడు అనవరంగా మాటలెందుకు ?

పురూరవుడు : పుట్టినబిడ్డ నిన్ను కోరతాడు. అతడిది ఎరింగి ఏడ్వకుండునా ? ప్రేమతో నున్న భార్యాభర్తలను ఎవరు విడదీయగలరు ? మా ఇంటిలో అగ్ని మండుతున్నంత కాలం మన ప్రేమ శాశ్వతం.

ఊర్వశి : నేను నీకు చెప్తున్నాను. అతడు నీదగ్గర ఏడ్వడు. కన్నీరు కార్చడు. నేను అతనికి మేలుచేస్తాను. నేను అతనిని నీవద్దకు పంపుతాను. నీవు యింటికి వెళ్ళు. నీవు నన్ను పొందలేవు.

పురూరవుడు : ఈ సుదేవుడు (పురూరవుడు) నేడు పడిపోతాడు. అతడు దూరంగాపోయి మళ్ళీ తిర్గి రాడు. అతడు చిక్కిన వస్తాడు. అతన్ని తోడేళ్ళు బలవంతాన తింటాయి.

ఊర్వశి : ఓ పురూరవా! నీవు చావవద్దు. పడవద్దు. అమంగళకరమైన తోడేళ్ళు నిన్ను తినవద్దు. ఆడవాళ్ళప్రేమ స్థిరంకాదు. వాళ్ళ హృదయాలు తోడేళ్ళ వంటివి. నేను నానా రూపాలతో మానవుల్లో నాల్గు శరత్తుల (సంవత్సరాల) రాత్రిళ్ళు గడిపాను. ప్రతిదినం కొద్దిగా నేయి తినేదాన్ని. దానితో తృప్తిపడి తిరుగుతూ ఉండేదాన్ని.

పురూరవుడు ; ఆకాశాలను నింపే, లోకాలను కొలిచే ఊర్వశీ. నిన్ను ప్రార్థిస్తున్నాను : నా సుకృతదానం నీకు చేరుగాక. ' ఓ ప్రియురాలా ! రా. నా హృదయం బాధ పడుతూవుంది.

ఊర్వశి : ఓ యిళాపుత్రా ! నీవు మృత్యువునకు బంధువని యీ దేవతలు అంటున్నారు. నీ ప్రజ హవిస్సుతో దేవతలను పూజిస్తారు. నీవుకూడా స్వర్గంలో సుఖంగా ఉంటావు.

పురూరవుడు దస్యుల యుద్ధంలో పాల్గొన్నట్లుగా యీ సూక్తంవల్ల తెలుస్తుంది. అతని తల్లి 'ఇళా'! అతనికి ఊర్వశివలన ఒక పుత్రుడుకల్గాడు. మహాభారతంలోను, యితర పురాణాల్లోను ఊర్వశీ పురూరవులను గురించి చాలా కథలు ఉన్నాయి. కాబట్టి నిర్ణయించుకొనుటలో జాగ్రత్త అవసరం.

3. నహుషుడు : 'అగ్ని నహుషుని ప్రజలనుండి బలిని (పన్ను) పొందునట్లు చేసెను' అని వసిష్ఠుడు చెప్పాడు (7-6-5) హిరణ్య స్తూప అంగిరసుడు 'దేవులు నహుషుని ప్రజాపతిగా చేసిరి' అని చెప్పాడు.

4. యయాతి : గయప్లాతఋషి చెప్పిన ప్రకారం (10—63—1) యయాతి నహుషుని పుత్రుడు. హిరణ్యస్తూప అంగిరసుడు 'యయాతి వద్దకు మనువు అంగిరాలు అగ్నిదేవుని వలె వచ్చేవారు' అని చెప్పాడు (10—31—37).

5. మంధాత : ఈయన కూడ దస్యుహంతకుడైన ప్రాచీన ఆర్యరాజు. (8-39-8).

ఋగ్వేదంలో ప్రాచీనతను రాజుల్లో ఈ ఐదుగురు పేర్లు లభిస్తున్నాయి. వీరు దస్యులతో యుద్ధం చేసినట్లుగ చెప్పబడింది. కాని వీరు ఏ ప్రాంతపు రాజులో ఆర్యులు సప్తసింధులో ప్రవేశించిన తర్వాత అంటే క్రీ. పూ 1500 తర్వాత ఎంత కాలానికి వీరు రాజులైనారో, వీరి తర్వాత ఎన్ని తరాలకు దివోదాసు, సుదాసు రాజులైరో యీ వివరాలు మనకు తెలియవు.

—•—

# ఎనిమిదవ అధ్యాయం

# శంబరుడు

1. దస్యులు : ఆర్యులు తమ విరోధులను దస్యులనేవారు. ఋగ్వేద కాలంలో (క్రీ. పూ. 1200) వారికి ముఖ్య శత్రువులు కొండల్లోని దస్యులు. కాని మైదానంలోని దస్యులు కాదు. కొండల్లోని దస్యులు హిమాలయ కిరాతులే. వీరిని నాశనం చేయుటకు ఆర్యులు పూనుకొన్నారు. ఈ కృష్ణయోని దాసులను యింద్రుడు నాశనం చేశాడు (2-20-7). ఇంద్రుడు కృష్ణత్వక్కులను (నల్లని చర్మం గలవారిని) నాశనంచేసెనని పరుచ్ఛేపుడు చెప్పాడు (1-130-8). పరుచ్ఛేపుడు కొండదాసుల గొప్పరాజగు శంబరుని జయించిన దివోదాసుకు పుత్రుడు. వసిష్ఠుడు వారిని 'శిశ్న దేవు'లన్నాడు (7-21-5) శిశ్నదేవులంటే లింగపూజకులు. పూజార్థం వున్న రాతి లింగాలు మైదాన దస్యుల పురాతన నగరములగు మొహింజెదారో, హరప్పాల్లో దొరికాయి. తామ్రయుగం నాటి రాతి అవశేషాలను యింకా కనుగొనలేదు. బహుశా వారిలోకూడ లింగపూజ వుండేదేమో ! వారు నాగుపామును దేవునిగ కొలిచారు. ఇందును గురించిన నామావశేషములు ఇప్పుడు కూడ హిమాలయాల్లో వున్నాయి. శంబర హంతకుడగు దివోదాసుని పురోహితుడు భరద్వాజుడు. పురోహితుడంటే దేవతలను స్తుతించువాడు, యజ్ఞ సంపాదకుడు. రాజుకు ప్రధాన మంత్రి కూడ. దివోదాసు, అతని పుత్రుడు సుదాసు గొప్ప సేనా నాయకులు. సమర్థులైన పురోహితుడు వారికి బలం. బభ్రు వైఖానసుడు కూడ పార్వతేయ శత్రువులను శిశ్నదేవు లన్నాడు (10-99-3). ఆర్యులకు తమకు ఉత్తరాన వున్న శత్రువుల ఇంద్రజాలం, మాయలంటే భయం. వసిష్ఠుడు కూడ శతయాతు అనగా నూరు మాయ లెరిగినవాడు. (7-18-21). అసురులు (దస్యులు) కూడ మాయావులే. "మాయావి అగు దానవుని యింద్రుడు మాయచేత పడగొట్టాడు" అని గృత్సమదుడు చెప్పాడు (2-11-10-19). మాయ అంటే వారి ఎత్తుగడలు, గంభీరములు, వారి దెబ్బలు ఆర్యుల కంఠములపై పడుతుం డేవి. వాళ్ళు కేవలం ముక్కులకు సూటిగ యుద్ధం చేసేవారు కాదు. వారు తమ తర్వాత కొన్ని వేల సంవత్సరాలకు పుట్టిన కౌటిల్యునికే గురువులు.

శత్రువుల్లో అన్నీ దుర్గుణాలు, మనలో అన్నీ సద్గుణాలు చూచుట నేడుకూడ పరిపాటి. ఆర్యులకు శంబరుని మనుష్యులు దుర్మార్గులుగా కన్పస్తారు. ప్రజాపతి

పుత్ర విమదుడు వారిని అకర్మలనీ, అమంతులనీ, అన్యధర్మరతులనీ, అమానుష లనీ అన్నాడు. (10-22-8) ఇక్కడ అమానుషులంటే మనువు సంతతి కానివారు అని అర్థం. 'దస్యులు మా చుట్టూ వున్నారు అమిత్ర హంతకుడైన ఓ యింద్రా! నీవు యీ దాసులను చంపు'మని విమనుడు వేడుకొన్నాడు. కాని నిజంగా దస్యులు వలువైపులా వున్నారా ? దక్షిణాన మైదాన ప్రాంతంలో వారులేరు. వారు ఎక్కువగా హిమాలయ పాదప ప్రదేశంలోని టెరాయి అడవుల్లో వున్నారు. ఆర్యుల రాకకు ముందే వారక్కడ వున్నారు. గంగా టెరాయివలె పంజాబు టెరాయి అంత అనారోగ్యంగా వుండేదికాదు. పూర్వీకుల నుండి వున్న భూమిని వారు వదులు కొనుటకు యిష్టపడలేదు. తప్పేముంది? ఆర్య పశుపాలకులు వారి భూభాగంలో ప్రవేశిస్తే వారు ఊరుకొంటారా ?

"యత్కరోషి యదశ్నాసి యజ్జుహోషి దదాసియత్। యత్ తపస్యసి కౌంతేయ తత్కురుష్వ మదర్పణమ్॥" ఇందు అంతా కృష్ణార్పణమని చెప్పబడింది. ఇది గీతా వాక్యం. ఋగ్వేద ఋషులు దీన్ని తూ. చా తప్పకుండ ఆచరించారు. వారు తమ విజయాలనన్నిటినీ యింద్రునికి కట్టబెట్టారు. కాని వాస్తవానికి ఆర్యుల విజయాలకు కారణం బధ్ర్యశ్వ, కుత్స దివోదాసు, సుదాసులు లేక వారి ప్రధాన మంత్రులగు భరద్వాజ, వసిష్ఠ, విశ్వామిత్రులు. ఋగ్వేద ఋషులు 'వియతి' (వి ఛాతకి) తమ విజయాన్ని అంటగట్టలేదు. అన్నిటికీ యింద్రుడే కారణం అన్నారు, ఇంద్రుడు దాసవర్ణమును నీచంగాను, నామరహితంగాను చేశాడు,' గృత్సమదుడు (2-12-4) ఓ యింద్రా, ధనవంతుడైన దస్యుని చంపుము.' - హిరణ్యస్తూపుడు (1-33-4) ఓ యింద్రా, దాన ప్రజలను తిరస్కరించుము.' - గృత్సమదుడు (2-1-4 ).

అయితే ఋషులు సాధానా పద్ధతిలో ఆర్యుల పౌరుషాన్ని అంగీకరించక పోలేదు. కణ్వపుత్ర మోరుడు. "అగ్నితోపాటు యదు, తుర్వసులు పిలువబడ్డారు. అగ్ని యీ ఉద్దేశ్యంతో నవవాస్త్వ బృహద్రధుని, తుర్వీతుని తీసుకొచ్చాడు." అని చెప్పాడు (1-36-18) ఆర్యపంచజనుల్లో యదు, తుర్వశులు ముఖ్యులు. శక్తివంతులు నాయకత్వం కొరకు వీరికీ, భరతులకూ మధ్య కొంతకాలం పోరాటం జరిగింది దివోదాసు వీరిని లోబరచుకొనగల్గాడు. శంబరునికి వ్యతిరేకంగా అందరినీ కూడ గట్టవలసివుంది. నవవాస్త్వ (క్రొత్తగా నివాస మేర్పరచు కొన్న) బృహద్రధుడు. తుర్వీతి యదు తుర్వశ గణాలకు అప్పటిలో నాయకులై వుంటారు. దాసులతో

సంఘర్షణ చేయు దేశంలోకి పడమర నుండి వారు ప్రవేశించారు. 'ఇంద్రుడు 50,000 కృష్ణులను (నల్లవారిని) పరిమార్చాడు. వారి దుర్గాలను ధ్వంసం చేశాడు' అని వామదేవుడు చెప్పాడు. (4-16-13). ఈ 50 వేల కృష్ణులు ఎప్పుడు చంపబడ్డారు ? దివోదాసు దస్యులతో భయంకర సంగ్రామం చేసినప్పుడు అయి వుంటుంది ఇంద్రుడు దస్యులను చంపి వారి అయసీ పురాలను ధ్వంసం చేశాడు, అని గృత్సమదుడు అన్నాడు (2-20-6). ఇక్కడ పదం అయస్ అంటే యినుము, రాగి యని అనుకోరాదు. ఎందుకంటే అనేకచోట్ల యీ పురాలను అశ్మన్మయీ అన్నారు కాబట్టి యిక్కడ అయస్ అంటే రాయి అను అర్థం. ఆ పాషాణమయ పురాలను ధ్వంసం చేసినవాడు దివోదాసు.

దస్యుల్లో పురుషులతోపాటు స్త్రీలుకూడ యుద్ధంచేశారు. ఆర్యులు తమ స్త్రీలకు ఆయుధాలు యిచ్చేవారుకాదు. సప్తసింధులో 15 తరాలు వున్న తర్వాత ఆర్యులు పరాజిత సింధుజాతి నాగరిక ఆచారాలను ఎన్నో అవలంబించి వుంటారు. స్త్రీలను పురుషుల పంక్తిలోకి తీసుకురాకూడదు అనేది అందులో ఒకటి. 'దాసుడు స్త్రీలను ఆయుధంగా చేసుకొన్నాడు' అని బభ్రుఋషి చెప్పాడు (5-30-9). అంతట యింద్రుడు- 'అతని అబలా సైన్యం నన్నేమి చేస్తుంది' అని అన్నాడు. బహుశా స్త్రీకి 'అబలా' అను పదం ప్రప్రథమంగా యిక్కడనే వాడబడింది. దీన్నిబట్టి ఆర్యుల అభిప్రాయం ప్రకారం స్త్రీలలో యోధులగుటకు యోగ్యత లేదని అనుకోవలసి వుంటుంది.

## ఋగ్వేద ఆర్యులు

ఋగ్వేదంలో మనకు తెలిసిన అందరికంటె ప్రాచీన ఆర్య రాజు మనువు. అతడు ఋషి. వివేకకూడ. ఋగ్వేదంలో శంబర యుద్ధానికి పూర్వమున్న ఋక్కులు సంగ్రహింపబడలేదు. అయినప్పటికీ వసిష్ఠపుత్ర శక్తి కొడుకు గౌరవీతి, 'ఇంద్రుడు మను ఋషికొరకు నముచిని చంపాడు' అని చెప్పుటవలన మనువు ఋషి అని తెలియుచున్నది (10-73-7). నముచి శంబరుని పూర్వీకుడైన కొండరాజు అయివుండవచ్చును. తర్వాత పరంపరను బట్టి యీ నముచి శంబరుని సంబంధీకుడని తెలుస్తుంది. శంబరుని ప్రత్యర్థి అగు దివోదాసుకు ప్రధాన మంత్రి భరద్వాజుడు. అతడుకూడ 'ఇంద్రుడు నముచిదాసుని తల బద్దలు చేశాడు' అని చెప్పాడు. (6-20-6) మరొక చోట 'ఇంద్రుడు నముచి తలను నరికాడు' అని చెప్పాడు. (5-30-7,8) ఈ యుద్ధం మనువు కాలంలో జరిగింది. "ఇంద్రుడు దభీతి కొరకు ముప్పదివేల దాసులను

విద్రింపచేశాడు" అని వామదేవుడు చెప్పాడు (4-30-21). ఆర్యరాజా దభీతికి పోటీ అయిన దస్యుదెవ్వరు ? అతని కాలూకు 30 000 మంది చనిపోయారంటే అతడు ఎంత బలవంతుడై వుంటాడు ? దభీతి దివోదాసుకు పూర్వమున్న ఆర్య నాయకుడై వుంటాడు.

ఆర్యులను ఎదిరించిన దస్యు నాయకుల పేర్లు ఋగ్వేదంలో యిట్లు చెప్పబడ్డాయి—

భరద్వాజుడు (6-18-8) చుముఠి, ధుని, పిప్రు, శంబర, శుష్ణ
వసిష్ఠుడు (7-99-4) వృషాశిప్రుడు.
కుత్స అంగిరసుడు (1-103-8) శుష్ణ, పిప్రు, కుయవ, వృత్ర, శంబర.
గృత్సమదుడు (2-14-5) శుష్ణ, అశుష, వ్యంస, రుధిక్ర.

వశ అశ్వపుత్రుడు (8-46-32) బల్బూథుడు. వశ అశ్వపుత్రుడు తనకు బల్బూథుడు నూరుమంది దాసులను యిచ్చినట్లుగ చెప్పుకొన్నాడు.

ప్రాచీన దాసమహావీరుల్లో నముచి, ఋగ్వేదకాలంలో శంబరుడు మహా పరాక్రమం గలవాడు. శంబరుని సహాయకుల్లో ఎందరో వీరసేనానులు వున్నారు. పర్వత శత్రువుల్లో శంబరుడొక్కడే మహా సైన్యాధిపతి కాదు. ఆర్యులు పేర్కొన్న వారిలో శంబరుని తర్వాత గొప్పశత్రువు శుష్ణు.

## 2. శంబర సేనాపతులు

1. శుష్ణు : దివోదాసుకు పోటీ శంబరుడు. కుత్స ఆర్జునేయ బోళజునకు పోటీ శుష్ణు. కాబట్టి దివోదాసుకు కుత్స ఆర్జునేయుడు, శంబరునకు శుష్ణు సేనానులై వుంటారు. ఋగ్వేదంలో ముగ్గురు కుత్సులున్నారు. కుత్స అంగిరసుడు ఋషి. ఇతడు కుత్స ఆర్జునేయునికి సమకాలికుడై వుంటాడు. పురుగణాల్లో కుత్సుడు పురుకుత్సుడు. ఇతడు శంబర యుద్ధానికి ముందువాడు. దివోదాసుకు సమకాలికుడైన త్రసదస్యుడు (దస్యులను బాధించువాడు) కుత్స ఆర్జునేయుని పుత్రుడే. అర్జున పుత్రుడు కుత్సుడు పరాక్రమంలో దివోదాసుకు తీసిపోడు. అతడు శుష్ణుని చంపాడు. 'ఇంద్రుడు శుష్ణుని సంతానములను కూడ నాశనం చేశాడు' అని నాభాకుడు చెప్పాడు (8-40-10,11) కణ్వపుత్ర మేధాతిథి (8-1-28) హిరణ్యస్తూపుడు (1-32-12). వామదేవుడు (4-3-3) యిదే విషయాన్ని చెప్పారు. విశ్వామిత్ర పౌత్రుడు, మధు

చ్ఛంద పుత్రుడు జేత (1-11-7) సవ్య అంగిరసుడు (1-56-3) ఇంద్రుడు తన మాయచేత మాయావి అయిన శుష్ణుని వధించెనని, అతని పురాలను ధ్వంసం చేసెనని వ్రాసారు. శాశ్వతమైన పురాలను మినహాయిస్తే మిగిలినవన్నీ యుద్ధంకొరకు నిర్మించబడిన పురములే. శుష్ణు, మాయావి, అతని అయసీ పురాలు.

పై మంత్రాల్లో యింద్రుడు శుష్ణుని చంపినట్లుంది. కాని వసిష్ఠుడు 'ఓ యింద్రా! నీవు కుత్సుని రక్షించావు. నీవు అర్జునేయునికై శుష్ణు, కుయవులను సంహరించావు' (7-19-2) అనుటచేత కుత్స అర్జునేయునికి ప్రతిద్వంది శుష్ణువే కాదు, కుయవుడుకూడ అని తెలుస్తుంది వసిష్ఠుడుకూడ కుత్స. శుష్ణ యుద్ధాన్ని గురించి చెప్పాడు. 'ఇంద్రుడు సారధికుత్సుని కొరకు శుష్ణునివంటి మహా శత్రువుని చంపాడు', (7-20-5). భరద్వాజుడు కుత్సుని సారథి అన్నాడు. ఇక్కడ సారథి అంటే మహారథి అను అర్థము. భరద్వాజుడు కుత్సుని దాతగా వర్ణించాడు (6-26-3). శుష్ణు, కుత్సులకు యుద్ధం జరిగినప్పుడు కుత్సుడు యువకుడని నోధా గోతముని ఋక్కువలన తెలుస్తుంది (1-63-3). సవ్యుని ప్రకారం యింద్రుడు యుద్ధమందు కుత్సుని శుష్ణునుండి రక్షించాడు (1-51-6). దీనినిబట్టి శుష్ణ యువకుడగు కుత్సుని అనేక బాధలు పెట్టినట్లు అనుకొనవలెను. 'ఇంద్రుడు కుత్సుని వాయువు గుర్రాలపై వుంచి శుష్ణుని చంపాడు' అనుటవలన (1-175-4). కుత్స అర్జునేయుడు గుర్రంపై నెక్కి పారిపోగా, యింద్రుడు వచ్చి తన వజ్రంతో శుష్ణుని తల నరికెనని అన్వయించు కోవలెను.

శుష్ణ సహచరుడగు కుయవునితో కుత్సుడు పోరాడినట్లు వామదేవుడు చెప్పాడు (4-16-12). 'ఇంద్రా, నీవు కుత్సునికొరకు అసురుడైన శుష్ణుని చంపావు. నీవు కుయవుని, వేలాది దస్యులను వెంటనే చంపావు.' సవ్య అంగిరసుడు శుష్ణుని, అశుషుని చంపినట్లు చెప్పాడు (1-51-6). కుత్స అంగిరస ఋషి కుయవునితోపాటు అతని యిద్దరు భార్యలను చంపినట్లు చెప్పాడు (1-104-3) కుయవుడు పాలతో స్నానం చేశాడు. పాలతో స్నానం చేయుట ఆ దినాల్లో తంత్రములందు ఆచరణలో వుండవచ్చును. కుయవుని యిద్దరు భార్యలు భర్తతోపాటు ఆయుధాలు పట్టుకొని యుద్ధము చేసి వుండవచ్చు. వారు యుద్ధం చేయకపోయి నప్పటికీ ఆర్యులు ఆనాడు యింత ఔదార్యం చూపేవారు కాదు. గృత్సమదుడు సారధి కుత్సునికై శుష్ణు, అశుష, కుయవులను: దివోదాసుకై శంబరుని 99 పురాలను యింద్రుడు నాశనం చేసినట్లు చెప్పాడు ("-19-4), గౌరవీతి (5-29-9), భర

ద్వాజుడు సారథి కుత్సుని పేర్కొన్నారు. సారథి అను విశేషణం ప్రత్యేకంగా కుత్స ఆర్జునేయునికే చెప్పుటలో విశేషముంది.

2. పిప్రు : ఇతడు దస్యులసేనాని. ఇతన్ని గురించి అనేకచోట్ల ఋగ్వేదంలో వామదేవుడు, బభ్రు వైఖానసుడు, గౌరవీతి, సవ్య అంగిరసుడు పేర్కొన్నారు. 'ఇంద్రా, నీవు విదథీపుత్ర ఋజిశ్వునికై మృగయుడగు పిప్రుని చంపావు. 50 వేల కృష్ణులను నాశనం చేశావు. వారి పురాలను ధ్వంసం చేశావు' అని వామదేవుడు అన్నాడు (4-16-13). 'ఋజిశ్వౌశిజుడు పిప్రుని (వ్రజాన్ని) చెండాడెను. అని, బభ్రువైఖానసుడు చెప్పాడు. దీన్నిబట్టి మనకు యీ విషయాలు తెలుస్తున్నాయి- ఋజిశ్వుడు ఉశిజ వంశజుడు. పిప్రువు తన వ్రజం (ఆలమందలు)తో వుంటున్నాడు. అప్పుడు ఋజిశ్వుడు ఆ ఆవులను దోపిడీచేయుటకు దండెత్తాడు. అతని దండయాత్ర సఫలమైంది. వసిష్ఠపౌత్ర గౌరవీతి యీ దండయాత్ర సఫలమగుటకు తన గొప్పతనమేనని చెప్పుకొన్నాడు (5-29-11). 'ఇంద్రా, గౌరవీతి స్తుతులు నీ వృద్ధిని పెంపుచేశాయి. నీవు వైదథికొరకు పిప్రుని చంపావు." పిప్రుతో చేసిన యుద్ధంలో ఋజిశ్వుడు అపాయానికి గురి అయ్యాడో లేక ఇంద్రునికి గౌరవం కట్టబెట్టుటకు యిట్లు వ్రాశాడో తెలియదు. 'ఇంద్రుడు పిప్రుని పురాలను ధ్వంసం చేశాడు. దస్యుహత్య, (దానయుద్ధం)లో ఋజిశ్వుని రక్షించాడు' అని సవ్య అంగిరసుడు చెప్పాడు (1-51-5),

40 సంవత్సరాలకు పైగా శంబరునితోను, అతని సహచరులతోను ఆర్యులు యుద్ధం చేశారు. దీన్ని ఋగ్వేదంలో 'దస్యుహత్య' అన్నారు— హత్య అంటే ఆనాడు వ్యక్తిని చంపుటకే కాదు, యుద్ధమని కూడ అర్థముంది. అట్లే అసుర శబ్దం దానునకు వాడబడింది.

3. వంగృద 4 కరంజ 5 పర్ణయ : ఋజిశ్వునితో యుద్ధం చేసిన వారిలో వంగృదుడుకూడ వున్నాడు. ఋజిశ్వుడు పిప్రుని నూర్గురి వీరులను ఓడించినట్లు సవ్యుడు చెప్పాడు (1-53-8). కుత్స అంగిరసుడు 'ఋజిశ్వుడు కృష్ణగర్భులు (దస్యులు) చాలమందిని చంపెనని చెప్పాడు (1-101-1). పిప్రు సామాన్యుడు కాదు. అతనికి బలమైన సాధనము లున్నాయి. 'పిప్రుడు మాయావి, ఇంద్రుని సాయముతో ఋజిశ్వుడు అతన్ని ఓడించగల్గాడు' అని అంగ ఔరసుడు చెప్పాడు. (10-138-3).

వర్చి : ఉదవ్రజంలో శంబరునితోపాటు వర్చికూడ చంపబడ్డాడు, అని

గర్గుని మంత్రంవలన తెలుస్తుంది. (8-42-21). వశిష్ఠుడు ఉదవ్రజాన్ని, శంబరుని కలిపి చెప్పలేదు. ఆయన (7-99-5) ఋక్కు యిట్లు తెల్పుతుంది- వర్చి వాలమంది అసురలను వెంటబెట్టుకొని దివోదాసుని ఎదిరించాడు. నూరువేల వీరులతో వర్చి హతులయ్యారు. అంటే ఒక లక్షమంది ఒకేచోటకూడి యుద్ధంచేసి చంపబడ్డారు. ఇట్లు జరుగుట సాధ్యమా అను ప్రశ్న వుదయిస్తుంది. దీని తాత్పర్యం దాసులు అసంఖ్యాకులుగా యుద్ధంలో చంపబడ్డారు. దాసుల సంఖ్య యింతగా ఉన్నప్పుడు ఆర్యుల సంఖ్య మాత్రం తక్కువగా వుంటుందా ఏమిటి? కాబట్టి ఉదవ్రజ మనేది కొంత ప్రాంతంలోనే బాగా సమ భూమి అయి వుంటుంది. అది కాంగ్రా కొండల్లోకి ప్రవేశించే ప్రదేశం కావచ్చు. ఘమేరి (నూర్పురము) వంటి ప్రదేశం అయివుండాలి. నూరు వేల మంది హతులైన విషయాన్ని గృత్సమదుడు కూడ చెప్పాడు. (2-14-6). "దానస్య వర్చినః సహస్రాణి శతావధీః", (అనగా దాసుడైన వర్చి యొక్క నూరు వేల మంది చంపబడ్డారు) అని వామదేవుడు చెప్పుట వలన (4-30-15) వర్చి శంబరునికి సామాన్యమైన సహాయకుడు కాదనీ, అతనికి ప్రత్యేకించి ప్రభుత్వమున్నదనీ మనకు తెలుస్తుంది. గృతమదుడు (2-12-14) వర్చి యొక్క లక్షమంది ప్రజలు చంప బడ్డారనీ, శంబరుని నూరు పురాలు ధ్వంసం చేయబడ్డాయి అనీ చెప్పాడు. ఈ పైన పేర్కొన్న అసుర సేనా పతులే కాకుండా మరి కొంతమంది వుండి వుంటారు. ఇంద్ర మహిమను కీర్తించే టందుకు వారి పేర్లన్నిటిని ఇక్కడ చెప్ప నవసరం లేదు. (7-28-20). మాన్య మానదేవకుని శంబరునితోబాటు యింద్రుడు చంపాడు అని వసిష్ఠుడు చెప్పుటవలన దేవకుడు కూడా శంబరునివలె అనార్య రాజా అను సందేహం కల్గుతుంది. కాని దేవకుడు అతని తండ్రి పేరు మాన్యమనుడు అనుట వలన అతడు ఆర్యజనుడుగా తోస్తున్నాడు. దేవకుడు తన వారికి వ్యతిరేకంగా అసురుల పక్షాన పోరాడి ఉండవచ్చు. ఇటువంటి ఉదాహరణం మనకు ఋగ్వేదంలో యింకా ఎక్కడా కానరాదు.

నప్తసింధులోని ఆర్యులు శంబరునితో బాగా పోరు సల్పేకాలమది. శంబరుడు బాగా ప్రతీకారం చేస్తున్నాడు. ఆర్యులు కృష్ణగర్భులను నాశనం చేయతలపెట్టారు. శంబరుడు కూడ శ్వేతగర్భులను కనీసం తన సరిహద్దులోనైనా బ్రతకనీయ తలచ లేదు. శంబరుని ప్రజలు గొప్పవీరులు, యుద్ధం చేసేవారని ఋగ్వేదం చెప్పు తుంది ఈనాటి గూర్ఖాలు కూడా గొప్పవీరులుగదా. వీరిలో చాలమంది కిరాతుల సంతానమే. పిప్రు ప్రజమనుట వలన దస్యులకు వేలాది గోవులున్నట్లు తెలుస్తుంది.

ఆర్యులకు జీవనాధారం గోవులు, గుర్రాలు, మేకలు, గొర్రెలు. దస్యులకు బహుశా అశ్వములు లేకపోవచ్చు. కొండలపై టాంగాలు యింకా తిరుగుటలేదు. ఆర్యుల సైంధవ గుర్రాలు కొండలపై యుద్ధాన్ని చేయటానికి పనికిరావు. కుత్స అర్జునేయుడు సారథిగా చెప్పబడ్డాడు. పర్వత యుద్ధాల్లో రథాలు పనిచేయవు కాబట్టి యిక్కడ సారథి అంటే సేనాపతివంటి గొప్ప బిరుదు అయివుంటుంది.

## 3. శంబరుడు

ఋగ్వేద ఆర్యులకాలంలో రెండు భీషణమైన యుద్ధాలు జరిగాయి. (1) దస్యు హత్య అనగా శంబరయుద్ధం. (2) తమలోతాము చేసుకొన్నది అనగా దాశరాజ్ఞ యుద్ధం. మొదటిది దివోదాసుకు శంబరునకు మధ్య జరిగింది. రెండవది సుదాసు పదిమంది రాజులతో చేసినయుద్ధం. ఋగ్వేదంలో శంబరుని యుద్ధాన్ని గురించి ఎక్కువగా చెప్పబడింది. రెండవయుద్ధాన్ని గురించి తక్కువగా చెప్పబడింది. కారణ మేమిటంటే రెండవ యుద్ధంలో పాల్గొన్న యిరు పక్షంవారు ఇంద్రుని భక్తులే. ఇంద్రుని మహిమ పెరగాలంటే దాన్ని గురించి ఎక్కువగా వ్రాస్తే ఉపయోగం లేదు. దస్యు హతం 40 సంవత్సరాలు జరిగింది. ఇది యింద్ర పూజకులకు, లింగ పూజకులకు మధ్య జరిగిన యుద్ధం. చివరకు యింద్ర పూజకులు గెల్చారు దస్యులు పూర్తిగా ఓడిపోయారు. కాబట్టి ఋగ్వేదంలో యింద్రునికి సంబంధించిన ఋక్కుల్లో శంబరుని హత్యా వృత్తాంతం ఉంది. భరద్వాజుడు, వసిష్ఠుడు, వామదేవుడు శంబర యుద్ధాన్ని గురించి ఋక్కులు చెప్పారు. శంబరుడు కులితర పుత్రుడు. అతడు మహా పర్వతంలో ఉండేవాడు. బృహత్పర్వతమంటే హిమాలయమే కదా! భరతుల భూమి పరుష్ణి, శుతుద్రి, విపాశల మధ్య ఉంది. దానికి దగ్గరగా ఉన్న పెద్ద కొండ కాంగడా హిమాలయం. 19 వ శతాబ్దం ప్రారంభం వరకు అజేయమై నిల్చిన కాంగడా కోట అక్కడ ఉంది. కాబట్టి శంబరుని పురాలు అక్కడే వున్నాయి. ఈ శతాబ్దంలో వచ్చిన భూకంపం వల్ల ఆ ప్రాచీన అవశేషాలన్నీ ధ్వంసమైనాయి. "ఇంద్రుడు శంబరుని 99 పురాలను ధ్వంసం చేసి 100 వ పురాన్ని దివోదాసుకు యిచ్చాడు", అని వామదేవుడు చెప్పారు (4- 6-8) వసిష్ఠుడుకూడా పై విషయాన్నే చెప్పాడు దివోదాసుకు మరొక పేరు అతిథిగ్వ. అనగా అతిథులకు బాగా సేవ చేసేవాడు. కొందరు ఋషులు 90 పురాలు

అన్నారు. కొందరు 99 పురాలనీ, మరికొందరు నూరు అనీ అన్నారు. వసిష్ఠుడూ భరద్వాజుడు చెప్పిన ఋక్కులను చూస్తే దివోదాసు 99 పురాలను నాశనం చేసి ఒక పురాన్ని మాత్రం తనకొరకు అట్టిపెట్టుకొన్నట్లుగా ఉంది "శంబరుడు, వర్చి యిద్దరూ ఉదవ్రజంలో చంపబడ్డారు" అని భరద్వాజ పుత్రుడగు గర్గఋషి చెప్పాడు (6-47-21). ఈ ప్రదేశం కాంగ్రా జిల్లాలో ఎక్కడ (ఇతర దానులవలె శంబరునికి కూడా గోష్ఠములు - గోసమూహములు) ఉండవచ్చు? ఒక నీటి ఒడ్డున యీ వ్రజముండవచ్చు. అందుచే దాన్ని ఉదవ్రజమన్నారు. ఇది కాంగ్రా జిల్లాలో ఉంటుంది. అయితే మూడు వేల సంవత్సరాల తర్వాత అదే పేరుతో ఉంటుందని ఆశించకూడదు.

శంబరునితోను, అతని జాతీయులతోను జరిగిన భీషణ యుద్ధాన్ని గురించి దివోదాసు ప్రకరణంలో కూడా వివరించబడింది.

## 4. కిరాతులు

కాంగ్రాలో జరిగిన యీ యుద్ధాన్ని గురించి పేరు మార్పుతో కథలు ఉన్నాయి. కాంగ్రా ప్రదేశాన్ని జలంధర్ అంటారు. హిమాలయంలో 5 భాగాలు ఉన్నాయి. నేపాలు, కూర్మాచలం (కుమాయు), కేదార్ (గర్వార్), జలంధర్ (కాశ్మీరులోని జలంధర్) కాశ్మీరు సరిహద్దునుండి తూర్పున సట్లజ్‌వరకు వున్న ప్రదేశం జలంధరుగను, పడమర వున్నది దుర్గర (డోగ్రా)గను విభజించబడ్డాయి. రెంటికి సరిహద్దు రావీనది. నేడు జలంధరు అంటే మైదాన ప్రదేశంలో ఉన్న జలంధరు నగరం అనుకొంటారు కాని ప్రాచీనకాలంలో పర్వత ప్రాంతానికి పేరు ఉండేది. జలంధరుడనే రాక్షసుని, దేవి చంపినట్లు పురాణాలు చెపుతున్నాయి. నగర కోటలో వున్న ప్రసిద్ధమైన భవానియే అదేవి. చచ్చిన తర్వాత జలంధరుని శరీరం ఏ భూభాగంపైన పడిందో ఆ భాగానికి జలంధరు అని వచ్చింది. జలంధరుని చెవిపడినచోట కాంగ్రా అయింది. (కనగడ, కాన్‌గడ, కాంగ్రాగా మారింది) జలంధరుడు అంటే శబ్దార్థం జలాన్ని ధరించేవాడు. ఈ భాగం నుండి సట్లజ్, బియాసు నదులు ప్రవహిస్తున్నాయి. కాబట్టి యీ పేరు ఉచితంగానే ఉంది.

వైదిక కాలంలో వృత్రుడంటే నీటిని అడ్డగించు వాడను అర్థం. ఇంద్రుడు తన వజ్రంతో అతన్ని చంపి నీటిని విడుదల చేశాడు. శంబరునికూడ వృత్రుడన్నారు నమకాలికులైన ఋషులు అతన్ని అసుర శత్రువు, మాయావి, యింద్రజాలికుడు అన్నారు. కాని అతడు మానవుడే. కాలం గడచినకొలది శంబరుని రూపం

మారిపోయింది. అతన్ని రాక్షసునిగ చిత్రించారు. పూర్వకాలంలో శంబర యుద్ధాన్ని ఇంద్ర వృత్ర యుద్ధంగా చెప్పారు. పౌరాణిక కాలంలో ఇంద్రుని, శంబరుని, దివోదాసుని మరచిపోయారు. ఈ యుద్ధం దేవకి, జలంధరునకు మధ్య జరిగినట్లు వర్ణించారు.

మనకు ఋగ్వేదం ద్వారా శంబర, దివోదాసుల యుద్ధం సంగతి తెలిసింది. శంబర జాతిని గురించి తెలియలేదు. అతని జాతీయులు 40 సంవత్సరాలు యుద్ధం చేసి లక్షలాది సంఖ్యలో చనిపోయారు. మిగిలినవారు ఇంకా దూరంగా కొండల్లోకి వెళ్ళిపోయారు. బియాసు, రావి ఎగువ ప్రాంతాల్లోవున్న చంబా, కులూ ప్రదేశాల్లో వారు చిరకాలంవరకు క్షేమంగావున్నారు. కిరాతులను అక్కడనుంచి వెళ్ళగొట్టిన వారు మధ్య ఆసియాలోని ఖస్సులు. వారు కిరాతభూమి నేపాలులోకూడ ప్రవేశించారు. అప్పుడుకూడ భయంకరమైన యుద్ధాలు జరిగి వుండవచ్చు. కిరాతులు మైదాన ప్రదేశాలను విడచిపోతూవుంటే ఖస్సులు వాటిని ఆక్రమించుకొన్నారు. లొంగిపోయిన కిరాతులు కాలాంతరమున ఖస్సుల్లో కలిసిపోయారు శంబర వంశీకులు ఈ విధంగా పరిణామాన్ని చెందారు.

# తొమ్మిదవ అధ్యాయం

# దివోదాసు

## 1. ప్రాచీన ఆర్య నాయకులు

**1. దధ్యఙ (దధీచుడు) :**

దధ్యఙ్ హమే జనుషం పూర్వో అంగిరాః ప్రియమేధః కణ్వో !
అత్రిర్మను ర్విదుస్తే మే పూర్వే, మనుర్విదుః ॥

(1-139-9) పరుచ్ఛేప దివోదాసు పుత్ర (దధీచి, అంగిరా, ప్రియమేధ, కణ్వ, అత్రి, మనువు- యీ పూర్వీకులు నా పుట్టుకను ఎరుగుదురు. వీరు నా పూర్వీకులు, మనువు ఎరుగును.) దివోదాసుకు ముందు మనువు మొదలగు రాజులను గురించి మేము తెల్పియున్నాం. దివోదాసు పుత్రుడు లేక సంతతివాడగు పరుచ్ఛేపుడు, దధీచి, అంగిరా, ప్రియమేధ, కణ్వ. అత్రి, మనువులను పూర్వీకులని చెప్పినాడు. వీరిలో అత్రి, కణ్వుడు రాజులుగ తోచరు.

**2. రుమ 3. రుశమ 4. శ్యావక 5. కృప**

మరికొందరి రాజుల పేర్లు ఋగ్వేదంలో వచ్చాయి. కాని వారు దివోదాసుకు పూర్వం వారో, లేక తర్వాత వారో మనకు తెలియదు.

యద్రుమే రుశమే శ్యావకే కృపే
ఇంద్రమా దయ సేచవా !
కణ్వాసస్త్వా బ్రహ్మభిః స్తోమ వాహస
ఇంద్రాయచ్ఛన్ త్యాగహి ॥

(8-4-2) దేవాతిథి కణ్వపుత్ర.

అనగా ఓ యింద్రా ! నీవు రుమ, రుశమ, శ్యావక, కృపులతో వున్నప్పుడు స్తోత్రకర్తలగు కణ్వులు మంత్రాలద్వారా నిన్ను కీర్తిస్తున్నారు. రమ్ము.

కణ్వపుత్ర దేవాతిథి (8-4-2) మేధాతిథి (8-3-12) రుమ, రుశమ, శ్యావక కృపులను పేర్కొన్నారు. వీరవరుడు కూడ ఒకానొక ప్రాచీన వంశస్థాపకుడై

వుంటాడు. అతని కులంలోనే దివోదాసు తండ్రి బధ్ర్యశ్వుడు పుట్టాడు. సుదాసు కూడ దివోదాసు పుత్రుడు కాబట్టి ఆ వంశీకుడే. పిజవనుని గురించి యింతకంటె ఎక్కువగా మనకు తెలియదు.

6. బధ్ర్యశ్వ : బధ్ర్యశ్వునితో మన చరిత్రకు గట్టి ఆధారం దొరుకుతుంది. భరద్వాజుడు, సుమిత్రుడు బధ్ర్యశ్వుని పేర్కొన్నారు. సుమిత్రుడు తనను బధ్ర్యశ్వుని సంతానమని చెప్పుకొన్నాడు. బధ్ర్యశ్వునిచే స్థాపించబడిన అగ్నిదర్శనీయమని అతడు చెప్పాడు. (10-69-1, 2-11-12) అగ్ని సంస్తుంఖ ఆర్యులకు ప్రత్యక్ష దైవం. ప్రతి యింటిలోను అగ్నిని స్థాపించి పూజించేవారు ఆర్యులు అగ్ని భక్తులు. సుమిత్రుడు, బధ్ర్యశ్వుని అగ్నిని వృత్రహన్తమన్నాడు. ఆ అగ్ని వృత్రహా అనగా శత్రునాశకుడు, బధ్ర్యశ్వుడు తండ్రి పుత్రుని పోషించునట్లు ఆ అగ్నికి సపర్యలు చేసేవాడు. సుమిత్రుని ఋక్కులనుబట్టి మనకు యీ క్రింది విషయాలు తెలుస్తాయి. బధ్ర్యశ్వుడు ప్రతాపంగల ఆర్య వీరుడు. అతడు శత్రువులను జయించాడు. వృత్రశబ్దం శత్రువను అర్థంలో ప్రయోగించబడింది. దివోదాసుకు ప్రధాన శత్రువులు దస్యులు. కాబట్టి బధ్ర్యశ్వుడు తన కుమారునికి సహాయపడి వుండాలి. కావున యిక్కడ వృత్రహా అంటే దస్యులను చంపినవాడు. మొదట దస్యులను చంపినవాడు బధ్ర్యశ్వుడు. కాని పుత్రుని విజయంతో అతని కీర్తి మరుగున పడింది. అతడు భరత, పురు, త్రిత్సుగణాలకు చెందినవాడు. అతడు రావీ- సట్లజ్ నదుల మధ్యనున్న భూభాగంలో వుండేవాడు.

ఇయమద దాద్రభ సమృణచ్యుతం
దివోదాసం బధ్ర్యశ్వాయ దాశుషే !
యాశశ్వంత మాచఖాదావసం
పణింతా తేదాత్రాణిత విషాసరస్వతి ॥

(6-61-1) భరద్వాజుడు.

అనగా ఈ సరస్వతి భక్తుడగు బధ్ర్యశ్వునకు ఋణమోచకుడును, భయంకరుడును అయిన దివోదాసుని యిచ్చింది. ఓ సరస్వతీ, దానహీనుడైన పణిని చంపావు. నీ దానములు బలమైనవి. సరస్వతి బధ్ర్యశ్వునికి ప్రతాపంగల పుత్రుని దివోదాసుని యిచ్చెనని భరద్వాజుడు చెప్పుట వలన బధ్ర్యశ్వుడు క్రమేణ ప్రదేశములను జయిస్తూ తూర్పున సరస్వతీ తీరాన్ని చేరుకొని వుండవచ్చు. అక్కడ సరస్వతీ తీరంలో దివోదాసు పుట్టివుంటాడు. సరస్వతి సప్తసింధుకోని

పవిత్ర నది. ఆనాడు సరస్వతీ నది మహిమ యీనాడు గంగ మహిమ వలె వుండేది.

భరద్వాజుడు : దివోదాసు విజయాలను గురించి చెప్పే ముందు భరద్వాజుని గురించి కొంచెం ప్రత్యేకించి చెప్పవలసి వుంది. ఎందుకంటే అతడు దివోదాసునికి చాణక్యుడు. తన కాలంలో అందరికంటే పలుకుబడి గల పురోహితుడు అతడు వున్నత శ్రేణికి చెందిన కవి. అతని వందలాది ఋక్కులు ఋగ్వేద ఆరవ మండలంలో వున్నాయి అందుచేత ఆరవ మండలాన్ని భరద్వాజ మండలం అంటారు. అతడు భరతులకే కాదు, యితర గణాలకు కూడ గౌరవ పాత్రుడు. ఆయనకు దాన మిచ్చిన రాజులను ఆయన స్వయంగా పేర్కొన్నాడు. అతని కుమారుడు గర్గు యితర ఋషులు పేర్కొనుటను బట్టి ఆ రాజు లందరు భరద్వాజ, దివోదాసులకు సమకాలికులై వుంటారనుట స్పష్టం.

7. అభ్యావర్తీ చాయమానుడు :

ద్వయాం అగ్నే రథినో వింశతిగా వధూమతో

మఘవామహ్యం సమ్రాట్,

అభ్యావర్తీ చాయమానో దదాతి దూణాశేయం

దక్షిణా పార్థవానాం ॥ (6-27-8)

అనగా ఓ అగ్నీ, మఘవ (ధనవంతుడు), సమ్రాట్ అభ్యావర్తీ చాయమానుడు వధువుల (దాసీలు) సమేతంగా రెండు రథాలను, ఇరువది ఆవులను యిచ్చాడు భరద్వాజుడు "పార్థవుల యీ చక్రవర్తి మధువులతో రెండు రథాలను, 20 ఆవులను యిచ్చినట్లు చెప్పాడు. దాసీలకూడ వధువు అంటారు. చాయమానుడు వధువులతో కూడ రథాలను యిచ్చాడు.

8. సుమీఢుడు : భరద్వాజునకు సుమీఢుడు రెండు అర గుర్రాలను నూరు ఆవులను యిచ్చాడు. పేరుకుడు వర్వాన్న, శాండుడు హిరణ్య సమేతంగా పది రథాలను యిచ్చాడు. (6-63-9) అన్నింటికంటే అధిక దానం శాండుడిచ్చింది.

9. పురుసీథుడు : పురుపీథ శాతవనేయుడు కూడా భరద్వాజునకు దాన మిచ్చేవని నోథాగోతముడు చెప్పాడు (1-59-7) శతవన బహుశా ఒక స్థానం పేరై వుంటుంది

10. ప్రస్తోకుడు : ఇతడు పది కోశాలను, పది గుర్రాలను యిచ్చినట్లు గర్గ చెప్పాడు (6-47-22). ఈనాడు ఖజానాను (ట్రెజరీ) కోశమంటారు కాని అనాడు కోశమంటే ఒక విశిష్ట నిధి. ఇక్కడే గర్గ "దివోదాసు అతిథిగ్వని నుండి శంబరుని ధనాన్ని మేము పొందాం" అని కూడా చెప్పాడు. (దివోదాసా దతిథిగ్వస్య రాధః శాంబరం వసుప్రత్యగ్రభీష్మ) శంబరుని నుండి పొందిన ధనాన్ని అంతా భరద్వాజునకు ఎట్లా యిస్తారు. యింకా భాగస్వాములున్నారుగదా! బహుశా యిందువల్లనే కాబోలు గర్గ తర్వాత ఋక్కులో యిట్లు అన్నాడు.–

"నేను దివోదాసు నుండి పది గుర్రాలు, పది కోశాలు పది వస్త్ర భోజనములు, పది హిరణ్య పిండములను (బంగారు ముద్దలు) పొందాను."

దివోదాసు చనిపోయిన తర్వాత భరద్వాజునకు గాని, అతని పుత్రుడగు గర్గునికి గాని పౌరోహిత్యం (ప్రధానమంత్రి పదవి) లభించలేదు. దివోదాసుని ప్రతాపంగల పుత్రుడు సుదాసునికి వసిష్ఠుడు పురోహితుడయ్యాడు. అప్పుడు కూడ భరద్వాజునకు వసిష్ఠునకు మధ్య వైరం అంతగా వుగ్రరూపము ధరించలేదు. కాని వసిష్ఠుని స్థానాన్ని విశ్వామిత్రుడు తీసుకొన్నప్పుడు ఆ వైరం బాగా తీవ్రమైంది. వసిష్ఠ సంతతిలోకూడ అంత తీవ్రత వున్నట్లులేదు. ఈ విషయం మృళీక వాసిష్ఠుని ఋక్కు వలన తెలుస్తుంది. (10-150-5) "అగ్ని అత్రి, భరద్వాజ. గవిష్ఠర, కణ్వులను రక్షించాడు. అగ్నిని వసిష్ఠుడు ఆహ్వానిస్తున్నాడు" పై ఋక్కును బట్టి భరద్వాజునకు అనేక గణాలందు గౌరవమున్నట్లు తెలుస్తుంది. ఆయన తపతున్న పలుకుబడిని, ప్రభావాన్ని శంబర యుద్ధంలో దివోదాసుని పక్షమునకు సంపూర్తిగా వినియోగించాడు. బయట శత్రువులతో యిటువంటి భయంకర సంఘర్షణ చేసేటప్పుడు ఆర్యుల అంతః కలహాన్ని ఆపకపోతే నలుబది సంవత్సరాలు పోరాడిన తర్వాత కూడ ఆర్యులు శంబరుని గెలుస్తారనుటలో సందేహం కల్పట్టుకుంది. కాబట్టి ఆర్యుల్లో అంతఃకలహాన్ని రాకుండా కాపాడిన శ్రేయస్సు భరద్వాజునిది. శంబరునిపై విజయాన్ని సాధించుటలో భరద్వాజుని గొప్పతనమేమిటో మనకు యిందు మూలకంగా తెలుస్తుంది.

11. కుత్స ఆర్జునేయ 12. శ్రుతర్య, 13. తుర్వీతి, 14. దభీతి, 15. ధ్వసంతి, 16. పురుషాంత.

ఆర్య సేనాపతుల్లో కుత్స ఆర్జునేయుడు ముఖ్యుడని కొద్దిగా పైన చెప్పాం. భరద్వాజుడు సారధి కుత్సునికై స్తుతించాడు. సారథి అంటే సేనాపతి.

మహోద్రుహో అపవిశ్వాయుధాయి వజ్రస్య
యత్పతనేపాది శుష్ణః।
ఉరుష సరథం సారథయే కరింద్ర
కుత్సాయ సూర్యస్యసాతౌ॥ (6-20-5)

అనగా వజ్రము పడగానే శుష్ణు పడిపోయాడు. అప్పుడు మహాద్రోహి ఆయువు (ప్రాణం) నశించింది. సూర్యోదయ మగునప్పటికి సారథి కుత్సుని కొరకు యింద్రుడు రథాన్ని విస్తృతం చేశాడు. ఇంద్రుడు స్వయంగా కుత్సుని రథంపై కూర్చొని యుద్ధం చేయుటకు వెళ్ళెనని వసుక్రఋషి చెప్పాడు. (10-29-2). ఇందుచేతనే కుత్సుని సారథి అనవేమగదా! "ఇంద్రుడు వసిష్ఠ, కుత్స, శ్రుతర్య, కుత్స ఆర్జునేయ, పర్వీతి, దభీతులను రక్షించాడు అని కుత్స అంగిరసుడు చెప్పాడు. (1-112-9,23). వీరంతా సమకాలీనులని చెప్పుట కష్టం. భరద్వాజుడు ఒకే వాక్యంలో (6-18-13) కుత్స, ఆయు, అతిథిగ్వులను రక్షించిన సంగతి చెప్పాడు. అతిథిగ్వుడు దివోదాసు, కుత్స ఆర్జునేయుని మనం ఎరుగుదుము. ఆయనకూడ ఆ కాలంనాటి ఒక ఆర్యయోధుడై వుంటాడు.

17. దేవక మన్యమానుడు :

శంబరుడు, అతని జాతీయులకే కాకుండా దేవక మన్యమానుడను ఆర్యవ్యక్తి ఒకరు ఉన్నారు. అతడు శంబరునితోపాటు చంపబడెనని ఒకేఋక్కులో వసిష్ఠుడు చెప్పాడు (7-18-20)

'దేవకంచిన్ మాన్యమానంజఘన్ దావ
త్మనా బృహత ః శంబరంభేత్ ॥

ఇతర ఆర్యరాజులు లేక గణనాయకుల సంఘర్షణను గురించి ఋగ్వేదంలో చెప్పబడింది. వారు దివోదాసుకు సమకాలికులని నిశ్చయంగా చెప్పలేదు. వారిలో కొందరు ఆయనకు సమకాలికులై వుండవచ్చు. కొందరు తర్వాతవారై వుండవచ్చు.

18. సుశ్రవ : త్వమేతాన్‌జనరాజ్ఞో ద్విర్దశాబంధునా
సుశ్రవసోప జగ్మష ః ।
షష్టిం సహస్రానవతిం నవశ్రుతో
ని చక్రేణ రథ్యాదుష్పదావృణక్ ॥
—(1-53-9) సవ్య ఆంగిరసుడు

అనగా ఓ ప్రసిద్ధుడైన ఇంద్రా ! బంధుహీన సుశ్రవుని పై దండెత్తివచ్చిన 20 రాజులను, వారియొక్క 60,999 అనుచరులను దుర్లంఘ్యమైన రథ చక్రాలచే నీవు ఓడించావు.

సవ్య ఆంగిరసుడు ఇంద్రుని స్తుతిస్తూ సుశ్రవునిపై దండెత్తివచ్చిన 20 మంది గణనాయకులను, 60,999 అనుచరుల సమేతంగా ఓడించెనని చెప్పాడు. ఈ 20 మంది గణనాయకులు ఎవ్వరు ? సుశ్రవుడెవ్వరు ? సవ్య ఆంగిరసుడు తర్వాత ఋక్కులో (1-53-10) ఇంద్రుడు సుశ్రవుని రక్షించెనని చెప్పెను. సుశ్రవుని గురించి మనకు యింతకంటె ఎక్కువ తెలియదు.

19 తుర్వయాణుడు : సవ్య ఆంగిరసుడు సుశ్రవునితోపాటు తుర్వయాణునికూడ ఇంద్రుడు రక్షించెనని చెప్పాడు (1-53-10). కుత్స, అతిథిగ్వ, ఆయువులు తరుణ మహారాజు సుశ్రవునికి వశులైనట్లు చెప్పబడింది. ఇందువలన సుశ్రవుని గురించి మనకు తెలుసుకొనవలయునను అభిలాష కల్గుతుంది. కాని తర్వాత మనకు ఏమీ తెలియుటలేదు.

20 ఋణంచయుడు : ఇతడు రుశమ గణానికి చెందినవాడు. బాగా డబ్బున్న రాజు. ఇతడు బభ్రువకు 4,000 ఆవులను యిచ్చాడు. (5-30-12,14) 'రుశమ రాజు నాల్గువేల ఆవులను యిచ్చాడు. ఋణంచయుని ధనాన్ని నేను పొందాను. ఆ రాత్రి నేను రుశమరాజు ఋణంచయునివద్ద గడిపాను.' నాల్గువేల ఆవులు (అంటే 8 లక్షల రూపాయలు) దానం యిచ్చే రాజు వైభవం చాల గొప్పదై వుండాలి.

21. పాకస్థామ కౌరాయణుడు : కణ్వఋషి దివోదాసుకు సమకాలీనుడు. తుర్వశయదు జనములకు పురోహితుడు. కాబట్టి వారికి సహాయకుడు కూడ. ఆయన అప్పటికి బ్రతికివుంటే ఆయన పుత్రులు సుదాసుని విరోధులను సమర్థించి వుంటారు. ఆయన పుత్రుడు మేధాతిథి (మేధ్యాతిథి) కురయాణ పుత్రపాక స్థాముని మహిమను కీర్తించాడు (8-3-21,22) 'మరుత్ దేవతలు యిచ్చిన దానిని పాకస్థామ కౌరాయణుడు నాకు యిచ్చాడు. పాకస్థాముడు అందమైన యిరుసుగల ఎర్రని రథాన్ని యిచ్చాడు. అతడు వస్త్రాలను, పుష్టికర భోజనమును యిచ్చాడు. ఎర్రని రథమిచ్చిన ఆదాతను నేను కీర్తిస్తున్నాను. యదు తుర్వశగణముల భూమి దగ్గరనే పాకస్థాముని భూమి వుండి వుంటుంది. కురయాణ అతని గణముపేరుగాని, తండ్రిపేరుగాని లేక పూర్వీకుల పేరుగాని అయి వుంటుంది.

22. దేవశ్రవ, 23. దేవవాత : దేవశ్రవ, దేవవాతులు భారతులు అంటే భరతగణంవారు. తర్వాత వున్నటువంటి భరతరాజును గురించి ఋగ్వేదంలో ఏమీ చెప్పలేదు. దేవవాత సంతానమగు సృంజయుని గురించి వామదేవుడు కూడ చెప్పాడు. (4-15-4). కాబట్టి యీ దేవవాతుడు ఎవరో ప్రాచీన కాలపువాడు. దేవశ్రవ, దేవవాతులు అన్నదమ్ములు. అగ్ని పూజకులు. వారిరువురు అగ్ని మహిమను చెప్పుచు యిట్లు స్తోత్రం చేశారు—

అమంథిష్టాం భారతా రేవదగ్నిం
దేవశ్రవా దేవవాతః సుదక్షం !
అగ్నే విపశ్య బృహతాభిరాయేషాం
నో నేతా భవతాదను ద్యూన్ ॥
దశ క్షిపః పూర్వ్యం సీమ జీజనన్ త్సుజాతం మాతృషు ప్రియం ।
అగ్నిం స్తుహి దైవ వాతం దేవశ్రవో యోజనా నామ సద్వశీ ॥ (3)
— 3-23-2,3

"భరతుల సంతానమగు దేవశ్రవ, దేవవాతలు సుదక్షుడు, ధనవంతుడు అయిన అగ్నిని మదించారు. పది వ్రేళ్ళు పురాతనుడు, సుజాతుడు, మాతలకు ప్రియుడు అయిన అగ్నిని పుట్టించినవి. దేవవాత దేవశ్రవల అగ్నిని మీరు స్తుతించండి ...పృథ్వియొక్క శ్రేష్ఠమైన, ధన సంపన్నమైన స్థానమందు అగ్నిని స్థాపించాం. ఓ అగ్నీ, నీవు దృషద్వతి, అపయా, సరస్వతీ తటమందు ధన సహితంగ ప్రజ్వరిల్లుము."

రెండు బద్దలకల కొయ్య అరణులందు మదించి అగ్నిని పుట్టించేవారు. ఈ సంగతే యిక్కడ చెప్పబడింది. ఈ ఋక్కుల్లో వర్ణితమైన దృషద్వతి నేటి మస్తరానది. సరస్వతి నేడు కూడ సివాలిక మండి కురుక్షేత్రం గుండా ప్రవహిస్తూ యీ పేరుతోనే పిలువబడుతూ వుంది. ఈ రెండు నదులమధ్య వున్న నది మరకండాయే ఆనాటి అపయా.

24. సృంజయు దైవవాత, 25. మహీరాధపాజ్ర్గః:
భరద్వాజుడు దేవవాత పుత్రుకగు సృంజయుని గురించి చెప్పాడు- 'ఆ ఇంద్రుడు తుర్వశుని సృంజయుని కొరకు యిచ్చాడు. వృచీవతులను దైవవాతునికి యిచ్చెను' (6-27-7) తుర్వశుని, వృచీవతులను, దైవవాత సృంజయుని వశం చేయుట యిక్కడ అభిప్రాయమైవుంది. దైవవాత అపత్యవాచకము ముఖ్యమైన పేరు సృంజయుడు. ఈ విషయం వామదేవుని యీ ఋక్కు వలన స్పష్టమవు

తుంది - 'ఈ అగ్ని పూర్వం దైవవాత స్పంజయుని కొరకు ప్రజ్వలితమైంది' (4-15-4). 'స్పంజయ పుత్రుడు (సాఙ్‌ర్జయుడు) భరద్వాజులను పూజించెను, అని భరద్వాజ పుత్రుడు గర్గఋషి చెప్పాడు. ఈ స్పంజయ పుత్రుడెవరు? మహిరాధుడు.

26. పురుకుత్సుడు : కుత్సుడను పేరు గల వారు ముగ్గురు వున్నట్లు ఋక్కుల వలన తెలుస్తుందని పైన మేము చెప్పాం. ఈ కుత్సుడు పురుగణాలకు చెందినవాడు. కావున పురుకుత్సుడని చెప్పబడ్డాడు. ఇతని పుత్రుడు త్రసదస్యుడు. సుదాసుకు సమకాలికుడు. కాబట్టి యీ పురుకుత్సుడు సుదాసు తండ్రి దివోదాసుకు సమకాలికుడై వుండాలి. భరద్వాజుడు యితన్ని కీర్తించుట వలన కూడ పై విషయం బలపడుతుంది. 'ఇంద్రుడు పురుకుత్సుని కొరకు దాసుల యొక్క ఏడు శారదీపురాలను ధ్వంసం చేశాడు', అని భరద్వాజుడు చెప్పాడు (6-20-10) శరత్కాలీనపురము అనుటచేత పార్వతేయులు ఆ కాలంలో చలి నుండి కాపాడుకొనుటకై టరాయిలోని వుష్ణప్రదేశాలకు వచ్చి దుర్గాలను కట్టుకొని వుండేవారు అని తెలుస్తుంది. కుమాఊం-గఢ్‌వాల్‌లోని చలి ప్రదేశాల్లో వుండేవారు. తమ పశువులతో సహా టరాయిలోకి ఎండవేడిమికి గాను వచ్చుట యిప్పుడు కూడ చూస్తున్నాం. పురుకుత్సుడు యిటువంటి ఏడు కిరాత పురాలను దోచివుండవచ్చు. వసిష్ఠుని తమ్ముడు అగస్త్యుడు చెప్పిన ఋక్కు పై విషయాన్ని బలపరుస్తుంది. 'ఇంద్రుడు మృధ్రవాచుని (మ్లేచ్ఛుని) ఏడు శారదీపురాలను ధ్వంసం చేశాడు. యువకుడైన పురుకుత్సునికి అనవద్య అరణా (నది)ని యిచ్చి వృత్రుని (శత్రువు)ని వధించాడు, (1-174-2) దీనినిబట్టి పురుకుత్సుడు ఏడు పురాలను తీసుకొన్నాడు. వీని సమీపంలో ప్రవహించే నదినికూడ స్వాధీనపర్చుకొన్నాడు, అని తెలుస్తుంది. నోధా గోతముడు యీ విషయాన్నే చెప్పాడు (1-63-7). 'అశ్వినీ దేవతలు వృష్టిని పురుకుత్సుని రక్షించారు', అని కుత్స ఆంగిరసుడు చెప్పాడు (1-112-7) వృష్టిని పురుకుత్సుడు అంటే విచిత్ర గోవులుకల పురుకుత్సుడు. లేకపోతే వృష్టిని పేరే రాజయి వుంటాడా ?

27. త్రసదస్యు పౌరకుత్సుడు : సుదాసుని పురోహితుడగు వసిష్ఠుని ప్రకారం యితడు పురుకుత్సుని పుత్రుడు 'ఓ యింద్రా, నీవు సుదాసుని రక్షించావు. వృత్రహత్య (శంబర యుద్ధం)లో పౌరకుత్స త్రసదస్యుని రక్షించావు' (7-19-3) త్రసదస్యుడు స్వయంగా చెప్పుకొన్నాడు-

అస్మాక మత్ర పితర స్త అనన్ త్ప ప్త ఋషయో
దౌర్గహే బధ్యమానే।
త ఆయ జంత త్రసదస్యు మాస్యా ఇంద్రం
న వృత్రతురు మర్ధదేవం॥
పురుకుత్సానీ హివామదా త్రద్ధ వ్యేభిరింద్రావరుణా నమోభిః।
అదా రా జానం త్ర సదస్యు మస్యావృత్రహణం దదమురర్ధదేవం॥

(4-42-8-9)

అనగా ఇక్కడ మా ఏడ్గురు పితర ఋషులున్నారు. దుర్గహ పుత్రుడు బంధీ అయినప్పుడు వారు యింద్రునివంటి అర్ధదేవుడును,శత్రు నాశకుడు అయిన త్రసదస్యుని పొందారు.

ఓ యింద్ర వరుణులారా ! నమస్కార పురస్సరంగా పురుకుత్సాని మీకు హవిని సమర్పించింది అప్పుడు మీరు ఆమెకు శత్రుహంతకుడగు త్రసదస్యుని యిచ్చారు.

అతని తల్లి పురుకుత్సాని కావచ్చును. అతడు దస్యులని బాధిస్తాడని అతని పేరులోనేవుంది. అర్ధదేవ యితని పుత్రుని పేరా ఏమిటి? త్రసదస్యుని దౌర్గహ అన్నారు. దుర్గహ అతని పూర్వీకుడై వుండవచ్చు. సంవరణఋషి గౌరిక్షితపౌరుకుత్సుని నుండి హిరణ్యయుక్తంగా పని తెల్లని గుర్రాలను పొందినట్లు చెప్పాడు (5-33-8). గౌరిక్షిత అంటే గిరి (కొండ) యందు వుండేవాడు బహుశా ఉత్తరపు (వ్యాస-సట్లజ్‌లమధ్య) కొండల్లో త్రసదస్యునికి ఏదైన దుర్గం వుండవచ్చును. వామదేవుడు చెప్పిన ప్రకారం (4-38-1) త్రసదస్యుడు గొప్పదాత అని తెలుస్తుంది. త్రసదస్యుని నుండి దానం పొందినవారిలో సౌభరికూడ వున్నాడు.

అదాన్ మే పౌరుకుత్స్య ః పంచాశతం
త్రసదస్యుర్వధూనాం ।
మంహిష్ఠో అర్య ః సత్ప ః ॥ 36
ఉత మే ప్రయియోర్వయియో ః సువాస్త్వా అధితుగ్వని ।
తిసృణాం సప్తతీనాం శ్యావ ః ప్రణేతా
భువద్వ సుర్దియానాం పతి ః॥ 37

—8-19-36-37

'అతిమహాన్ ఆర్యుడును, సుస్వామియు అయిన పౌరుకుత్స్య త్రసదస్యుడు నాకు 50 వధువులను యిచ్చాడు సువాస్తునదీ తీరాన 270 వల్లని ఆవులను యిచ్చాడు, అని అతడు చెప్పాడు. ఇక్కడ వధువు అంటే భార్యకాదు, సోభరికి యింత మంది వధువులెందుకు ? వారు దాసీలు, పార్వతేయుల కుమార్తెలై వుంటారు. సోభరి యిదే సూక్తంలో (8-19-32) 'అగ్ని త్రసదస్యు సమ్రాట్టుకు రక్షకుడు' అని అన్నాడు. సమ్రాట్ శబ్దమునకు యింకా అంత ప్రచారంలేదు. అప్పటిలో నేడు న్నట్లుగా అంతటి గొప్ప అర్థం కూడ లేదు. పురుకుత్సుని పుత్రుడగుటచేత త్రసదస్యుడు పురువంశజుడు. అనాడు ఆగణంవారు సట్లజ్— వ్యాసనదుల తూర్పున కొండవరకు నివాసం ఏర్పరచుకొన్నారు.

28. కురుశ్రవణ త్రసదస్యుపుత్ర : మొదటిసారిగా యీ పేరుకు ముందు 'కురు' శబ్దాన్ని చూస్తున్నాం. పురుకుత్సుని పౌత్రుడగుటచేత యితడు పురుని కాలంలోను సుదాసుని కాలంలోకూడ వున్నాడు. బహుశా యితడు సుదాసుకు శత్రువుకూడ అయివుండవచ్చు. దాశరాజ్ఞ యుద్ధంలో పీటమునిగి చనిపోయిన కవష ఐలూషుడు యితని పురోహితుడు. కవషుడు తన యజమాని దాతృత్వాన్ని గురించి చెప్పాడు (10-32-9; 10-33-4). ఏతాని భద్రాకలశం క్రియామకురు శ్రవణ దదతో మఘాని దాన ఇద్వోమఘవాన : నఅస్త్వయంచ సోమో

హృదయ ఏ భర్మి ॥9॥
కురుశ్రవణమావృణి రాజానం త్రాసదస్యనం,
మంహిష్ఠం వాఘతామృషి : ॥4

'దాత కురుశ్రవణుడు ఇచ్చిన ధనం కల్యాణప్రదం. నేను త్రసదస్యు పుత్ర కురుశ్రవణ రాజును యాచించాను. అతడు దాతలలో గొప్పవాడు' అని కవషుడు చెప్పాడు.

## 2. దివోదాసు కార్యములు

1. దివోదాసు అతిథిగ్వ : దివోదాసు మొదట్లో తన ఆర్యగణాలతోనే కొంత పోరాటం చేయవలసి వచ్చింది. కాని సుదాసు చేసినంత కాదు. దస్యులతో సంఘర్షణ చేయునప్పుడు ఆర్య నాయకులైన కుత్స ఆర్జునేయ, ఋజిశ్వవైదథి మొదలైన వారున్నట్లు మనకు తెలుసును. కుత్సఆర్జునేయుడు దివోదాసు సేనాపతి అని కూడ

తెల్పియున్నాం. పంచజనుల్లో తుర్వశ, యదులు పరమర నుండి వచ్చి దస్యులతో యుద్ధంచేశారు. శంబరునితో తుదిపోరాటం చేయకముందే తుర్వశ, యదులు దివోదాసుతో రాజీపడినట్లుంది ఈ రాజీ కేవలం శాంతియుతంగా జరుగలేదు. ఎందుకంటే దివోదాసు చనిపోయిన తర్వాత అతని వారసుడైన సుదాసుతో యుద్ధంచేసిన పది రాజుల్లో ఈ రెండు గణాలు ముఖ్యమైనవి. దివోదాసుకు సంబంధించి సంతవరకు తుర్వశ, యదులు, అతిథిగ్వుని ఆధిపత్యం అంగీకరించిరని వసిష్ఠుడు చెప్పాడు (7-19-8) అమహీయు అంగిరసుడుకూడ సోముని మహిమను గురించి చెపుతూ, 'అతడు తుర్వశ, యదులను దివోదాసునికి అధీనం చేశాడు.' అని వర్ణించాడు (9-61-2).

దివోదాసు శంబరునే కాకుండా యింకా మరికొంతమంది దస్యు నాయకులను ఓడించాడు. వారిలో వర్చిని శంబరునితోపాటు ఉదవ్రజంలో చంపాడు. సవ్య అంగిరసుడు 'కరంజ పర్ణయులను అతిథిగ్వునికై యింద్రుడు చంపాడు. ఋజిశ్వుడు వంగృదుని నూరుపురాలను ధ్వంసం చేశాడు.' అని వర్ణించాడు. (1-53-8) నూరు పురాలను ధ్వంసం చేసినవాడు దివోదాసే. వంగృద శంబరుని రెండవ పేరు కాదు. సవ్యుడు చెప్పిన నూరుసంఖ్యను బహు సంఖ్య అను అర్థంలో గ్రహించవలయును ఒక అజ్ఞాతఋషి చెప్పిన ఋక్కులో యింద్రునికే యిట్లు చెప్పబడినటు వుంది— 'నేను గుంగులనుండి అతిథిగ్వ దివోదాసుకు అన్న ధనములను యిప్పించాను, పర్ణయ కరంజులను చంపాను' (10-48-8) గుంగు అనార్య జాతి పేరుగ తోస్తుంది.

దివోదాసు అశోకునివలె 'దేవానాంప్రియ' బిరుదు వహించక పోయినప్పటికీ తెలుగు దేవులకు ప్రియుడు. అతని కుమారుడు ఋక్కులను రచించి ఋషుల పట్టికలో పేరు ఎక్కించుకున్నాడు. పౌత్రుడు లేక రెండవ పుత్రుడు పరుచ్ఛేపుడు కూడ ఋషి. కాని దివోదాసు ఋక్కు ఏదీ దొరకలేదు. అయినప్పటికీ అతనికి దేవులు ప్రత్యక్షమయ్యేవారు. దీర్ఘతమ పుత్ర కక్షీవానుడు అశ్వినీదేవతలు దివోదాసు వద్దకు వచ్చారని చెప్పాడు (1-116-8). కుత్స అంగిరసుడు: అశ్వినీదేవతలు శంబర హత్యలో అతిథిగ్వ దివోదాసుని రక్షించారు అని చెప్పెను. కక్షీవానుడు అశ్వినీద్వయం ఎక్కువ రక్షణ యిచ్చుటతోపాటు కాపాడినట్లు చెప్పాడు. (1-119-4). బృహ్యుడు బహుశా దివోదాసునికి సహాయపడిన ఆర్యనాయకుడై వుంటాడు

2. శంబర హత్య : శంబరుని గురించి చెప్పేటప్పుడు మేము యీ మహా యుద్ధమును గురించి కూడా చెప్పియున్నాం. ఈ యుద్ధంలో లక్షమంది

చనిపోయారనుట అతిశయోక్తి. దివోదాసు పురోహితుడు (ప్రధానమంత్రి) భరద్వాజుని ప్రభావాన్ని గురించి కూడ చెప్పియున్నాం. ఆ కాలంలో ఆర్యగణాల్లో సమైక్యతను తెచ్చిన గౌరవం భరద్వాజునిది అనుట నిస్సందేహం. ఏ ఆయుధ బలంచేత శంబరుడు జయింపబడ్డాడో ఆ గౌరవం దివోదాసుకు యివ్వవలసి వుంటుంది. తమ దేవతలు స్వర్గంలో వుండి తమాషా చూచేవారు కాదని ఋషులు నమ్మేవారు. దేవతలు వారితో పాటు వుండి ప్రత్యక్షంగా యుద్ధంలో పాల్గొనేవారు. కుత్సఆర్జునేయుని రథంపై యింద్రుడు స్వయంగా ఎక్కి శుష్ణుతో యుద్ధం చేయుటకు వెళ్ళాడు. దేవతలతో యీ సంబంధమెట్లు కల్గెనో ఎక్కడా స్పష్టంగా చెప్పలేను. కాని వామదేవుడు తన ఋక్కుల్లో యింద్రుడు ఉత్తమ పురుషలో 'నేను' అని చెప్పినట్లు వర్ణించుట వలన దేవతలు శరీరాలపై ఆవేశించేవారని (పూనకం వచ్చుట) చెప్పవలసివస్తూంది. గఢ్వాల్లో పాండవ నృత్యం జరుగుతుంది. అక్కడ పంచపాండవులు, ద్రౌపది జీవితకాలం అంతా ఒకే వ్యక్తి ఎన్నుకొంటారు. వారి శరీరాలపై పంచపాండవులు ద్రౌపది ఆవేశించి ఉత్తమ పురుషలో మాటలన్నీ చెపుతారు. వారు పాండవ నృత్యంలో కూడా ఆ పూనకం వచ్చినవారిని మహావాలుగా చేసుకొని పాల్గొంటారు. ఈనాడు కూడ కిన్నర దేశంలో దేవతలతో వాంభక్తులకు ప్రత్యక్ష సంబంధాన్ని చూస్తున్నాం. అచ్చటి దేవత ఒకటి ఒకగొప్ప యింగ్లీషు వుద్యోగిపై తన ప్రభావాన్ని కల్గించుటచేత అతడు రాజుతో చెప్పి అతనికి శిస్తు లేకుండా చేయించాడు. ఇందులో సత్యమనేది వుంటే యిది, మానవుడు హిప్నాటిజంకు లోనై అటు చేస్తాడని, ఎక్కువగా మనస్సు ఏకాగ్రతతో నుండుటచేత కొన్నిమంత్రాలు నిజం కావచ్చునని మాత్రం చెప్పవచ్చు. నేడుకూడ ఉన్నత విద్యావేత్తలకు యిందు గురించి మతులు పోతూవుంటే, నేటికి మూడువేల సంవత్సరాలకు పూర్వం యిటువంటి విషయం ఎంతగా విశ్వసించేవారో, మనం తేలికగా అర్థం చేసుకొనగలం. ఇంద్రుడు, అగ్ని, సోముడు, అశ్విద్వయం మొదలగు వేదకాలపు దేవతలు ఇట్లే ఏదో రూపంలో తమ భక్తులకు సహాయపడుతూ వుండేవారు.

శంబర హత్యను గురించి భరద్వాజుడు యిట్లు చెప్పాడు (6-26-3).

త్వం కవిం చోదయో ఽర్కసాతౌ త్వం
కుత్సాయ శుష్ణం దాశుషేవర్క్ ।
త్వం శిరో అమర్మణః పరాహన్నతిథిగ్వాయ
శంస్యం కరిష్యన్॥

"ఓ యింద్రా, నీవు ప్రకాశ ప్రాప్తికై కవిని ప్రేరేపించావు. భక్తుడైన కుత్సుని కొరకు శుష్ణుని చంపావు. నీవు అతిథిగ్వుని క్షేమముకోరి మర్మహీనుని (శంబరుని) తలను నరికావు"

భినత్ పురోనవతి మింద్ర పూరవే దివోదాసాయ
మహిదాశు షేన్నృతో (వజ్రేణదాశుషేన్నృతో)।
అతిథిగ్వాయ శంబరం గి రేరుగ్రో అవాభరత్।
మహోధనాని దయమాన ఓజసా,
విశ్వా ధనా న్యోజసా॥

—(1-130-7) పరుచ్ఛేప దివోదాస పుత్ర "ఓ యింద్రా! నీవు యుద్ధంలో భక్తుడైన పురు వంశజుడగు దివోదాసు కొరకు వజ్రంతో 99 పురాలను నాశనం చేశావు. అతిథిగ్వుని కొరకు ఉగ్రశంబరుని కొండనుండి క్రిందకు పడగొట్టావు. నీ పరాక్రమంతో గొప్ప నిధిని పంచుతున్నావు."

యింద్రుడు దివోదాసు కొరకు 99 పురాలను ధ్వంసం చేసినట్లు, శంబరుని కొండపైనుండి క్రిందకు పడగొట్టి చంపినట్లు వుంది. శంబర హత్యను ప్రత్యక్షంగా చూచిన భరద్వాజుడు ఏమి చెప్పాడో చూడండి-

యస్యత్యచ్ఛమ్బరం మదే దివోదాసాయ రంధయః
"అయంస సోమ ఇంద్రతే సుతం పిబ॥ 6-43-1)

"ఓ యింద్రా. నీవు సోమాన్ని త్రాగి మత్తిల్లి దివోదాసు కొరకు శంబరుని చంపితివో, ఆ సోమం నీ కొరకు వడకట్టి సిద్ధం చేయబడివున్నది. నీవు త్రాగుము."

త్వ మిభావార్యా పురు దివోదాసాయ సున్వతే।
భరద్వాజాయ దాశుషే॥ (6-16-5)
అగ్నిరగామి భారతో వృత్రహా పురుచేతనః।
దివోదాసాయ సత్పతిః॥ (6-16-19)

"ఓ అగ్నీ, నీవు సోమ సవనము చేయు పురు దివోదాసు కొరకు యీ శ్రేష్ఠ ధనాలను యిచ్చావు. భక్త భరద్వాజునికి కూడ యిచ్చావు. (6-16-5)

"మేధావి, శత్రు నాశకుడు భరత వంశజుడగు
దివోదాసుకు అగ్ని నిజమైన స్వామి

—(6-16-19)

ఈ ఋక్కులను బట్టి శంబరుడు కొండకు దిగువను యుద్ధము చేయవలసి వచ్చింది. యుద్ధరంగ ఉదవ్రజమని గర్గఋషి చెప్పియున్నాడు.

భరద్వాజునకు సమకాలికుడైన వామదేవుడు కూడ శంబర యుద్ధాన్ని గురించి చెప్పాడు.

అహం పురో మందసానాం వ్యైరం
నవసాకన్నవతీ : శమ్బరస్య ।
శతతమం వేశ్యం సర్వతా తా
దివోదాస మతి ధిగ్వం యదావం ॥ (4-26-3)

"నేను (ఇంద్రుడు) మత్తుడనై శంబరుని 99 పురాలను ధ్వంసం చేశాను. నూరవ పురమును ప్రవేశానికై వుంచాను. యుద్ధమందు దివోదాసు అతిధిగ్వుని రక్షించాను"

అంటే 99 పురాలను ధ్వంసంచేసి నూరవ పురం దివోదాసు అట్టిపెట్టుకున్నారు. ఆపురం అతని ఆధీనంలోను, అతని వంశీకుల అధీనంలోను వుండేది. అక్కడ వుంది వారు ఆ కొండ ప్రజలను పాలించేవారు. శంబరుని దేశం సుసంపన్నమైంది. ఆ కాలంలో అన్నిటికంటే ఉపయోగమైన లోహం రాగి. దీన్ని ఆర్యులు "అయస్" అన్నారు. శంబరుని దేశమునుండే అది ఆర్యులకు చేరిన దనుట విశ్వయం. ఆవులు, గొర్రెలు, మేకలుకూడ పార్వతేయుల దగ్గర చాలా వుండెవి.

ఋక్కులు అను అడవిలో చెదరియున్న చారిత్రక సంగతుల వలన మనకు యిట్లు తెలుస్తుంది దివోదాసు, సుదాసు వారి కాలంలో అందరికంటె గొప్ప ఆర్య నాయకులే. అయినప్పటికిని వారుమాత్రమే ఏకైక నాయకులు కారు. ఇతరులుకూడ వైభవములోగాని, పరాక్రమంలోగాని వారికి తీసిపోరు. పురుగణాల్లో పురుకుత్సుడు త్రసదస్యుడు, కురుశ్రవణుడు వారికాలంలో గొప్ప పరాక్రమంగల రాజులు. వారు వేల కొలది దానంచేసేవారు పురుగణాల కీర్తిని వృద్ధిచేయుటకు వీరు గొప్పగా కృషి చేశారు. ఇందుచేతనే వేదకాలం తర్వాత పురు, కురు, వంశముల ప్రభావం వృద్ధి చెందింది. అడవిలో సూదిని వెదకినట్లు 10,000 ఋక్కుల్లో చారిత్రక సత్యాలను వెదకవలసి వుంది. అయితే అవి అత్యంత విశ్వసనీయమైనవి. దాని తర్వాత చరిత్రాంశాలు మహాభారతం, రామాయణం పురాణాల్లో క్రమబద్ధంగా వున్నప్పటికిని అంత నమ్మదగింది కాదు. ఏమైనప్పటికీ సప్తసింధు తర్వాత గంగా యమునల వుపత్యకలో కురువంశానికి ప్రాధాన్యత స్థాపించబడింది.

3. ఆయుధాలు : ఋగ్వేద ఆర్యులు రాతియుగంలో వున్నారు. సింధు వుపత్యకా నాగరికులు వారికి 1½ వేల సంవత్సరాలు పూర్వం నుండి అదే యుగంలో వుంటూ వచ్చారు. అయస్, లోహ, అశ్మన్– ఇవి రాగికి పేర్లు. దీనితో ఇషు (బాణము). క్షురిక లేక వజ్రం (గద). పరశు (గండ్రగొడ్డలి) మొదలైన ఆయుధాలను తయారు చేసుకొనేవారు. వారి నిషంగం (తూణీరం, అంబుల పొది). జ్యా (వింటినారి) చర్మంతో చేయబడినవే. ఆయుధాలు కాని వాటిలో వాశీ (బాడిత) మొదలైనవి రాగితో చేయబడినవి.

## 1. ఇషు 2. నిషంగం

సంక్రందనేనా నిమిషేణ జిష్ణునాయుత్కారేణ
దుశ్చ్యవనేన ధృష్ణునా ।
తదింద్రేణ జయత తత్ సహధ్వం
యుధో నర ఇషు హస్తేన వృష్ణా ॥ (2)
స ఇషుహస్తై : స నిషంగిభిర్వశీ
సంస్రష్టా సయుధ ఇంద్రో గణేన ।
సంసృష్టజిత్ సోమపా బాహుశర్ధ్యు గ్రధన్వా
ప్రతిహితాభిరస్తా ॥ (3)

—(10-103-2 3)

ప్రజాపతి పుత్ర యజ్ఞఋషి, "వీరులారా, ఇంద్రుని సహాయం పొంది విజయులు కండు. శత్రువులను ఓడించండి. శత్రువులను ఏడ్పించేవారును, జాగరూకులును, విజయులును, అజేయులును, దుర్ధర్షులును అయిన వీరులు చేతులందు బాణాలను పూని యున్నారు.

బాణహస్తములు గల, తూణీరములు గల బాణాలతో స్వీయవశుడు యింద్రుడు యుద్ధంలో వున్నాడు. విసిరివేయు బాణాలతో శత్రువును జయించువాడును, సోమపానం చేయువాడును. శ్రేష్ఠధనుర్ధరుడును అయిన యింద్రుడు శత్రువులను పరాజితులను చేస్తున్నాడు," అని వర్ణించాడు.

## 3. ధనుషు, 4. జ్యా, 5. వర్మ (కవచం)

భరద్వాజ పుత్రపాయుడు ఆయుధాలను గొప్పగా ప్రశంసిస్తున్నాడు. ఆయన తండ్రి శంబరుని జయించిన దివోదాసుకు పురోహితుడు కదా! తన తండ్రి

వలెనే ఆయనకూడ తన సర్వస్వాన్ని ఒడ్డవలసి వచ్చిన్దేమో! ఆయన వర్మ (కవచ), ధనుషు, ఇషుధి (అంబులపొది) ఆయుధాలను ప్రశంసించాడు. ఆయన జ్యాను (వింటినారి, అల్లెత్రాడు) గురించి చెప్తూ, ప్రియురాలు తన ప్రియునితో ఆలింగనాన్ని గూర్చి సుచ్చటించునట్లుగ ధనుర్ధరుని చెవిదగ్గరకు వెళ్ళి అతనికి ప్రియవచనాలు పల్కుచున్నదా అన్నట్లుగావున్న యీ 'జ్యా' యుద్ధము యొక్క అంతు కోరుచున్నదని" వర్ణించాడు. "ధనుషు రెండు కొనలు విమనస్క స్త్రీవలె మంది శత్రువుపై ఆక్రమణ చేయునప్పుడు తల్లి పుత్రుని రక్షించునట్లు దివోదాసు శత్రువులను ఛేదించుగాక." (6-75-1-4)

ఋగ్వేదంలోని ఒక మహావిజేత సుదాను. అతడు ఆయుధాల మహిమను కీర్తించుటలో ఆశ్చర్యమేముంది ? అతడు తన సూక్తంలోని ఏడు ఋక్కుల్లో ఆరింటిలో, 'అన్యేషాం జ్యాకా అధిధన్వసు నశంతాం' అనగా 'యితరుల (శత్రువుల) జ్యా ఛిన్నాభిన్న మగుగాక' అని ప్రార్థించాడు.

6. కులిశం : విశ్వామిత్రుడు కులిశాన్ని వర్ణిస్తూ 'మేము యజ్ఞమును పెంపొందించు వైశ్వానర అగ్నికొరకు పవిత్ర ఘృతం (నేయి)వలె స్తుతించుచున్నాము గొడ్డలి రథమును నిర్మించునట్లు మనుష్యులు, ఋత్విక్కులు దేవులను ఆహ్వానిస్తూ గార్హపత్య, ఆహవనీయ అను రెండు రకాల అగ్నులను వెలిగించుచున్నారు.' అని చెప్పాడు (3-2-1). కులిశమునకు వజ్రము లేక గద అను అర్థమున్నది. గొడ్డలికిూడ అది పర్యాయపదం.

7. పరశు : పరశు అంటే యుద్ధంలో వుపయోగించే గండ్రగొడ్డలి. పరశు రాముని పేరులో కూడా యిది వుంది. విశ్వామిత్రుడు పరశువును వర్ణిస్తూ, 'ఓ యింద్రా, పరశువు తగలగానే శింబల వృక్షం దుఃఖపడునట్లు మా శత్రువులు దుఃఖితులగుగాక. బూరుగు చెట్టువడనట్లు, వుడుకుచున్న కుండ పొంగును వదగొట్టు చున్నట్లు మా శత్రువులు పడుదురు (చచ్చుదురు) గాక' అని చెప్పాడు (3-53-22)

8. వాశీ 9. ఋష్టి : ఈనాడు బాకునే వాశీ అంటారు. దీన్ని ఆ దినాల్లోగూడ వుపయోగించేవారు. శ్యావాశ్వ ఋషి వాశీ, ఋష్టులను వర్ణించాడు— "మరుద్గణాలా, మనీషులు అయిన మరుత్తులారా, మీరు వాశీ సమేతులై ఋష్టి ధారులై, సుందరమైన ధనస్సును చేతబట్టి, బాణములను ధరించి, తూణీర గుర్రాలతో, సుందరమైన రథములతో, సుందరమైన

ఆయుధములతో నన్నద్దుఃఖ కందు." (5-57-2) మరీచి పుత్ర కశ్యపుడు కూడా వాశిని గురించి చెప్పాడు (8-29-3).

వాశీ మేకో బిభర్తి హస్త ఆయసీమంతర్దేవేషు నిధ్రువిః॥

"దేవతల మధ్య విశ్రాంత స్థానంలోవున్న ఒక పురుషుడు చేతిలో ఆయసీవాశి (రాగిబాడిత)ని కల్గియున్నాడు."

10. వజ్రం : వజ్రమును కులిశమని కూడ అంటారు. ఇది ఒక రక మైనగద. ఇది పాషాణయుగం నుండి వస్తూవుంది. దధీచిపుత్ర దధీచి ఎముకలతో ఇంద్రుడు వజ్రం తయారుచేసెనను కథ పురాణాల్లో వుంది. కశ్యపుడు వజ్రమును వర్ణించాడు.

"వజ్రమేకో బిభర్తి హస్త ఆహితం తేన వృత్రాణి జిఘ్నతే॥

(8-29-4)

అనగా ఒక చేతితో వజ్రం ధరించి దానితో శత్రువులను సంహరించు తున్నాడు.

11. అత్క : ఇది ఒక వస్త్రం యొక్క పేరు. కాని ఋగ్వేద స్తోత్రంలోని వర్ణనబట్టి ఒక ఆయుధ మనికూడ అనవచ్చును (6-33-3)

త్వంత ఇంద్రోభయాం అమిత్రాన్ దాస్తా

వృత్రాణ్యార్యాచ శూర।

వధీర్వనే వ సుధితే భిరత్కైః

ప్రత్సుదర్షి నృణాం నృతమ॥

"ఓ శూరుడగు యింద్రా, నీవు శత్రువులగు దాస, ఆర్యుల నిరువురిని బాగా వనమునగల అత్కలతో వనమును ఛేదించినట్లుగ యుద్ధమునందు సంహరించు తున్నావు."

కావున అత్కమనగా ఒకరకమైన గొడ్డలి కావచ్చు.

16)

12. నావ : దీన్ని గురించి మేము వామదేవుని ప్రకరణంలో చెప్పివున్నాం. ఆర్యులు నావలను వుపయోగించేవారు. కాని వ్యాపార దృష్టి వారికి ఎక్కువగాలేదు. వారి నావలు ఎక్కువగా మామూలు రాక పోక సాధనములుగా మాత్రమే వుపయోగ పడేవి. దీర్ఘ తమ పుత్రకక్షీవానుడు నూరు తెడ్లుగల నావను వర్ణించాడు (1-116-5).

అనారంభణే తదవీర యేథా మనా స్థానే
అగ్రభణే సముద్రే।
యదశ్వినా ఊహథుర్భుజ్యుమ స్తం శతారిత్రార।
నావమా తస్థి వాంసం॥

"ఓ అశ్వనీ కుమారులారా, మీరు ఎటువంటి ఆధారము లేని, ఆనుటకు వీలులేని అగాధ సముద్రమందు మునుగుచున్న భుజ్యుని నూరు తెడ్లుగల నావపై కూర్చోపెట్టి దాటించారు."

—•—

# పదవ అధ్యాయం

# సు దా సు

## 1. సుదాసు పితహవ్యుడు

ఒక మహాప్రతాపం గల రాజు తర్వాత అతని పుత్రుడు అతనికంటె మహా ప్రతాపవంతుడగుటను మనం చరిత్రలో చాల అరుదుగ చూస్తాం. సుదాసు అటు వంటి అసాధారణమైన పుత్రుడు. అతడు దివోదాసు విజయాలను మరింతగ ముందుకు తీసుకొనిపోయాడు. దివోదాసు దస్యుల బాధను బాపి ఆర్యులకు రక్షణ కల్గించాడు. అంతే కాదు. అతడు హిమాలయంలోని పచ్చిక బయళ్ళకు, ఉపత్యకలకు, గనులకు మార్గం తెర్చాడు. సింధు నుండి సరస్వతి వరకు ఉన్న ఆర్య గణాల్లో ఐక్యతను నెలకొల్పడానికి ఏకరాజ్య రూపమిచ్చాడు. కాని ఆర్యగణములందుకు సిద్ధంగాలేవు దివోదాసు చనిపోగానే అన్నిచోట్లా వారు తల ఎత్తారు. అందువలన తండ్రికంటే ఎక్కువగా సుదాసు పోరాటం చేయ వలసివచ్చింది. సుదాసు, దాశరాజ్ఞయుద్ధం యొక్క చారిత్రక సామాగ్రి, ఋగ్వేదంలో చాల దొరుకుతుంది. వసిష్ఠుని ఒక సూక్తమంతా (7-18) దీన్ని గురించి వుంది. త్రిత్సుగణాలు కూడా మొదట శత్రువులు. త్రిత్సు, భరతుల వైభవం కొరకే అతడు పోరాడింది. పృథు, పర్శుగణాలు కూడ త్రిత్సుల మాదిరి విరోధులే. పృథు పర్శుగణాలు ఈరానీయుల్లో కూడా వున్నవి. దీనిని బట్టి వైదిక పృథు, పర్శుగణాలు ఈరానులో తర్వాత కన్పడు పర్థియనులు, పార్శియనులు అని అనుకోరాదు. ఈరానీయులు, సప్తసింధు ఆర్యులు ఒక వంశానికే చెందిన రెండు శాఖలు. ఈ రెండుశాఖలు ఒక చోట వుండునప్పుడు ప్రాచీన పృథు పర్శుగణాలలో కొందరు ఈరానుకు, కొందరు సప్తసింధుకు వెళ్ళినను అసంభవం కాదు. సుదాసుకు సహాయం చేసినవారిలో భరతుల ప్రాచీన పురోహితుడగు దీర్ఘతముని సంతానముంది. సుదాసుని కాలంలో భరద్వాజ వంశీకులకు పురోహిత పదవి అంటే ప్రధానమంత్రి పదవిలేకుండా చేసినప్పటికిని వారు సుదాసుని విరోధులతో కలిసినట్లుగా ఎక్కడా కనబడదు. వసిష్ఠుడు యుద్ధానికి ప్రధాన సూత్రధారి. అతని సంబంధీకుడు జమదగ్ని కూడ బహుశా అతనివెంట వుండవచ్చును. తర్వాత వసిష్ఠుని స్థానం విశ్వామిత్రుడు

తీసుకొన్నాడు. దాశరాజ్ఞ యుద్ధంలో ఆయన, ఆయనవగడాలైన కౌశికులు సుదాసుకు సహాయపడ్డారు.

పదిమంది రాజులు శత్రువులు. కాని శత్రువుల సంఖ్య కేవలం పదిమంది అని కాదు, ముఖ్య శత్రువులు పదిమంది. వీరి లెక్క ఋగ్వేదంలో చెప్పబడలేదు. ఇందు గురించి ఋగ్వేద పండితుల్లో అభిప్రాయ భేదముంది. అయినప్పటికీ పదిమంది ప్రధాన శత్రువుల్లో (1) తుర్వశ (2) యదు(3) అను (4) ద్రుహ్యు (5) పురుగణాలు నిస్సందేహంగా వున్నారు. మిగిలినవారిలో (6) శిమ్యు (7) కవష (కురు శ్రవణుని పురోహితుడు) (8) భేద (9-10) పై కర్ణులిద్దరు వుండ వచ్చును. తుర్వశ యదుల పురోహితుడు కణ్వుడు. ద్రుహ్యులకు భృగుడు, (గృత్స మదుడు). పురులకు అత్రి. వీరుకూడ వాని యజమానుల పక్షానవున్నారనుట సంభవం. కవషుని వలన అతని యజమాని కురుశ్రవణుడు సుదాసు శత్రువుల్లోకి ఆకర్షింప బడుటలో ఆశ్చర్యంలేదు. తుర్వశయదులు మత్స్యులపై ఒకసారి దెబ్బతీశారు. కాని యిప్పుడు మాత్రం మత్స్యులు తమ శత్రువులతో కలిసి సుదాసుకు విరోధు లయ్యారు. ఈ ప్రకారంగా మత్స్యులు పదిమంది లిస్టుకు బయటవున్న శత్రువులు వీరి సంఖ్య 11. 12 పక్థులు (పక్తూనులు) 13 భలానసులు 14 అలినులు 15 విషాణులు 16 అజాలు 17 శివులు 18 శిగ్రులు 19 యక్షులు వీరంతా ఎప్పుడో ఒకప్పుడు సుదాసుకు శత్రువులు.

సుదాసుకు వ్యతిరేకంగా పోరాడిన వారిలో యుధ్యామధి, దాయమానకవి, సతుక, ఉచధ, శ్రుత, వృద్ధి, మన్యు పేర్లు కూడ వున్నవి.

**1. వసిష్ఠ పురోహితుడు :** దివోదాసు కాలంలో భరద్వాజుడు గొప్ప ప్రభావశాలి. కాని సుదాసుని దాశరాజ్ఞ యుద్ధ విజయకాలంలో వసిష్ఠుడు అతని కంటె గొప్ప ప్రభావశాలి. వసిష్ఠుడు తన్ను భరతుల (సుదాసు జనముల) విధాత అను కొన్నాడు. ఆయన స్వయంగా చెప్పుకొన్నాడు (7-33-6) — "కర్రను చూచి భయపడు గోవువలె భరతులు అనవలుగ వున్నారు. వసిష్ఠుడు పురోహితుడైన తర్వాత త్రిత్సులు (భరతులు) సంతానం బాగా పెరిగింది."

"ఇంద్రునిద్వారా కొట్టబడిన యీ త్రిత్సులు విడువబడిన నీటివలె దిగువకు పారిపోయారు. దుష్టమిత్రులకల, వికలబుద్ధులైనవారు బాధింపబడి భోజనమంతా సుదాసుపై వైచిరి" (7-33-15) భోజనమంతటిని యిచ్చిన సంగతిని వసిష్ఠుడు మరల 17వ మంత్రంలో చెప్పాడు. భరద్వాజ కులస్థులు శారీరకంగాకూడ దివోదాసుకు

సహాయం చేశారు. అప్పుడు యింకా శ్రుసాకు. అసికి యింత గట్టి ఏర్పాటు జరగలేదు. అసి (కత్తి)ని ఎత్తేపని ఒక వర్గానికే కట్టిపెట్టలేదు. వసిష్ఠుని ప్రజలు సుదాసునికై బహిరంగంగా పోరాడారు. అందుచేత ఆయన వారిని ప్రోత్సహించాడు.— "వాశ్విత సంతతులారా, కుడివైపున ముడిని వేసుకొన్నమీరు ప్రసన్నులు కండు. మీరు నాకు దూరంగ వుండవద్దని నేను ఎలుగెత్తి చెబుతున్నాను." (7-33-1).

సుదాసుని విజయానికై తన వంశీకులు చేసిన సహాయాన్ని వసిష్ఠుడు పేర్కొన్నాడు.

ఏవేన్నుకం సింధుమేభి స్తతారే వేన్ను
కం భేదమేభిర్జఘాన ॥
ఏ వేన్నుకం దాశరాజ్ఞే సుదాసంప్రావదింద్రో
బ్రహ్మణావో వసిష్ఠాః ॥ (7-33-3)

"ఈ ప్రకారంగా వీరివలన అతడు సింధును దాటాడు. ఈ ప్రకారంగా వీరి వలన భేదుని చంపాడు. ఈ ప్రకారంగా ఓ వసిష్ఠులారా, మీ బ్రహ్మ (ఋక్కులు) ద్వారా యింద్రుడు సుదాసుని రక్షించాడు."

తలపైన పూర్తిగా జుట్టు వుంచుకొనుట ప్రాచీన కాలం నుండి మహమ్మదీయులు వచ్చే పర్యంతం మనదేశంలో వాడుకలో వుంది. ఆ జుట్టును బాగా అలంకరించి ముడివేసుకొనేవారు ఈ చూడ [జడ, ముడి] వేర్వేరు గణాలకు వేర్వేరు విధములుగ వుండేవి. వసిష్ఠుని కులస్తులు తలకు కుడిభాగాన ధరించేవారు. కావున వారిని "దక్షిణతః కపర్దా" (కుడివైపున ముడిగలవారు) అన్నారు. దాదాపు క్రీస్తుశకారంభం వరకు స్త్రీలుకూడ పాగా చుట్టుకొనేవారు. వైదిక స్త్రీలుకూడా పాగా చుట్టుకొని వుంటారు. కాబట్టి వసిష్ఠకుల స్త్రీలుకూడ 'దక్షిణతః కపర్దీ' అయి వుంటారు. కన్యలు చతుష్కపర్దా అనగా నాలుగు జడలు వేసుకొనేవారు. ఇక్కడ కపర్దా అంటే ముడి కాదు. పిలక (జడ) బహుశా రెండు పిలకలు చెవుల దగ్గరనుండి ముందుకు, రెండు వెనుకకు వ్రేలాడుతుండేవి.

ఋక్కుల్లో ఎక్కడా ప్రమాణం కన్పడక పోయినప్పటికీ సుదాసుకు ప్రతర్దనుడను సోదరుడు వున్నాడు. కొందరు వేద పరిశోధకులు, ప్రతర్దనుడు పెద్దవాడు. అతన్ని భరద్వాజుడు గద్దెపై కూర్చొపెట్టాడు పౌరుషవంతుడగు సుదాసు దీన్ని సహించలేదు, అని అభిప్రాయ పడుతున్నారు. అట్లు కాకపోతే ప్రతర్దనుడు

తండ్రికి తగిన సమర్థవంతుడైన పుత్రుడు కాకపోవచ్చు. అతడు దివోదాసు విజయా లను కాపాడలేకపోయాడు. అసంతృప్తులైన ప్రజలు సుదాసుని పక్షం వహించారు. వారిలో వసిష్ఠుడు ముఖ్యుడు. వసిష్ఠుడు సుదాసుకు అభిషేకం చేసి అతన్ని భరతుల రాజుగ ప్రకటించాడు. అన్నదమ్ముల మధ్య పోరు జరిగింది. బహుశా అందు లోనే ప్రత్యర్థనుడు చనిపోయివుండవచ్చును. సముద్రగుప్తుని సింహాసనంపై కూర్చొన్న రామగుప్తుని చంపి తమ్ముడు చంద్రగుప్త విక్రమాదిత్యుడు అయినట్లు సుదాసు భరతులకు అధిరాజు అయ్యాడు. ఇట్లు అనుకొంటేనేని త్రిత్సులతో మొదట సుదాసుచేసిన యుద్ధానికికూడ వ్యాఖ్య కుదురుతుంది.

2. సుదాసు : వసిష్ఠుడు స్వయంగా తనకు సుదాసు దానము లిచ్చిన సంగతి చెప్పాడు—(7-28-22,23)

ద్వేనప్తుర్దేవవాత : శతే గోర్ద్వా రథా
వధూమంతా సుదాసః ।
అర్హన్నగ్నే పైజవనస్య దానం హోతేవ ।
సద్మ పర్యే మిరేభన్ ॥ 22
చత్వారో మా పైజవనస్య దానా :
స్మద్దిష్టయః కృశనినో నిరేకే ।
ఋజ్రాసో మా పృథివిష్ఠా : సుదాసస్తోకం
తోకాయ శ్రవసే వహంతి ॥ 23

దేవవాతుని మనుమడు సుదాసు వధువులతోకూడ రెండు రథములను, రెండు వందల ఆవులను నాకు యిచ్చాడు. "ఓ అర్హన్ (పూజ్య) అగ్నీ, పైజవనుని (సుదాసుని) దానమును పొంది హోతవలె నేను స్తుతిని గానంచేస్తూ యింటికి వెళ్ళు తున్నాను." "సుదాసు బంగారు ఆభూషణములుకల నాల్గు గుర్రాలను నాకు యిచ్చాడు." (23)

దివోదాసుని పుత్రుడు సుదాసుడనుటను కొందరు పండితులు సందేహిస్తు న్నారు. కాని వసిష్ఠుని యీ ఋక్కువలన అట్టి సందేహానికి తావులేదు. (7-18-25)

ఇమంనరో మరుతః సశ్చతాను దివోదాసం నపితరం సుదాసః—
అవిష్టనా పైజవనస్య కేతం దూణాశం క్షత్రమజరం దువోయు ॥

"ఓ వీరులగు మరుత్తులారా, తండ్రి దివోదాసునివలె సుదాసుకి సహాయం చేయండి. పైజవనుని కోర్కెను నెరవేర్చండి. అతని స్థిరమైన రాజ్యాన్ని రక్షించండి."

సుదాసుని కొక్కనికే వసిష్ఠుడు ఆదరణీయుడుకాదు. అతనికి త్రసదస్యుడు కూడ కృపాపాత్రుడు. కాబట్టి ఆయన ఇంద్రుని మహిమను గురించి చెప్పుతూ, "ఓ ఇంద్రా, నీవు సుదామునకు అన్ని రక్షణలు యిచ్చావు. యుద్ధంలో పౌరుకుత్స త్రసదస్యుని రక్షించావు" అని అన్నాడు. (7-19-3) దీన్నిబట్టి త్రసదస్యుడు సుదాసునితో యుద్ధం చేయలేదను సందేహం కలుగుతుంది. కాని యిది మరియొక సందర్భమున చెప్పింది.

సనాతా త యింద్రభోజనానిరాతహవ్యాయ దాశుషే సుదాసే।
వృష్ణే తే హరి వృషణా యునజ్మివ్యంతు బ్రహ్మాణి పురుశాక వాజం ॥

(7-19-6)

"ఓ ఇంద్రా, రాతహవ్య (హవిదాత) సుదాసుని కొరకు నీవు భోజనం (సంపత్తిని) సదా యిస్తున్నావు".

హంతావృత్ర మింద్రః శూశువానః ప్రావీన్ను వీరో జరితారమూతీ।
కర్తా సుదాసే అహవా ఉ లోకం దాతా వసు ముహురాదాశుషే భూత్॥

(7-20-2)

"ఇంద్రుడు బలసిన శత్రువును చంపుతూ స్తోతను శీఘ్రంగా రక్షిస్తున్నాడు. సుదాముని కొరకు ఆయన లోకాన్ని నిర్మించాడు. భర్తనకు అతడు మాటిమాటికి ధనమిచ్చాడు."

"ఓ యింద్రుడా ! నీ వందలాది రక్షణలు, వేలాది ప్రశంసలు సుదాసునికై వుండుగాక." (7-25-3).

వకిః సుదాసో రథం పర్యాస వరీరమత్।
ఇంద్రో యస్యావితా యస్య మరుతో గమత్
సగోమతి వ్రజే॥ (7-32-10).

ఇంద్రుడు రక్షించుతున్న, మరుత్తులు రక్షించుతున్న సుదాసుని రథాన్ని ఎవరూ తొలగించలేరు, అడ్డుకొనలేరు. అది గోవుల గోష్ఠమునకు పోవుచున్నది.

"ఓ యింద్ర వరుణులారా, దాస, ఆర్య శత్రువులను చంపండి. సుదాముని రక్షించండి(7-83-11).'ఇంద్ర వరుణుల కృపచే వృధు, పర్శులు గోవులను దోచుటకు

తూర్పుదిక్కుకు వెళ్లారు' అని వసిష్ఠుని పై ఋక్కునలన తెలియుచున్నది. 'నీవు దాసులను, వృత్రులను సంహరించావు. ఆర్యశత్రువులను చంపావు. సుదాసుని రక్షించావు'. మొదట ఋషి ఏ శత్రువులను సంహరించుటకు ప్రార్థన చేశాడో వారు దస్యులు. కాని యిప్పుడు ఆర్య దాస శత్రువు లిద్దరిని నాశనం చేయుటకు ఆయన ప్రార్థించవలసి వచ్చింది. సుదాసు శత్రువులు మాత్రం ముఖ్యంగా ఆర్యులే.

## 2. దాశరాజ్ఞ యుద్ధం

**1.** శత్రువులు : శంబర యుద్ధంవలె దాశరాజ్ఞ యుద్ధం కూడా ఒకటి రెండు సంవత్సరాల యుద్ధం కాదు అందుకు సుదాసుకు చాలాకాలం పట్టింది.

యువాంహవంత ఉభయాస ఆజిష్వింద్రంచ
వస్వోవరుణా చ సాతయే।
యత్ర రాజభిర్దశభిర్ని బాధితం ప్ర
సుదాసమావతం తృత్సుభిః సహ॥ 7/83/6
దశరాజానః సమితా అయజ్యవః
సుదాస మింద్ర వరుణా న యుయుధుః।
సత్యా నృణామద్ మసదాము పస్తుతిర్దేవా
ఏషామభవన్ దేవహూతిషు॥ (7-83-7)

"ధనం కోరి యిరు పక్షాలు సంగ్రామమందు ఇంద్రవరుణులను సహాయం చేయవలసిందిగ ఆహ్వానించారు త్రుత్సులతో కూడా సుదాసు పదిమంది రాజులవలన యిబ్బంది పడుచుండగా మీరు అతన్ని రక్షించారు."

"ఓ యింద్ర వరుణలారా ! యజ్ఞ విముఖులగు పదిమంది రాజులు యుద్ధంలో సుదాసుతో పోరాడలేరు. యజ్ఞమందు కూర్చున్న యీ నరుల స్తుతి సత్యమైంది. దేవతలు వీరి ఆహ్వానం అందుకొని వచ్చారు."

దీని అర్థమేమనగా (7-83-6) త్రిత్సులతో వచ్చిన గృహ కలహం శాంతించింది. ఇప్పుడు పదిమంది రాజులు సుదాసుని, అతని త్రిత్సు గణాలను ఓడించుటకు ప్రయత్నించారు. ఏడవ ఋక్కులో అయజ్ఞ కర్తలు, అభక్తులగు పదిమంది రాజులు సమితా అనగా కూడి సుదాసుతో యుద్ధం చేశారు, అని చెప్పబడింది. సమితా అంటే అర్థం ఒకటి అగుట, లేక సమితౌ (యుద్ధ క్షేత్రమందు) అందు యుద్ధం చేయు విషయం సుదాసు శత్రువుల్లో తుర్వశయదులు ముఖ్యులు (6-18-6)

పురోళా ఇత్తుర్వ శోయక్షురాసీద్రాయే
మత్స్యాసోనిశితా అపీవ ।
శ్రుష్టిం చక్రుర్భృగవో ద్రుహ్యవశ్చ సఖా
సఖాయ మతరద్విషూచోః॥
అపక్థాసో భలానసో భనంతాలినాసో విషాణినః శివాసః।
ఆయోన యత్సధమా ఆర్యస్య గవ్యాతృత్సుభ్యో
అజగన్యు ధాన్నౄన్॥ (6-18-7)
దురాధ్యో అదితిం స్రేవయంతో చేతసో
వి జగృభ్రే పరుష్ణీం।
మహనా వివ్యక్ పృథివీం పత్యమానః
పశుష్క విరశయ చ్చాయ మానః॥ (6-18-8)

పై ఋక్కుల వలన మనకు యీ విషయాలు తెలుస్తాయి— తుర్వశులు, మత్స్యులు, భృగులు. ద్రుహ్యులు కలిసి ఒకరి కొకరు సహాయకులై (కలిసికట్టుగా) దండెత్తారు. (7-18-6) పక్థులు, భలానసులు, అలినులు, విషాణులు, శివులుకూడా దండెత్తారు. అందు ఆర్యుల గోవుల త్రిత్సులకు దక్కినవి. దుర్దాంతులు, దుర్నీతులు అగు శత్రువులు పరుష్ణిని పట్టుకొన్నారు. కాని చివరకు చాయమాన పుత్రుడు కవి నేలమీద ఒరిగాడు. పరుష్ణివద్ద శత్రువులు ఓడిపోయారు. సుదాసు వారిని చెదర గొట్టాడు. (7-18-10 8) దాశరాజ్ఞయుద్ధంలో అన్నిపైపుల నుంచి ముట్టడించబడిన సుదాసుకు ఇంద్ర వరుణులు సహాయం చేశారు. యుద్ధమందు కపర్దులన్న శ్వేత త్రిత్సులు ప్రార్థిస్తున్నారు (7-83-8).

విశ్వామిత్రుడు వ్యాస, సట్లజ్‌లను లోతునుండి, లోతు తక్కువగుటకు అందంగా ప్రార్థించాడు. దాన్ని ఋగ్వేదంలో సర్వోత్కృష్ట కవిత్వమని చెప్ప వచ్చు. కాని నదులను లోతు తక్కువ చేయు విషయంలో వసిష్ఠుడు కూడ శక్తి వంతుడు. నదులు ఋషుల ప్రార్థన విని లోతు తక్కువ కాకపోవచ్చును. కాకతా ళీయంగా అట్లు జరుగవచ్చుకూడ. శత్రువులను తరుముకొంటూ సుదాసుని అశ్వికులు నదిలో ఒకచోట నీరు తక్కువగ వుండుటను చూచి వుంటారు. ఇది దాశరాజ్ఞ యుద్ధ సమయంలో జరిగింది. కాబట్టి యీ శ్రేయస్సు వసిష్ఠుని కియవలసి వుంటుంది. వసిష్ఠుడు స్వయంగా యీ విషయాన్ని చెప్పుకున్నాడు. (7-18-5)—
17)

"ఇంద్రుడు సుదాసుని కొరకు నదులను లోతు తక్కువగాను, దాటుటకు వీలుగాను చేశాడు" దీని తర్వాతనే పుర్వశ, మత్స్య, భృగు, ద్రుహ్యులు మొదలైన వారిపైన పోరాటం, దాయమూనకని చంపబడుట చెప్పబడింది. దీన్నిబట్టి సుదాసు శుతుద్రి, విపాశ్ నదులను కాదు, పరుష్ణినదిని దాటి శత్రువులపై దండెత్తినట్లు తెలుస్తుంది.

ఏకంచ యో వింశతి చ శ్రవస్యా
వై కర్ణయోర్జనాన్రాజాన్యస్తః ।
దస్మో న సద్మన్ని శిశాతి బర్హిః
శూర స్సర్గమకృణోదింద్ర ఏషాం ॥

(7-18-11)

అధ శ్రుతం కవషం వృద్ధమప్స్వనుద్రుహ్యం
నివృణాక్ వజ్రబాహుః ।
వృణానా అత్ర సఖ్యాయ సఖ్యం త్వాయంతో
యే అమదన్ననుత్వా ।

(7-18-12)

వి సద్యో విశ్వా దృంహితాన్యేషామింద్ర
పురః సహసా స ప్తదర్ద ః ।
వ్యానవస్య తృత్సవే గయం భాగ్జేష్మ
పూరుం విదథే మృధ్రవాచం ॥

(7-18-13)

నిగవ్యవోఽని వవో ద్రుహ్యవచషష్టిః శతా
సుషుపుః షట్ సహస్రా ।
షష్టిర్వీరాసోఅధిషడ్దువోయు
విశ్వేదింద్రస్య వీర్యాకృతాని ॥

(7-18-14)

శశ్వంతోహిశత్రవోరారధుష్టేభేదస్య
చిచ్ఛర్ద్ధతో విందరంధిం ।
మర్తాం ఏనః స్తువతోయఃకృణోతి
తిగ్మం తస్మిన్నిజహి వజ్రమింద్ర ॥

(7-18-18)

"ఋత్విజులు యజ్ఞంలో దర్భలను కోసినట్లు, సుదాసు వైకర్ణ లిరువురి యొక్క 21 మందిని నరికాడు." (7-18-11). వజ్రబాహుడైన యింద్రుడు శ్రుతక వషుని, బృద్ధుని, ద్రుహ్యుని నీటిలో ముంచారు. దీనినిబట్టి శత్రువు లొకసారి పరుష్ణినదిని దాటి భరతుల భూమిలోనికి (పరుష్ణి, శుతుద్రీలమధ్య భూమి) వచ్చినట్లు తెలుస్తుంది. సుదాసుడు వారితో భయంకర యుద్ధం చేయుటవలన వారు పారిపోతూ ఎందరో నదిలో మునిగి చనిపోయి వుంటారు. సుదాసు ఎక్కడో ఒకచోట నది లోతు తక్కువగ వున్నచోట నదినిదాటి శత్రువులను తరిమారు. (7-18-12) వసిష్ఠుడు తర్వాత ఋక్కులో (7-18-13)

"సుదాసు తన శత్రువులయొక్క ఏడు దుర్గాలను ధ్వంసం చేశాడు. వారి సంపత్తి చాలా త్రిత్సువులకు లభించింది' అని చెప్పాడు. ఈ యుద్ధంలో నర సంహారం ఎక్కువగా జరిగింది. 'దండెత్తివచ్చిన అను, ద్రుహ్యు వీరులు ఆరు వందల ఆరువేల అరువది ఆరుమంది (600666) చనిపోయారు. (7-18-14) సుదాసుచేసిన మహాయుద్ధం ఈ దాశరాజ్ఞ యుద్ధమే. అతడీ యుద్ధంలో శత్రువులను పూర్తిగా ఓడించి పరుష్ణినదికి అవలవరకు పారద్రోలి వారి భూములనుకూడ ఆక్రమించుకొన్నాడు.

సుదాసు భేదుని చంపాడు (7-'8-18). కాని భేదుడు అర్యునిగా తోచడు. దాశరాజ్ఞ యుద్ధంలో సుదాసు ఇరకాటంలో పడుటచూచి భేదుడను రాజో లేక గణమో రాజ్య విస్తరణకు పూనుకోవచ్చు. అప్పుడు సుదాసు అతన్ని చంపాడు. ఇంతగా ఘనవిజయాన్ని సాధించిన తర్వాత సుదాసు కీర్తి పెరుగుట సహజం. వసిష్ఠుని మాటల్లో "అతనికీర్తి భూమ్యాకాశాలకు విస్తరించింది. అతడు బాగా దానం చేశాడు. ప్రజలు అతన్ని యింద్రునివలె స్తుతిస్తున్నారు. అతడు యుద్ధంలో యుధ్యామధిని చంపాడు. మరుత్తులారా, యీ సుదాసుని కూడ తండ్రి దివోదాసుని మాదిరగ స్వీకరించండి. పైజవనుని గృహాన్ని రక్షించండి. సుదాసుని బలము అవినశిమై అజరమై, అశిథిలమై యుండుగాక. (7-18-24-25)

2. యుద్ధం : వసిష్ఠుని పౌరోహిత్య కాలం (ప్రధానమంత్రిత్వం)లోనే సుదాసు దాశరాజ్ఞ యుద్ధాన్ని (7-83-1,10). తూర్పున యమునా నది వరకు విజయ యాత్రను చేశాడు వసిష్ఠుని యీ ఋక్కువలన పై విషయం మనకు తెలుస్తుంది-

అవదింద్రం యమునా తృత్సవశ్చ ప్రాత్ర భేదం
సర్వ తాతామషాయత్ ।

అజాసశ్చ శిగ్రవో యక్షవశ్చ బలిం
శీర్షాణి జభ్రు రశ్వ్యాని॥ (7-18-19)

"యమున, తృత్సులు యింద్రుని సంతృప్తి పర్చారు. ఇక్కడ భేదుని యింద్రుడు చంపాడు. అజ, శిగ్రు, యక్షులు గుర్రాల తలలను కానుకగా తెచ్చారు" భేదు యమున, సమీపంలో వున్న రాజాగాని గణంగాని కావచ్చు. అజ, శిగ్రు, యక్షులు యమున, గంగకుమధ్య నుండే ఆర్యేతర జాతులు కావచ్చు. వారు సుదాసునికి లోబడినారు.

వసిష్ఠుడు భరతుల పేరుకు శాశ్వతాన్ని కలిగిస్తూ యిట్లు చెప్పాడు—

ప్రప్రాయమగ్నిర్భరతస్య శృణ్వేవియత్సూర్యో
నరోచతే బృహద్భాః ।
అభియః పూరుం పృతనాసుతస్థౌద్యుతానో
దైవ్యో అతిథిః శుశోచ॥ (7-8-4)

పురులను ఓడించిన ఆ భరతుల అగ్ని చాలా ప్రసిద్ధమైనది. అది సూర్యుని వలె మిక్కిలి కాంతితో ప్రకాశిస్తుంది. ఆ అగ్ని దేవుడు దీప్తిమంతుడై ప్రజ్వలిస్తూ భరతుల స్తుతిని వింటున్నాడు."

వసిష్ఠుడు, అతని గణం సుదాసు విజయముల శ్రేయస్సులో సర్వాధిక్యతను తామే పొందాలను కొన్నారు. సుదాసు చిరకాలమట్లుండుటకు యిష్టపడలేదు. అభిమానంతో కొంతవరకు తిరస్కారం కూడా చేసివుండవచ్చు. వసిష్ఠుని పుత్రుడు శక్తి తండ్రివలె గాంభీర్యంతో తన వారసత్వాన్ని నిర్వహించకపోవచ్చు. పరంపరగా మనకు తెలియుచున్నదేమనగా, మంత్రి పదవిని సుదాసు యితరుల కిచ్చుట శక్తికి యిష్టంలేదు. అతడు వ్యతిరేకించాడు. సుదాసు చేతిలో తునకు ప్రాణాలు పోగొట్టు కొన్నాడు. సుదాసుకు మొదటి మంచి యుద్ధములలో విశ్వామిత్రుడు సహాయపడుతూ వచ్చాడు. కాబట్టి, వసిష్ఠునితో వైరుధ్యం కల్గినమీదట అతడు ఆ పదవిని విశ్వామిత్రునికి యిచ్చాడు.

3. సుదేవి రాణి : సుదాసు భార్య రాణి సుదేవి. ఆమె భర్తకు తగిన భార్య. సుదాసు ఆమెను అశ్వినీ దేవతల ప్రసాదమున పొందినట్లు కుత్స అంగిరసుడు చెప్పాడు. (1-112-19).

"యాభిః సుదాస ఊహథుః సుదేవ్యం తాభి రూషు ఊతిభి రశ్వి నా గతం!"

# 3. అశ్వమేధం

1. విశ్వామిత్రుడు : విశ్వామిత్రుని నదీ సూక్తం చూచినచో అతడు ఋగ్వేద సర్వ శ్రేష్ఠ కవి అని తెలుస్తుంది. ఆయనకు యింద్రుని గురించి కొంత అభిమానం కూడ వుంది. (3-53-12)

య ఇమే రోదసీ ఉభే అహ మింద్ర మతుష్టవం ।
విశ్వామిత్రస్య రక్షతి బ్రహ్మేదం భారతం జనం ॥

"రోదసి - పృథ్వీ రెంటికీ రక్షకుడైన ఇంద్రుని నేను స్తుతించాను. విశ్వామిత్రుని యీ బ్రహ్మ (ఋక్కు) భారత గణాలను రక్షిస్తుంది"

విశ్వామిత్రుడు నదులను లోతు తక్కువగా చేసి సుదాసును దాటించాడు అన్న విషయం తప్పుగా తోస్తుంది. "మహా ఋషి విశ్వామిత్రుడు సింధు అర్ణవము (నదిని)ను అడ్డగించగా ఇంద్రుడు కుశికులతో సహా సుదాసును దాటించాడు" అని విశ్వామిత్రుడు (3-53-9) ఋక్కులో చెప్పాడు.

కుశికులు ప్రాచీన పురుగణాలతో సంబంధమున్న గణం. ఆ గణం సరస్వతీ ఉపత్యకలో ఉండేది. వసిష్ఠుని గణంవలె వీరు కూడ చాల శక్తి వంతులు.

అశ్వోనక్రందన్ జనిభిః సమిధ్యతే
వైశ్వానరః కుశికేభిర్యుగేయుగే।
సనో అగ్నిః సువీర్యం స్వశ్వ్యం దధాతు
రత్న మమృతేషు జాగృవిః॥

— (3-26-3)

"వైశ్వానర అగ్ని అశ్వంవలె సకిలిస్తూ కుశికులచే యుగయుగములందు (సదా) ప్రజ్వలింపబడుతుంది. అమృతములందు జాగరూకమైన ఆ అగ్ని మాకు బలమును, మంచి అశ్వాలను, మంచి రథాలను ప్రసాదించుగాక" అని విశ్వామిత్రుడు తన వంశీకులను గురించి చెప్పుకొన్నాడు. "కుశికులు ప్రతి యింటిలోను అగ్నిని పేరిస్తున్నారు. (3-29-15) మా యొక్క ప్రతి యింటిలోను, అగ్ని ప్రతిష్ఠితమైంది, అందరు అగ్నిదేవుని భక్తులు, అని సరస్వతీ ఉపత్యకలో ఉన్న యీ ఆర్యులు గర్వపడేవారు. గొప్ప శత్రువులను ఓడించుట, యమునా ఉపత్యకలోని అనార్యులను లోబర్చుకొనుట అనునవి వసిష్ఠుని కాలంలోనే జరిగాయి. విశ్వామిత్రుని

కాలంలో యీ విజయాలను స్థిరంగా అట్టిపెట్టుకోవలసివుంది. కాని యిందులో విశేష మేముంది ? అందుకనే విశ్వామిత్రుడు సుదాసు చేత అశ్వమేధం చేయించాడు.

2. అశ్వమేధం :

మరలి సుగంధిత అశ్వమాంసం ఆర్యులకు ప్రియమైన ఆహారమని ఋక్కుల వలన తెలుస్తుంది (1-162-12) కాని అశ్వాన్ని హవన రూపంలో బలి యిచ్చి ఒక పెద్ద యజ్ఞం ద్వారా తన ప్రభుకకు ప్రఖ్యాతి కల్గించుట బహుశా మొట్ట మొదటి పర్యాయం విశ్వామిత్రుని కాలంలో జరుపబడింది. ఋక్కుల్లో ఒక్క ఋక్కు మాత్రమే యీ యజ్ఞాన్ని గురించి పేర్కొంది. అందులోకూడ అశ్వంతోపాటు మేధ శబ్దం ప్రయోగింపబడలేదు. (3-53-11)

ఉపప్రేత కుశికాశ్చేత యద్ధ్వమశ్వం
రాయేప్రముంచతా సుదాసః।
రాజావృత్రం జంఘనత్ ప్రాగపాగుదగథా
యజాతే వర అపృథివ్యాః॥ (3-53-11)

"ఓ కుశికులారా, దగ్గరకురండి, జాగరూకులై కండు. ధనం (జయము) కొరకు సుదాసుని అశ్వం విడవండి. రాజు (సుదాసు) తూర్పు, పడమర, ఉత్తరము లందున్న శత్రువులను చంపి పృథ్వియొక్క సర్వశ్రేష్ఠ స్థానమందు యజ్ఞం చేయుగాక," అని విశ్వామిత్రుడు చెప్పాడు. కావున సుదాసు గుర్రాన్ని విడుచుటలో రాజకీయ ఉద్దేశ్యం స్పష్టమవుతుంది. పై ఋక్కునందు తూర్పు, పడమర, ఉత్తరం అని చెప్పబడి దక్షిణం విడువబడింది. దీన్నిబట్టి సుదాసుని విజయం సింధునది, హిమాలయం, యమున పైపున వున్నట్లు తెలుస్తుంది. దక్షిణం (మరుభూమి) చాలా భాగం అప్పుడు కూడా విజేతను ఆకర్షించగల్గిన సంపన్న దేశం కాకపోవచ్చు. ఈ గుర్రాన్ని బహుశా ఎవరూ అడ్డగించకపోవచ్చు. కాబట్టి ఏ సంఘర్షణా చేయవవసరంలేక పోవచ్చు. అట్లు జరిగివుంటే విశ్వామిత్రుడు తప్పకుండా ఋక్కుల్లో ఆ విషయాన్ని పేర్కొనే వాడే. భరతులకు రాజైన సుదాసుకు విశ్వామిత్రుడు జీవితకాలమంతా పురోహితుడు. భరతుల అభిమానం వల్ల కూడ అతడు ఒక ఋక్కులో తన అంతం తృప్తిని తెల్పాడు.

ఇమ ఇంద్ర భరతస్య పుత్రా అపపిత్వం
చికితుర్న ప్రపిత్వం ॥
హిన్వన్త్యశ్వమరణం న నిత్యం జ్యావాజం
పరిణయన్ త్యాజౌ॥ (3-53-24)

"ఓ యింద్రుడా, భరత పుత్రులకు యుద్ధం తెలుసు ఐక్యత తెలియును-శత్రువుల పైకి గుర్రం పంపుతారు. ఇక్కడ ప్రతి విశ్యం యుద్ధానికి ధనుస్సు ధరిస్తారు."

సుదాసుని కాలంలో సప్తసింధులోని ఆర్యులు చరమ స్థాయిని అందుకొన్నారు. ఆ కాలంలో సర్వశ్రేష్ఠులైన ఋషులు పుట్టారు. ఆ కాలంలోనే వేర్వేరు గణతంత్రములుండాలను భావానికి తీవ్రమైన దెబ్బ తగిలింది. అభిమానం గల ప్రతి ఆర్యగణం తన హద్దుల లోపల ఏ యితర గణ జోక్యము చేసికొనుటను సహించదు. బలవంతుడైన శత్రువును ఎదిరించవవసరం లేనంతవరకు యీ విధానం నడుస్తుంది. 'మీ (కంసాలి పొయ్యిల) వేర్వేరు పొయ్యిలు ఎక్కువకాలం సాగవని దుర్దాంతుడైన శంబరుడు తన విజయాల ద్వారా ఆర్యులకు తెలియచెప్పాడు. పొరుగున ఉన్న ఆర్యులు శత్రువులను ఎదిరించుటలో పూర్తి విజయాన్ని పొందలేక పడమర నుండి యదు, తుర్వశులను పిలిపించుకొన్నారు. తర్వాత ద్రుహులు, పర్శులు కూడ యిదే ఉద్దేశ్యంతో తూర్పుకు వచ్చారు. కాని వేర్వేరుగా వుండి ఎవరూ విజయం సాధించలేక పోతున్నారు. దివోదాసు సమస్త ఆర్యగణాల బలంతో శంబరుని బలమును పూర్తిగా నిర్మూలించాడు దివోదాసు తర్వాత మళ్ళీ ఆర్యగణాలు తమ పాత మనస్తత్వం కావాలనుకొన్నారు. కాని వారు సఫలీకృతులు కాగల్గుతారా? అభివృద్ధి చెందిన ఆర్థిక జీవితం, పరాక్రమం గల సుదాసు యిందుకు బాధాకరంగా వున్నారు. అతడు సప్తసింధు నంతా సమైక్యపరుచుటకు పనిచేశాడు. యమునకు తూర్పున కూడ ఆర్యుల వ్యాప్తికి మార్గం తెరిచాడు.

—•—

# పదకొండవ అధ్యాయం

# రాజ్య వ్యవస్థ

## 1. శాసకులు, శాసితులు

సప్తసింధులోకి ఆర్యులు మొట్టమొదటగా ప్రవేశించేటప్పుడు వారు గణ వ్యవస్థలో వున్నట్లుగా వెనుకటి అధ్యాయంలో మీరు చదివారు. ఆర్య గణాల్లో ప్రముఖమైనవి ఐదు. వీరిలో ఒక శాఖ భరతగణం. దివోదాసు, సుదాసు భరత గణంలో పుట్టారు. ఆర్యుల నివాసాన్ని, ప్రభావాన్ని తూర్పునకు విస్తరింపచేయుటలో యీ గణమే అందరికంటే ముందుంది. తర్వాత భరతుడను రాజు ఎవరైనా పుట్టి వుండవచ్చు. కాని మన దేశానికి ఖ్యాతి ఆయన వలన రాలేదు. ఆ ఖ్యాతి యీ ఋగ్వేద భరతగణం ద్వారానే వచ్చింది. గణవ్యవస్థ నుండి బయటపడి ఆర్యులు యిప్పుడు సామంత వ్యవస్థలోకి ప్రవేశించారు. పితృసత్తాక స్వేచ్ఛా వాతావరణం నుండి రాజరిక నిరంకుశత్వంపైపుకు పోతున్నారు కాని వారు ప్రజాతంత్రం విడువ లేదు. ఆర్యుల ఆర్థిక వ్యవస్థ యిప్పటికీ పురాతనమైంది. గోవులు, గుర్రాలు, గొర్రెలు, మేకలు—ఇవే వారికి గొప్పధనం. ఇవే వారి జీవయాత్రకు సాధనం. పశువుల మేతకు పచ్చికబయళ్ళు, అవి వుంటానికి గోష్ఠములు కావాలి. ఒక్కొక్కరి వద్ద వేలాది గోవులు, గుర్రాలు వుండేవి. ఇట్టివారికి జనబాహుళ్యముతో కూడిన నగరాలు పనికిరావు. మొహి జెదారో, హరప్పా వంటి నగరాలు వున్నాయి. కాని గ్రామాలే వారికి ఎక్కువ అనుకూలం. ప్రథమంలో గ్రామం అంటే అర్థం గుంపు. హూణుల, తురుష్క భాషలో ఓర్దూ అంటారు. తర్వాత గ్రామం అంటే మనుష్యుల గుంపుకు బదులు యిళ్ళ సముదాయమైంది. ఆర్యుల నివాసం గ్రామం, రాష్ట్రముగా విభక్తమైనాయి. రాష్ట్రం, జనపదం ఒకే అర్థాన్ని సూచించు పదాలు. జనముల (గణముల) ప్రాధాన్యతను తెలుపు పదం జనపదం—జనముల నివాస స్థానం. సామంతుల ప్రాధాన్యతను తెల్పు పదం రాష్ట్రం. గ్రామ పెద్దను గ్రామణి (గ్రామ+నీ) అనేవారు. రాష్ట్ర పెద్దను రాజు అనేవారు. రాజును సమ్రాట్, స్వరాట్, శాస, ఈశాన, భూపతి, పతి శబ్దాలు వాడబడ్డాయి. రాజుల సంతానాన్ని రాజపుత్రుడు, రాజదుహిత అన్నారు.

1. గ్రామణి : నాభానేదిష్ఠఋషి మనువును గ్రామణి అన్నాడు. గ్రామ నాయకుడు అను అర్థమందు కాదు, ఆర్యుల సమూహానికి నేత అను అర్థమందు, యిక్కడ ఆయన 'గ్రామణి' పదం వాడాడు. తర్వాత వేయి సంవత్సరాలకు సింహళంలో ఒక పరాక్రమం గల రాజును దుష్టరగుటచేత దుష్టగ్రామణి అన్నారు. అంటే రాజును కూడ గ్రామణిఅనుట వాడుకలోవుంది. మనువు ఔదార్యమును గురించి ఋషి ప్రశంసించాడు (10-62-11) "సహస్రదాతయైన గ్రామణి మనువుకు ఎవరూ అనిష్టం చేయవద్దు. ఇతని దానం సూర్యునితోపాటు సర్వత్రా చేరుగాక, పావక్షి మనువుకు దేవుడుఆయువు నొసంగుగాక. ఇతని నిరంతర దానం మేము పొందుతాం."

2. రాష్ట్రం : వసిష్ఠుడు వరుణుని రాష్ట్రంకు రాజు అని చెప్పాడు. (7-34-10, 11).

"ఈ వరుణ జలమును సహస్ర నేత్రుడగు ఉగ్రవరుణుడు చూస్తున్నాడు."

"అతడు రాష్ట్రంకు రాజు (రాజా రాష్ట్రాణాం), నదులకు రూపం. అతని క్షత్రం (బలం, రాజ్యం) అనుపమం, సర్వగతం."

ఒక కల్పిత మహిళా ఋషి జాహూకూడ రాష్ట్రన్ని పేర్కొంది. (10-109-3).

"యథా రాష్ట్రం గుపితం క్షత్రియస్య"

"ఈమె బ్రహ్మజాయ. ఈమె దేహాన్ని చేతితోనే పట్టుకొనవలెను." అని అందరు చెప్పారు. క్షత్రియునిచేత రక్షితమైన రాష్ట్రంవలె ఈమె పంపబడిన దూతయందు ఆసక్తురాలు కాలేదు."

క్షత్రియ (రాజు) శబ్దం యిప్పటికిని ఆ ప్రాచీన అర్థమందు వాడుకలో వుంది. ఉదాహరణమునకు ఈనాడు స్వరాట్ దానయవహూ (దారా) యీ శబ్దం తనకు ఉపయోగించుకొన్నాడు. జాహూను ఆమె భర్తబృహస్పతి విడిచిపెట్టాడు. భార్యను అతను ఏలుకొనవలసిందిగా యీ ఋక్కులందు చెప్పబడింది.

3. విశ్ : విశ్ అంటే ప్రజలు. తర్వాత దీనినుండి వైశ్య (విశుని సంతానము) శబ్దం వచ్చింది. శక్తివంతులగు గణాలను విశ్ అన్నారు. విశకు రాజును చేయటానికి, దింపటానికి అధికారము వుంది. రాజు సింహాసనంపై ఎక్కినప్పుడు

చెప్పబడు మంత్రం వలన ఈ విషయం మనకు తెలుస్తుంది. అందరికంటె ప్రాచీన ఋషి భరద్వాజుడు విశులు రాజును ఉపస్థానం (సన్మానం) చేసినట్లు చెప్పాడు. (6-8-4).

అపాముపస్థే. మహిషా అగర్భత
విశో॰రాజానము పతస్థుర్ ఋగ్మియం ।
అదూతో అగ్నిమభర ద్వివస్వతో
వైశ్వానరం మాతరిశ్వా పరావతః ॥

"మహా మరుత్తులు ఆకాశమందు అగ్నిని ధరించారు. విశులు అతన్ని పూజ్యుడని తలంచి ఉపస్థానం చేశారు. వివస్వానుని (సూర్యుని) దూత వాయువు దూరంనుండి వైశ్వానర అగ్నిని యిక్కడకు చేర్చాడు."

4. రాజు : రాష్ట్రానికు రాజును గురించి యింతకుపూర్వం మేము వసిష్ఠుని ఋక్కుల్లో మీకు తెల్పియున్నాం. ఆయనకు సమకాలికుడగు వృద్ధ ఋషి భరద్వాజుడు అగ్నిని రాజుతో పోల్చాడు. (6-4-4) "ఓ అగ్నీ, నీవు మాకు అన్నం యిమ్ము. రాజువలె (రాజేవ) శత్రువులను నాశనంచేసి మాకు అన్నం యిమ్ము." తర్వాత 6-12-2 ఋక్కునందు "రాజన్" శబ్దం ప్రయోగింప బడింది. "ఓ రాజన్, నీవు కీర్తిమంతుడవు, బుద్ధిమంతుడవు. యజ్ఞంచేయు యజమానులు నీకు హవ్యాన్ని ఎక్కువగా యిస్తారు. నీవు త్రిభువనాలందున్న మనుష్యుల వుత్తమ హవ్యాలను అతి శీఘ్రంగా దేవతలవద్దకు కొనిపొమ్ము."

త్వమపో విదురో విషూచీ రింద్ర
ద్రుళ్హా మరుజః పర్వతస్య ।
రాజా భవో జగతశ్చర్షణీనాం
సాకం సూర్యం జనయంద్యా ముషానం ॥ (6-30-5)

"ఓ యింద్రా, నీవు జలమును విస్తరించుటకుగాను విముక్తం చేశావు. దృఢమైన పర్వతాన్ని బ్రద్దలు చేశావు. నీవు సూర్యుని, ద్యౌని, ఉషస్సుని ఒక్కసారిగా ఉత్పన్నంచేసి ప్రపంచ ప్రజలకు రాజైనావు." భరద్వాజుడు మరొక ఋక్కులో (6-36-4) ఇంద్రుని "ప్రజలకు అద్వితీయ పతి అనీ, భువనాలకంతటికీ రాజనీ" చెప్పాడు. "పతిర్బభూథా సమోజానామేకో విశ్వస్య భువనస్య రాజా." వసిష్ఠుడుకూడ ఇంద్రుని గురించి భరద్వాజుడు చెప్పినదానిని సమర్థించాడు— (7-27-3).

ఇంద్రో రాజా జగతశ్చర్షణీ నామధి
క్షమి విషురూపం యదస్తి,
తతో దదాతి దాశుషే వసూని చోదద్రాధ
ఉపస్తుతశ్చి దర్వాక్ ॥

"ఇంద్రుడు జగత్తులోని మానవులకు, పృధ్విపై ఉన్న నానా రకములగు వస్తువులకు రాజు, అతడు యజమానికి ధనమిస్తున్నాడు; అతడు స్తుతులనువిని మాకు ధనాన్ని పంపుగాక" వసిష్ఠుడు మిత్రుని (సూర్యుని), వరుణుని ఒక్క పారిగా స్తుతిస్తూ వారిని రాజు అన్నాడు (7-64-20).

"మహాసత్య రక్షకులారా, సింధువులకు పతులు, క్షత్రియ (రాజు)లగు మిత్రా వరుణులు, మీరు ఎదుటకు దయచేయండి. ఓ దాతలారా, మిత్రావరుణు లారా, ద్యులోకమునుండి అన్నాన్ని వృష్టిని పంపండి."

కణ్వపుత్ర ప్రగాథుడు ఇంద్రుడు గణాలకు రాజు అని చెప్పాడు. (8-53-3)
"త్వమీశిషే సుతానా మింద్ర త్వ మసుతానాం ।
త్వం రాజా జనానాం ॥

"ఓ యింద్రా, నీవు వడకట్టిన, వడకట్టని సోమాన్ని స్వామివి. నీవు గణాలకు రాజువు,"

## 2. రాజు

1. రాజ్యాభిషేకం : రాజు సింహాసనం అధిరోహించు కాలంలో యిప్పటివరకు చదువుతున్న మంత్రాలకు కర్త ధ్రువ అంగిరసుడు (10-173). "ప్రజాభీష్టమే నిన్ను స్థిరముగ నుంచగలదు," అను హెచ్చరిక ఆ మంత్రములందు రాజుకు చేయబడింది.

ఆత్వాహార్షమంతరేధి ధ్రువస్తిష్ఠా విచాచలిః । విశస్త్వా సర్వా వాంఛంతు మాత్వ ద్రాష్ట్ర మధిభ్ర శత.

ఇహైవైధి మావచ్యోష్ఠా ॥ పర్వత ఇవా విచాచలి ॥ (1)
ఇంద్ర ఇవేహ ధ్రువ స్తిష్ఠేహ రాష్ట్రి ముధారయ ॥ (2)
ఇమమింద్రో అదీధరద్ ధ్రువం ధ్రువేణ హవిషా।

తస్మైసోమో అధి బ్రవత్తస్మా ఉ బ్రహ్మణస్పతిః॥ (3)
ధ్రువాద్యౌ ధ్రువాపృథివీ ధ్రువాసః పర్వతా ఇమే।
ధ్రువం విశ్వమిదం జగద్ ధ్రువోరాజా విశామయం॥ (4)
ధ్రువంతే రాజావరుణో ధ్రువందేవో బృహస్పతిః.
ధ్రువంత ఇంద్రశ్చాగ్నిశ్చ రాష్ట్రం ధారయతాం ధ్రువం॥ (5)
ధ్రువం ధ్రువేణ హవిషాభిసోమం మృశామసి।
అథోత ఇంద్రః కేవ లీర్విశో బలిహృతస్కరత్॥ (6)

"నేను నిన్ను తెచ్చాను. దేశంలోపల వృద్ధించెందుము. అచలమై ధృవమై వుండుము. ప్రజలంతా నిన్ను కోరుదురుగాక, నీ రాష్ట్రం (రాజ్యం) భ్రష్టం కాకుండా వుండుగాక." (1)

"ఇక్కడనే వుండుము. అచలుడవై వుండుము పర్వతము వలె అచ్యుతుడవై వుండుము. ఇంద్రుని వలె ధ్రువముగా నుండుము ఇక్కడ రాష్ట్రమును వహించుము." (2)

"ఈ రాజును హవ్యముతో ఇంద్రుడు ధ్రువపర్చి ధరింపచేశాడు. అతన్ని సోముడు, బ్రాహ్మణస్పతి ఆశీర్వదించారు." (3)

"ద్యౌలోకము ధ్రువం, పృథివీ ధ్రువం, ఈ పర్వతములుకూడ ధ్రువం ఈ జగత్తు అంతా ధ్రువం. యీ విశుల రాజు ధ్రువం." (4)

"నీ రాష్ట్రాన్ని బృహస్పతి దేవుడు ధ్రువముగ నుంచెదరు గాక. రాజు వరుణుడు ధ్రువం, ఇంద్రాగ్నులు ధ్రువం." (5)

"ధ్రువమైన హవిస్సుతో మేము ధ్రువమైన సోమాన్ని కలుపుతున్నాం. ఓ యింద్రా, నీ ప్రజలను ఏకంచేసి కరప్రదాతలుగ చేయుము" (6)

2. సమ్రాట్ : సమ్రాట్ అర్థం రాజ రాజు కాదు. యాజ్ఞవల్క్యుడు బృహదారణ్యక ఉపనిషత్తులో (4-2-1) జనకుని సమ్రాట్ అన్నాడు. కాని జనకుడు కేవలం విదేహ జనపదానికి రాజు. భరద్వాజుడు వైశ్వానర అగ్నిని కూడ అదే అర్థంలో లేక మంచి రాజు అను అర్థంలో సమ్రాట్ అన్నాడు (6-7-1). "కవిం సమ్రాజ మతిథిం జనానామాసన్నా పాత్రం జనయంత దేవాః"। "కవి, సమ్రాట్, గణాలకు అతిధి అయిన వైశ్వానర అగ్నిని దేవతలు సృష్టించారు"

వసిష్ఠుడు సవితను (సూర్యుని) సమ్రాట్ అన్నాడు (7-38-4). "అభి సమ్రాజో వరుణో గృణన్త్యభి మిత్రాసో అర్యమా సజోషాః." "అదితి దేవి సవితృ

దేవుని పేరిస్తూ అజ్ఞాను వర్తిమై స్తుతిస్తుంది. వరుణ సమ్రాట్ మిత్ర, అర్యమా సమేతంగా దేవతలను స్తుతిస్తున్నాడు"

3. శాస : రాజా అను అర్థంలో శాస వాడబడింది. శాసనమను శబ్దంలో కూడ ఆ భావమేవుంది. తర్వాత ఈరానులో మాత్రమే రాజుకు శాస (శాహ్, షా) అను శబ్దం వుండిపోయింది. ఈరానీ భాషలో సర్వ సాధారణంగా 'స' 'హ' గా మారుతుంది. ఇది మన మెరిగిన విషయమే. శాసకు 'శాహ' అనీ, శాసాను శాసకు 'శాహ్యంశాహ' అనీ వచ్చింది. ఋగ్వేదంలో కూడ ఇదే అర్థంలో వాడబడింది. విశ్వామిత్రుని ఋక్కులవలన పై విషయం తెలుస్తుంది. (3-47-5).

"మరుత్వంతం వృషభం వా బృధాన మకవారిం
దివ్యం శాస మింద్రం ।
విశ్వాసాహమవ సే నూతనాయోగ్రం
సహోదామిహ తం హువేమ ॥

"వృషభుడు, వర్ధనశీలుడు, దివ్యశాస (రాజా) విశ్వవిజేతా అగు ఆ ఉగ్ర యింద్రుని మరుత్తుల సమేతంగా మేము నవీనరక్షణకై యిక్కడకు ఆహ్వానిస్తున్నాం."

4. ఈశాన : ఋగ్వేదంలో 'ఈశాన' శబ్దం శంకరునికి పర్యాయ పదం కాదు. తర్వాత చాలకాలం వరకు ఈశ్వర పరమేశ్వర శబ్దంవలె యీశాన శబ్దం కూడ రాజుకు వుపయోగించారు. వసిష్ఠుడు ఇంద్రుని గురించి చెప్తూ యీ శబ్దం ప్రయోగించారు. (7-32-22).

అభిత్వా శూరనోనుమో దుగ్ధా ఇవధనః ।
ఈశాన మన్యజగతః స్వర్దృశ మీశానమింద్ర తస్థుషః ॥

"ఓ వీరుడా, పాలు పితకని గోవు వలె మేము నిన్ను ఆహ్వానిస్తున్నాం, ఓ యింద్రా, నీవు యీ జగత్తుకు స్వర్గదర్శకుడవు, స్థావరములకు ఈశానుడవు."

5. స్వరాట్ : రాట్, రాజా ఒకేశబ్దము, రాట్ కు స్వ చేరిస్తే స్వరాట్ అయింది. దీని అర్థం స్వయంరాజా. ఇంద్రుని స్తుతిస్తూ గౌతమ నోధా చెప్పారు (1-61-8).

"ద్యులోకము, పృథివి, అంతరిక్షములకంటె అతని మహిమ గొప్పది. ఇంద్రుడు తన గృహమందు స్వరాట్ (స్వరాడింద్రో).

6. నృపతి : అంగిరస కుత్సుడు ఇంద్రుని నృపతి అన్నాడు. (1-102-8).

"త్రివిష్టి ధాతుప్రతి మానమోజా స స్తిస్రో
భూమిర్ నృపతేత్రీణి రోచనా ।
అతీదం విశ్వం భువనం వవక్షితా శత్రురింద్ర
జనుషాసనా దసి ॥

"ఓ నృపతి యింద్రా! నీవు ముప్పేట తాడువలె ఓజస్సుకు కొలబద్దవు. త్రిభూములు అనగా ద్యౌ, పృథివి, ఆకాశములు నీవు. మూడు ప్రకాశములు అనగా సూర్యుడు, మెరపు, అగ్ని నీవు. నీవు యీ భువనమంతా వహిస్తున్నావు. నీవు పుట్టుకతోనే సదా శత్రు రహితుడవు."

7. పతి, రాజా : రెండు శపతి, రాజా ద్విములను కలిపి అంగిరస తిరశ్చి రాజా అను అర్థంలో వాడాడు. (8-84-3)

పిబాసోమం మదాయక మింద్రశ్యేనా భూతం సుతం ।
త్వం హి శశ్వతీ నాం పతీరాజా విశామసి ॥

"ఓ ఇంద్రా, శ్యేన (డేగ) పక్షి ద్వారా తేబడింది. వడకట్టబడింది. సుమయమైంది యీ సోమం. దీనిని మత్తుకొరకు త్రాగుము. నీవు శాశ్వతమైన విశులకు (ప్రజలకు) పతివి, రాజావు."

8. రాజ పుత్రే, రాజదుహిత : రాజా అయినతర్వాత రాజపుత్రుడు రాజ దుహిత వుండుట స్వాభావికం. రాజా ప్రజల మనిషి కాదు. అతని సింహాసనం యిప్పుడు ఇంద్ర, అగ్ని, వరుణ, మిత్రుల వలె ప్రజలకు పైన వుంది. కాబట్టి రాజుకు పుత్రుడవుట ప్రత్యేక గౌరవాన్ని తెల్పుతుంది. దీర్ఘతమా కక్షీవానుని పుత్రిక ఘోష తనను రాజ దుహితగ చెప్పుకొంది. ఇప్పటికి 'రాజ' శబ్దం బాగా వ్యాప్తిలోకి వచ్చినట్లు దీనినిబట్టి మనకు తప్పక తెలుస్తుంది. ఘోష అశ్వినీ కుమారులిద్దరిని స్తుతించింది.

ప్రాతర్జరేథే జరణేవకాపయావ స్తోర్వస్తోర్యజతా
గచ్ఛథో గృహం ।
కస్య ధ్వస్రా భవథః కస్యవానరా
రాజపుత్రేవ సవనా గచ్ఛథః ॥ (10-40-3)

యువాం హ ఘోషా పర్యశ్వినా యతీ రాజ్ఞ
ఊచే దుహితా పృచ్ఛేవాం వరా ।
భూతం మే అహ్న ఉత భూత మ క్తవే శ్వావతే
రథినే శ క్తమవతై (10-40-4)

"ఓ అశ్వినీ కుమారులారా! వృద్ధరాజా లిద్దరిని మేల్కొలిపినట్లుగా ప్రాతఃకాలమున మిమ్ములను మేల్కొలుపుటకు స్తుతిస్తారు. సేపగౌరకు మీరు ఎవరింటికి వెళుతున్నారు ? ఎవరిని వస్తవరున్తున్నారు ? ఓ నేతలారా, ఎవరి సోమయాగానికి మీరు రాజపుత్రుల వలె వెళుతున్నారు ?"

"ఓ అశ్వినీకుమారులారా, రాజదుహిత ఘోష నలువైపుల తిరుగుతూ, మీ వద్దకు వచ్చింది. మీరు నా వద్ద పగలు వుండండి, రాత్రి వుండండి, అశ్వరథిమైన ప్రభువి (పురుషుని) నాకు యీయవలసింది అని అడుగుతున్నాను". పైన చెప్పిన యీ అంశముల బట్టి, విశ్ (ప్రజ) యింకా కుంఠితం కాలేదని తెలుస్తుంది. అది ఆయుధం ధరించి వుంది. దాని శస్త్రములు ప్రతి చోటా అవసరమై వుంది. గ్రామాల్లో వుండుట చేత ఆర్యులు గణయుగ ఆర్థిక వ్యవస్థ నుండి పూర్తిగా బయటపడలేదు. అందుచేతనే నిరంకుశమైన రాజా పుట్టలేకపోయాడు. అయినప్పటికి యిప్పుడు కూడ రాజా విశ్ కంటె పైన వున్నాడు.

## 3. ప్రభుత్వ యంత్రం

ఋగ్వేదమును బట్టి ఆ నాటి ప్రభుత్వ విధానం సంకేత మాత్రంగా తెలుస్తుంది. బుద్ధుని సమకాలికులైన లిచ్ఛవి, మరి ఎన్నో గణాలు వున్నాయి. బుద్ధుని కాలంలో గ్రామ పెద్ద అగు గ్రామణిని గామజేర్థ అని కూడ అనేవారు. హిమాలయంలో కొన్ని చోట్ల బాధా లేక బధేరా అను పదాల్లో గ్రామ జ్యేష్ఠ ప్రతిధ్వని కాన వస్తుంది. పెద్దలు గ్రామ వ్యవస్థను చూచుటకు బాధ్యులు, పన్ను వసూలుకు కూడ సహాయ ముండేది. ఋగ్వేద గ్రామముల గ్రామణికూడ యీ పనే చేస్తూ వుండే వారేమో.

**1.** సభ : సభ, సమితిని గురించి ఋగ్వేదంలో అనేక చోటులందు వచ్చింది. సభ అర్థము కొంత విస్తృతమైంది. అందు గ్రామ, రాష్ట్రీ జన సభలే కాకుండా ద్యూతసభ కూడ వుంది. కవష ఐలూష పుత్రుడు ఈ విషయం చెప్పాడు. (10-34 6)

సభాషేతి కితవః పృచ్ఛమానో "జేష్యమీతి"
తన్వా శూశుజానః।
అక్షాసో అస్య వితిరంతి కామం ప్రతిదీవ్నే
దధత ఆ కృతాని।

"నేను గెలుస్తాను" అని చెప్పుతూ, శరీరాన్ని ఉప్పొంగిస్తూ, కబుర్లాడుతూ జూదరి సభకు వెళుతున్నాడు. పాచికలు ఒకప్పుడు యితని కోరికను చెల్లిస్తూ మరొకప్పుడు ప్రత్యర్థి కోరికను చెల్లిస్తున్నాయి."

'సభ' శబ్ద ప్రయోగం తర్వాత ద్యూత సభకు ఎక్కువగా వున్నట్లు తోస్తుంది. అందుకనే ద్యూతశాల (జూదమాడు చోటు) అధ్యక్షుని సభికు డన్నారు. శునహోత్ర పుత్ర గృత్సమదుడు 'సభేయ' శబ్దమును సభానుడను అర్థంలో ప్రయోగించాడు. (2-24-13). "బ్రహ్మణస్పతి వాహనములు (గుర్రములు) మా స్తోత్రం వింటున్నాయి. సభేయ విప్రులు (ఋత్విక్కులు) స్తుతి సహిత హవ్యమును యిస్తున్నారు."

ఆర్యులు తమ యువకులను "సభేయులు" కండు అని ప్రార్థించేవారు. కాబట్టి వారి సభలు చాల మహత్వపూర్ణములు. అందు యువకులు తమ వాగ్మితను (మాటల చతురతను) చూపేవారు.

అశ్వరథీ సురూప ఇద్ గోమాం ఇదింద్రతే సఖా ।
శ్వాత్రభాజా వయసా సచతే సదా చంద్రోయాతి సభాముప ॥

8-4-9 దేవాతిథి కణ్వపుత్ర.

"ఓ ఇంద్రా, నీసఖుడు, అశ్వయుక్త రథికుడు, సురూపుడు, గోమంతుడు, ధనిక వయస్కుడు సదా చంద్రుడై (ఆహ్లాదముతో) సభకు వెళ్ళును".

భరద్వాజుడు కూడ గోవులను ప్రశంసిస్తూ సభను పేర్కొన్నాడు (6-28-6).

"ఓ గోవులారా, మమ్ములను మీరు బలిపించండి. మా కృశించిన, అందహీన మైన శరీరాలను అందంగా చేయండి. గృహములకు మేలు చేయండి. ఓ భద్ర వాణులారా. సభలందు మీ మహా భోజనం గురించి చెప్పుకుంటాం."

2. సమితి : సమితే ఐరోపీయ భాషల్లో కమిటీ లేక కమీటీ (శతమ్ కేంటమ్ భాషలకువున్న ముఖ్యభేద మేమనగా శతమ్‌లోని 'శ' కేంటమ్‌లో 'క' అవుతుంది). ఈనాడు చిన్న సభను సమితిలేక కమిటీ అంటారు. కాని ఋగ్వేదకాలంలో రాజ సభను, రాష్ట్రసభను, లేక సంసదును సమితి అనేవారు. బుద్ధుని కాలంలో గణముల

పార్లమెంటును 'సంస్థా' అనేవారు ప్రతియొక గణరాజధానిలో సంస్థాగారం తప్పనిసరిగా వుండేది పాళీ సూత్రాల్లో గణ రాజ్యములకు రాజధానులుగ నున్న నగరాల్లోని సంస్థాగారాలను గురించి చెప్పబడింది. ఋగ్వేదంలో 'సంస్థా' ప్రయోగంలేదు. అప్పుడుకూడ సంస్థ వుండి వుంటుంది. కాని రాజతంత్రానికి సమితి ఎక్కువ అనుకూలంగా వుండేది. మరీచిపుత్ర కశ్యపుడు "రాజా సమితికి వెళ్ళినట్లు సోముడు వెళ్ళుతున్నాడు," అని చెప్పాడు (10-97-6)

కాని సమితికి అర్థం యుద్ధ క్షేత్రమనికూడ వుంది. కశ్యపుని ఋక్కు ఈ విషయాన్ని తెల్పుతుంది. (9-92-6)

"హోత ఋత్విజులు యజ్ఞగృహానికి వెళ్ళినట్లు, మంచిరాజు సమితికి (యుద్ధానికి) వెళ్ళినట్లు, పవిత్రుడైన హోత సోముడు కలశాల్లోకి వెళ్ళుతున్నాడు. సంతవ ఋషి సమితిని పేర్కొన్నారు.

"మీ మంత్రం సమానంగాను, సమితి ఒక్కటిగాను వుండుగాక" (10-191-3).

3. వ్రాజపతి, కులప: ప్రభుత్వ వ్యవస్థలోగాని, సాంఘిక వ్యవస్థలోగాని కులములకు వ్రాజాలకు (సమూహములకు) కూడ స్థానముంది. ప్రతర్దనుడు కులప, వ్రాజపతులను పేర్కొన్నాడు— (10-179-2)

శ్రాతం హవిరో ష్విన్ద్ర ప్రయాహి జగామ
సూరో అధ్వనో విమధ్యం ।
పరి త్వాసతే నిధిభిః సఖాయః
కులపా న వ్రాజపతిం చరన్తం॥

"ఓ యింద్రుడా, హవిస్సు పక్వమైంది, రమ్ము. సూర్యుడు మధ్యాహ్నానికి చేరుకున్నాడు. విచరిస్తున్న వ్రాజపతికై కులపుడు నిరీక్షించినట్లు నిధులతో సఖులు నీకై ఎదురుచూస్తున్నారు." దీన్నిబట్టి కులపెద్దకంటె పైస్థానం వ్రాజపతిదని తెలుస్తుంది. కులముల సముదాయం గ్రామము. బహుశా గ్రామ సముదాయాన్ని వ్రాజ అనేవారేమో. ఆ గ్రామ సముదాయానికి పెద్ద వ్రాజపతి. ఒకగ్రామం అనేక కులాల్లో విభక్తమై వుండేది. పెద్ద గ్రామాన్నికాని, నగరాన్నికాని పురమనే వారుకాదు. శంబరుని పురాలు కోటలున్న ప్రదేశాలని మనకు తెలుసు.

ఋగ్వేదంలో సంకేతమాత్రంగా వర్ణితమైన దాన్నిబట్టి ఆ కాలంనాటి పరిపాలనయొక్క పూర్తిరూపం వివరించుట సాధ్యంకాని పని. రాజవ్యవస్థలో పరిపాలన,

న్యాయపాలన, పన్నులు (బలి) వసూళ్ళు ముఖ్యమైనవి. పరిపాలనకు బహుశా (1) కులపతి, (2) వ్రాజపతి, గ్రామణి, గణపతి, చివరకు సమితి, దానికి ముఖ్యుడు (3) రాజు వుండి వుండవచ్చు. సివిలు, క్రిమినలు వ్యవహారాలను చూచే బాధ్యత కూడ వీరికే వుండవచ్చు. విశువి బలిహృత్ (పన్ను చెల్లించువాడు) అన్నారు. పన్ను నగదు రూపంలోకాక వస్తురూపంలో వుండేదనుట సంభవం. పన్ను వసూళ్ళకు కులపతి, వ్రాజపతి సహాయకులుగా వుండి వుండవచ్చును.

సైనిక విధానాన్ని గురించి చెప్పునప్పుడు ఆర్యులు క్రమశిక్షణ కలవారని మాత్రం చెప్పగలం. వారు వేలసంఖ్యలో శత్రువులపై దాడిచేసేవారు, లేక ఆత్మ రక్షణకై వెళ్ళేవారు. సేనకు అందరి కంటె పై అధికారి రాజు. కాని అర్జునేయ కుత్సునికి సారథి బిరుదు వుంది. బహుశా రాజు తర్వాత అందరి కంటె పెద్ద సేనాని అతడు కావచ్చు. బహుశా ఆఫీసరులు దశిన్ (దశపతి), శతిన్ (శతపతి) మరియు సహస్రిన్ (సహస్రపతి) వుండవచ్చు. చతురంగ సేనకాదు, త్రిరంగ సేనవుంది– రథాలు, గుర్రాలు, కాల్బలం ఇంకా ఏనుగుల సేన ఏర్పడలేదు. సప్త సింధులో సింహములు తప్పకుండా వున్నాయి. కాని ఏనుగుల వున్నసంగతి గాని, అవి పెంపుడుగా వున్న సంగతిగాని ఋగ్వేదంలో చెప్పలేము.

**4.** పురోహితుడు (ప్రధానమంత్రి) : రాజ పురోహితుని పని కేవలం యజ్ఞం, ధార్మిక విషయాల్లో సలహా యివ్వడమే కాదు; వసిష్ఠుడు చాల గర్వంతో చెప్పుకొన్నాడు. "త్రిత్సు భరతులు అనాథ శిశువులవలె వున్నారు. వసిష్ఠుడు పురోహితు డవుట తోడనే వారు శక్తివంతులయ్యారు." పురోహితుని బృహస్పతి అనేవారు. వామదేవుడు బృహస్పతి పురోహితుని గురించి చెప్పాడు. (4-50-1) వసిష్ఠుడు త్రృత్సులకు తాను పురోహితునిగ వున్నట్లు చెప్పుకొన్నాడు (7-83-4).

—•—

# పన్నెండవ అధ్యాయం

# విద్య, ఆరోగ్యం

1. విద్య : మానవ జాతి ఎంత వెనుకపడిన దైనప్పటికీ పూర్వీకుల ద్వారా ఆర్జించుకొన్న జ్ఞానాన్ని, అనుభవాన్ని ఒక తరం నుండి మరొక తరం వారికి అందించవలసిన అవసరం వుంది. అందుకు గాను ఏదో విధమైన శిక్ష ప్రణాళిక అవలంబించవలసి వుంది. వైదిక ఆర్యులు తమ పూర్వార్జిత జ్ఞానాన్ని ఒక తరం నుండి మరొక తరానికి అందించారు. వారు వేద మంత్రాలను పరమ పవిత్రమైన జ్ఞానమనుకొన్నారు. ఋగ్వేద ఆర్యులకు పూర్వం మొహింజెదారో, హరప్పా జాతులు వున్నాయి. వారికి చిత్రలిపి వుంది. ఒక వేయి వరకు అక్షరాలు దొరికాయి. కాని వాటిని చదువుటకు యింత వరకు మార్గం దొరకలేదు. వ్రాతకు పూర్తి ప్రచార మున్నప్పటికీ యీ నాడు కూడ మన దేశంలో వేదాలను గురుముఖంగా చదువుకొను ఆచారానికి యిష్టపడుతున్నాం. అయినప్పుడు ఋగ్వేదకాలంలో దాన్ని లిపి బద్ధం చేసే ప్రయత్నం జరుగుట అసంభవం. ఆర్యులు చాల కాలం వరకు వేదాలను లిపిలో వ్రాయుటానికి ఒప్పుకోలేదు. ఎందుకంటే అట్లు వ్రాతలో వుంచే గోప్యత పోతుందని. వైదిక వాఙ్మయమే కాదు, బౌద్ధ, జైన పిటకాలు కూడ శతాబ్దాల వరకు కంఠస్థం చేయబడ్డాయి. బుద్ధుడు చనిపోయిన నాల్గు శతాబ్దాల తర్వాత బౌద్ధ పిటకాలు, ఎనిమిది శతాబ్దాల తర్వాత జైన ఆగమాలు వ్రాతలోకి వచ్చాయి. చెవితో విని నేర్చుకొనుట వలన వేదాన్ని శ్రుతి అన్నారు. అందుచేత గొప్ప పండితుని బహు శ్రుతుడని, (బాగా విన్నవాడు) అంటారు. మన లిపి ఎట్లా పుట్టిందో, దానికి ఏ ప్రాచీన లిపితో సంబంధం వుందో యింకా నిర్ణయం జరగకుండా వుంది. మనకు అన్నిటికంటే ప్రాచీనమైన లిపి బ్రాహ్మీ అని తెలుసు. ఆ లిపి యొక్క నిశ్చిత కాలానికి సంబంధించిన నమూనాలు అశోకుని శిలా శాసనాల్లో దొరుకుతున్నాయి. వాటి కాలము క్రీ. పూ. మూడవ శతాబ్దం లేక బుద్ధ నిర్వాణంకు 250 సంవత్సరాలు తర్వాత. పిపరహవా యొక్క బ్రాహ్మీ అక్షరాలు బుద్ధుని కాలం నాటివి అను విషయం వివాదాస్పదమైంది. క్రీ. పూ. మూడవ శతాబ్దానికి ముందున్న అక్షరాల నమూనాలు మొహింజెదారో, హరప్పాలోని చిత్రలిపిలో దొరకుతున్నాయి. రెండు

లిపులకు సంబంధం స్థాపించుట కష్టం. మొహింజెదారో చిత్రలిపి నుండి ఉచ్చరింపబడు వర్ణమాల పుట్టుట పూర్తిగా సంభవం. కాని బ్రాహ్మి మొహింజెదారో లిపినుండి పుట్టినదని ఋజువు చేయుట యింకను జరుగలేదు.

ఆ కాలంలో ఏదో రకమైన మౌలిక భాషకు ప్రాచీనమైన (కావున పవిత్రమైన) కవితలు తప్పకుండా వుండేవి. అవి వేదాల్లో సంగ్రహింపబడి వుంటాయి. కాని అట్లు జరుగలేదు. ఋగ్వేదంలోని ప్రాచీన తమ ఋషులు, వారి కృతులు మనలను భరద్వాజ, వసిష్ఠ, విశ్వామిత్రుని వరకే తీసుకు పోతున్నాయి. వారికంటే ప్రాచీనమైన ఋషులు యిద్దరు ముగ్గురు కానవస్తున్నారు. వారి కృతులు కూడ ప్రాచీనములు కావచ్చు. కాని భాష, సంగ్రహంలో వచ్చిన గందరగోళం వారి ప్రాచీనత్వాన్ని చాల వరకు పోగొట్టాయి. ఋగ్వేద మహా ఋషులు ఇంద్ర, అగ్ని, మిత్రులపై వేలాది ఋక్కులు రచించారు. వాటిలో కొన్ని శబ్దమందు గాని భావమందు గాని భరద్వాజాదులకంటే ప్రాచీనములు కావచ్చుననే అనుమానం కల్గుతున్నది. కాని మనం యిదమిద్ధంగా చెప్పలేక పోతున్నాం. ద్యౌః, పృథ్వులు మనకు అత్యంత ప్రాచీన దేవతలు. వీరిని ఋగ్వేదంలో పితరౌ (తల్లిదండ్రులు) అన్నారు. ద్యౌ తండ్రి, పృథివి తల్లి. ద్యౌ-పితరౌ భావం చాల పురాతనమైంది. వీరు కేవలం శతమ్ శాఖకు (ఆర్యస్లావ వంశీకులకు) చెందిన వారికి మాత్రమే కాదు, కేంటమ్, (గ్రీసు, రోము మొదలైన) వారికి కూడ పూజ్య దేవతలు. ద్యౌ- పితర శబ్దానికి రూపాంతరం జూపిటర్. జ్యూస్ శబ్దం ద్యౌయే గదా! ద్యౌకు సంబంధించినవి ఎన్నో ఋక్కులు లభిస్తున్నాయి. కాని ఋగ్వేద కాలంలో ద్యౌకు కాదు, ఇంద్రునికి ప్రాధాన్యత వుంది.

ఋగ్వేదానికి పూర్వమందున్న పరంపరగా వచ్చిన జ్ఞాన సంపత్తి ప్రత్యేకంగా మనకు లభించదు కాబట్టి ఆనాటి శ్రుతి శిక్షణ పరంపర ఎట్టిదో మనం చెప్పలేం. శిక్ష, శిక్షణ, ప్రశిక్షణ శబ్దాలకు నేడువున్న అర్థం ఆనాడులేదు. ఋగ్వేదంలో శిక్ష అంటే యిచ్చుట అని వసిష్ఠుని ఋక్కు వలన తెలుస్తుంది (9-27-2).

"య ఇంద్ర శుష్మోమఘవంతే అస్తి శిక్షా సఖిభ్యః పురుహూత నృభ్యః". "ఓ పురుహూత (బహు నిమంత్రితుడైన) ఇంద్రా, నీకున్న బలాన్ని మా సఖులైన నరులకు యిమ్ము."

వసిష్ఠుని రెండవ ఋక్కులో శిక్ష అర్థం అపకరణము. (7-10-6)

యదేషా మన్యో అన్య న్య వాచం శాక్తస్యేవ -
వదతి శిక్షమాణః॥
సర్వం తదేషాం సమృదేవ పర్వయత్
సువాసో వదథ నాధ్యప్సు॥

"ఈ కప్పల్లో ఒక కప్ప అన్నదానిని రెండవ కప్ప ఆచార్యుని అనుకరించి నట్లుగ అనుకరిస్తున్నది ఓ కప్పలారా, మీరు బాగా బెకబెక లాడుతున్నప్పుడు మీ అంగాలన్నీ వృద్ధిచెందుతున్నాయి."

ఇక్కడ వర్షారంభమందు కప్పలు ఒకదానిని మరొకటి అనుకరిస్తూ అరుచుటను ఋగ్వేదకాలం గురు శిష్యుల పాఠంతో పోల్చబడింది. గోస్వామి తులసీదాసు యీ ఋక్కును బహుశా చూచి వుంటారు. ఈ ఉపమానం పరంపరంగా వస్తూవున్నట్లు వుంది. అందుకనే ఆయన అన్నారు —

"దాదురధుని చహుం ఓర్ సుహాఈ।
వేదపఢహిం జనుబటు సముదాఈ॥

"వటుల (బ్రహ్మచారుల) సముదాయం వేద మంత్రాలను చదివినట్లు కప్పల అరుపులు నాల్గు వైపులనుండి వస్తూ ఆనందం కల్గిస్తున్నాయి."

ఒక కప్ప అరుపును ప్రారంభిస్తుంది. తర్వాత యితర కప్పలు అనుకరిస్తాయి. ఇంక బెకబెకలు సాగుతాయి! ప్రాచీన కాలపు వేదపాఠ విధానాన్ని యిప్పుడుకూడా చూస్తున్నాం. గురువు స్వరయుక్తంగా మంత్రాన్ని ఒకసారి చదివితే శిష్యులు దాన్ని రెండుసార్లు అంటారు. నేడు గురుశిష్యులు పుస్తకాన్ని ఆధారము చేసుకుంటున్నారు. కాని వేదాలు లిపిబద్ధం కానప్పుడు గురువు కంఠస్థం చేసిన ఋక్కును ఒకసారి అనవచ్చు, దాన్ని శిష్యులు రెండుసార్లు అంటూ వుండవచ్చు. ఈ ప్రకారం క్రమంగా పునరుచ్చారణ చేయుటవలన చిన్న వయస్సులోనే పిల్లలకు వారివేదం కంఠస్థం అయ్యేది. సామవేదం తప్ప మిగిలిన ఏ వేదాన్ని సంగీత స్వరాలతో చదువుట లేక పునరుచ్చారణ చేయకపోయినప్పటికిని వచ్చే పరపంపరె దానికి తోడు అయి వుండేది. పవిత్రమైన ఋక్కులనుగాని, ఛందముల శిక్షణగాని యీ ప్రకారంగా శిష్యుడు గురువునుండి నేర్చుకొనేవాడు. భరద్వాజ, వసిష్ఠుల నాల్గయిదు తరాలవరకే రచించబడిన మంత్రములు ఋగ్వేదంలో లభిస్తున్నాయి. ఋగ్వేదంలోని అందరికంటె చివరి ఋషులు గురుముఖతా తమ పూర్వీకుల బ్రహ్మలను (మంత్రములను, పద్యములను) చదువుకొన్నారు.

బ్రహ్మకు (ఋక్కునకు, అద్భుతమైన శక్తి వుందని నమ్మేవారు. అందుకనే విశ్వామిత్రుడు అన్నాడు— "ఈద్యౌ, పృథివి లిద్దరిని, యింద్రుని బ్రహ్మంతో సంతృప్తి పర్చాను. విశ్వామిత్రుని యీ బ్రహ్మ భారత జనులను రక్షిస్తుంది."— (3-53-12).

వేదవాణియొక్క అద్భుతశక్తిని గురించి స్వయంగా ప్రాచీనతమ ఋషులు తమ నోటితో చెప్పారు. అందుచేతనే వాటిని నేర్చుకొనుటకు, కంఠస్థం చేయుటకు ప్రజలు ఎక్కువశ్రద్ధ చూపుట సహజమే.

కాని దేవతలను ప్రసన్నులుగా చేసినంత మాత్రాన వారి లౌకిక జీవితం జరుగదు. ఆ కాలంలో నేర్చుకొనేవి చాలవుండేవి. ఆర్య యువకులు గురుముఖతా నేర్చుకొన్న యుద్ధ కౌశలమంతా వేదంలో చెప్పబడలేదు. అప్పటిలో అనేక శిల్పాలు వాడుకలో వుండేవి. వాటిని నేర్చుకోవలసిన అవసరముంది. ఈ శిల్పాల్లో కొన్నిటి పేర్లు మాత్రమే ఋగ్వేదంలో దొరకుతున్నాయి. మొహింజెదారో, హరప్పాలో ఋగ్వేదంకంటె 1,500 లేక, 2,000 సంవత్సరాలకు పూర్వమున్న వస్తువులు వారికి లభించాయి. వాటినిబట్టి ఆ కాలంలో వాస్తుశిల్పులు (ఇంజనీయర్లు), తాపీపనివారు నేతపనివారు, స్వర్ణకారులు, చర్మకారులు, వేణుకారులు, కమ్మరులు, కుమ్మరులు మొదలైన చాలామంది శిల్పులు వున్నట్లు తెలుస్తుంది. వారు ఆ విద్యలను తర్వాత తరంవారికి అందించవలసి వున్నది. వ్యవసాయం, దానికి ఉపకరించే ఋతువుల జ్ఞానం కూడ నేర్పవలసివుంది. ఈ ప్రకారంగా ఋగ్వేద ఆర్యులు నేర్పవలసినదంతా ఋగ్వేదంలో చెప్పబడలేదు.

2. ఆరోగ్యం : ఆర్యులు వాస్తవిక వాదులు. వారికి దేవతలంటే విశేషమైన భక్తివుంది. కాని వారు పౌరుషాన్ని వదలుకోలేదు. ఇంద్రుకూడ దివోదాసు, సుదాసుల పౌరుషంయొక్క సహాయం చేతనే శత్రువులను సంహరించ గలిగినట్లు వారికి తెలుసు. అందుచేతనే శరీరపుష్టి, ఆరోగ్యం గురించి వారికి ప్రత్యేక శ్రద్ధ వుంది. ఆర్యులకు వేగంగాపోయే గుర్రాలు వున్నాయి. వారికి దేశ ద్రిమ్మరులకుండే యుద్ధ స్వభావం వుంది. ఇంతకంటె వారికి బలమైన శరీరముంది. కాబట్టి వారు తమకంటె నాగరికులు, సంస్కృతిపరులు సాధన సంపన్నులైన సప్తసింధువారిని ఓడించుటలో కృతకృత్యులయ్యారు. వారిముందు మొహింజెదారో నాగరికులు క్షీణకాయులు, ప్రతి ద్రిమ్మరులు లేక అర్ధ ద్రిమ్మరులు మాదిరి ఆర్యులకు మైదాన ప్రదేశంలో వుండుట యిష్టం కాబట్టి వారు తమ నివాసాన్ని నగరాల్లో కాకుండా గ్రామాల్లో ఏర్పరచుకొన్నారు. ఆరుబయట నివాసం పాలు, నేయి, మాంసము వారి

ప్రధాన భోజనం, ఆరోగ్యాన్ని పెంపొందించు యిట్టి ఉత్కృష్ట సాధనాలు వారికి వున్నాయి. గుర్రపుస్వారియే ఒక వ్యాయామం. ఆనాడు మంచి గుర్రపురౌతు కానటువంటి ఆర్యుడు లేకపోవచ్చు. శత్రువులనుండి కాపాడుకొంటూ ఇతరుల ఆవులను గొర్రెలను దొంగిలించుటకు సదా వారు ఆయుధాలను ధరించవలసి వుంది. అందుచేత వారు గుర్రపుస్వారిలోకూడ ప్రవీణులు. మల్లులను గురించిగాని మల్లవిద్యను గురించిగాని ఋగ్వేదంలో పేర్కొనలేదు. కాని తర్వాత కాలంలో పంజాబులోను, తూర్పు ఉత్తర ప్రదేశ్‌లోనువున్న ఒక గణముపేరు మల్లగణము అని వుండుటనుబట్టి ఆర్యులకు కుస్తీకండూతి వున్నదని చెప్పాలి. ముష్టియుద్ధం గురించి విశ్వామిత్రపుత్ర మధుచ్ఛందుడు స్పష్టంగా చెప్పాడు. (1-8-2) "ఓ యింద్రా నీచే రక్షితమైన గుర్రాలతోను, ముష్టి హత్య (ముష్టి యుద్ధం)తోను మేము శత్రువులను అడ్డగించుతాం."

కుస్తీ (మల్ల యుద్ధము)గాని ముష్టియుద్ధంగాని ఆరోగ్యానికే కాకుండా యుద్ధానికి కూడ ఉపయోగపడేవి. అందుచేత ఆర్య యువకులు వాటిని బాగా అభ్యసించేవారు.

నాట్యం వినోదాన్ని కల్గిస్తుంది. ఇది అత్యంత ప్రాచీన కాలంనుండీ మానవులకు వున్న ఉత్తమ లలితకళ. ఇది మంచి వ్యాయామం కూడ. ఘోరమైన చలి దినాల్లో ఒక యువకుడు "అహీరుల (గొల్లవారి) నాట్యం" చేస్తూ వుండగా అతని శరీరమంతా చెమటకారుటను నేను చూశాను. అప్పుడు ఆధునిక వ్యాయామ అభిరుచిగల మరొక యువకుడు నాతో "ఈ నృత్యం వలన నడుముకు యిరువైపులవున్న మాంస కండరాలకు మంచి వ్యాయామం కల్గుతూ వుంది. ఆధునిక వ్యాయామ విధానంలో అట్టి వ్యాయామం కల్గించుట అసంభవం కాదుకాని కష్టమని చెప్పాడు. అంగిరా గోత్రీకుడగు సవ్యుడు నర్తయన్ (నాట్యము చేస్తూ) శబ్దమును ఆయుధాన్ని నర్తింపచేస్తూ అను అర్థంలో ప్రయోగించాడు. (1-51-3). "నపేనచి ద్విషదాయా బహోవస్యాజా వద్రిం దావస్య నర్తయన్." "ఓ యింద్రా, నీవు అంగిరాలకు వస్త్రం యిచ్చావు. విమదునకు అన్నంతోపాటు ధనం యిచ్చావు. సంగ్రామమునందు గదను నర్తింప చేస్తూ స్తుతి కర్తను రక్షించావు."

సంస్కారమున్నట్టి, సంస్కారము లేనట్టి అన్ని ఆదిమ జాతుల్లోను అన్ని నాగరక జాతుల్లోను, ఎంతో ముందుకు పోయిన ఆధునిక జాతులందును నాట్యం

బహు ప్రచలితమైన వ్యాయామం, వినోదంకూడ. ఋగ్వేద ఆర్యులు సోమాన్ని (భంగును) బాగా ప్రేమించేవారు. దాన్ని త్రాగి మత్తిల్లట వారికి ఆనందదాయకం. మత్తుకు, ఆనందా 'మద' శబ్దాన్ని ప్రయోగించుట ఈ విషయాన్నే తెల్పుతూ వుంది. ఆర్య స్త్రీ, పురుషులు తమ సోమ గోష్ఠుల్లో గీత. నృత్యముల ఆనందాన్ని అనుభవించేవారు. దీనివల్ల వారి ఆరోగ్యానికి బాగా లాభముండేది.

3. రోగం : రోగాల్లో యక్ష్మ. హృదయ రోగం, కుష్ఠును గురించి ఋగ్వేదంలో చెప్పబడింది. యక్ష్మ బహుశా జ్వరానికి మరొక పేరు కావచ్చు. క్షయ (టి. బి.) కు రాజ యక్ష్మ శబ్దం వాడబడింది. అథర్వణ ఋషి యక్ష్మను గురించి చెప్పాడు. (10-97-11,12)

యదిమా వాజయన్న హమో షధీర్హస్త ఆదధే ।

ఆత్మా యక్ష్మస్య నశ్యతి పురా జీవగృభోయదా॥

"శక్తివంతములైన యీ ఔషధాలను నేను చేత పట్టుకొన్నప్పుడు యక్ష్మ రోగం యొక్క ఆత్మ. మృత్యువు పట్టుకొనక ముందు పోవు జీవువివలె నశిస్తుది. (11)

"ఓ ఓషధులారా. వీర పురుషులు సంగ్రా మందు యితరులను బాధించు రీతిని మీరు యితని ప్రతి కణువుయందు వ్యాపించి యక్ష్మమును హరించండి." (12)

కల్పిత నామధేయుడు ప్రజా పతిపుత్ర యక్ష్మ నాశన ఋషి యక్ష్మకు, రాజయక్ష్మకు భేదాన్ని చెప్పాడు. (10-161-1)

ముంచామిత్వా హవిషాజీవనాయ

కమజ్ఞాత యక్ష్మాదుత రాజయక్ష్మాత్ ।

గ్రాహిర్జ గ్రాహయది వైతదేనంతస్యా

ఇంద్రాగ్నీ ప్రముముక్తమేనం ॥

"నేను హవి ద్వారా విన్ను అజ్ఞాత యక్ష్మనుండి, లేక రాజ యక్ష్మ నుండి విముక్తునిగ చేశాను. ఇతన్ని భూత గ్రహాలు పట్టివమెదల ఇంద్రాగ్నులు రక్షించెదరుగాక."

హృదయరోగం (గుండె జబ్బు) పురాతనమైంది. వృద్ధాప్యం వలన శరీరవ లోపలవున్న అవయవాలు జీర్ణము లగుటయే దీనికి వున్న ఒక లక్షణం. ఏ జ్వర లేకుండా రోగంలేకుండా గుండె ఆగిపోయి మనిషి ఆకస్మాత్తుగా చనిపోతే అట్టివావు: ప్రాచీన వరి భాషలో రోగులకు (శ్లాఘనీయ) మృత్యువు, మంచి చావు అన్నారు. చా: రాకుండా బాధపెట్టేదాన్ని ఉత్పీడక రోగ మన్నారు. కణ్వపుత్ర ప్రస్కణ్వు మిత్రుని (సూర్యుని) యిట్టి రోగంనుండి కాపాడమని కోరాడు. (1-50-11)

"నేడు ద్యౌ లోకమునకు పైన ఎక్కుతున్న మిత్రుడు (సూర్యుడు) న హృదయ రోగాన్ని, పాండురోగాన్ని పోగొట్టుగాక."

పాండురోగం వలన శరీరమంతా పచ్చపడుతుంది.

శరీరంలోని అనేక రోగాలను యక్ష్మ అనేవారని తోస్తుంది. ఈ విషయ వివృహాకాశ్యపుని సూక్తంవలన (10-163-1-6) తెలుస్తుంది.

"నీ రెండు కన్నులు, రెండు ముక్కురంధ్రాలు, రెండు చెవులు, గడ్డమ మెదడు, నాలుకనుండి తల వరకు వున్న యక్ష్మను పోగొట్టుతున్నాను. (1)

నీ మెడనుండి, ధమనులనుండి, స్నాయువులనుండి, ఎముకలనుండి, రెండ ముంజేతులనుండి రెండు బాహువులనుండి, రెండు భుజములనుండి యక్ష్మను పోగొట్ట తున్నాను. (2)

నీ ప్రేవులనుండి, గుదస్థానమునుండి, హృదయంనుండి, మూత్రాశయంనుండి యకృత్‌నుండి, మాంస కండరాలనుండి, యక్ష్మను పోగొట్టుతున్నాను. (3)

నీ తొడలనుండి, రెండు జానువులనుండి రెండు కాలి పిక్కలనుండి రెండ మడమలనుండి, రెండు పిరుదులనుండి, నడుమునుండి, మలస్థానంనుండి యక్ష్మన పోగొట్టుతున్నాను. (4)

నీ మూత్ర స్థానంనుండి, వెంట్రుకలనుండి, గోళ్ళనుండి, నీసర్వాత్మ (శరీరం) నుండి, ఈ యక్ష్మను పోగొట్టుతున్నాను.— (5)

ప్రతి అవయవంనుండి, ప్రతి రోమంనుండి, శరీరంనుండి, ప్రతి కణుపునుండి ఉద్భవించిన యీ యక్ష్మను పోగొట్టుతున్నాను.—(6)

ఘోష కుష్ఠురోగంతో బాధపడిన సంగతి ఋగ్వేదంలో పేర్కొనబడలేదు. కాని యితరచోట్ల చెప్పబడింది. దీర్ఘ తమాపుత్ర కక్షీవానుని సూక్తాన్నిబట్టి (1-117-7)

ఆమె ఏదో రోగంతో బాధపడి వివాహం లేకుండానే తండ్రి యింటిలో వుందని తెలుస్తుంది.

"ఓ అశ్వినీ దేవతలారా, మీరు స్తుతికర్తమైన కృష్ణపుత్ర విశ్వకునికి విష్ణాపు డను పుత్రుని యిచ్చారు. మీరు తండ్రియింట కూర్చున్న, బాధతోనున్న ఘోషకు పతిని ప్రసాదించారు." అప్పుడుకూడ రోగాల సంఖ్య ఎక్కువగానే వుండవచ్చు. కాని ఆ రోగాల వర్గీకరణ ఎక్కువగా జరుగలేదు.

4. చికిత్స : ఋగ్వేదానికి ఆరు శతాబ్దాల తర్వాత బుద్ధుని కాలంలో ఔష ధములు బాగా వృద్ధిచెంది విస్తరించాయి. కాని అప్పటికి యింకా రసాలు, లోహ భస్మాలు వాడుకలో లేవు. అవి వచ్చుటకు శతాబ్దాలు గడిచాయి. బుద్ధునికాలంలో పంచ భైషజ్యములు—ఐదు మందులు (నేయి, వెన్న, నూనె, తేనె, కలకండ) కొవ్వు, మూలికలు, కషాయం, ఆకులు, పండ్లు, జిగురు, లవణములు: పచ్చిమాంసం, రక్తంతో చేసిన మందులు వాడుకలో వుండేవి. అంజనము తైలము, నస్యము, పాంత్రాణి! మద్యంతోకూడిన మందులుకూడ ఉపయోగించేవారు. ఆవిరితో చెమట పట్టించుట, కొమ్ముతో నెత్తురుతీయుట, మర్దనము(మాలీషు), కోత (ఆపరేషను), మలాము పట్టీ, సర్ప చికిత్స, విషచికిత్స, పాండురోగ చికిత్స, గ్రహ (భూత) చికిత్స, చర్మరోగ చికిత్సలను గురించికూడ వినయ పిటకంలో (మహా వగ్గ, భైషజ్య స్కంధకంలో) పేర్కొనబడింది. వీనిలోని ఎక్కువ మందులు, చికిత్సలు అంతకు ముందు కూడ ప్రచారంలో వుండవచ్చు.

ఋగ్వేదంలో పేర్కొనబడిన రోగములు : అగద, అజకా, అజ్ఞాతయక్ష్మ, అనమీవ, అమూత్య, అప్వా, అమ, అశీపద, అశీమిద, జీవగృభ, దుర్నామా (మూలశంక) పవజ్వార, వృషన్య, వృష్ట్యామయీ, యక్ష్మ, రాజయక్ష్మ, వందన బద్రి, విపల్య, విషూచి, సురామ, గ్రామ, హరిమా, హృద్రోగం.

ఔషధముల సంఖ్య కూడ ఎక్కువగావుంది. కావున అధర్వణఋషి యిట్లు చెప్పారు—

యత్రౌషధీః సమగ్మత రాజానః సమితావివ ।

విప్రః స ఉచ్యతే భిషగ్రక్షో హామీవచాతనః ॥ (10-97-6)

"సమితిలో రాజులవలె ఔషధాలు ఎవరివద్ద గుమిగూడునో అతన్ని రోగ నాశకుడు, రాక్షసనాశకుడు, విప్రుడు, వైద్యుడు అంటారు."

నేటి వైద్యులు ధన్వంతరిని యిష్టదైవంగా చూస్తారు. కాని వేదకాలంలో అశ్వినీ కుమారుల మహిమను గురించి స్తుతించారు.

" ఆదివ్య భిషగ్గులగు అశ్విద్వయము మాకు శుభం చేకూర్చుగాక. మా బాధలను యిక్కడనుండి తొలగించుగాక." అని ఇరిన్వి ఋషి–చెప్పాడు. (8-18-8) హిరణ్యస్తూపుడు అశ్వినీ కుమారులను స్తుతిస్తూ చెప్పాడు– (4-34-69). "కల్యాణ దేవతలారా, అశ్వినీ కుమారులారా, మాకు మూడుసార్లు ద్యౌనుండి, మూడుసార్లు భూమినుండి, మూడుసార్లు నీటినుండి మందులను యివ్వండి సంయునివలె నా బిడ్డలకు మూడు విధాలుగా సౌఖ్యం చేకూర్చుడు. (6)

"ఓ అశ్వినీ కుమారులారా, మీ మూడు రథముల, మూడు చక్రము లెక్కడ ? అద్దంలతోకూడిన మూడు యిరుసులు ఎక్కడ ? ఆ బలమైన గాడిదను ఎప్పుడు కట్టుకొని యజ్ఞానికి వస్తారు " (9)

దీన్నిబట్టి అశ్వినీ దేవతల రథానికి రాసభం (గాడిద) కట్టబడేదని తెలుస్తుంది. గుర్రంతో సమానం కాకపోయినా గాడిదలను పెంచుటకు, ఉపయోగించుటకు ఆర్యులకు ఎటువంటి హీనభావం లేదనిపిస్తుంది.

మాదక సోమాన్ని ఔషధంగా వుపయోగించారనుటలో ఆశ్చర్యపడ నవసరం లేదు. నేటి మందుల్లోకూడ మద్యసారం ఎక్కువగా వాడబడుతూ వుంది.

"మిత్రావరుణులారా, సూర్యోదయం కాగానే సోమాన్ని పుచ్చుకొంటున్నాం అది రోగికి మందు," అని ప్రగాథ పుత్ర హర్యతుడు చెప్పాడు.

కణ్వపుత్రసోభరి ప్రసిద్ధమై ఋగ్వేదఋషి, ఆయన అశ్వినీకుమారుల మహిమను కీర్తిస్తూ "ఓ అశ్వినీదేవతలారా। మీరు ఏ ఔషధాలచే భక్తులను రక్షించారో, అధ్రిగులను రక్షించారో, అసహాయులైన బభ్రువిరక్షించారో, ఆ ఔషధాలతో వెంటనే రండి, యీ బాధితునికి (రోగికి) చికిత్స చేయండి-" అని చెప్పాడు. (8-22-10).

—•—

# పదమూడవ అధ్యాయం

# వేషభూషలు

ఆర్యులు చలి దేశాన్నుండి వచ్చారు. చలి కాలంలో సప్తసింధులో కూడ చలి బాగా వుండేది. సువాస్తు ఉపత్యకవంటి ప్రదేశాల్లో వుండేవారు. అక్కడ ప్రతి సంవత్సరం మంచు పడుటను చూచేవారు. కాని ఆర్యుల నివాసాలు ఎక్కువగా చలి వున్నప్పటికీ హిమపాత భూమికి దూరంగా వున్న చలినుండి కాపాడుకొనుటకు శరీరాన్ని కప్పుకోవాలి. "అగ్నిర్హిమస్య భేషజమ్" (చలికి మందు నిప్పు) అను మాటను సార్థకం చేస్తూకూడ వారు బట్టలు లేకుండా కేవలం నిప్పు సహాయంతో వుండలేరు. వారు అనేక రకాల దుస్తులు ధరించేవారు. కాని వాటి అన్నిటి వివరాలు లభించుటలేదు.

## 1. వస్త్రాలు

వస్త్రాన్నివాస అన్నారు. సువాస, దుర్వాస, అర్ధనవాస, శుక్రవాస, అధివాస మొదలగు శబ్దాలు ఆర్యులకు వస్త్రములపట్ల వున్న శ్రద్ధను తెల్పుతున్నాయి. స్త్రీ గాని, పురుషుడు గాని సువాసులగుట అవసర మనుకొనేవారు. విశ్వామిత్రుడు సువాసను గురించి చెప్పాడు. (3-8-4)

యువా సువాసాః పరివీత ఆగాత్స ఉ
  శ్రేయాన్ భవతి జాయమానః।
తం ధీరాసః కవయ ఉన్నయంతి
  స్వాధ్యో మనసా దేవయంతః॥

"సుందర వస్త్రం ధరించిన యువకునివలె యూప స్తంభం వచ్చింది. అది పుట్టి కీర్తిని సంపాదించుకొంటున్నది. జ్ఞానులు, ధీరులు అయిన కవులు మనసారా దేవులను తలుస్తూ యూపం ఎత్తుతున్నారు.

ఇక్కడ యజ్ఞం కొరకు వున్న యూపాన్ని వర్ణిస్తూ దాన్ని సుందర వస్త్రాలు ధరించిన యువకునితో పోల్చారు.

ఋషి కక్షీవానుడు కూడ సువాసా స్త్రీని పేర్కొన్నాడు-(1-124-7)

"సోదరులులేని స్త్రీ పురుషుని ఎదుటకు ధనం కొరకు వచ్చినట్లు, సువాసా పత్ని అభిలాషతో భర్త వద్దకు వచ్చినట్లు నవ్వుతూ ఉషస్సు ప్రకాశిస్తున్నది." ఈ భావన్నే బృహస్పతి కూడ చెప్పాడు (10-71-4)

"చూస్తూ కూడ వాణిని ఎవరూ చూడలేరు. వింటూ కూడ వినలేరు. పతిని కోరిన సువాసా స్త్రీ వలె ఎవరికో యీ వాణి తన శరీరాన్ని అనావృతం చేస్తుంది."

శుక్ల వస్త్రమంటే ఆర్యులకు మక్కువ వున్నట్లుగ తెలుస్తుంది. కుత్స అంగిరసుడు ఉషస్సును వర్ణిస్తూ చెప్పాడు. (1-113-7)

"ద్యౌని పుత్రిక, యువతి, శుక్రవాసా (శుక్ల వస్త్రధారిణి తెల్లని వస్త్రమును ధరించినది) ఉషస్సు అంధకారాన్ని తొలగిస్తూ కనపడింది. ఈమె పృథ్వీ లోకం ధనమంతటికీ స్వామిని. ఓ సౌభాగ్యవతీ ఉషా, నేడు యిక్కడ నుంచి చీకటిని తొలగించుము."

ఉషస్సును అరుణవాసా అనాలి. కాని శుక్ల వస్త్రం అందేవున్న పక్షపాతంచేత యిక్కడ ఆమెను శుక్రవాసా అన్నారు. విశ్వామిత్రుడు కూడ ఉషస్సును అర్జునవాసా (శ్వేతవస్త్ర ధారిణి) అన్నాడు (3-39-2).

దివిశ్చిదా పూర్వ్యా జాయమానా వి జాగృవిద్విదథే శస్యమానా,

భద్రా వస్త్రాణ్యర్జునా వసానా సేయమస్మే సనజా పిత్ర్యాధీః ॥ (3-39-2).

"ఓ యింద్రా, ద్యులోకమందు పుట్టి, యజ్ఞమందు ప్రశంసించబడి, జాగరూకమై, అర్జున (తెల్లని) వస్త్రములను ధరించి శుభదాయిని ఉషస్సు పితరులనుండి మా వద్దకు వస్తున్నది."

ఆర్యులవి వున్ని వస్త్రాలు. అన్నిచోట్ల వారు అవిని (గొర్రెను), ఉన్నిని గురించే చెప్పారు. సోమాన్ని వడగట్టుటకుకూడ వున్నివస్త్రమునే వుపయోగించేవారు. విమద ఋషి వున్ని వస్త్రాలను గురించి చెప్పాడు (10-26-6).

"మిక్కిలి కోరికతో శువా (ఆడమేక). శుని (మేక)ల యజమానిగా గొర్రెల వున్నితో వస్త్రాలు నేస్తూ వున్నాడు"

దుర్వాసులు (చెడ్డ వస్త్రములు వేసుకొనుటను)గా వుండుట ఆర్యులకు యిష్ట ముండేదికాదు. అందుకనే వసిష్ఠుడు అగ్నిని ప్రార్థించాడు (7-1-19).

"ఓ అగ్నీ! మమ్మ నిర్వీరులుగ చేయవద్దు. దుర్వాసులుగా, మతిహీనులుగ చేయవద్దు. మాకు ఆకలిని యీయవద్దు. రాక్షసుని యీయవద్దు మమ్మ యింటిలో గాని, వనంలోగాని చంపవద్దు."

స్త్రీలు అందముగ వస్త్రాలతో కప్పుకొనుట ఆర్యులకు యిష్టం. అశ్వినీ కుమారులను స్తుతిస్తూ విశ్వమనా అంగిరసుడు చెప్పాడు. (8-26-13).

"ఓ అశ్వినీ కుమారులారా! వస్త్రం ధరించిన వపువులె మీకు యజ్ఞంతో కూడిన పూజను చేసిన వారికి, మీరు యశస్సు, శుభం చేకూర్చుతున్నారు."

వస్త్రాలు వారు ఎక్కువగా వుపయోగిస్తున్నప్పటికి అవి ఎన్ని రకాలో మనకు వాటి వివరణ చాల తక్కువగానే తెలుస్తుంది. వారి దుస్తులు-

1. ద్రాపి : వామదేవుడు యీ వస్త్రం గురించి చెప్పాడు (4-53-2)

"ద్యులోక ధారకుడు, భువనముల ప్రజాపతి, కవి (సూర్యుడు) పిశంగ ద్రాపిని ధరిస్తున్నాడు. అతడు స్తుతించబడి విచక్షణతో సుందరమైన ధనములను ప్రసాదించుగాక"

దీర్ఘతమ పుత్ర కక్షీవానుడుకూడ ద్రాపిని వర్ణించాడు. (1-116-10).

"ఓ అశ్విద్వయములారా, మీరు జీర్ణమైన ద్రాపివలె చ్యవనుని ముసలితనాన్ని పోగొట్టారు. మీరు అసహాయుడైన చ్యవనుని ఆయువును వృద్ధిచేసి అతన్ని కన్యలకు భర్తగా చేశారు."

అజీగర్త పుత్ర శునశ్శేపుడు వరుణుని స్తుతిస్తూ ద్రాపిని పేర్కొన్నాడు. (1-25-13)

"బంగారు వన్నెగల ద్రాపిని ధరించి వరుణుడు తన శరీరాన్ని కప్పుకొంటు న్నాడు. నలు వైపుల కిరణాలను ప్రసరింప చేస్తున్నాడు"

ఆర్యులు పిశంగ, హిరణ్య (పసుపు వర్ణం) బంగారు వన్నెగల ద్రాపిని ధరించే వారని పై ఋక్కుల వలన తెలుస్తున్నది. హిమాలయంలోని అనేక స్థావముల్లోని స్త్రీలు దోరూ (అద్దరు)ను ధరించినట్లు బహుశా యీ ద్రాపిని ఆర్యులు ధరించి వుంటారు.

2. అత్క : భరద్వాజుడు దీన్ని పేర్కొన్నాడు. (6-29-3)

"ఓ యింద్రా. శ్రీకొరకు మేము నీపాద సేవను చేస్తున్నాం. గదను చేతబట్టి శత్రువులను నీవు బలంతో ఓడించి మాకు దక్షిణలు యిస్తున్నావు. ఓనేతా, నీవు దర్శనీయమైన, సురభిత అత్కను ధరించి సూర్యునివలె తిర్గుతున్నావు."

కల్పితమైన భార్గవ ఋషి వేనదేవతను వర్ణిస్తూ అత్కాను పేర్కొన్నాడు (10-123-9) "గంధర్వ స్వర్గం పైనవుండే వేనుడు మా ఎదుట విచిత్ర ఆయుధాలను ధరిస్తూ, సురభిత అత్కాను వేసుకొని దర్శనీయుడై ప్రియ సుఖం కల్గిస్తున్నాడు"

3. శిప్ర : శిరస్త్రాణం, ఉష్ణీషం (తలపాగా) వెంటనే శిప్ర అంటారు. వసిష్ఠుడు యింద్రుని స్తుతిస్తూ శిప్రను పేర్కొన్నాడు. (7-35-3) "ఓ శిప్రధారీ యింద్రా, సుదాసునికొరకు నీవు వందలాది రథాలు, వేలాది కోర్కెలు, దానములు యిచ్చేదవు గాక. మా క్రూర శత్రువులను చంపుము. మాకు ఉజ్వల రత్నాలను యిమ్ము."

వామదేవుని ఋక్కులవలన శిప్ర అనగా శిరస్త్రాణమని తెలుస్తుంది. (4-37-4)

"ఋషులారా. మీ గుర్రాలు బలిసి వున్నాయి. రథములు మెరుస్తున్నాయి. మీరు తామ్రశిప్రులై (అయః శిప్రాః), అన్నవంతులై, మంచి నిష్కములను (బంగారు ఆభరణములు) ధరించి వున్నారు. ఓ యింద్రపుత్రులారా బలని మనుషులారా. మీ ఆనందం కొరకు ముందుగా యీ ఆహారం యిస్తున్నాం.

ఇక్కడ శిప్ర అంటే శిరస్త్రాణంగ తోస్తుంది కాని శిరస్త్రాణము కూడ ఉష్ణీషము యొక్క వికసిత రూపమే గదా! ఈ ప్రకారంగా ఆర్యుల దుస్తుల్లో ఉష్ణీషం కూడ వుంది. దాదాపు క్రీ. శ. 1వ శతాబ్దం వరకు భారతదేశంలో స్త్రీ పురుషులు ఉష్ణీషం చుట్టుకొనేవారు. ఆ కాలంలో భారతదేశానికి బయటకు పోయి వలసను ఏర్పరుచుకొన్న స్త్రీ పురుషులు తమ వెంట అక్కడకు యీ ఉష్ణీషం కూడ తీసుకుపోయారు. బర్మాకు సరిహద్దున చైనాలో - పూర్వకాలంలో పూర్వగంధార ఉపనివేశం ఉన్న చోటులో- నేటికి స్త్రీ పురుషులు తలపాగా చుట్టుకొంటారు. ద్రాపి యొక్క రూపాంతరమే తర్వాత వచ్చిన ఉత్తరసంగం (ఉత్తరీయ వద్దరు). మనాన లేక మంచి అంతర్వాసికమే తర్వాత ధోవతిగా మారింది. స్త్రీలకు ఉత్తరీయం గాను లేక ఉత్తరాసంగతో కూడిన చీరెగా మారింది. లేక కుచ్చీలను పెంచగా లంగా అయింది. మొహింజెదారో, హరప్పా దుస్తుల్లో కూడ అంతర్వాసం, ఉత్తరాసంగం ఉన్నట్లు తెలిసింది. సుత్తన్ లేక పైజామా శకుల దిస్తులు. అది వారితో క్రీ. పూర్వములోను క్రీస్తుకు తర్వాతను వున్న ప్రథమ శతాబ్దాల్లోను భారతదేశానికి వచ్చింది. తర్వాత మన రాజులు దాన్ని వారి దుస్తుల్లో చేర్చుకొన్నారు. సుత్తన్ ధరించివున్న గుప్త రాజుల నాణెములను చూస్తే యీ విషయం తెలుస్తుంది.

# 2. భూషణాలు (నగలు)

ఆ భూషణాల్లో కుండలములు (చెవి పోగులు). మెడలో తాయెత్తు లేక బిళ్ళ, వక్ష స్థలముపైన హారము, చేతి కంకణములు సంగతి తెలిసింది. ఈ నగలు బంగారం తోను, మణులతోను చేయబడినవే. వైదిక కాలంలో వెండి వున్నప్పటికీ దాని వాడుక చాల తక్కువ. ప్రాచీన కాలంలో వెండి దొరకనందున వెండి, బంగారముల విలువ సమానంగా వుండేది. ఇదికూడ వెండి వాడుకలోనికి రాకపోవుటకు ముఖ్య ఆటంకం. బంగారం మన దేశంలో కొద్దిగానో, గొప్పగానో దొరికేది. ఇంతకన్న ఎక్కువగా అల్టాయి గనులనుండి బంగారం, తామ్ర యుగంలో ఆసియాలోని విభిన్న దేశాలకూ, మధ్య దేశాలగుండా భారత దేశానికి వస్తూ వుండేది.

1. కర్ణ భూషణాలు (చెవుల నగలు) : కురుసుతి ఋషి కర్ణ భూషణం (కర్ణ శోభన) గురించి చెప్పాడు. (8-67-3)

"ఓ వృత్ర నాశకుడైన యింద్రా ! నీవు ధన సంపన్నుడవు, నీవు సర్వత్రా స్తుతింపబడుతున్నావు. మాకు అనేక కర్ణ శోభనలు యిమ్ము"

కక్షీవానుడు సర్వ దేవతలను ప్రార్థిస్తూ చెప్పాడు. (1-122-14)

హిరణ్య కర్ణ మణిగ్రీవ మర్ణ స్తన్నో విశ్వే వరివస్యంతు దేవాః।
ఆర్యోగిరః సద్యఆ జగ్మషీరో స్రాశ్చాకంతూమయేష్వస్మే॥

"ఓ విశ్వదేవులారా, మాకు హిరణ్య కర్ణులను (చెవులకు బంగారు పోగులు కలవారు), మణిగ్రీవులను (కంఠమందు మణులు గలవారు), రూపవంతులును అగు పుత్రులను ప్రసాదించండి. అతివుగా వెలువడుచున్న మా శ్రేష్ఠ వాణులను, హవ్యమును ప్రేమతో గ్రహించండి."

2. బంగారు కంఠి : మెడలో నిష్కం (బంగారు నగ) ధరించు సంగతి చెప్పబడింది. నిష్కం బంగారు నాణెం కాదు. కుషానులకు, పూర్వం భారతదేశంలో బంగారు నాణెములను ఏ రాజూ ముద్రించనూలేదు. వాటి నమూనాలు మనకు దొరకనూలేదు. మెడలో వేసుకొనుటకు ప్రత్యేక ఆకారంలో బంగారపు బిళ్ళలు వుండవచ్చు. వాటిని నిష్కం అన్నారు. బభ్రు ఆత్రేయుడు మెడలో నిష్కం ధరించిన ఋత్విజులను పేర్కొన్నాడు. (5-13-3)

"స్తుతి కర్తలు, అన్నకాంక్షలు, విష్కగ్రీవులు అగు ఋత్విజులు యీ అగ్ని బలమును వృద్ధి చేస్తున్నారు".

విష్కగ్రీవుని వసిష్ఠుడు సువిష్కడన్నాడు. (7-56-11)

"స్వాయుధాస ఇష్మిణః సునిష్కా ఉత
స్వయం తన్వః శుంభమానాః॥"

"సుందర ఆయుధాలను ధరించిన, చురుకైన సుందరమైన విష్కములు ధరించిన మరుత్తులు స్వయంగా మా శరీరమును అలంకరిస్తున్నారు."

కక్షీవానుడు విశ్వదేవస్తుతిలో (1-122-14) మణిగ్రీవుల సంగతి చెప్పాడు. దీన్నిబట్టి ఆర్యస్త్రీలు, పురుషులు మెడలో విష్కములే కాకుండా మణుల మాలను కూడ వేసుకొనేవారు అని తెలుస్తుంది.

3. రుక్మవక్షః : వసిష్ఠుడు వక్షముపై రుక్మను, భుజమునకు కంకణం ధరించిన సంగతిని పేర్కొన్నాడు, (7-56-13).

అంసేష్వా మరుతః ఖాదయోవోపక్షః సుక్మా
ఉపశిశ్రియాణాః।
వి విద్యుతోన వృష్టి భీరువానా అను
స్వధా మ యుధై ర్యచ్ఛమానః॥

"ఓ మరుత్తులారా, మీ భుజములకు కంకణాలు, మీ వక్షాలపై రుక్మలు (స్వర్ణ భూషణాలు) అలంకృతములై వున్నాయి. వానలో మెరుపువలె ఆయుధాలను ప్రకాశింపచేస్తూ ప్రయోగిస్తున్నారు."

4. ఖాది 5. ఋష్టి 6. శిప్ర : పై ఋక్కునుబట్టి ఖాది భుజమునకు పెట్టుకొను ఆభూషణమని తెలుస్తుంది. శ్యావాశ్వుడుకూడ పేర్కొన్నాడు (5-54-11). "ఓ మరుత్తులారా, మీ భుజములకు ఋష్టి (ఆయుధాలు), కాళ్ళకు ఖాది, వక్షములకు రుక్మలు వున్నాయి. రథముపై మీరు శోభిల్లుతున్నారు. కిరణాల్లో నిప్పువలె ప్రకాశించుచున్న తళుకులతో తల పైన విశాలమైన సువర్ణ శిప్రలున్నాయి."

ఇక్కడ ఖాది భుజములకు కాకుండా కాళ్ళకు వున్నట్లు వర్ణితమైంది. కాబట్టి కాళ్ళకున్న కడియాలను కూడ ఖాది అనేవారు. కంకణము (మురుగు)లను కూడ ఖాది అనే వారని శ్యావాశ్వుని ఋక్కువలన తెలుస్తుంది. (5-58-2).

"ఓ విప్రులారా, దీప్తిమంతులు, శక్తివంతులు, చేతులకు కంకణం కలవారు, సుఖదాయకులు. మాయావులు, దాతలు, గొప్పమహిమ కలవారు, గొప్పఐశ్వర్యం కలవారు, నేతలు అయిన యీ మరుత్తులకు మీరు వందనం చేయండి."

భరద్వాజుడుకూడ శిశువు చేతికి ఖాది వున్నట్లు పేర్కొన్నాడు. (6-16-40) "అధ్వర్యులు ఖాదిని ధరించిన నవజాత శిశువు వలె సుందరమైన అగ్నిని చేతియందు గ్రహిస్తున్నారు."

మొహింజెదారో ప్రజల, ఋగ్వేద ఆర్యుల అభూషణాల్లో కొంత సమానత్వం తప్పక వుంది. ఎందుకంటే మొహింజెదారో ప్రజలు ఎక్కువ సంస్కృతి సంపన్నులగుటచేత భూషణాలందును, అలంకరణలోను ఆర్యులకు మార్గ దర్శకులుగా వుండవచ్చు. మొహింజెదారో త్రవ్వకాల్లో ఎన్నో రకములైన నగలు దొరికాయి. స్త్రీలు మణికట్టు మొదలు భుజమువరకు ఏబదేసి కంకణాలు లేక గాజులు ధరించేవారు. వాటిని యిప్పటికీ పాతకాలపు సింధీ, మార్వాడీ స్త్రీల చేతులకు వుండుటను చూస్తున్నాం. ఋగ్వేద ఆర్య స్త్రీలు చేతులకంతా బంగారం ఖాది పెట్టుకొనక పోయినా ఒకటిరెండయినా తప్పక ధరించి వుంటారు. కంకణం స్త్రీలకు మాత్రమే ఆభూషణం కాదు. ఒంటిపేట, నాల్గుపేటలు, ఆరుపేటలు హారములు కూడ మొహింజెదారోలో దొరికాయి. ఈ బంగారు హారాలను ధరించినవారిని ఋషులు రుక్మవక్షులుగా వర్ణించారు.

7. ఓపశ : ఇది స్త్రీల శిరోభూషణం. బహుశా సౌభాగ్యవతి తిలకంవలె వుండేది.

## 3. సజ్జా (అలంకరణ)

1. కపర్ద : శరీరాన్ని అలంకరించుకొనుట మానవ సహజం. ఇందుకు మనం కేవలం స్త్రీలను నిందించవలసిన పనిలేదు. పురుషులు కూడ తమ్ము అలంకరించుకొనుటకు ప్రయత్నిస్తున్నారు. ఆర్యు లందరూ గడ్డం, మీసాల్ని ఉంచుకొనేవారు కాదు. ఇంద్రుని ముఖమునకు పసుపు గడ్డం మీసం ఉన్నట్లుగ మేము యిదివరలో చెప్పాం. ఆర్యపురుషులు కూడ ఆర్య స్త్రీలవలె పొడవైన జుట్టును వుంచుకొనేవారు. ఈ అలవాటు మహమ్మదీయులు వచ్చేవరకు వుంది. మొత్తం జుట్టును పోగుపెట్టి కట్టిన జడను కపర్ద అన్నారు. శంకరుని తలపై జటాజూటముంది. కాబట్టి శంకరునికి కపర్ది అను పేరు వచ్చింది. భరద్వాజుడు పూషుని కపర్దీ అంటూనే

ఈశానుడని అన్నాడు. (6-55-2). ఈశానుడు రాజుకు లేక శాసకునికి పర్యాయ పదం. అదే శంకరునికి పర్యాయ పదమైంది. భరద్వాజుని "కపర్దీ ఈశానుణ్ణి" తర్వాత కాలంలో జటాజూట ధారి శంకరునిగ చెప్ప నారంభించారు. ఏమైనా కానీ యండి, పూషనుణ్ణి భరద్వాజుడు కపర్దీ అన్నాడు, (6-55-2).

రథీతమం కపర్దిన మీశానం రాధసోమహః ।

రాయః సఖాయ మీమహే ॥

"సర్వశ్రేష్ఠరథి, కపర్దీః మహా ఐశ్వర్యవంతుడు, ఈశానుడు, మాకు సఖుడు పూషనుని నుండి మేము ధనాన్ని అడుగుతున్నాం."

ఆయనకు సమకాలికుడగు వసిష్ఠుడు కూడ తన కులంలోని యువకులను తలపై కుడివైపు కపర్దములు ధరించినవారని చెప్పుకొన్నాడు (7-33-1)

"తెల్లని. కుడివైపున ముడులుగల నా పుత్రులు నాకు అన్ని వైపుల నుండి ఆనందం చేకూర్చుతున్నారు. యజ్ఞం నుండి లేస్తూ 'వసిష్ఠసంతానం నాకు దూరముగ పోరాదు' అని చెపుతున్నాను."

దీన్నిబట్టి వివిధ కులస్తులు వారి తలపై ముడులను వేర్వేరుగా వేసుకొనే వారని తెలుస్తుంది. బైరాగి సాధువులు తమ సాంప్రదాయానుసారంగా తమ తల పాగను కుడికిగాని, ఎడమకుగాని చుట్టుకొంటారు. ఇట్లే రాజపుత్రులు కూడ చుట్టు కొంటారు. హిందువుల బొక్కులు, మిర్జయీమెద కుడివైపునుండి, మహమ్మదీయు లని ఎడమనుండి తెరచు విధానములుండుట మనకు తెలును. ప్రాచీనకాలంలో కపర్దం నిక్కుల ముడిలాంటిది కాదు. ముడికి పైన పాగా చుట్టి దాన్ని పూలతో అలంకరించే వారు. క్రీస్తుకు పూర్వం రెండు-మూడు శతాబ్దాల విగ్రహాలను చూస్తే మనకీవిషయం తెలుస్తుంది. పువ్వులతో కేశాలను అలంకరించుకొను ఆచారం ఋగ్వేద కాలంలో కూడా వుండవచ్చు.

వేణిని కూడ కపర్ద మనేవారు. వియూప పుత్రసధ్రీ ఋక్కులవల యీ విషయం తెలియగలదు. (10-114-3) "నాల్గు కపర్దులను (జడలను) ధరించినటువంటిది అంద కత్తె, సువస్త్ర ఆయజ్ఞ యువతి పై పరాక్రమం గల పక్షులు రెండు కూర్చున్నాయి. అందు దేవతలు తమ తమ భాగాలను పొందారు."

ఇక్కడ యజ్ఞ వేదికను నాల్గు కపర్దులు కల యువతితో పోల్చారు. కన్యలు నాల్గు జడలు వేసుకొని వుండవచ్చు. ఒక జడ, రెండు జడలు వేసుకొను పద్ధతి యిప్పుడు కూడ వుందిగదా.

2. క్షురం : గడ్డం, మీసంగాని, గడ్డం ఒక్కటేగాని క్షవరం చేయించుకొను ఆచారమున్నట్లు (10-142-4) ఋక్కువలన తెలుస్తుంది.

"ఓ అగ్నీ, నీవు ఎత్తైన కొండలను, పల్లపు మైదాన ప్రదేశాలను ఆరగిస్తున్నప్పుడు దోచుకొను పేనవలె వేర్వేరుగా పోతావు. వాయువు నీకు తోడైనప్పుడు మంగలి గడ్డాన్ని మీసాన్ని క్షవరం చేసినట్లు అధిక భూభాగాన్ని ఆరగిస్తావు." ।

ఋగ్వేదంలో ఆర్య స్త్రీ, పురుషుల వేషభాషల గురించి వర్ణితమైన విషయాలనుబట్టి మనకు యీ క్రింది సంగతులు తెలుస్తాయి. ఆర్యులకు ఉన్నిగుడ్డలుగాని, చర్మపు దుస్తులుగాని వేసుకొనుట యిష్టం. వారు రకరకాల బంగారు నగలు, మణుల నగలు పెట్టుకొనేవారు. కేశములను పువ్వులతో అలంకరించుకొనేవారు. ఆర్య పురుషులందరకు గడ్డం ఉంచుకొనవలెనను మోజు లేదు. ప్రౌఢులు మాత్రం తప్పక గడ్డం పెంచేవారు.

—•—

# పదునాలుగవ అధ్యాయం

# క్రీడా వినోదాలు

1. నృత్యం : నృత్యగీతాలు, సోమపానం, గుర్రపుస్వారి, కుస్తీ, జూదం ఆర్యుల వినోద సాధనాలు. వీటినిగురించి విస్తారంగా ఋగ్వేదంలో వర్ణింపబడ కుండుట సహజమే. ఋగ్వేద సంగ్రహం యొక్క వుద్దేశ్యం అదికాదుగదా! అంగిరస సవ్య ఋషి నృత్యాన్ని పేర్కొన్నాడు.

(1-67-8) కాని దాన్ని సాంకేతిక భాషలో అక్కడ ఇంద్రుడు గదను నర్తనం చేయించినట్లు చెప్పాడు.

2. సంగీతం : సంగీతం కూడ ఆర్యులకు ఒకే వినోదసాధనం. ఋగ్వేదం లోని తొమ్మిదవ మండలం, దాదాపు సామవేదమంతా సోమగానం కొరకే వుంది. గానసాధన (గాయత్ర) మగుటచేత ఎనిమిది అక్షరాలతో మూడు పాదములున్న పద్యాన్ని గాయత్రీ అన్నారు ఘోర పుత్ర కణ్వుడు అందుచేతనే చెప్పాడు. (1-38-11). "నోటిలో శ్లోకం తయారు చేసుకొనుము. పర్జన్య మేఘంవలె దాన్ని విస్తరించుము. ఉక్థ్య (గేయ) గాయత్రిని గానం చేయుము."

నేడు కూడ కిన్నరులు మొదలగు పర్వత జాతులయొక్కయు, మైదాన ప్రజల యొక్కయు పల్లెపదాల్లో మూడు పాదములున్న యీ పద్యం అధికవ్యాప్తిలో వున్నట్లు మేము యింతకు ముందే చెప్పియున్నాం. వైదిక గాయత్ర సామములు, పల్లెపదాల్లో మూడు పాదములున్న పాటల లయను గురించి తులనాత్మక అధ్యయనం చేసిన యెడల బహుశా మనకు నప్తసింధులోని ఆర్యుల గాన పద్ధతి పరిచయాత్మకంగా నైనా తెలియగలదు.

## 3. పానం

1. సోమపానం :- మత్తును కల్గించు పానముల్లో సోమపాన మొకటి. ఇది ఆర్యుల్లో చాల ఎక్కువగా వుంది. ఒకరకమైన సురనుకూడ వారు త్రాగేవారు. కాని దానికి అంతగా ప్రాముఖ్యంలేదు. కణ్వపుత్రకుసీది సోమపానం యింద్రునకు

ప్రియమైందని చెప్పాడు. (8-71-7,8) "చమసుల్లో (గిన్నెల్లో), చమూల్లో (కొయ్య పాత్రల్లో) నీ కొరకు సోమాన్ని వడగట్టి వుంచాం. ఓ యింద్రుడా, నీవు దీన్ని త్రాగుము. నీవు దీనికి యజమానివి." (7)

"పాత్రల్లోని సోమం నీటిలో చంద్రునివలె కనబడుతున్నది. నీవు దీన్ని త్రాగుము. దీనికి నీవు ఈశ్వరుడవు." (8)

సోమాన్ని గురించి వున్న తొమ్మిదవ మండలం విశ్వామిత్రపుత్ర మధుచ్ఛందుని సూక్తంతో ప్రారంభమవుతుంది. అందలి మొదటి ఋక్కు యిట్లున్నది. (9-1-1).

స్వాదిష్ఠయా మదిష్ఠయా పవస్వ సోమధారయా ।
ఇంద్రాయ పాతవేసుత ః ॥

"ఓ సోముడా, నీవు యింద్రుడు త్రాగుటకొరకు వడకట్టబడి, స్వాదిష్ఠమై, మదిష్ఠమై ధారగా ప్రవహించుము."

శున ః శేపుడు సోమాన్ని వర్ణించాడు. (9-3-1).

ఏషదేవో అమర్త్యః పర్ణవీరివ దీయతి ।
అభిద్రోణాన్యాసదం ॥

ఈ అమరదేవుడు ద్రోణము (కలశము) ల్లోనికి పక్షివలె ఎగురుతూ పోతున్నాడు"

సోమం గురించి ఎక్కువ సూక్తములు రచించిన ఋషి అసితదేవలుడు. ఆయన ఏమి చెప్పాడో చదవండి—(9-5-1).

సమిద్ధో విశ్వతస్పతి ః పవమానో విరాజతి।
ప్రీణాన్ వృషా కనిక్రదత్ ॥

"పరాక్రమవంతుడు, పతి, ఉద్దీప్తుడు, పవమానుడు అయిన సోముడు శబ్దం చేస్తున్నాడు. సంతోషపెట్టుతూ శోభిల్లుతున్నాడు."

"పవమాన. (వడకట్టుటచే పవిత్రమైన) సుందర, మహా సోముడు రాత్రిని, దర్శనీయమగు ఉషస్సును కాంక్షిస్తున్నాడు." (6)

"పవమాన సుందర సోముని భార్యలగు భారతి, సరస్వతి, ఇళా-మువ్వురూ మా యీ యజ్ఞంలోకి రావలసింది" (8)

అసిత ఋషి యింకా వర్ణిస్తున్నాడు. (9-8-4-6)

"ఓ సోముడా. నిన్ను పవిత్రేళ్ళు శుభ్రపరుస్తున్నాయి. ఏడు స్తుతులు ప్రసన్నం చేస్తున్నాయి. తర్వాత విప్రులు నిన్ను సేవించి మత్తిల్లుతున్నారు (9-8-4)"

"పసుపు పచ్చని బంగారు వన్నెగం సోముడు కలశాల్లోకి ప్రవహిస్తూ పాలు అను వస్త్రం ధరిస్తున్నాడు."

ఋషి యింకా చెప్పుతున్నాడు (9-11-1,3,6).

"ఓ నరులారా, పవమాన సోమునికొరకు పాటపాడండి. ఇతడు దేవతల కొరకు యజ్ఞం చేయకోరుతున్నాడు." (1)

"దేవతల కొరకు కోర్కెతో సోమదేవతకు అధర్వులు మధువును చేర్చి కలిపారు. కావున ఓ సోమరాజా, నీవు మా కొరకు ప్రవహించు. మా గోవుల మేలు కోరి, మా గణముల మేలుకోరి, మా గుర్రముల మేలుకోరి, ఔషధముల మేలుకోరి ప్రవహించుము." (3)

"ఎర్రని రంగుగలవాడును, స్వశక్తి కలవాడును, ద్యౌను తాకువాడును అగు సోముని కొరకు గాథను పాడండి."

"నమస్కరిస్తూ దగ్గరకు రండి. సోమాన్ని పెరుగుతో కలపండి. ఇంద్రునికి సోమం యివ్వండి. (6)

సోమం గురించిన స్తుతుల్లో ఎక్కువ భాగం మూడు పాదాలు గల గాయత్రీ పద్యమందున్నవి అని మీరు గుర్తుంచుకొనవలసి వుంది. ఉత్తర భారతంలో చాలా ప్రదేశాల్లో పల్లెపదాల్లో (లోక గీతముల్లో) యీ ఛందము (పద్యము) వాడుకలో వుంది. చివరి మూడవ పాదాన్ని మరొకసారి అన్నప్పుడు అది నాల్గు పాదములు కల పద్యమవుతుంది. ఋగ్వేదకాలంలో కూడ యీ విధంగానే వుండ వచ్చు. ఋగ్వేద ఆర్యులకు ప్రియమైన పానం సోమపానం. అది వారి దేవతలకు కూడ మత్తును కల్గించేది. అందుచేతనే అసిత దేవలుడు పులకితుడై సోముని గుణాలను కీర్తిస్తున్నాడు (9-15-1-2-4).

ఏషధియా యాత్యణ్వ్యా శూరో రథేభి రాశుభిః ।
గచ్ఛన్నిన్ద్రస్య నిష్కృతం ॥ (1)
ఏషపురూధియా యతే బృహతే దేవతా తయే ।
యత్రామృతాస ఆసతే ॥ (2)
ఏష శృంగాణి దోధు వచ్ఛిశీతే యూథ్యో వృషా ।
నృమ్ణా దధాన ఓజసా ॥ (4)

"ఈ కూరుడు (సోముడు) ఇంద్రుని వద్దకు సూక్ష్మ స్తుతులతో! వేగంగా పోవు రథములపై వెళుతున్నాడు."

"అమరులున్న యీ మహాయజ్ఞమందు సోముడు చాలా శ్రద్ధవహిస్తున్నాడు"

"యూథపతి వృషభం కొమ్ములను ఆడిస్తున్నట్లు సోముడు తన బలన్పుతో పరాక్రమిస్తూ వున్నాడు."

అసిత ఋషి యింకా వర్ణించాడు. (9-17-4-7).

"సోమం కలశాల్లోకి పరుగిడుతూ, పాత్రలను తడుపుతూ, యజ్ఞములందు సామగానముల ద్వారా అభివందించబడుతున్నది." (4)

"ధనవంతుడైన సోముడా! రక్షిస్తావు అను కోర్కెతో విప్రులు నిన్ను యజ్ఞం కొరకు స్తుతిస్తూ శుభ్రపరుస్తున్నారు." (7)

తర్వాత ఋక్కుల్లో ఏమి చెప్పారో చదవండి. (9-22-1,2,3,7)

"శీఘ్రగామియగు రథాలవలె, విడువబడిన గుర్రాలవలె సోముడు శబ్దం చేస్తున్నాడు." (1)

"ఈ సోముడు పెనుగాలివలె, పర్జన్య వృష్టివలె, అగ్నిశిఖవలె వ్యాపిస్తు న్నాడు." (2)

"దధి మిశ్రిత పవిత్ర సోమాన్ని విప్రులు స్తుతుల ద్వారా విస్తరింప చేస్తున్నారు. (3)

త్వం సోమ పణిభ్య ఆ వసుగవ్యాని ధారయః ?
తతం తంతు మ చిక్రదః॥ (7)

"ఓ సోముడా, నీవు పణులనుండి గోవులను హరిస్తున్నావు. గొప్ప యజ్ఞ మందు నవ్వడి చేస్తున్నావు."

సోమం ఆ దినాల్లో దొరకంది కాదు. అందుచేతనే దాని వాడకం అమితంగా వుంది. తొమ్మిదవ మండలంలో - సోమ మండలంలో 114 సూక్తముల్లో సోముని మహత్తును గురించి వర్ణించినంతగా దీని పుట్టుకను గురించిగాని, యితర విషయాలను గురించిగాని చెప్పలేదు. సోమం ఎత్తైన కొండలపై వుండేదని రహూగణ పుత్ర గోతముని ఋక్కువలన తెలుస్తుంది. (10-32-2).

వీంద్రయాసి దివ్యాని రోచనాని పార్థివాని
రజసా పురుష్టుత ।
యేత్వావహంతి ముహురధ్వరాం ఉపతేను
వన్వంతు వగ్వనాం అరాధసః ॥

"పర్వతసానువులపై వున్న సోముడా! నీకొరకు ఆవులు నేతిని, పాలను పిండుతున్నాయి."

రహూగణుడు ప్రాచీన ఋషి భరద్వాజుని కంటెకూడ ప్రాచీన ఋషుల్లోని వాడు. దివ్యపానమగు సోమం గురించి ప్రశంసిస్తూ ఆయన చెప్పిన గేయగీతములు తరతరాలవరకు ప్రజల నాలుకలపై వుండేవి అని చెప్పితే ఆశ్చర్యపడనవసరం లేదు. రహూగణుడు సోముని గురించి యిట్లు చెప్పాడు. (9-37-1)

ససుతః పీతయే వృషాసోమః పవిత్రే అర్షతి ।
విఘ్నన్ రక్షాంసి దేవయుః ॥

"అతడు రాక్షసులను నాశనం చేస్తాడు. దేవకాముడు, పరాక్రముడు సోముడు వడకట్టబడి పాత్రల్లోనికి పానం కొరకు వెళుతున్నాడు."

"ఆ తడిసిన సోముడు కవి ద్వారా స్తుతించబడి ఇంద్రుని కొరకు కలశముల్లోకి పరుగిడుతున్నాడు." (6)

అయాస్యుడు సోముని కీర్తిస్తూ మూడు సూక్తములను రచించాడు. (44,45,46). అతడు ఒక సూక్తమందు సోముని యిట్లు వర్ణించాడు. (9-46-1,2,5)

పర్వతంపైన పెరిగిన సోముడు ప్రవహిస్తూ నైపుణ్యం గల గుర్రం వలె యజ్ఞం కొరకు సిద్ధపర్చబడుతున్నాడు." (1)

"తల్లిదండ్రులచే చక్కదిద్దబడు కన్యవలె పరిష్కృత సోముడు వాయువు వద్దకు వెళ్ళుచున్నాడు." (2)

"ఓ ధన విజేతా, మార్గవేత్త సోముడా! మాకు మహా ధనమును యిప్పిస్తూ ప్రవహించుము" (5)

అవత్సార ఋషికూడ సోముని గురించి చెప్పాడు (9-68-3).

"ఓ సోముడా! జారుణ్ని కన్య పిలిచినట్లుగ నిన్ను పవిత్రేణ్ళ పిలుస్తున్నాయి. ఇచ్చుటకొరకు నిన్ను శుభ్రపర్చుతున్నారు." సోముని సర్వవిజేత అనేవారు (9-59-1).

"ఓ గోవిజేతా, అశ్వవిజేతా, విశ్వవిజేతా, రమణీయతావిజేతా, సోమా! ప్రవహించుము. నా కొరకు సంతాన సమేతంగా రత్నాలను తెమ్ము."

"సహస్రాక్షుడు, సూక్ష్మదర్శి, వడకట్టబడుచున్న సోముని గాయత్ర సామం గానం చేయండి." (9-60-1).

అ మహీయు అంగిరసుడు సోముని చారిత్రక కృత్యాలను ఉల్లేఖించాడు. (9-61-1, 2, 20)

"ఓ సోముడా ! త్రాగుటకై ప్రవహించుము. నీ యొక్క మత్తుచేతనే 99 పురాలు ధ్వంసం చేయబడినాయి." (1)

నీవు యీ ప్రకారంగా శంబరుని పురాలను, తుర్వశ, యదులను దివోదాసుకు వెంటనే వశపర్చావు." (2)

"నీవు అమిత్ర శత్రువు చంపావు. ప్రతిదినం అన్నం యిచ్చావు. నీవు గోదాతవు. అశ్వదాతవు (20)

నిధ్రువ కాశ్యపుడు సోముని మహిమను కీర్తిస్తూ చెప్పాడు- (9-63,3,4,5)

"ఇంద్ర, విష్ణులకై వడకట్టబడి కలశముల్లోకి ప్రవహించే సోముడు వాయు దేవునికి మధురంగ నుండుగాక."–(3)

"పింగళ వర్ణుడు, శీఘ్రగాముడు సోముడు యజ్ఞధారలో మత్తు తిరుగుతూ ప్రవహిస్తున్నాడు." (4)

ఇంద్రం వర్ధన్తో అప్తురః కృణ్వంతో విశ్వమార్యం। అపఘ్నన్తో అరావ్ణః॥ (5)

"ఇంద్రుని ఉత్సాహపరుస్తూ, జలంతెస్తూ, అన్ని పనులుచేస్తూ, పిసిని గొట్టులను నిర్మూలిస్తూ ప్రవహిస్తున్నావు."

ఆర్య సమాజంవారు "కృణ్వంతో విశ్వమార్యం" (అందరినీ ఆర్యులుగా చేస్తూ) అన్న వాక్యం చదువుకొని ఎగిరి గంతు వేస్తారు. అందరినీ ఆర్యులుగా చేసిన శ్రేయమ్ము సోమపానానికి (భంగుత్రాగుటకు) నిధ్రువఋషి యిచ్చిన సంగతిని వీరు తెలుసుకోలేక పోతున్నారు. ఋషి తర్వాత యిట్లు చెప్పాడు. (9-63-12,13)

"నీవు మాకు ఆవులతోను, గుర్రాలతోను సహస్రధనాన్ని, అన్నాన్ని, యశాన్ని కూడ యిమ్ము" (12)

"రాళ్ళతో కొట్టబడి వడకట్టబడి సోముడు సూర్యుని వలె కలశాల్లోకి చక్కగా ప్రవహిస్తున్నాడు." (13)

జమదగ్ని భృగుపుత్రుడుకూడ సోముని వర్ణించాడు. (9-65-1-3. 15).

"గోవ్రతవాన్ని కాంక్షించు వ్రేళ్ళు అను చెల్లెళ్ళు ప్రవహింపచేయవలె నను కోర్కెతో సోముని ప్రేరేపిస్తున్నారు." (1)

"పింగళవర్ణుడు: మధురసప్రదుడు సోముని రాళ్ళతో నూరి ఇంద్రుడు త్రాగేందుకు పాకం పిండుతున్నారు." (8)

"ఓ సోముడా, రాళ్ళనుండి తీయబడి మత్తును కల్గించు తీవ్ర రసమగు నీవు పాపాలను హరిస్తూ ప్రవహిస్తున్నావు (15)

జమదగ్ని తన సోమగాథలో సోముని పుట్టుక చోటును గురించి కొద్దిగా పరిచయమిచ్చాడు.

యే సోమాసః పరావతియే అర్వావతి సున్విరే ।
యే వాదః శర్యణావతి ॥ (9-65-22(

"ఏ సోముడు పశ్చిమాన, ఏ సోముడు తూర్పున, ఏ సోముడు శర్యణావతంలో వడకట్టబడినాడో"

ఏ సోముడు ఆర్జీకులందు (వ్యాస నదీతీర వాసులందు,) ఋత్విజులందు, వస్త్యలందు, పంచజనములందు వడకట్ట బడినాడో. (9-65-23)

"ఆ సోముడు ఆకాశంనుండి వృష్టిని, వీరులైన సంతానాన్ని మాకు తెచ్చుగాక." (24).

అవులోంపై తయారుచేయబడి, జమదగ్ని ఋషిచే స్తుతింపబడి బంగారు రంగుగల సోముడు ప్రవహిస్తున్నాడు." (25).

అంగిరస పవిత్ర ఋషి యీ క్రింది మంత్రమును సోముని మహిమను కీర్తిస్తూ చెప్పాడు. కాని రామానుజ మతస్థులు 6, 7 శతాబ్దాల నుండి కోట్లాది జనానికి భుజములపై లోహముతో ఆబోతును కాల్చినట్లు కాల్చి శంఖ చక్రాలను ముద్రించారు. గుడ్డి ఎద్దు చేలో పడిన చందమున వున్నటువంటి యీ అన్యాయానికి ఏమైనా అంతమనేది వుందా ?

పవిత్రంతే వితతం బ్రాహ్మణస్పతే ప్రభుర్గాత్రాణి
పర్యేషి విశ్వత ః ।
అతప్తత నూర్న తదామో అశ్నుతే శృతాన
ఇద్వహ న్తస్తత్ సమాశత ॥ (9-83-1)

"ఓ బ్రహ్మణస్పతి (మంత్రపతి) సోముడా, నీ గిన్నెలు అంతటవున్నవి. ఓ ప్రభూ, నీవు గాత్రములద్వారా అంతటా చేరుకున్నావు. అతప్త శరీరుడు (అపరిపక్వుడు) నిన్ను పొందలేడు. పక్వమైన వారు నిన్ను వహిస్తూ పొందుతున్నారు"

గృత్సమదుడు సోముని వర్ణించాడు (9-83-47) "వడకట్టునపుడు నీ ప్రవాహములు గొర్రెయొక్క సూక్ష్మరోమములను దాటుతున్నాయి. ఓ సోముడా, రెండు పాత్రల్లో నీవు గోరసంతో మిశ్రమం చేయబడి, వడకట్టబడి కలశాల్లోకి వెళ్ళుతున్నావు."

వసిష్ఠునకు సోముని మహిమ తెలుసు. యుద్ధమందు సోమపానం చేసి మత్తిల్లిన వీరులు అద్భుత పరాక్రమాన్ని చూపేవారు. శాంతికాలంలో సోమాన్ని త్రాగి ప్రజలు ఆనందించేవారు. ప్రాచీనమందు భక్తివున్నప్పటికీ ఆధునికులకు సోమముపట్ల ఋషులకు వున్న భావం లేదు. నేడు అంతటా మద్యపానానికి వ్యతిరేక వాతావరణ ముండుటయే, అసహ్యత వుండుటమే దీనికి కారణం. సప్తసింధులోని ఆర్యులు సోమునికి ఎందుకింత భక్తులయ్యారో, వసిష్ఠ మహర్షి ఎందుకింతగా ప్రశంసించాడో సోముని ప్రశంసిస్తూవున్న ఋక్కులను చదివితే తెలుస్తుంది.

"ఓ సోముడా! వీరుల కలవాడవై, బలవంతుడవై విజేతవై, ధనదాతవై, తీక్ష్ణ ఆయుధాలు కలవాడవై వేగంకల ధనుస్సుకలవాడవై, యుద్ధమందు అజేయుడవై, యుద్ధమందు శత్రువులను పీడించువాడవై ప్రవహించుము."(9-90-3).

ప్రతాపవంతుడైన దివోదాసుని పుత్రుడు ప్రతర్దనుడు. ఇతడనేక యుద్ధాల్లో పాల్గొన్నాడు. బహుశా యితణ్ణి వంచించి సుదాసు భరతులకు రాజై వుండాలి. ప్రతర్దనుడు దివోదాసు జ్యేష్ఠ పుత్రుడైనప్పటికీ యుద్ధమందునూ, శాసనా పటిమలోనూ తస్ముడైన సుదాసుకు దీటైనవాడుకాడని భావిస్తున్నారు. కుల పురోహితుడైన భరద్వాజుడు ప్రతర్దనుని పక్షం వహించి వుండవచ్చు. కాని ఆయన ఏమీ చేయలేక పోయాడు. వసిష్ఠుడు సుదాసునీపు కాచాడు. ఇంకేముంది అతడు భరతులకు రాజై పోయాడు. ప్రతర్దనుడు సోముని కీర్తిస్తూ 24 త్రిష్టుపములు చెప్పి యోగ్య ఋషిగా నిరూపించుకొన్నాడు. అతడు సోముని గురించి చెప్పిన ఉపమానాలు సైనికుని మనస్సుకు మాత్రమే తట్టగలవు. (9-96, 1,5,6,11,12,)

ప్రసేనానీః శూరో అగ్రేరథానాం గవ్యన్నేతి హర్షతే అస్య సేనా।
భద్రాన్ కృణ్వన్నింద్ర హవాన్త్సఖిభ్య
ఆ సోమో వస్త్రారభసాని దత్తే॥ (1)

సోమః పవతే జనితా మతీనాం జనితా దివో జనితా పృథివ్యాః ।
జనితాగ్నేర్జనితా సూర్యస్య జనితేంద్రస్య, జనితో తవిష్ణో ॥ (5)

"సేనాని, శూర్యుడు, సోముడు గోవులను దోపిడి చేయతలపెట్టి రథమునకు ముందు పోతున్నాడు. అతని సేన హర్షిస్తున్నది. ఇంద్రుని ఆహ్వానాన్ని కల్యాణప్రదంచేస్తూ సోముడు సఖులకొరకు శీఘ్రంగా వస్త్రాలను యిస్తున్నాడు" (1).

"బుద్ధులకు (కవితలకు) జనకుడు, ద్యౌకు జనకుడు, పృథ్వికి జనకుడు, అగ్నికి జనకుడు, సూర్యునకు జనకుడు, విష్ణువుకు జనకుడు సోముడు ప్రవహిస్తున్నాడు." (5)

"సోముడు దేవులందు బ్రహ్మయై, కవులందు కవితయై, విప్రులందు ఋషియై, మృగములందు మహిషమై, గృధ్రములందు శ్యేనమై: వనములకు కుఠారమై శబ్దంచేస్తూ పాత్రల్లో పొంగుతూ ప్రవహిస్తున్నాడు." (6)

"ఓ పవమాన సోముడా ! నీతో మా పూర్వపితరులు కర్మలు చేశారు. ఓ వీరుడా ! నీవు ఆగని అశ్వాలతో శత్రువులను చంపుతున్నావు. నీవు మాకు యింద్రుడవు కమ్ము." (11)

"ఓ సోముడా ! నీవు మనువుకొరకు ఏ విధంగా ఆయుధం ధరించి, శత్రునాశనం చేసి, ధనయుక్తుడవై, హవియుక్తుడవై ప్రవహించావో, అదే విధంగా మా కొరకు ధనంతెస్తూ ప్రవహించుము. ఇంద్రుని సహాయంతో ఆయుధాలను ఉత్పన్నం చేయుము." (12)

తమ్ముడు సుదాసుతో యుద్ధం చేసేటప్పుడు ప్రతర్దనుడు సోమ మహిమను కీర్తిస్తూ యీ త్రిష్టుపములను రచించాడా ఏమిటి ?

కుత్సఋషి అరువదివేల ధనాన్ని సోముని కృపవలన పొందాడు. (9-97-53)

ఉతన ఏనా పవయా పవస్వాధిశ్రుతే
శ్రవాయ్యస్య తీర్థే ।
షష్టిం సహస్రా నైగుతో వసూని వృక్షం న పక్వం
ధూనవద్రణాయ ॥

"ఓ సోముడా ! నీవు మా కొరకు కీర్తివంతుడవై ప్రసిద్ధ తీర్థమందు యీ ధారతో ప్రవహించుము పండిన పండును పొందుటకై చెట్టును వూపినట్లుగా అడిగిన తోడనే శత్రునాశకుడగు సోముడు 60,000 ధనం మాకు యిచ్చాడు."

సోముని వడకట్టునప్పుడు ప్రాచీన కాలపు గాథలు పాడబడేవని కాశ్యపగోత్ర ఋషి ఋక్కువలన తెలుస్తోంది. (9-99-4)

"వడకట్టినపుడు సోముని ప్రాచీన గాథలతో కీర్తిస్తున్నాం. ఇటునటు తిరుగుతున్న ప్రేళ్ళు దేవుళ్ళను స్మరిస్తూ హవిని ధరిస్తున్నాయి."

విశ్వామిత్ర వాక్పుత్రుడు లేక ప్రజాపతి ఋషి "సోమాన్ని వడకట్టుటకు ఉన్ని వస్త్రం, అవుతోలు అవసరమని" చెప్పాడు. (9-101-16)

అవ్యోవారేభి ః పవతే సోమో గవ్యే అధి త్వచి ।

కవిక్రిదద్ వృషా హరిరాద్రస్యాభ్యేతి నిష్కృతం ॥

"సోమం అవుతోలు పైన ఉన్ని రోమముల మధ్యను వడకట్టబడుతున్నది. పరాక్రమవంతుడు బంగారువర్ణంకల సోముడు ఇంద్రుని స్థానమునకు పోతున్నాడు."

కశ్యప మరీచి పుత్రుడు సోమపాన స్థానముల గురించి చెప్పాడు.

(9-113-1,2,7,9,11)

"వృత్రహంతకుడు యింద్రుడు శర్యణావతంలో సోమాన్ని త్రాగాడు. శరీరమునకు బలము కల్గి మహా విక్రమాన్ని చూపాడు. అట్టి యింద్రునికై ఓ సోముడా! నీవు ప్రవహించుము. (1)

"ఓ దిక్పతి సోముడా! నీవు ఋక్కులతో, సత్యవచనములతో, శ్రద్ధతో, తపస్సుతో వడకట్టబడితివి. ఓ సోముడా, నీవు ఆర్జీకమునుండి (బియాసు పుపత్యక నుండి) ప్రవహించుము." (2)

"నిరంతరం జ్యోతి వుండుచోటుకి స్వర్గమున్నలోకానికి, అక్షిణ్ణమైన అమర లోకానికి ఓ సోముడా! నన్ను తీసుకొని పొమ్ము" (7)

"ఏ మూడు స్వర్గములందు యిచ్ఛాను వర్తులై కిరణముల ప్రసరించుచున్నవో, ఎచ్చట జ్యోతిర్లోకము లున్నవో, అచ్చటకు నన్ను కొనిపోయి అమరునిగ చేయుము "(9)

"ఎక్కడ ఆనంద మోద, ముద, ప్రముదము లున్నవో, ఎక్కడ కోరికలన్నీ ప్రాప్తించునో, అక్కడకు నన్ను కొనిపోయి అమరునిగ చేయుము. ఓ సోముడా, నీవు ఇంద్రునికై ప్రవహించుము." (11)

సోమం ప్రస్తుతించు ఆర్యులకు, ఆనందము నిచ్చే, మత్తును కల్గించే శ్రేష్ఠమైన పేయము. ఇంతేకాదు, దేవతలను సంతృప్తి పర్చుటకు ఆర్యులకిది గొప్ప సాధనం

అవి వేరుగా చెప్పనవసరంలేదు. హోమంలో నెయ్యి, మాంసం, మొదలైన హవిస్సును దేవతలకొరకు సమర్పించేవారు. దానిలో చాలా భాగం నిప్పులో కాలిపోయి పనికిరాకుండా పోయేది. అవుకోలు మీద రెండు రాళ్ళ మధ్య నూరబడి, వడకట్టబడి కొయ్య పాత్రల్లోను, లోహ కలశాల్లోనూ పోయబడి వుంచిన సోమాన్ని త్రాగుటకు ఇంద్రుడు, అగ్ని మొదలగు దేవతలను ఆహ్వానించేవారు. ఆర్య భక్తుల నమ్మకాన్ని బట్టి ఆ దేవతలు వచ్చి సోమపానాన్ని చేసి వెళ్ళేవారు. ప్రాచీన ఋషుల గోష్ఠులందు ఇంద్రుడు, అగ్ని, మిత్రావరుణులు సశరీరులై వచ్చి సోమపానాన్ని చేశారు. ఈ విషయంలో శపథం చేయటానికి తర్వాత కాలపు ఋషులు సిద్ధపడ్డారు. దేవపూజకు సోమరసం సాధనమైనందున ఒక్క చుక్క కూడా పోకుండా చూసేవారు. పాత్రల్లోను, కలశాల్లోను నిండివున్న, పెరుగు, తేనెలతో కలిపిన సోమరసాన్నంతా భక్తులు ఆరగించేవారు.

సోమపానం ఆర్యులకు సర్వ సాధారణమైనప్పటికీ అది దివ్యపానమైంది. కాబట్టి దేవతల పేరుతోనే దాన్ని దివ్య ప్రసాదముగ తీసుకొనేవారు. ఈనాడుకూడ బైరాగి సాధువులు పరమాన్నం కూడ తాము తింటున్నామని చెప్పకుండా ముందుగా 'రామ్‌జీ' పేరు చెపుతారు. అంటే మొదట భోజనమంతా రామునికి ఆరగింపుచేసిన తర్వాత ఎవరివంతు వారు పవిత్ర భోజనం చేస్తారు. ఇదే విధంగా వైదిక ఆర్యులు కూడ దేవతలపేరు చెప్పుకొని ప్రసాదరూపంలో సోమరసాన్ని త్రాగేవారు.

సోమం పవిత్రమైంది, సకల గ్రాహ్యమైంది. కాని సురను (మద్యమును) హీనంగా చూసేవారు. నేడు కూడా హిందువులు భంగు, సారాయంపట్ల అటువంటి భావాన్నే కల్గివున్నారు. టిబెట్టులో భంగును 'సోమరాజ' మంటారు. అక్కడ అది ఎక్కువగ ఉత్పత్తి అవుతుంది. మత్తును సేవించనివారు టిబెట్టులో లేరనే చెప్పాలి. కాని సోమరాజము మత్తును కల్గిస్తుందనికాని, అందు పాలు, పంచదార, మిరియం. ఏలకులు కలిపి మిక్కిలి రుచికరంగా తయారుచేయవచ్చు ననికాని వారికి తెలియదేమో ననిపిస్తుంది. మనకు జనుము, గోగువలె వారికి సోమరాజము వుపయోగపడుతుంది. వారు దాని నారతో తాడు పేనుతారు. మనదేశంలోకూడ ప్రాచీనకాలంలో భంగు (గంజాయి) నారతో వస్త్రాలను నేసేవారు ఇప్పుడుకూడ కుమాయూం, గఢవాల్‌లో భంగేలా తయారుచేస్తారు దాన్ని వంద సంవత్సరాల క్రితం ప్రజలు ధరించేవారు. ఇప్పుడది సంచులకు ఉపయోగిస్తోంది. కొరియాలో భంగునారతో వస్త్రాలను నేస్తారు. అచ్చటి ప్రజలకుకూడ టిబెట్టువారివలెనే భంగు వుపయోగం యింతమాత్రం అని

తెలుసు. టిబెట్టువారు సోమరాజము దగ్గరకు పోరు. దానికి బదులుగా వారు తమకున్న ఛజ్ (యవలతో తయారు చేయబడిన వచ్చిసారా) త్రాగుతారు. వారికి అర (అరకు, బ్రాంది) అంటే చాలా యిష్టం. కాని అవి వారి ప్రియం. టిబెట్టీయులది ఋగ్వేద ఆర్యులకు పూర్తిగ విరుద్ధమైన పద్ధతి. వారికి ఖంగు యిష్టంలేదు. కాని సారా త్రాగుతారు.

3. సురాపానం : సప్తసింధు ఆర్యులకు సురతో సంబంధం లేదని చెప్పలేం. కాని వారు సురను హీనదృష్టితో చూచేవారని మేధాతిథి కాణ్వుని ఋక్కువలన తెలుస్తుంది. (8-2-12). "కల్లు త్రాగినవారు మత్తిల్లి పాలులేని గోస్తనాలు వలె కొట్టుకొంటూ ప్రేలుతున్నారు."

వసిష్ఠుడు కూడ సురపట్ల తన అయిష్టతను తెల్పాడు. (7-86-6).

"ఓ వరుణుడా! సుర కోపానికి, జూదానికి, అజ్ఞానానికి _ దారితీస్తుంది. గనుక మేము ఆ పాపం చేయము. సురను సేవించిన పెద్దలు పిన్నలను చెడగొట్టుతారు. నిద్రకూడ పాపకార్యం చేయించుతుంది."

కాని సురను ప్రేమించేవారు కూడా వున్నారు. అందుచేతనే "దాత సురను పొందుతున్న"ట్లు చెప్పబడింది. (10-107-9)

భోజా జిగ్యుః సురభిం యోనిమగ్రే
భోజా జిగ్యుర్వధ్వం యా సువాసాః ।
భోజా జిగ్యురంతః పేయం సురాయాః
భోజా జిగ్యుర్యే అహూతాః ప్రయంతి ॥

"భోజదాత అందరికంటె ముందుగ సుగంధిత స్థానాన్ని పొందుతున్నాడు. భోజుడు మంచి వస్త్రాలంకృత వధువులను పొందుతున్నాడు. భోజుడు అంతరిక పేయమగు సురను పొందుతున్నాడు. పిలవని కజ్జానికి వచ్చేవారిని భోజుడు జయిస్తున్నాడు."

4. జూదము : సప్తసింధు ఆర్యుల్లో జూదమాడుట ఎక్కువగా వున్నట్లు కన్పడుతుంది. మహాభారతంలో యుధిష్ఠరుడు దీన్ని తనపూర్వీకుల నుండి నేర్చుకొన్నాడు. జూదమువలన అనేకమంది నాశనమైపోతూ వుండుటవలన ఆర్యఋషులు

జూదమాడరాదని వుపదేశించారు. కవషఐలూషుడు తన ఋక్కుల్లో యిట్లు వుప దేశించాడు (10-34)

జూదరి అంటున్నాడు—— పెద్దపాచికలు కదలుతూ, మెదలుతూ, యిటునటు దొర్లుతూ నన్ను బాల సంతోషపెట్టుతున్నాయి. ముంజవాన్ పర్వతంలో పుట్టిన సోమం మాదిరిగనే మెలకువతోనున్న యీ కొయ్యపాచికలు నన్ను ఉత్సాహ పరుస్తున్నాయి." (1) "నా భార్య నన్ను ఎన్నడూ చికాకుపెట్టలేదు. నాపై కోపం చూపలేదు. మిత్రులకూ, నాకూ మేలు చేసింది. కేవలం జూదానికి లోబడిపోయి అనురాగవతియగు భార్యను విడిచిపెట్టాను." (2)

"అత్త ద్వేషిస్తుంది. భార్య విడిచిపెట్టుతుంది. అడిగినప్పుడు జూదరిని ప్రేమించేవారు ఎవ్వరూ వుండరు. ముసలి గుర్రాన్ని కొననట్లుగానే జూదరి భోగాన్ని ఎవరూ కోరరు." (3)

"ఎవనిని ఆకర్షణీయమైన పాచికలు జూదమందు పట్టుకొని వుంచునో, అతని భార్యను యితరులు చెరుస్తారు. తల్లిదండ్రులూ, సోదరులూ, "ఇతడు ఎవరో మాకు తెలియదు. ఇతణ్ణి కట్టివైచి పట్టుకొని పొండు అని అంటారు." (4)

"నీవు ముసలివాడవని ఎవరైనా అంటే జూదరి "నేను గెలుస్తాను" అంటూ (జూదమాడు) సభకు వెళతాడు. పాచికలు ఒకప్పుడు అతణ్ణి గెలిపిస్తాయి. ఒకప్పుడు ప్రత్యర్థిని గెలిపిస్తాయి." (6)

"జూదరి భార్య మొత్తుకుంటూ బాధపడుతుంది. అవారాగా తిరిగే కొడుకును గూర్చి తల్లి 'ఎక్కడ వున్నావురా ?' అని అడుగుతుంది. అప్పులవాళ్ళై, డబ్బు అడు గుతారను భయంతో అతడు పొరుగింట్లలో రాత్రి గడుపుతాడు." (10)

"భార్యను, ఇతరుల భార్యను చక్కగా కట్టిన యిళ్ళను చూచి జూదరి బాధ పడతాడు. ఉదయాన అతడు దర్పంతో ఎర్రని గుర్రాలను కట్టాడు. సాయంకాలం వృష లుడై (వివస్త్రుడై) చలికి భయపడి నిప్పుదగ్గర కూర్చొంటాడు." (11)

"ఓ జూదరీ, నీవు పాచికలతో ఆడకుము. వ్యవసాయం చేయుము. వ్యవసా యాన్ని నమ్ముకొని సంతృప్తిపడుము. అక్కడ నీకొరకు గోవులున్నాయి, పత్ని వుంది. సవితృ దేవుడు నాకీ విషయం చెప్పాడు." (13)

జూదంయొక్క యీ బీభత్స రూపాన్ని చూచికూడ ఆర్యులు జూదం మానేసి వుంటారని చెప్పలేం. జూదమాడినందుకు రాజవందన వున్నట్లు ఋగ్వేదంలో చెప్పలేదు.

# పదిహేనవ అధ్యాయం

# దేవతలు (ధర్మం)

ఆర్యులు తమ దేవతలకు పరమ భక్తులు, పౌరుష పూజకులు, ఆశావాదులు. వారి దేవతలుకూడ యీ గుణములందు విధులు. దేవతల సంఖ్య 33 అనీ, 3,339 అనీ చెప్పబడింది. కాని అంతమంది దేవతల పేర్లు ఋగ్వేదంలో కానరావు. దేవత లనే కాకుండా పితరులనుకూడ (మృతులైన పూర్వులు) పూజ్యులుగా వారు భావించారు. వారు దేవతలను నిష్కామ భావంతో అర్చించేవారు కాదు. నిష్కామో పాసన చాల కాలం గడచిన తర్వాత వచ్చింది. ఆర్యులు పరలోకాన్ని, స్వర్గ నరకాలను నమ్మారు. కాని పునర్జన్మను గురించి ఋగ్వేదంలో ఎక్కడా కానరాదు,

## 1. దేవతలు

నేడు దేవ శబ్దానికి బదులు దేవతా శబ్దం ఎక్కువ వాడుకలో వుంది. దీనికి రెండు కారణాలు వున్నాయి. (1) మొదట్లో రాజానుకూడ దేవుడనేవారు. అందుచేత వేరే శబ్దాన్ని ఏర్పాటు చేసుకోవలసిన అవసరం కల్గింది. (2) పార్శీ భాషా సంపర్కం కల్గిన తర్వాత రాక్షసులనుకూడ దేవులంటారని తెలిసినందువల్ల దేవులపట్ల తమకున్న పూజ్య భావాన్ని గౌరవించుకొంటూనే సందిగ్ధంగావున్న దేవ శబ్దాన్ని విడిచి దేవత శబ్దాన్ని చెప్పటను ప్రారంభించారు. వివస్వాన్ పుత్రుడు మనువు చెప్పిన ప్రకారం దేవుళ్ళలో పైవర్లు వుండరు. (8-30-1)

"ఓ దేవులారా, మీలో శిశువులుగాని, పిల్లలుగాని ఎవరూ లేరు. మీరు అంతా పెద్దలే."

1. దేవుళ్ళ సంఖ్య : ఋగ్వేదంలో రకరకాలుగా లెక్కింపు జరిగింది భరద్వాజుడు దేవుళ్ళసంఖ్య చెప్పారు. (6-50-1) ఆయన లెక్కప్రకారం అదితి, వరుణ, మిత్ర, అగ్ని, అర్యమా, సవిత, భగ, రుద్ర, వసుగణ, మరుత్, రోదసి, ద్యా-పృథివి, అశ్వినీదేవులు, వానస్త్య, సరస్వతి, వాయువు, ఋభుక్ష, పర్జన్యులు దేవుళ్లు. ఆయన ద్యౌను తండ్రిగా, పృథివి తల్లిగా, అగ్నిని అన్నగా చెప్పారు. ఆదిత్యుని, అతిదిని కూడ పేర్కొన్నారు. ఋషులు భూమిపై నున్న అందమైన

వస్తువులను కూడ దేవతలని అనుకొనేవారు. అందుచేతనే భరద్వాజుడు ఉషస్సును, పర్వతాలను, పితరులను, సింధువులతో (నదులతో)పాటు సరస్వతిని, పర్జన్యమును కూడ రక్షించమని కోరాడు. (6-52-4-6) "ఉదయించే ఉషస్సులు నన్ను రక్షించు గాక, పొంగే నదులు నన్ను కాపాడుగాక, అచల పర్వతం నాకు రక్షణ నిచ్చుగాక. దేవయజ్ఞంలో దేవతలతోపాటు ఆహ్వానింపబడిన పితరులు నన్ను రక్షించుగాక"—4·

"మేము సదా సుందరమైన మనస్సులతో ఉదయించే సూర్యుని చూచెదము గాక. దేవుల వద్దకు హవిస్సును కొనిపోవు వసుపతి అగ్ని శక్తియుక్తుడై వచ్చు గాక."5

"ఇంద్రుడు రక్షణతో మావద్దకు వచ్చుగాక. సింధువుల సమేతంగా ఉప్పొంగుచున్న సరస్వతీ, ఔషధులతో పర్జన్యమూ, తండ్రివలె సుందరమైన స్తుతులతో ఆహ్వానములతో సుఖమును కల్గించు అగ్ని మా వద్దకు వచ్చుగాక."6

వసిష్ఠుడు దేవుళ్ళను పేర్కొన్నాడు. (7-35; 7-41-1). వసిష్ఠుని లెక్క ప్రకారం—ఇం ద్రాగ్నులు, ఇంద్ర వరుణులు. ఇంద్ర సోములు, ఇంద్రపూషులు, భగ, పురంధి, అర్యమా, ధాత, రోదసి. అద్రి (పర్వతము), అగ్ని, మిత్రావరుణ, అశ్విద్వయం, అంతరిక్షం, ఇంద్రుడు, వసుగణం, రుద్రుడు, త్వష్ట, గ్నాయీ (దేవుళ్ళ స్త్రీలు,) సోముడు, బ్రహ్మ, గ్రావా, యజ్ఞం, సూర్యుడు, నాల్గు దిక్కులు, పర్వతం. సింధువులు (నదులు), అప, అదితి, మరుత్‌గణం, విష్ణువు, పూషన్, వాయువు, సవిత, ఉషస్సు, పర్జన్యం, క్షేత్రపతి, విశ్వదేవులు (దేవసమూహం), దేవుళ్ళు.

"సహస్రసూనుడు, యువకుడు, అక్రోధవాచ్యుడు. అతి తరుణుడు అయిన నిన్ను స్తుతుల ద్వారా మేము పిలుస్తున్నాం. నీవు జ్ఞానివి, అద్రోహివి, సర్వప్రియ ధనదాతవు."

అని భరద్వాజుడు అగ్ని మహిమను గురించి చెప్పాడు. (6-5-1)

"ఆ వ్రత పాలకుడగు అగ్ని పరమవ్యోమమందు పుష్టి వ్రతములను కాపాడు తున్నాడు. ఆ సుకర్ముడు ఆకాశాన్ని కొలుస్తున్నాడు. వైశ్వానర అగ్ని తన మహిమ చేత నాకమును (స్వర్గమును) తాకుచున్నాడు." (2)

"మహిమలు (గొప్పవారు) అంతరిక్షమందు అతన్ని ధరించారు. విశులు (ప్రజలు) పూజ్యుడైన రాజు అనుకొని గౌరవించారు. వివస్వాన్ (సూర్యుడు) దూతయగు వైశ్వానర అగ్నిని వాయువు దూరం నుండి తెచ్చి ధరించింది."—4

భరద్వాజుడు అగ్నిని "యుగయుగాల అమరదూత" అన్నాడు (6-15-8)

త్వాం దూత మగ్నే అమృతం యుగే యుగే
హవ్య వాహం దధిరే పాయుమీడ్యం।
దేవాసశ్చ మర్తాసశ్చ జాగృవిం విభుం
విశ్పతిం నమసా నిషేదిరే

"హవ్య వాహకుడు, రక్షకుడు, పూజ్యుడు అయిన ఓ అగ్నీ అమర దూతవైన నిన్ను ప్రతియుగంలోను ప్రజలు ధరిస్తారు. నీవు విభుడవు, జాగరూకుడవు, ప్రజాపతివి. నిన్ను దేవులు, మానవులు నమస్కరించి స్థాపన చేస్తారు."

విశ్వామిత్రుడు కూడ అగ్నిని స్తుతించాడు. "హవిస్సు కల్గిన, ధనము కోరుచున్న కుశికులైన మేము సత్యామవర్తియు స్వర్గవేత్తయు, సుదాతయు, అశ్వసారథియు, అణు [సూక్ష్మ] రూపియు అయిన వైశ్వానర అగ్నిని మనస్సుతో తెలుసుకొని ఆహ్వానిస్తున్నాం" [3-26-1] గంగల నవ్వుచున్న స్త్రీలద్వారా వెల్గించబడిన వైశ్వానర అగ్ని కుశికులచే యుగయుగాలనుండి పోషింపబడుచున్నాడు. అమరులందు జాగరూకుడైన అగ్ని మాకు అందమైన వీరులను, అశ్వాలను రత్నాలను యిచ్చుగాక." [3]

అగ్ని రస్మి జన్మనా జాతవేదా ఘృతం మే
చక్షురమృతం మే ఆసన్।
అర్కస్త్రి ధాతూ రజసో విమానో ఽజస్రో
ధర్మోహ విరస్మినామ ।। [3-26-7]

"నేను అగ్నిని, పుట్టుకతోనే అంతా ఎరుగుదును. నెయ్యి నాకన్ను. అమృతం నా నోటిలోవుంది నేను త్రివిధ అర్కుడను [సూర్యుడను]. లోకాలను కొలిచేవాడను. సదా వేడిగా వుండేవాణ్ణి. హరిపేరు కలవాణ్ణి అగ్నిని." వామదేవుడు అగ్నిని స్తుతించాడు.

"పిడుగుపాటుతో చనిపోయేముందు నీవు రుద్రుడును, ద్యౌ, పృథ్వీహోతలకు నిజమైన యజమానియు, సువర్ణ రూపుడును, యజ్ఞరాజును అగు అగ్నిని రక్షకునిగా చేసికొనుము." [4-3-1]

"ఓ అగ్నీ! పతిని కోరుతూ సుందరమైన వస్త్రముల నలంకరించుకొన్న పత్ని వలె మేము నీకొరకు యీ స్థానమును ఏర్పాటుచేస్తున్నాం. తేజోవంతుడవై ఎదుటకు వచ్చి యిక్కడ కూర్చొనుము. స్వపాకము వెనుకవైపున వుంది."—2.

సప్తసింధులోని భరతుల సంతానములైన దేవశ్రవా, దేవవాతులు అగ్నిని స్తుతిస్తున్నారు — [3-23-4].

"ఓ అగ్నీ, మేము అన్న స్థానము కల ఉత్తమ భూమియందు మంచి దినము లకై నిన్ను స్థాపన చేస్తున్నాం. నీవు దృషద్వతి (ఘగ్గరా), ఆపయా (మరకండా), సరస్వతీ తటముల ధనయుక్తుడవై ప్రజ్వలించు ప్రకాశించుము."

2. అరణ్యాం : పూజనీయము, దాత, ప్రకాశవంతము అయిన ఏ వస్తువు నైనా సరే ఋషులు దేవత అని నమ్మారు. అందుచేతనే అరణ్యం కూడ వారికి దేవత అయింది. మనం భారతమాతను స్తుతిస్తూ వందేమాతరం పాడుకుంటున్నాం. ఇదే విధంగా వారి మనసుల్లో భావకల్పన తిర్గి వుండవచ్చు. సప్తసింధు ఆర్యులకు ఆవులు, గుర్రాలు, మేకలు, గొర్రెలు గొప్పధనం. వాటికి అరణ్యాలు ఎంతో ఆధార భూతాలు. కాబట్టి ఇరమ్మద పుత్ర దేవముని అరణ్యాన్ని భక్తిభావంతో పూజించాడు. (10-146-6)

న వా అరణ్యా ని ర్హన్త్యన్యశ్చేన్నాభి గచ్ఛతి ।
స్వాదోః ఫలస్య జగ్ధ్వాయ యథాకామం ని పద్యతే ॥

"ఇతరులు దురాక్రమణ చేయకపోతే అరణ్యం చంపదు. అక్కడ తియ్యని పండ్లు తింటూ యథేచ్ఛగా పడి వుండవచ్చు."

ఆంజనగంధి సురభిం బహ్వన్నామ కృషీవలాం ।
ప్రాహం మృగాణాం మాతరమరణ్యాని మశంసిషం ॥

—[10-146-6].

"పల్లవి వర్ణం కలది, సుగంధ భరితమైంది. సేద్యం లేకనే అధిక అన్నం యిచ్చేది, మృగములకు మాత అయిన అరణ్యాలను నేను స్తుతిస్తున్నాను."

3. ఆప : జలమును, నదిని ఆప అంటారు. ఈ రెండూ ఆర్యులకు పూజనీయాలే. వారి బంధుకోటిలోని వారగు పారశీకులు కూడ ఆర్యులతోపాటు 'ఆప'ను దేవతగ విశ్వసిస్తారు. సింధు దీవక్షుత్ర అంబరీషుడు 'ఆప'ను స్తుతిస్తూ చెప్పాడు.. [10-9-1, 2-4].

"ఆపదేవి మంగళ మందుగాక. ఆమె మాకు ధనం యిచ్చుగాక. మహత్తర మగు రామణీయతను చూచుటకు శక్తి నిచ్చుగాక."

"ఓ ఆపదేవీ, నీవు నీ కల్యాణతమమైన జలాన్ని వాత్సల్యం గల తల్లివలె ప్రసాదించుము."

శంనో దేవీరభిష్టయ ఆపో భవంతు పీతయే.
శంయోరభి స్రవంతునః ॥ (10-9-4)

"దివ్య అపలు కల్యాణప్రదంలై ఆనందదాయకంలై మాకు త్రాగుటకై వుండు గాక. మీరు మా ఆరోగ్యం కొరకు ప్రవహించండి."

4. ఇళా : సరస్వతి, ఉషస్సు. అప మాదిరిగా ఇళా కూడ ఆర్యులకు దేవి. ఇళా అంటే అర్థం అన్నం. అన్నం దేవత కంటే గొప్పదే కదా! విశ్వామిత్రుడు ఇళతో పాటు భారతినీ, సరస్వతినీ స్తుతించాడు. (3-4-8)

ఆ భారతీ భారతీభిః సజోషా ఇళా
దేవై ర్మనుష్యేభి రగ్నిః।
సరస్వతీ సారస్వతే భిరర్వాక్
తిస్రోదేవీర్బర్హి రేదం సదస్తు ॥

"భారతీలతో భారతి, దేవుళ్ళతో ఇళా (దివ్యాన్నం). మనుష్యులతో అగ్ని, సరస్వతీతీరస్థ దేవులతో సరస్వతి - యీ ముగ్గురు దేవతలు వచ్చి ఈ దర్భాసనంపై ఆసీనులుకండు."

భారతి అంటే నేటి సరస్వతి కాదు. అనేక భారతీలతో భారతి వున్నదనుటలో కొంత విశేషార్థముంది. చాలమంది భారతీయ అనుటచేత యిక్కడ భారతదేశ పూజ్య దేవతలు అను అర్థం కావచ్చు. సారస్వతు లనుటచేత సరస్వతీ తీరమందున్న దేవీదేవతలు అను భావం.

6. ఇంద్రుడు : ఇంద్రుడు ఆర్యులకు సర్వ శ్రేష్ఠుడైన, తేజోవంతుడైన దేవత. ఈరానీ ఆర్యులు జరథుస్తువి మతం అనుసరించి దేవ శబ్దంకు అర్థం రాక్షసుడు అన్నారు. దేవులకు రాజు కాబట్టి ఇంద్రుడు రాక్షస రాజు అయ్యాడు. కాని జరథుస్తువికి పూర్వం కూడ 'దేవ' శబ్దానికి అర్థం యిదే అక్కడ వున్నదనుట తప్పు అవుతుంది. ఎటువంటి మినహాయింపులు లేకుండా ఇండో యూరపియను జాతుల పూర్వీకులు అంతా దేవశబ్దాన్ని దివ్యమను అర్థంలోనే వుపయోగించేవారని మనకు తెలుసు. ఋషిత్రయంలో అందరికంటె పెద్దవాడు భరద్వాజుడు, ఇంద్రుని మహిమను గురించి చెప్పాడు.

స ఈం పాహియ ఋజీషీ తరుత్రో
యః శిప్రవాన్వృషభో యోమతీనాం ॥
యోగోత్రభిద్వజ్రభృద్యోహరిష్ఠా ।
సఇంద్ర చిత్రాం అభితృన్ధి వాజాన్ ॥

"ఓ ఇంద్రుడా, రక్షించుము. నీవు శత్రువుల నుండి కాపాడతావు. నీవు కోర్కెలను తీర్చువాడవు (వృషభుడవు). శ్రమము కలవాడవు. మనోభీప్సితాలను యీడేర్చువాడవు. కొండలను వరకు వజ్రమును ధరించినవాడవు. అశ్వారోహకుడవు. అటువంటి నీవు మాకు అద్భుతమైన అన్నాన్ని ధనాన్ని ఇమ్ము." (6-17-2)

భరద్వాజపుత్రుడు గర్గ ఇంద్రుని రక్షకుడని చెప్పుతూ స్తుతించాడు. (6-47-11, 18)

త్రాతారమింద్ర మవితార మింద్రం హవే హవే
మహావం శూరమింద్రం ।
హ్వాయామిశక్రం పురుహూతమింద్రం స్వస్తి
నో మఘవా ధాత్విన్ద్రః ॥— (11)

త్రాత అయిన ఇంద్రుని, రక్షకుడైన ఇంద్రుని, ప్రతి యజ్ఞంలోను చక్కగా ఆహ్వానింపబడు ఇంద్రుని, శూరుడైన ఇంద్రుని, శక్రుని, పురుహూతుని (ఎక్కువగ ఆహ్వానింపబడువాని) నేను ఆహ్వానిస్తున్నాను. మఘవన్ (ధనవంతుడు) ఇంద్రుడు మాకు మేలు చేయుగాక."

"ఇంద్రుడు తన రూపం ప్రకటించుటలో విభిన్న రూపుడై వున్నాడు. అతడు తన మాయలచే బహురూపుడై వున్నాడు. అతని రథమందు వేయి గుర్రాలు కట్టబడినాయి." 18.

వసిష్ఠుడు ఇంద్రుని సోమపానం కొరకు ఆహ్వానిస్తున్నాడు. (7-29-1)

"ఓ ఇంద్రా, ఈ సోమం నీకై వడకట్టబడివుంది. ఓ అశ్వారోహీ, నీవు శీఘ్రంగా సోమం దగ్గరకు రమ్ము చక్కగా వడకట్టిన యీ సోమాన్ని త్రాగుము. ఓ మఘవా, వచ్చి మాకు మఘాన్ని (ధనాన్ని) యిమ్ము."

ఆర్యులకు, వారి దేవతలకు సోమం మిక్కిలి యిష్టమైన పేయం. దాన్ని త్రాగి వారు ప్రసన్నులై మత్తిల్లుచు వుండేవారు. అందుచేతనే వసిష్ఠుడు చెప్పాడు. (7-32-4)

"ఈ దధ్యాశిరం (పెరుగు కలిపి వడకట్టబడిన సోమం) సిద్ధముగ వుంది. ఓ వజ్రహస్తుడా! నీవు రెండు గుర్రాలతో శీఘ్రంగా మత్తును పొందుటకు సోమం వున్నచోటుకు రమ్ము." వసిష్ఠుని శతయాతు (నూరు మాయలు ఎతింగినవాడు) అంటారు. కాని ఆయన ఇంద్రుని బలముచేతనే మాయలో చతురుడయ్యాడు. కాబట్టి ఆయన యింద్రుని యిట్లు స్తుతించాడు. (7-104-24)

ఇంద్రజహిషమాంసం యాతుధానముత
స్త్రియం మాయయా శాశదానాం।
విగ్రీవాసో మూరదేవా ఋదన్తు మాతే
దృశన్త్సూర్యముచ్చరంతం ॥

"ఓ ఇంద్రుడా, పరుషయాతుధానుని (రాక్షసుని), మాయచే అపకారం కల్గించు స్త్రీ యాతుధానుని చంపుము. మూరదేవుని (మూర్ఖుడు లేక హింసకుడు అయిన రాక్షసుడు) తలను త్రుంచుము. అతడు ఉదయించే సూర్యుని చూడరాదు."

విశ్వామిత్రుడు ఋషిత్రయంలో చివరకు అధికారానికి వచ్చాడు. ఆయన సుదాసుతో అశ్వమేధ యాగం చేయించాడు. ఆయన ఇంద్రుని స్తుతిస్తూ చెప్పారు. (3-32,2,3,8).

"ఓ ఇంద్రుడా, గవాశిర శుక్ర సోమం (పాలు కలిసిన తెల్లని సోమం) త్రాగుము. నీ మత్తుకొరకు మేము దీన్ని ఇస్తున్నాం. బ్రహ్మకృత్తులతో (మంత్ర కర్తలతో) మరుత్ గణములతో, రుద్రులతో తనివితీర సోమం త్రాగుము."(2)

"ఓ ఇంద్రా, నీ బలమును, తేజస్సును వృద్ధిచేయు మరుత్తులు నీకు మరింతగా ఓజస్సును ప్రసాదించుగాక. ఓ వజ్రహస్తా! నీవు సుశిప్రుడవై (మకుటధారివై) రుద్రులతో, గణములతో మధ్యాహ్నపు సవన మందు సోమాన్ని త్రాగుము." (3)

"ఇంద్రుడు ద్యోలోకాన్ని, పృథివిని వహించి వున్నాడు. అతడు సుందర మైన పౌర్ణమిని ఉషస్సును సృష్టించాడు. అట్టి ఇంద్రుని సుకర్మను, బహుకర్మలను దేవులందరూ నష్టపర్చలేరు."(8)

విశ్వామిత్రుడు ఇంద్రుని గుర్రాలను నెమలి ఈకలు కలవిగా వర్ణించాడు. (3-45-1)

"ఓ ఇంద్రుడా, మత్తిల్లిన నెమలి యీకలుగల గుర్రాలతో రమ్ము. పక్షులను పట్టువానివలె విన్నెవరో అడ్డగించలేరు. మరుభూమినివలె నీవు వాటిని దాటి రమ్ము."

వామదేవుడు ఇంద్రుని యిట్లు స్తుతించాడు. (4-16-14,17,18.)

"ఓ ఇంద్రుడా, సూర్యునివద్ద కూర్చున్నప్పుడు నీ శరీరం, నీ అమరరూపం విస్ఫారితుంది. తేజస్సుతో శత్రువులను కాల్చుతున్నప్పుడు మృగహస్తివలె

వుంటావు. ఆయుధాలను ధరించినపుడు సింహంవలె భయంకరంగా కన్పడ తావు."-14

"ఓ శూరుడైన యింద్రా, మాదు యే గణాల యుద్ధం మధ్యలోనైనా పిడుగు పడునప్పుడు, ఘోర యుద్ధం జరుగునప్పుడు, నీవు మా శరీరాలను రక్షించవలసిన దిగా ఎరుంగుము." - 17

"వామదేవుని ఆలోచనలకు రక్షకునిగా వుండుము. నీవు యుద్ధమందు విష్కపటమైన సఖునిగా వుండుము. రక్షకుడవైన నీ దగ్గరకు మేము వస్తాం. నీవు ఎల్లప్పుడు నిన్ను స్తుతించువారకు బహు ప్రశంసనీయుడవు కమ్ము."

వామదేవుడు యింకా స్తుతించాడు—

"త్వం మహాం ఇంద్రతుభ్యం హక్ష
అనుక్షత్రం మహనా మన్య తద్యౌః" ।
త్వంవృత్రం శవ సా జఘన్వాన్త్సృజః
సింధు రహినా జగ్రసానాన్॥ (4-17-1)

"ఓ ఇంద్రా. నీవు గొప్పవాడవు. మహా పృథ్వి నిన్ను ఆమోదించింది. ద్యౌ నిన్ను ఒప్పుకొంది. నీవు నీ బలంతో వృత్రుని సంహరించావు. అహి(వృత్రుడు)చే గ్రహింపబడుచున్న సింధువులను (నదులను) విముక్తం చేశావు(4-17-1)

"నీ ప్రకాశంచే ద్యౌప్రకాశించ మొదలిడింది. నీ కోపంచే భీతిల్లి భూమి కంపించింది, సుందరమైన పర్వతాలు చలించాయి. మరుభూమి తడిసింది, నదులు ప్రవహించాయి." (4-17-2)

వామదేవుడు యింకను స్తుతించాడు—

"వృష్టిధారకుడును, కామదాయకుడును, రెండుచేతులతోను నాల్గువైపుల పదును గల వజ్రం విసరువాడును, ఉగ్రుడును, మహాగొప్ప నాయకుడును, శచీయుక్తుడును అగు ఇంద్రుడు ఉష్ణిని సేవించినట్లు పరుష్ణి నదిని (రావీనదిని) శ్రీ కొరకు సేవిస్తున్నాడు. దాని ప్రదేశాలను మైత్రి కొరకు కప్పినాడు" (4-22-2)

"ఇంద్రుడు బహు అన్నములతో, మహా వేగములతో, బలములతో, పుట్టి దేవుళ్ళలో సర్వశ్రేష్ఠ దేవుడైనాడు రెండు చేతులతోను కాంతిగల వజ్రం పట్టుకొని ద్యౌ పృథ్వీలను కంపింపచేశాడు." (4-22-3)

వామదేవుడు ఇంద్రుని మహిమను ఇంద్రునితోనే చెప్పించాడు.

"నేను మనువుని, నేను సూర్యుడను. నేను కక్షీవాన్ విప్రఋషిని. నేను అర్జునేయ కుత్సుని సమర్థించాను. నేను 'ఉశనా' కవిని. మీరు నన్ను చూడండి." (4-26-1)

"నేను ఆర్యునికి భూమి యిచ్చాను. దాత మానవునికి వృష్టిని యిచ్చాను. గంగల పారునట్టి నదులను తెచ్చాను. దేవతలు నా సంకల్పాన్ని అనుసరిస్తారు." (4-26-2)

"నేను యుద్ధమందు దివోదాసుని రక్షించాను. మత్తుతో శంబరుని 99 పురాలను ధ్వంసం చేశాను. నూరవ పురాన్ని దివోదాసుకు వుంటానికి యిచ్చాను." (3)

ప్రసిద్ధులైన ఋగ్వేద ఋషుల్లో గృత్సమదుడు ఒకడు. ఆయన ఇంద్రుని సర్వశక్తిమత్తతను కీర్తించాడు (2-12-7).

"ఎవ్వని గుర్రాలు, గోవులు గ్రామాలు, రథాలు అన్ని దిశలందున్నవో, ఎవ్వడు సూర్యుని ఉషను సృజించాడో, ఎవడు నదులకు నేతయై వున్నాడో ఓ ప్రజలారా, అతడే యింద్రుడు."

యః శమ్బరం పర్వతేషు క్షియంతం
చత్వారింశ్యాం శరద్యన్వవిందత్ ।
ఓజాయమానం యో అహింజఘాన
దానుంశయానం సజనాస ఇన్ద్రః ॥ (2-12-11)

"ఎవడు పర్వతములందుండు శంబరుని నలభైయో శరత్తులో (సంవత్సరంలో) సంహరించాడో, ఎవడు శక్తివంతుడై నిద్రించు దానవ అహిని (వృత్రుని) చంపాడో, ఓ ప్రజలారా, అతడు ఇంద్రుడు."

వసిష్ఠుడు ఆర్యుల విజయాల శ్రేయస్సు అంతా ఇంద్రునికి యిచ్చాడు. ఈయన చెప్పిన రెండు సూక్తాల్లో (7-18-2) ఋగ్వేద ఆర్యుల సంఘర్షణల గురించి బహుమూల్య విషయాలు అవగత మగుచున్నవని మేము ఇదివరలో తెల్పియున్నాం. ఆయన చెప్పుతున్నారు. [7-18-1]

"ఓ ఇంద్రుడా, మా పితరులు నిన్ను స్తుతించి విలువైన ధనములన్నీ పొందారు. నీ వల్లనే పాడి ఆవులను పొందారు. గుర్రాలను పొందారు. దేవుల భక్తునికి నీవు చాల ధనాన్ని యిస్తావు " "స్త్రీలతో నున్న రాజువలె నీవు వున్నావు. నీవు విద్వాంసుడవు. కవివి. మాకు యశస్సు నిమ్ము. ఓ మఘవన్. ఆవులను గుర్రాలను యిస్తూ మాస్తుతులను ఆమోదించుము. శక్తులైన మాకు ధనం యిమ్ము, [7-18-2]

"ఓ యింద్రా, పోటీపడుచు, హర్షప్రదములై దేవులను కోరుచు మా యీ స్తుతులు నిన్ను చేరుతున్నాయి. నీ ద్వారా మాకు ధనం చేరుగాక నీ స్తుతివలన మేము సుఖులమై వుంటాం." 3

"పాలుపిండుటకొరకు ఆవుకు మంచి గడ్డిని వేసినట్లుగా, వసిష్ఠుడు నీకొరకు మంత్రములను రచించాడు. నీవే గోపతివని అందరూ నాకు చెపుతున్నారు. ఇంద్రుడా నీవు మా స్తుతిని వింటానికి దగ్గరకు రమ్ము" 4.

అంగిరస ప్రియమేధుడు ఇంద్రుని స్తుతించాడు. (8-58-6,8,9 15,16)

"వజ్రధారి ఇంద్రుడు దగ్గరకు వచ్చినప్పుడు అతనికొరకు గోవులు తియ్యని పాలు యిస్తాయి". 6

"ప్రియ మేధులారా! పూజించండి. బాగా పూజించండి. పూజించండి ఓ పుత్రులారా! పూజించండి దృఢమైన పురమును అర్చించినట్లు అర్చించండి.

"గర్గర (బాకా) వినవస్తోంది. ఇంద్రునికొరకు మంత్రాలు ఘోషింపబడినాయి. గోధా (చర్మవాయిద్యము) చప్పుడు నాల్గువైపుల వినపడుతోంది. పింగా (తంతు వాయిద్యం) నాల్గువైపుల మ్రోగుతూవుంది." (9)

"శిశు కుమారునివలె నూతన రథంపై అదుగో ఇంద్రుడు కూర్చున్నాడు. అతడు తల్లిదండ్రుల కొరకు బలిష్ఠమైన మహిషమును పక్వం చేశాడు." (15)

"ఓ సుందరమైన శిరస్త్రాణధారీ, నీవు మా గృహాలకు యజమానివి. బంగారు రథంపైవచ్చి కూర్చోనుము. సహస్రపాదుడు. కోపరహితుడు విష్వాపుడు అయిన నీవు చక్కగా నడిచే బంగారు రథంపై కూర్చోనుము. అప్పుడు మనమిద్దరం కలుసుకొందాం." (16)

భృగు గోత్రీయుడగు నేమఋషి ఋక్కు (8-89)ను బట్టి ఆర్యుల్లో కొందరు ఇంద్రుని అస్తిత్వంపట్ల సందేహించేవారని తెలుస్తుంది.

"ఓ యుద్ధేచ్ఛుకులారా, ఇంద్రడు నిజమైతే అతనికొరకు సత్యమైన స్తుతులు చదవండి. నేమఋషి మాత్రం ఇంద్రుడులేడని చెపుతున్నాడు. ఇంద్రుని చూచింది ఎవరు? అట్లు కానప్పుడు ఎవరిని స్తుతించాలి?" (3)

(నేమఋషి) కిట్లు సందేహం కల్గినప్పుడు ఇంద్రుడు స్వయంగా సమాధానం చెప్పాడు.

"ఓ భక్తులారా ఇదిగో ఉన్నాను చూడండి నన్ను. ఇక్కడ సృష్టి అంతా నా మహిమచే నేను అదుపులో వుంచుతున్నాను. దిక్కులు నా సత్యమునకు స్వాగతం పలుకుతున్నాయి. నేను పురములను ధ్వంసం చేశాను." (4)

ఋషులు యింద్రుని శరీరధారి అనుకొన్నారు. అతని మకుటాన్ని రెండు చేతులను పైన ఋక్కుల్లో వర్ణించారు. ప్రజాపతిపుత్ర విమదుడు ఇంద్రుని శ్మశ్రువులను (మీసమును గడ్డమును) వర్ణించాడు. (10-23-1,4)

"కుడిచేతిలో వజ్రమును పట్టుకొని యున్నవాడు, కార్యకౌశల్యము గలవాడు, గుర్రం పూన్చిన రథముపై కూర్చున్నవాడు, ఆ ఇంద్రుని మేము పూజిస్తున్నాం. సోముని ద్వారా ప్రసన్నుడై, సేనలతోను, ఆహారంతోను ఇంద్రుడు శ్మశ్రువులను వూపుకొంటూ శత్రు సంహారంకై వచ్చాడు." (1)

"వృష్టి పశువుల గుంపులను తడిపినటు ఇంద్రుడు తన బంగారు రంగుగల మీసమునూ, గడ్డమును సోమంతో తడుపుతున్నాడు. తరువాత సుందరమైన యజ్ఞానికి వెళ్ళి వడకట్టిన స్వాదిష్ట సోమం త్రాగి వాయువు వనాన్ని కదిలించినట్లు అతడు తన శ్మశ్రువులను ఊపుతున్నాడు." (4)

విమదఋషి సోమపానంచే ఇంద్రుడు తృప్తి చెంద దనుకొని అతని భోజనం గురించి వర్ణించాడు. "ఓ ఇంద్రా, విమద ప్రజలు సువాతమైన నీ కొరకు అద్భుతమైన విస్తృతమైన స్తోమములను రచించారు. రాజైన నీవు తిను భోజనం సంగతి మాకు తెలుసు. అందుచేతనే గోపాలకులు గడ్డిచూపెట్టి గోవులను దగ్గరకు పిల్చునట్లు నిన్ను మేము భోజనంకై ఆహ్వానిస్తున్నాం. (10-23-6)

అసంభవాన్ని సంభవంగా చేయగల యింద్రుని అద్వితీయ శక్తివల్ల వసుక్ర ఋషికి నమ్మకం వున్నట్లు తోస్తుంది (10-28-3)

"ఓ ఇంద్రుడా! నీ కొరకు ఋత్విక్కులు శీఘ్రంగా మత్తును కల్గించు సోమాన్ని రాళ్ళతో నూరి వడకట్టి సిద్ధం చేస్తున్నారు. నీవు ఆ సోమాన్ని త్రాగుతున్నావు. వారు నీ కొరకు వృషభాన్ని వండుతున్నారు. నీవు భోజనానికి ఆహ్వానింపబడి ఆ ఆహారమును తింటున్నావు."

"ఓస్తోతా, నాకున్న యీ సమస్యను తీర్చుము. ఇంద్రుడు తలచుకుంటే నదులు తమ వరదను ఎదురు తన్నుతాయి. గడ్డితిను పశువు సింహాన్ని తరుముతుంది. నక్క వరాహాన్ని అడవి నుండి పారద్రోలుతుంది." (4)

"ఇంద్రుడు తలిస్తే కుందేలు తోడేలును ఎదిరిస్తుంది. ఒక మట్టిగడ్డను విసిరివైచి పర్వతాన్ని విచ్ఛిన్నం చేస్తాను. పెద్దవాడు చిన్నవాని చేతిలో చిక్కుతాడు. దూడకూడ ఆబోతుతో పోరుతుంది." (9)

"ఇంద్రుడుకోరితే పంజరబద్ధమైన సింహం నాల్గువైపుల తన పంజాలను రుద్దుకొన్నట్లు, గరుడపక్షి తన గోళ్ళను రుద్దుకొంటుంది. దప్పికగొన్న మహిషం పట్టుబడుతుంది. చర్మపుత్రాడు చిక్కుకొనియున్న దాని కాళ్ళను బంధించి వుంచు తుంది" (10)

ఆంగిరసవరు ఋషి ఇంద్రుని రూపం గురించి వర్ణించాడు. (10-96-3-8)

"ఇంద్రుని వజ్రం హరితం. (బంగారువర్ణం కలది) అది అయస్సు (రాగి లేక రాయి)తో చేయబడింది. మిక్కిలి అందంగా వుంది. దాన్ని అతడు రెండు చేతులతోను పట్టుకొని వున్నాడు. ధనికుడు, సుశిప్రుడు (ముకుటధారి), అందగాడు, క్రోధం అను బాణం కల యింద్రునికి బంగారు రంగు కల, సోమంచేత అభిషేకం చేస్తాను." (10-96-3)

"ఆ యింద్రుడు బంగారు గడ్డం, మీసం కలవాడు. బంగారు జుట్టు కలవాడు. రాయివలె దృఢమైనవాడు. అశ్వస్వామి. అతడు సోమపానంచేసి శరీరాన్ని వుబ్బింగిస్తున్నాడు. అతన్ని హరితగుర్రాలు యజ్ఞంలోకి తీసుకుపోతున్నాయి. అతడు వేగంగా పరుగెత్తు గుర్రాలను అధిరోహించి కష్టములను పోగొట్టు తున్నాడు"–(8)

ఇంద్రుడు మనుష్యునివలె సాకారుడని యాస్కుడు కూడ చెప్పుతున్నాడు. (నిరుక్తం - ఉత్తర షట్కం (7-2-2).

"దేవతల ఆకారాన్ని గురించి ఆలోచిస్తే వారు పురుషులుగా అగపడుతున్నారు. మానవుని వలె చైతన్యం కల ఋక్కులు పురుషుల వంటి వారి అవయవాలను స్తుతిస్తున్నాయి."

ఇంద్రుని గురించిన ఋక్కులు చూస్తే యాస్కుడు చెప్పింది నిజమని తెలుస్తుంది. ఇంద్రునికి శిప్ర ముంది. అతడు గుర్రాలు పూన్చిన రథంపై వెళ్ళేవాడు. సోమాన్ని త్రాగి మత్తిల్లుతాడు. ఆయన రెండు చేతుల్లోను నాల్గు వైపుల పదును వున్న వజ్రముంది. ఆయన గుర్రాలు నెమలి యీకలు కలవి. ఆయన మూతికి బంగారు రంగుగల మీసముంది. గడ్డముంది. ఆయన భుజించుటకై భక్త సమూహం వృషభాన్ని వండుతున్నారు. శచి ఆయన భార్య మొదలైనవి.

6. ఋభులు : ఇంద్ర పుత్రులైన ఋభులను వామదేవుడు స్తుతించాడు.

"ఈ యజ్ఞమందు ఋభులు నాకు రత్నాలను యిచ్చారు. బాగా వడకట్టిన సోమం త్రాగారు. మంచి పనులతో, అందమైన చేతులతో వారు ఒక పాత్రను నాల్గుగా చేశారు." (4-35-2)

"ఆ పాత్ర ఎట్టిది ? దాన్ని నైపుణ్యంతో నాల్గుగా చేశారు. మళ్ళీ మత్తు కొరకు సోమం వడకట్టండి. ఋభులాలా, మధురమైన సోమాన్ని త్రాగండి"-4

"అందమైన చేతులుకల ఓ ఋభులారా, మీరు తృతీయ సవనంలో (సాయం కాల యజ్ఞంలో) మీ సుకర్మలచే ఆర్జించిన రత్నాలను దానం చేస్తున్నారు. మీరు యీ వడకట్టిన సోమాన్ని ఇంద్రియాలు సంతృప్తి చెందునట్లు త్రాగండి."-9

వామదేవుడు దేవవైద్యులగు అశ్వినీ కుమారులు కూడ ఋభుల అనుగ్రహం పొందినట్లు వర్ణించాడు. (4-36-1)

"ఓ ఋభులారా, అశ్వద్వయం మీరిచ్చిన మూడు చక్రాల రథంపై గుర్రాలు లేకుండా, కళ్ళెపుత్రాడు లేకుండా ఆకాశంలో నాల్గు వైపుల తిరుగుతున్నారు. ఇట్టి మీ పని స్తవనీయమైంది. మీరు ద్యౌని, పృథివిని పోషించుతున్నారు ఇది మీ దివ్యత్వానికి ఘనమైన కీర్తి."

7. క ప్రజాపతి : క ప్రజాపతిగాను లేక స్వతంత్రమైన దేవతగాను క ఋషులకు - ముఖ్యంగా తర్వాత వచ్చిన ఋషులకు - పూజ్యుడైనాడు. ఆయన ఐతిహ్యం గురించి సందేహముంది. ప్రజాపతిపుత్ర హిరణ్యగర్భుడు ఒక పూర్తిసూక్తం క ప్రజా పతిని స్తుతిస్తూ చెప్పాడు. (10-121).

"హిరణ్యగర్భుడు మొదట ఉన్నాడు అతడు పుట్టిన ప్రాణులకు ఏకైక పతి. అతడు పృథివిని, ద్యౌలోకాన్ని ధరించాడు. క దేవతకు మేము హవిస్సు ఇస్తున్నాం." 1

"ఎవ్వడు శరీరం యిచ్చునో, బలమొసంగునో, ఎవనిని అందరు పూజించెదరో, దేవతలందరు ఎవని ఆజ్ఞకు బద్ధులైవున్నారో ఎవ్వని ఛాయ అమృతమో, ఎవ్వని ఛాయ లేనప్పుడు మృత్యువో, అట్టి 'క' దేవతకు మేము హవిస్సును యిస్తున్నాం. 2

"ఎవ్వడు శ్వాసిస్తూ, కండ్లు తిప్పుతూ జగత్తుకు తన మహిమచే ఏకైక రాజై వున్నాడో, ఎవ్వడు ద్విపాదులను, చతుష్పాదులను శాసిస్తున్నాడో అట్టి క దేవతకు మేము హవిస్సును యిస్తున్నాం." 3.

"ఎవ్వని మహిమచే యీ హిమవంతుడు వున్నాడో, పృథ్వీ సమేతంగా సముద్రమున్నదో, ఈ దిక్కులు ఎవని భుజాలో, అట్టి క ప్రజాపతికి మేము హవిస్సుమ యిస్తున్నాం." 4.

"ఎవ్వనిచేత ద్యౌ ఎత్తుగా వుందో, పృథివి దృఢంగా వుందో, ఎవ్వడు ఆకాశాన్ని స్వర్గలోకాన్ని పట్టివుంచాడో, ఎవ్వడు అంతరిక్షమందు జలమును విర్మిస్తున్నాడో అట్టి క ప్రజాపతికి మేము హవిస్సును యిస్తున్నాం." 5

క దేవతను గురించిన యీ మహిమలో ఉపనిషత్తుల ఋషుల బ్రహ్మ యొక్క భావన గోచరిస్తుంది. కప్రజాపతి ఉపనిషత్తులకాలంలో సర్వోన్నత దేవతగా వుండడు కాని యీ సూక్తం చెప్పిన ఋషికి మాత్రం క ప్రజాపతి ప్రజలందరికీ మహాదేవుడను అభిప్రాయముంది. ఈ సూక్తంలోని చివర మంత్రం (10)లో యీ విషయం మనకు తెలుస్తుంది. అందు చివర పాదమును తిగ్గి వుచ్చరించుటను విడవాడు.

ప్రజాపతే న త్వదేతాన్యన్యో విశ్వా
జాతాని పరితా బభూవ ।
యత్ కామాస్తే జుహుమ స్తన్నో అస్తు
వయం స్యామపతయో రయీణాం॥

"ఓప్రజాపతీ, నీవుతప్ప యీ సృష్టిని అదుపులో పెట్టువారు ఎవ్వరూలేరు మేము ఏ కోర్కెతో హవనం చేస్తున్నామో. ఆ కోర్కె నెరవేరుగాక. మేము ధనానికి పతుల మగుదుము గాక (10)

8. పర్జన్యం : ఇతడు మేఘానికి, వృష్టికి దేవత. ఇంద్రుణ్ని కూడా మేఘాధిపతి అన్నారు. ఇంద్రుడూ, పర్జన్యమూ — ఒక్కరా లేక వేరా ఏమిటి? వేరైతే వారికివున్న పరస్పర సంబంధ మెట్టిదో తెల్పుటకష్టం. వసిష్ఠుడు పర్జన్యాన్ని స్తుతించాడు. (7-102-1,2,3)

"ద్యౌపుత్రుడు, సేచనకర్త పర్జన్యాన్ని స్తుతించండి. అతడు మనకు అన్నం యిచ్చుగాక"—1

"ఏ పర్జన్యం ఓషధులందు, గోవులందు, ఆడ గుర్రాలందు, స్త్రీలందు గర్భం కల్గించునో"—(2)

"ఆ పర్జన్యం నోటిలో యీ అతి మధురమైన హవిస్సును హవనం చేయండి. అతడు మనకు అన్నం యిస్తాడు"—(3)

9. పితరులు : ద్యౌను, పృథివిని ఋషులు తండ్రి, తల్లి అన్నారు. వారికి ద్వివచనశబ్దమైన 'పితరౌ'ను ఉపయోగించారు. భరద్వాజుడు యిట్లు స్తుతించాడు. (6-7-5)

"ఓ వైశ్వానర అగ్నీ, నీవు చేసిన ఆ గొప్ప పనులను ఎవరూ చెరుపలేరు నీవు పితరుల ఒడిలో పుట్టినప్పుడు, నీవు దినముల మార్గములో వెలుతురుని (సూర్యుని) స్థాపించావు."

పృథివిని, ద్యౌలోకమును ఋషులు తల్లిదండ్రులుగా స్తుతించారు.

10. పురుషుడు : పురుష సూక్తం ఋగ్వేదం చివరసూక్తాల్లోవుంది. (10-90) దీని కర్త నారాయణ ఋషి కల్పితుడుగా తోస్తున్నాడు. సూక్తంలో బ్రహ్మాండమయ విరాట్ పురుషుని కల్పన వుంది.

సహస్ర శీర్షాపురుషః సహస్రాక్షః సహస్రపాత్ ।
స భూమిం విశ్వతో వృత్వాఽతిష్ఠ ద్దశాంగులం॥ 1

పురుష ఏ వేదం సర్వం యద్ భూతం యచ్చ భవ్యం।
ఉతామృతత్వ స్యేశానో యదన్నేనా తిరోహతి॥ 2

యత్ పురుషేణ హవిషాదేవా యజ్ఞ మతన్వత।
వసంతో అస్యాసీ దాజ్యం గ్రీష్మ ఇధ్మః శరద్ధవిః॥ 6

తస్మాదశ్వా అజాయంత యేకేచో భయాదతః।
గావోహజజ్ఞి రేతస్మాజ్జాతా అజావయః॥ 10

బ్రాహ్మణోఽస్య ముఖమాసీద్ బాహూరాజన్య కృతః।
ఊరూ తదస్యయద్వైశ్యః పద్భ్యాం శూద్రో అజాయత॥ 12

"పురుషుడు సహస్రశీర్షుడు, సహస్రాక్షుడు, సహస్రపాదుడు. అతడు భూమిని నాల్గువైపులనుండి ఆవరించి దశాంగుళుడై వున్నాడు." 1

"ఈ భూత, భవిష్యత్తుల ఏవైతే ఉన్నవో, అవి అన్నీ ఆ పురుషుడే. అన్నంచేత పెరిగే ఆ పురుషుడు అమృతత్వంకు స్వామి." 2

"పురుష రూపుడైన హవిస్సుతో దేవులు ఏ యజ్ఞాన్ని ప్రారంభించారో

అందు వసంతుడు నెయ్యిగా గ్రీష్మం ఇంధనంగా (కట్టెలుగా) శరత్తు హవిగా వున్నారు." 6

"ఆ పురుషునుండి గుర్రాలు, నోటిలో రెండువైపుల దంతాలు కల ప్రాణులు పుట్టాయి. ఆవులు, గొర్రెలు మేకలు ఆయననుండి పుట్టాయి. 10

"ఆయన ముఖం బ్రాహ్మణుడు, చేతులు క్షత్రియులు, తొడలు వైశ్యులు రెండు కాళ్ళనుండి శూద్రులు పుట్టారు" 12

10 పూషన్ : పుష్టిని కల్గించు దేవతను పూషన్ అన్నారు. ఈయన గుణాలు సూర్యునికి సరిపోతాయి. ఒక దేవతయొక్క అనేక గుణాలను తీసుకొని ఋషులు అనేక దేవతలను కల్పించేవారు. ఉదాహరణంకు సూర్యుడే వున్నాడు. అతనికి ఆదిత్యుడని, సవితృడని, మిత్రుడని, సూర్యుడని, పూషనుడని పేర్లుపెట్టి వారు వేర్వేరు దేవతలని నమ్మారు. ఋషిత్రయంలో అందరికంటె పెద్దవాడైన భరద్వాజుడు పూషనుని స్తుతిస్తూ ఆరు సూక్తాలు రచించాడు. (6-53 నుండి 58 వరకు). దీన్నిబట్టి మనం యీ దేవత మహత్తును తెలుసుకోగలం. భరద్వాజుని ఋక్కుల ద్వారా పూషనుని వ్యక్తిత్వంకూడ తెలుస్తుంది.

"త్రోవలకు స్వామి అగు ఓ పూషన్, అన్నం దొరుకుట కొరకు మేము రథంవలె ఎదురుగా నిన్ను వుంచాము." (6-53-1)

ప్రకాశవంతుడగు ఓ పూషన్, దానం చేయనివానిని దానం యిచ్చునట్లు ప్రేరేపింపుము. పిసినిగొట్టు అయిన వణి మనస్సును కోమలంగా చేయుము"—3

భరద్వాజుడు తర్వాత సూక్తం (6-54) యిట్లు చెప్పాడు :

"ఓ పూషన్, ఎవ్వడు మమ్ములను క్రమశిక్షణలో పెట్టగలవాడో, 'ఇదే' అని చెప్పగలవాడో, అట్టి విద్వాంసుని వద్దకు నీవు మమ్ము కొనిపొమ్ము."—(6-54-1)

"మాగోధనానికి నష్టం వాటిల్లరాదు. మా గోవులు బావుల్లో, నూతుల్లో పడి పోరాదు. మా గోవులను కాపాడుతూ రావలసిందిగా నిన్ను ఆహ్వానిస్తున్నాం"—7

"పూషనుడు తన కుడిచేతిని నలువైపులకు చాచి మా పోయిన గోవులను మరల మాకు తెచ్చిపెట్ట వలసిందిగా స్తుతిస్తున్నాం."—10.

పూషనుడు దారితప్పిన వారికి దారిచూపు దేవతని, గోవులను రక్షించు దేవత అని భరద్వాజుడు చెప్పిన పై మంత్రాలు తెల్పుతున్నాయి. పూషనుని తలపై కపర్ద మున్నట్లు ఆయన చెప్పిన మరియొక మంత్రం ద్వారా తెలుస్తుంది. (6-55-2)

రథీతమం కపర్దిన మీశానం రాధసోమహః—
రాయః సఖాయమీ మహే॥

"ఏ పూషనుడు మహారథికుడై వున్నాడో, కపర్దధారియై వున్నాడో, మహదైశ్వర్యానికి స్వామియై వున్నాడో, అట్టి స్నేహితుడైన పూషనుని మేము ధనంకై ప్రార్థిస్తున్నాం." భరద్వాజుడు పూషనుని కరంభ ప్రియుడన్నాడు.

"ఏ మనుష్యుడు యీ పూషనుని కరంభ దానంతో ప్రార్థన చేస్తాడో, అతడు యితర దేవతలను ప్రార్థించ నవసరంలేదు" (6-56-1)

"మహారథి, నిజమైన స్వామి అగు ఇంద్రుడు తన సఖుడైన పూషనునితో కూడి శత్రువులను చంపుతున్నాడు."—(2)

"మహారథీ సూర్యుడు (పూషనుడు) బంగారు రంగుగల చక్రం నడుపుతున్నాడు."—3

ఇక్కడ పూషన్ సూర్యునిగా చెప్పబడ్డాడు. ఇంద్రునికి సోమపానం యిష్టమైనట్లుగా పూషనుకి కరంభం యిష్టమని భరద్వాజుని ఋక్కువలన తెలుస్తుంది.

"ఇంద్ర, పూషనులారా, మీలో మొదటివారు వడకట్టిన సోమం త్రాగుటకు దగ్గరకురాగా రెండవవారు కరంభం కోరుతున్నారు." (6-57-2)

"పూషనుని వాహనం మేక, ఇంద్రుని వాహనం రెండు గుర్రాలు. ఈ యిరువురి సహాయంతో మేము శత్రువులను చంపుతున్నాం" —3

"అజవాహనుడు, పశుపాలకుడు, ధాన్యములకు పతి, స్తుతిప్రియుడు, అయిన పూషన్ విశ్వమంతటా వ్యాప్తమై వున్నాడు. ఆ దేవత భువనాన్ని ప్రకాశింపజేస్తూ చేతియందు ప్రముఖమైన దండం తీసుకొని తిరుగుతున్నాడు" 2

"ఓ పూషన్, సముద్రం మధ్యలో, అంతరిక్షంలో నీ బంగారు నౌకలు తిరుగుతున్నాయి. నీవు స్తుతించబడు సూర్యునికి ప్రేమవశమున. దూతవగుచున్నావు" 3

"పూషను ద్యావాపృథ్వీలకు మంచి బంధువు. ధాన్యానికి పతి, ధనవంతుడు, దర్శనీయమైన రూపవంతుడు. శక్తిమంతుడు, స్వేచ్ఛతో సుందరమైన గమనం కలవాడు. దేవతలు ప్రేమతో అతన్ని సూర్యలోకానికి యిచ్చారు. 4

పూషనుకు సూర్యునితోను, పశుపోషణతోనూ ఎక్కువ సంబంధ మున్నట్లును, అతడు ఇంద్రునకు సఖుడని, అన్న దేవతని, కరంభ ప్రియుడని, పై ఋక్కులను బట్టి తెలుస్తుంది. నేటి టిబెటీయులవలె నాడు ఆర్యులందరికి యవలపిండి యిష్టం.

12. ప్రజాపతి : పరమేష్ఠి ప్రజాపతి ఋషి అను పేరు కల్పితంగా తోస్తుంది. ఈ పేరుతో రచించబడిన సూక్తానికి ఋగ్వేదమంతటిలోను గొప్ప విశేషముంది. ఈ సూక్తం ఋగ్వేదం 10 వ మండలంలో కడపటి సూక్తముల్లో ఉన్నవాటికి (10-129) యిందే మొట్టమొదటగా ఉపనిషత్తుల్లో చెప్పిన రహస్యవాదం. అజ్ఞేయబ్రహ్మ వర్ణించబడింది.

నాసదాసీన్నో సదాసీత్తదానీం నాసీద్రజో నో వ్యోమా పరో యత్।
కిమావరీవః కుహకస్య శర్మన్నంభః కిమాసీద్ గహనంగంభీరం॥ 1

నమృత్యురాసీ దమృతం నతర్హి నరాత్ర్యా అహ్న ఆసీత్ ప్రకేతః ।
ఆనీదవాతం స్వధయా తదేకం తస్మాద్ధాన్యద్ధ పరః కిచనాస॥ 2

తమ ఆసీత్తమసా గూహళమగ్రే ప్రకేతం సలిలం సర్వమా ఇదం ।
తుచ్ఛ్యే నాభ్వపిహితం యదాసీత్త పస్తన్మహి నా జాయతైకం॥ 3

కామస్తదగ్రే సమవర్తతాధి మనసోరేతః ప్రథమం యదాసీత్ ।
సతో బంధుమసతి నిరవిన్దన్ హృది ప్రతీష్యా కవయోమనీషా॥ 4

తిరశ్చనో వితతో రశ్మిరేషామధః స్విదాసీ దుపరి స్విదాసీత్।
రేతోధా ఆసన్ మహిమాన ఆసన్ త్స్వధా
అవస్తాత్ ప్రయతిః పరస్తాత్॥ 5

కో అద్ధావేద కఇహప్రవోచత్ కుతఆజాతా కుతఇయం విసృష్టిః ।
అర్వాగ్దేవా అస్యవిసర్జనేనాథాకోవేద యత ఆ బభూవ ॥ 6

ఇయం విసృష్టిర్యత ఆ బభూవ యదివా దధేయ దివాన।
యో అస్యాధ్యక్షః పరమేవ్యోమన్త్సో అంగవేదయదివానవేద॥ 7

“అప్పుడు అసత్తులేదు, సత్తులేదు. లోకాలు లేవు. ఆకాశానికి అవల అంటూ ఏదీలేదు. ఆవరణ ఏమిటి? ఎక్కడ దేనికి స్థానం? అహా! జలము ఎంత గహనమైన గంభీరంగా వుంది?” 1

“అప్పుడు మృత్యువు లేదు, అమరత్వం లేదు. రాత్రి, పగలు అను భేదం లేదు. వాయువు లేకుండా అతడొక్కడే సహజత్వంతో వున్నాడు. అతడు మినహా మరొకరు లేరు.” 2

“అంధకారంగా వుంది. ఇది అంతా పూర్వకాలమందు చీకటితో కప్పబడిన అజ్ఞాత సలిలం. ఇది అంతా శూన్యంతో కప్పబడినప్పుడు తపోమహిమచేత అతడు జన్మించాడు.”—3

"అప్పుడు మొట్టమొదటగా కోరికవుంది. అదే మనస్సులోని ప్రథమ రేతస్సు. కవులు బుద్ధిద్వారా ఆలోచించి అసత్తునందు ఆ సత్తును పొందారు."4

"అతని కిరణం ఏటవాలుగా వ్యాపించింది. క్రిందకు వుంది లేక పైకి వుంది. బీజం కలవాడు. అతనికి మహిమలు వున్నాయి. స్వతంత్రమైన వనులున్నాయి. పరమైన ప్రగతి వుంది. శక్తి వుంది." 5

"సరిగ్గా ఎవరికి తెలుసు ? ఇక్కడ అతన్ని గురించి ఎవరు చెప్పుతారు? ఎక్కడ నుండి పుట్టింది, ఎక్కడ నుండి యీ సృష్టి జరిగింది ? ఇది సృజించిన పిమ్మటే దేవలోకాలు పుట్టాయి. ఎక్కడ నుంచి యీ సృష్టి వచ్చిందో ఎవరికి తెలుసు ?" 6

"ఈ సృష్టి ఎక్కడ నుండి వచ్చింది. ఎవ్వరు దీన్ని సృష్టిందారు లేక ఎవ్వరు దీన్ని సృష్టించలేదు. దీనికి అధ్యక్షుడు పరమైన ఆకాశంలో ఎవరైతే వున్నాడో, ఓ మిత్రులారా, అతడు ఎరుగును లేక ఎరుగడు"-7

ప్రజాపతిపుత్ర యజ్ఞఋషి కూడ కల్పిత నామం. ఈయన రచించిన సూక్తాల్లో కూడ ప్రజాపతి వర్ణించబడ్డాడు. కాని అతడంత రహస్యమయుడు కాడు. (10-130)

"తంతువులలో నలుపైపుల వ్యాపించిన యజ్ఞం ఒక నూరు దేవకర్మలతో విస్తృతమైంది. వచ్చిన పితరులు దీన్ని నేస్తున్నారు. "పొడవు నేయండి వెడల్పు నేయండి' అంటూ పొడుగు పన్ని పనికో మగ్నులైవారు." 1

దేవతలు ప్రజాపతి యజ్ఞం ప్రారంభించినప్పుడు, ఆ యజ్ఞముయొక్క ప్రతిమా ప్రతిమలు (రూపం) ఏమిటి, సంకల్పం ఏమిటి, నెయ్యి ఏమిటి, పరిధి ఏమిటి? ఛందస్సు ఏమిటి? గానం ఏమిటి?" 3

"అగ్నికి గాయత్రీ, ఉష్ణిక్కుతో సవితృడు కలిశారు. అనుష్టుప్‌తో సోమం, పంక్తితో సూర్యుడు, బృహస్పతి వాణికి బృహతి సహాయకులయ్యారు." 4

మిత్రావరుణులను విరాట్ ఛందస్సు ఆశ్రయించింది. ఇంద్రుని, పగటిని త్రిష్టుప్ ఛందము (పద్యం). దేవతల నందరినీ జగతీఛందం ఆశ్రయించింది. వాటితో ఋషులు, మునులు యజ్ఞంచేశారు."-5

"స్తోమం, ఛందం (పద్యం), కొంతకతో ఏడుగురు దివ్యఋషులు అన్వయులై వున్నారు. సారథి కళ్ళెపు త్రాటిని పట్టినట్లు ధీరులు పూర్వీకుల మార్గం పొందారు "-7

మొదటి సూక్తంలో వున్నట్లుగా యీ సూక్తంలో ప్రజాపతిని గురించిన

చమత్కారం లేదు. కాబట్టి మొదటి సూక్తాన్ని ఉపనిషత్తుల పూర్వరూప మనుకోవాలి. ఆ సూక్తం చెప్పిన పద్ధతిలో సప్తసింధు ఆర్యులు తత్వ చింతనలో ఎగరటం ఆరంభించారనుటలో సందేహం లేదు. రెండవ సూక్తంలో ఛందముల (వద్యముల) పేర్లు ఒకచోట గ్రహించబడ్డాయి. స్తోమం (స్తుతి), ఉక్థ (సామగానం) పేర్కొన బడ్డాయి.

13. మన్యు : ఈ దేవతా శబ్దానికి చాల వ్యాపకార్థం వుంది. ఆయనలో సృష్టిలో దాగిన చమత్కార శక్తులతో పాటు మనుష్యుని లోపల వుండు శక్తులు కూడా వున్నాయి. సప్తసింధు ఆర్యులకు శాంతి, అహింసల పాఠం వల్లించుటకు సమయం యింకా రాలేదు. శత్రువులపై దెబ్బ తీయటానికి వారికి మన్యు (కోపం) అవసరం. కాబట్టి తప పుత్ర మన్యుఋషి మన్యు దేవతను స్తుతించాడు. (10 83)

వజ్రంతోను బాణంతోను సమానుడైన ఓ మన్యూ, నిన్ను పూజించువాడు సమస్తం జయించగల ఓజస్సును పోషిస్తాడు. సాహసకారి, శక్తివంతం అయిన నీతోకూడి మేము దాసులను, ఆర్యులను ఓడిస్తాం."-1

"మన్యు ఇంద్రుడు, మన్యుదేవత, మన్యుహోత, వరుణుడు, అగ్ని (పురోహితుడు) మనువు సంతానం మన్యుని స్తుతిస్తున్నారు. ఓ మన్యూ. తపంతో కూడిన నీవు మమ్ములను రక్షించుము."-2

"బలవంతుల్లో మేటి బలవంతుడైన మన్యూ. నీవు తపస్సుతో రమ్ము శత్రువులను సంహరించుము. నీవు అమిత్రహంతవు, వృత్రహంతవు, దస్యు హంతవు. నీవు మా కొరకు ధనములన్నీ తెమ్ము"-3

ఆ కల్పితనామం కల ఋషి యింకా మన్యుని వర్ణిస్తూ చెప్పాడు. (10-84)

"ఓ మన్యూ, నీతోకూడ రథంపైన ఎక్కి హర్షోల్లాసముతో. వాయు వేగంతో పోవుతీక్షణ బాణములను ధరించి, ఆయుధాలను పదునుపెట్టుకూ అగ్ని రూపులైన వరులు ప్రయాణం సాగింతురుగాక."-1

అగ్నివలె ప్రజ్వలిస్తూ యజ్ఞానికి ఆహ్వానింపబడు ఓ మన్యూ, మా సేనానివై ముందుకు సాగుము. శత్రువులను చంపి మాకు ధనం యిమ్ము. శక్తిని పెంచుకొని శత్రువులను అణచుము."-2

14. మిత్ర దేవత : మిత్ర, (మిథ్ర - మిహిరక)- ఈరానీయులకు, వైదిక ఆర్యులకు సమష్టి దేవత మనదేశంలో తర్వాత వున్న దేవతల్లో యీ దేవత పేరు లేదు. కాని యీరానులో మిత్రుని మహిమ తర్వాత కాలంలో చాల పెరిగింది.

ఒక కాలంలో రోమకసామంతులు కూడ యీ దేవతలను ఉపాసించుటకు ఎక్కువ ఆకర్షింపబడ్డారు. ఆ కాలంలో క్రైస్తవానికి మిత్ర భక్తికి పోటీ ఏర్పడింది. అప్పటిలో క్రైస్తవం గెలుపొందుతుందో లేక మిత్రమతం విజయాన్ని సాధించుతుందో చెప్పుట కొంత కాలంవరకు కష్టమైంది. మిత్రదేవతా స్తుతి సందర్భంలో విశ్వామిత్రుని ఋక్కులు కొన్ని యిక్కడ పొందుపరుస్తున్నాం (3-59).

"పిలుచుటతోనే మిత్రుడు ప్రజలను ప్రేరేపిస్తాడు. అతడు ద్యౌ, పృథ్వీలను వహిస్తున్నాడు. అతడు ప్రజలను కృపాదృష్టితో చూస్తున్నాడు. మిత్ర దేవత కొరకు నేతితో హవిస్సును హవనం చేయండి."-1

"ఓ మిత్ర ఆదిత్యా, నిన్ను యజ్ఞంతో సేవించువాడు సర్వశ్రేష్ఠు డగుచున్నాడు. నీచే రక్షణ పొందిన వానిని ఎవరూ చంపలేరు, ఎవరూ గెల్వలేరు. దగ్గరనుండి గాని, దూరంనుండి గాని అతనికి కీడు మూడదు."-2

"మహాన్ ఆదిత్యుడు నమస్కార పురస్సరంగా సేవ్యుడు. గణాలను ప్రోత్సహిస్తాడు. అతడు స్తుతికర్తలపట్ల దయగలవాడు. అటువంటి మిక్కిలి స్తుత్యుడైన మిత్రుని కొరకు యీ ప్రియమైన హవిస్సును అగ్నిలో హవనం చేయండి" -5.

"మహాశక్తివంతుడైన మిత్రుని పంచగణాలు పూజిస్తున్నారు. అతడు దేవుల నందరిని పాలిస్తున్నాడు.

15. రుద్రుడు : విశేషణార్థంలో రుద్రుడంటే ఏడిపించేవాడు. వేదంలోని రుద్రునకు తర్వాత వచ్చిన శంకరునికి ఏమీ సంబంధం లేదు. అయినప్పటికీ యిద్దరూ ఒక్కటే నను భావంతో తర్వాత కాలంలో రుద్రుని గూర్చి చెప్పిన ఋక్కులను సంగ్రహించి 'రుద్రాష్టాధ్యాయీ'ని కూర్చారు. వసిష్ఠుడు తన యజమానులైన భరతులను ఉద్దేశించి యిట్లు చెప్పాడు. (7-46)

"ఓ భక్తులారా! వినండి, రుద్రుడు స్థిరమైన విల్లు కలవాడు. బాణాలను వేగంగా వేయగలవాడు, అన్నం కలవాడు, అజేయుడు. విజేత, విధాత, పదునైన ఆయుధాలు కలవాడు. అతని కొరకు నేను స్తోత్రం చేస్తున్నాను."

"ఓ రుద్రుడా! ద్యౌ లోకానికి పైనుండి నీవు వేసే పిడుగు పృథ్వీతలంపై చరించునప్పుడు మమ్ములను దానినుండి కాపాడుము. ఓ దయామయా! నీకు వేలాది ఔషధాలు వున్నాయి. మా పుత్రులకు పౌత్రులకు హాని కల్గించ వద్దు"-3.

"ఓ రుద్రుడా! మమ్ము చంపవద్దు. దూరం చేయవద్దు. నీ కోప బంధంలో

మేము వదకుండా వుండునట్లు చేయుము. ప్రాణులకు క్షేమం కల్గించే మా యజ్ఞానికి రమ్ము. నీవు నదా మాకు మేలు చేసి మమ్ము రక్షింపుము" 4.

అంగిరస కుత్సుడు చెప్పిన సూక్తంవలన రుద్రుని రూప గుణాలు తెలుస్తున్నాయి. (1-144)

"శక్తివంతుడు, జటాధరుడు, శత్రునాశకుడు అయిన రుద్రుని మేము స్తుతిస్తున్నాం. ఈ స్తుతి వలన ఈ గ్రామంలోని ద్విపాదులకు, చతుష్పాదులకు మేలు కల్గాలి. అందరూ పుష్టి కలవారై, ఎట్టి రోగం లేకుండా వుందురుగాక !" 1.

"దీప్తిమంతుడు, యజ్ఞ సాధకుడు, వక్రుడు, కవి అయిన రుద్రుని ఆహ్వానిస్తున్నాం. అతడు తన దివ్యమైన క్రోధాన్ని మాకు దూరంగా ప్రయోగించుగాక. మేము అతని ప్రసన్నత కొరకు స్తుతిస్తున్నాం" 4.

"కాంతివంతుడు, సుందరమైన కపర్దము కలవాడు, అయిన రుద్రుని ఆహ్వానిస్తున్నాం. శ్రేష్ఠమైన ఔషధాలను చేతిలో పెట్టుకొన్న అతడు మాకు సుఖం, రక్షణ గృహం యిచ్చుగాక." 5

16. వరుణుడు : వరుణుడు ప్రాచీన దేవత. పారశీకులు ఈ దేవతనే అహురమజ్ద (అమురమేధ)గా నమ్మినట్లుగ విద్వాంసులు చెపుతున్నారు. పారశీకులు భారతీయ ఆర్యులు శతమ్ శాఖకు చెందినవారు. దీని రెండవశాఖకు చెందిన స్లావుల్లో (రష్యనులు, చెక్కులు మొ॥) క్రైస్తవమతాన్ని స్వీకరించకముందు పేరున్ (వరున) దేవతకు గొప్పమహిమ వుండేది. పేరున్ ఈ వరుణుడే అనుటలో సందేహంలేదు. భారత దేశంలో ఇంద్రుడు వరుణుని తేజస్సును తగ్గించాడు. అయినప్పటికీ ప్రాచీన ఋషులు వరుణుని గద్గదస్వరంతో స్తుతించారు. వసిష్ఠుడు వరుణుని స్తుతిస్తూ అనేక ఋక్కులు చెప్పాడు. కాని ఆయనకూడా విశ్వదేవతలతో చేర్చుటవలన వరుణుడు గౌణుడైనాడు. వసిష్ఠుడు యిట్లు స్తుతించాడు (7-34) :

"సహస్రాక్షుడు, ఉగ్రుడు అయిన వరుణుడు యీ నదీ జలాలను చూస్తున్నాడు." 10

"అతడు రాష్ట్రాలకు రాజు, నదులకు గౌరవం: అతని రాజ్యం విశ్వవ్యాప్తమై, అద్వితీయమైంది." 11

ఈ ఋక్కులు జలంకు, వరుణునకు సంబంధమున్నట్లు తెల్పుతున్నాయి. వసిష్ఠుడు వరుణుని భార్య వరుణానిని కూడ పేర్కొన్నాడు. (7-34)

"దాన విషయుఁగు దేవ పత్నులు మాకు ధనం యిచ్చెదరుగాక. ద్యా వృధ్వులు. వరుణాని మా ప్రార్థన వింటురుగాక. త్వష్టా, ఆశ్రయదాయిని, మదాని, రక్షిక అగు వరుణాని ఇతర దేవతా స్త్రీలతోపాటు మాకు ధనం ఒసంగుగాక" 2

వసిష్ఠుడు తన ఏడవ మండలంలోని 82-85 సూక్తాల్లో ఇంద్రుని వరుణుని కలిపి స్తుతించాడు. 83-89 సూక్తాల్లో వరుణుని మాత్రమే స్తుతించాడు. 60-65 సూక్తాల్లో మిత్రా వరుణులను స్తుతించాడు. ఈ సూక్తాల వలన వరుణుని గురించి తెలుస్తుంది.

"ఆహ్వానింపబడి ప్రకాశించు చున్న ఓ సూర్యా! నీవు నేడు మమ్ములను పాపరహితుల చేయుము. మిత్రావరుణులకు సత్యం చెప్పుము. ఓ అదితీ, మేము దేవులకు ప్రియుల మగుదుము గాక. ఓ అర్యమా, స్తుతించుచున్న మేము నీకు ప్రేమాస్పదుల మగుదుం గాక." (7-60-1)

వరుణుణ్ణి మాత్రమే స్తుతించినవి కొన్ని ఋక్కులు వసిష్ఠునివి వున్నాయి. (7-86)

"ఈ వరుణుని మహిమవలన ప్రజలు ధీమంతు లగుదురు. ఈ వరుణుడే విశాలమైన ద్యా వృథ్వులను నిల్పియున్నాడు. ఉచ్చ నాకాన్ని (స్వర్గం) బృహత్ నక్షత్రాన్ని ప్రేరేపించి, భూమిని విస్తృత పర్చాడు." 1

"ఓ వరుణుడా, చూడాలను కోర్కెతో నేను చేసిన ఆ పాపం గురించి అడుగు తున్నాను. ప్రశ్నిస్తున్న నేను విద్వాంసులను అడిగాను, 'ఈ వరుణుడు నీపై కినుక వహించి వున్నాడు' అని కవులు ఒకే రీతిని ఒకే మాట నాకు చెప్పారు." 3

"నేను నీయొక్క జ్యేష్ఠ సఖుడవగు స్తోతను. నన్ను నీవు చంపదలచావు. నేను చేసిన పాపమేమిటి? ఓ శక్తివంతుడా, ఆ పాప మేమిటో చెప్పుము. నేను నీ వద్దకు వందన పురస్సరంగా వస్తాను." 4

"పాప రహితులై దాసునివలె వరుణదేవుని సేవించండి. అజ్ఞానులమైన మనలను ఆ దేవత మేలుకొలుపుగాక. ఆ మహాకవి వరుణుడు స్తుతికర్తకు ధనం యిచ్చుగాక." 7

భరద్వాజుడు దేవతా సముదాయంలో వరుణుని పేరుమాత్రం చేర్చి వెట్టివాకిలిని టలాయించినట్లుగా దాటవేశాడు. విశ్వామిత్రుడు మాత్రం వరుణునిపట్ల కొంత

ఔదార్యం చూపాడు. కాని వసిష్ఠుడు చూపినంతగా చూపలేను. ఈ కారణం చేతనే వసిష్ఠుని మైత్రావరుణు డనలేదుగదా! విశ్వామిత్రుడు తన మండలంలోని చివర సూక్తంలో (3-62) ఇంద్రమిత్రులతోపాటు వరుణుని స్తుతించాడు.

"ఓ ఇంద్ర వరుణులారా, ధనం కాంక్షించు యీ గొప్ప యజమాని మిమ్ములను సదా రక్షణకొరకు ఆహ్వానిస్తున్నాడు. మరుత్తులారా, ద్యౌ, పృథ్వీలతో మీరునూ మా స్తుతిని వినండి." 2

"ఓ సుకర్ములైన మిత్రా వరుణులారా! మీ యిరువురు మా గోశాలను నేతితో నింపుడు. మా నివాసములను మధువుతో నింపుడు, తడుపుడు." 16

"వరుణిని గురించి వసిష్ఠుడు చెప్పిన సూక్తాన్ని మేము పైన పేర్కొని వున్నాం. (7-34-22)

17. వాయువు : విశ్వామిత్రుని పుత్రుడు మధుచ్ఛందుడు వాయు దేవుని స్తుతించాడు. (1-2)

"ఓ సుందరమైన వాయుదేవా! రమ్ము. సోముని అలంకరించాం. నీవు సోమపానం చేసి మా స్తుతిని వినుము." 1

"ఓ వాయుదేవుడా, సోమం వడగట్టునప్పుడు ఎరుకగల స్తుతికర్తలు విన్న ఉక్థలతో బాగా స్తుతిస్తున్నారు." 2

18. వాస్తోష్పతి : గృహముల దేవతను యీ పేరుతో పిల్చేవారు. వసిష్ఠుడు యిట్లు స్తుతించాడు. (7-55)

"ఓ రోగనాశక వాస్తోష్పతీ, నీవు అన్ని రూపాల్లోను ఆవేశించి మాకు సుఖం చేకూర్చు సఖుడవు కమ్ము." 1

ఓ శ్వేత, పింగళ సరమా పుత్రా, నీవు దంతాలను చూపునప్పుడు అవి పెదవులకు దగ్గరగా ఋష్టులవలె బయటకువచ్చి అందంగా వున్నాయి. నీవు నిద్రించుము." 2

19. విశ్వకర్మ : ఋగ్వేదంలోని విశ్వకర్మకూ, తర్వాత కాలంలో వచ్చిన దేవశిల్పి విశ్వకర్మకూ ఏమీ సంబంధంలేదు. ఋగ్వేదంలో అన్నిటికంటె చివరవున్న పదవ మండలంలో విశ్వకర్మ వర్ణన వుంది. ఆ వర్ణనలనుబట్టి అతడు విశ్వ నిర్మాతగ కన్పట్టుతున్నాడు. భువన పుత్ర విశ్వకర్మ యీ సూక్తం ఋషి (10-81).

అతడు కల్పిత ఋషిగా తోస్తున్నాడు. భువనము పేరు సూక్తం మొదటి మంత్రం నుండి గ్రైకొనబడింది. యీ సూక్తంలో నాల్గుసార్లు విశ్వకర్మ పేరు వచ్చింది.

"ఈ భువనము లన్నిటికీ హవనం చేయుహోత, ఋషి. మన తండ్రి విశ్వకర్మ కూర్చొన్నాడు. ధనం కాంక్షిస్తూవున్న ప్రధమ భక్తులందు అతడు ఆశీస్సుల ద్వారా ప్రవేశించాడు." (10-81-1)

"అప్పుడు ఆధార మేమిటి ? ఆరంభ మేమిటి ? పని ఎట్లు జరిగింది ? విశ్వదర్శి విశ్వకర్మ భూమిని నిర్మించి తన మహిమచేత ద్యౌను నిర్మించాడు." 2

"అన్నివైపుల చక్షువులు కలవాడు, అన్నివైపుల ముఖాలు కలవాడు, అన్నివైపుల పాదాలు కలవాడు ఆ దేవుడు ఒక్కడే. ద్యౌను, భూమిని సృష్టించి తన రెండు బాహువులు అను రెక్కలతో కంపింపజేస్తున్నాడు." 3

"ఆ విశ్వకర్మ ఏ వనంనుండి, ఏ వృక్షం నుండి ద్యావృథ్వీలను నిర్మించాడు? ఓ మనీషులారా, భువనములను ధరించి నిల్చొనివున్న ఆ పురుషు డెవరో మీ మనస్సులను ప్రశ్నించండి." 4

20. విష్ణువు : ఇతడు ఋగ్వేదంలోని దేవతల్లో ఒకడు. ఋగ్వేదంలోని కపర్ది రుద్రుని నుండి తర్వాత కాలంలో శివుని కల్పించినట్లుగానే యీ విష్ణు మంత్రములను ఆధారంగా చేసుకొని తర్వాత కాలంలో విష్ణువును కల్పించారు. కాని వైదిక ఆర్యులకు పౌరాణిక లేక మహాభారత విష్ణువుతో, రుద్రునితో ఏమీ సంబంధం లేదు. వసిష్ఠుడు ఒక సూక్తంలో (7-100) విష్ణుని స్తుతించాడు.

"దానమందు కోర్కెగల పురుషుడు అనేకులచే స్తుతించబడిన విష్ణువుకు హవిస్సు యిస్తున్నాడు. విష్ణుని మనస్సుతో సేవించువానికి శీఘ్రంగా ఫలితం లభిస్తుంది" 1

"శత కిరణాలతో కూడిన విష్ణువు తన మహిమచేత పృథ్విని మూడుసార్లు చుట్టాడు, అతడు వృద్ధుల్లో అతివృద్ధుడు, శక్తివంతుల్లో అతి శక్తివంతుడు అగుగాత. అతడు దీప్తిమంతు డవుగాత" 3

"ఈ విష్ణువు మనువుకు క్షేత్ర మీయవలెనను తలంపుతో యీ పృథ్విని లంఘించాడు. ఇతన్ని స్తుతించు జనులు అచలురై వున్నారు. ఇతడు విశాలమైన క్షితిని సుందరమైన జనులతో ఏర్పరచాడు." 4

21. సరస్వతి : సరస్వతి వేదంలో ముఖ్యమైన దేవత. తర్వాత కాలంలో పవిత్రతకు ప్రసిద్ధికెక్కిన గంగానది వలెనే కురుక్షేత్రంలో ప్రవహించే యీ సరస్వతీ నదికూడ ఋగ్వేద ఆర్యులకు పవిత్రమైన దేవత. సరస్వతి శబ్దానికి అర్థం సరము (జలము) కలది. గంగానది తన ప్రవాహమును వదలి దేవతగా వుండలేను. కాని సరస్వతి నదియే కాదు దేవతకూడాను. వసిష్ఠ విశ్వామిత్రులను ఋక్కులవలన యీ సరస్వతీ రూపం కొద్దిగా తెలుస్తుంది. వసిష్ఠుడనేక సూక్తాల్లో (7-95-96) సరస్వతిని స్తుతించాడు. ఆ ఋషి మొదటి సూక్తంలో యిట్లుచెప్పాడు.

"ఈ సరస్వతి పాషాణ దుర్గంవలె ప్రవాహంతోకూడి ప్రవహిస్తున్నది. ఈ సింధువు రథివలె తన మహిమచేత ఇతర నదులను బాధిస్తున్నది." 1

"గిరులనుండి సముద్రంకు పోవు నదుల్లో పవిత్రమైన యీ సరస్వతి అద్వితీయమైంది మానవులకు వివిధిగా భువనములనుండి ధనం, నేయి, పాలు, యిస్తుంది." 2

"ఓ సరస్వతీ, సుభగా ! ఈ వసిష్ఠుడు నీ కొరకు యజ్ఞద్వారాన్ని తెరుస్తున్నాడు. ఓ శుభ్రవర్ణా, ముందుకు రమ్ము. స్తోతకు అన్నం యిమ్ము. నీవు ఎల్లప్పుడు స్వస్తితో కాపాడుము." 6

తర్వాత సూక్తంలో వసిష్ఠుడు యిలా చెప్పాడు. (7-96):

"ఓ వసిష్ఠుడా, నదుల్లో బలవతి అయిన సరస్వతిని స్తుతించుము. ద్యౌ పృథ్వీల్లందు సరస్వతినే సుందర స్తోమములతో పూజింపుము." 1

"ఓ శుభ్రవర్ణా, నీ మహిమచేత పురజనులు (దివ్య, మానుష) రెండు రకాలైన అన్నం పొందుతున్నారు. మరుత్తుల సఖి, రక్షిక, సరస్వతి ధనికుల ధనాన్ని మాకు పంపుగాక." 2

విశ్వామిత్రుడు సరస్వతీ మహిమను మిక్కుటంగా కీర్తించాల్సివుంది. ఆయన కులస్తులు కుశికులు సరస్వతీ తటాన వున్నట్లుగ చెప్పబడుతున్నారుగదా. కాని అతడు పక్షపాతం చూపలేదు ఒకచోట. ఇళా భారతితోపాటు సరస్వతిని, సారస్వతులను పేర్కొన్నాడు (3-4-8). ఈ సంగతి ఇగా ప్రకరణంలో మీరు చదివి వుంటారు

భరత గణాల ఋషులైన దేవశ్రవ, దేవవాతులు ఒకే చోట సరస్వతితోపాటు దాని సహాయక నదులరెంటిని ఎన్నించారు. (3-23-4)

"ఓ అగ్నీ మేము అన్నస్థానమైన వుత్తమ పృథ్విలో సదా సుదినం కొరకు నిన్ను స్తుతిస్తున్నాం. దృషద్వతి, ఆపయా, సరస్వతీ తట ప్రజలకు ధనంయిస్తూ ప్రకాశించుము" 4

ఈ ఋక్కుల్లో వచ్చిన దృషద్వతి, ఆపయా, సరస్వతులు హరియూపాలో ప్రవహించు పుగ్గర, మరకంచా, సరస్వతీ నదులని మేము ఇదివరలో చెప్పాం.

భరద్వాజుడు చెప్పిన ప్రకారం చూస్తే సరస్వతియే దివోదాసుని ప్రసాదించి నట్లు కూడ తెలుస్తుంది. (6-61)

ఇయమదా దద్రభ సమృణచ్యుతం
దివోదాసం బధ్ర్యశ్వా య దాశుషే ।
యాశ్వశ్వన్త మాచఖాదావసం పణిం
తాతే దాత్రాణి తవిషా సరస్వతి ॥ 1

"ఈ సరస్వతి బధ్ర్యశ్వతనకు నాకు ఋణమోచక అది భయంకర దివోదాసు పుత్రుని ప్రసాదించింది. దానహీనులైన పణిని భక్షించినట్టి ఓ సరస్వతీ, నీ ఆ దాన ములు బలిష్ఠములైనవి."

"ఈ సరస్వతి మట్టిని త్రవ్వువానివలె తనశక్తితో, వేగయుక్త తరంగాలతో పర్వత పాదభాగాలను భగ్నం చేస్తూవుంది. తటాలను ధ్వంసంచేయు సరస్వతిని రక్షణకొరకు మేము స్తుతులద్వారా, గీతములద్వారా ఆహ్వానిస్తున్నాం." 2

"ప్రియతమ, సుపేవిత, ఏడ్గురు తోబుట్టువులుకల, సుప్రసన్నురాలు సరస్వతీ మా స్తుతులకు యోగ్యురాలగుగాత." 10

"ఓ సరస్వతీ, మాకు వుత్తమ ధనాన్ని తెచ్చి ఋమ్ము మాకు హాని కల్గింత వద్దు. జలంతో మాకు వినాశనం చేయార్చపద్దు. మా మిత్రత్వాన్ని పొరుగును స్వీక రించుము. నీ క్షేత్రమందు మేము అరణ్యంలో దారి తప్పకుండా వుందుం గాత" 14

22. సవిత : గాయత్రీ ఛందస్సులో విశ్వామిత్రుని ద్వారా రచింపబడిన సవిత స్తుతి ప్రసిద్ధమైంది. ఎనిమిది అక్షరములు కల మూడు పాదములున్న ఏ గీతాన్ని అయినా గాయత్రి అంటారు. కాని సవిత మహిమలు కీర్తించుట వలన యీ ఋక్కుకు సావిత్రి లేక గాయత్రి అను పేరు వచ్చింది. (3-62-10)

తత్ సవితు ర్వరేణ్యం భర్గో దేవస్య ధీ మహి ।
ధియో యోనః ప్రచోదయాత్॥

"సవితృ దేవుని ఆ మహా తేజస్సును మేము పొందెదంగాక. ఆ సవిత మా బుద్ధిని దీప్తవంతం చేయుగాక."

భగవంతుడగు సవితృదేవుని నుండి మేము అన్నాన్ని అడుగుతున్నాం."11

"ఆ సుకర్ముడగు సవితాదేవుడు సవనం కొరకు తన బంగారు బాహువులను పైకి ఎత్తుతున్నాడు. మహా యువకుడు, సుదక్షుడు అయిన సవిత లోకముల రక్షణ కొరకు ఘృతయుక్తమైన తన చేతులను ప్రేరేపించుచున్నాడు." (6-71-1)

"బంగారు జిహ్వగల ఓ సవితా, హింసారహితమైన, కల్యాణదాయకమైన రక్షణల ద్వారా నేడు మా నివాసాలను నలువైపుల నుండి కాపాడుము. నూతన సుఖం కొరకు రక్షించుము. చెడును కోరువారు మాకు శాసకులుగా వుండకుండా వుందురు గాక" 3

ఓ సవితా, నేడు మాకు ధనం యిమ్ము. రేపు మాకు ధనం యిమ్ము. ప్రతి దినం మాకు ధనం యిమ్ము. ఓ దేవుడా, నీవు చాల ధనానికి, గృహానికి యజమానివి. ఈ స్తుతిద్వారా మేము ధనానికి భాగస్వాములం మవుదుముగాక." 6

23. సోముడు : ఋగ్వేదములోని తొమ్మిదవ మండలం సోముని మండలం. భరద్వాజుడు, వసిష్ఠుడు, విశ్వామిత్రుడు - యీ ముగ్గురు ఋషులు సోముని ప్రశంసిస్తూ సూక్తాలను రచించారు. సోమం లంగు జాతికి చెందిన మొక్క. అది మత్తును కల్గిస్తుంది దానికి ఋషులు దివ్యత్వాన్ని కల్పించారు. పేయమైన సోమాన్ని, అందుండే సోమదేవత గుణాలను కూడ వర్ణించారు. ఇంద్రుడు, అగ్ని, తదితర దేవతలు సోమాన్ని బాగా ప్రేరేపించేవారు. భరద్వాజుడు సోమ ప్రకరణంలో సోముని మహిమను కీర్తించాడు. అతని పుత్రుడు గర్గఋషి (6-47) ఒకే సూక్తం సోముని గురించి రచించాడు. అందు పేయమైన సోమం యొక్క గుణాలు కూడ వర్ణించబడ్డాయి.

"ఇది నిశ్చయంగా రుచిగా వుంది. ఇది తీవ్రమైన తీపి కల్గివుంది. ఇది రసవంతమైంది. దీన్ని త్రాగే యింద్రుని యుద్ధంలో ఎవ్వరూ ఓడించలేరు."-1

"ఇది రుచి కలది. మిక్కిలి మత్తును కల్గిస్తుంది. దీనిని సేవించి యింద్రుడు వృత్ర యుద్ధంలో మత్తిల్లాడు. శంబరుని 99 పురాలను ధ్వంసం చేశాడు."-2

"పృథ్వీ విస్తారమును, ద్యౌ శరీరాన్ని నిర్మించినవాడు సోముడు. సోముడు మూడు వస్తువులకు (ఔషధములు, జలము, గోవులు) అమృతం యిస్తాడు. అతడు విస్తృత ఆకాశాన్ని ధరిస్తున్నాడు" - 4

వసిష్ఠ, విశ్వామిత్ర, వామదేవులు సోముని ప్రశంసిస్తూ దాన్ని దేవతల దివ్య పానంగా వర్ణించారు.

అసిత, దేవల ఋషులు యిద్దరు అను సందేహం వైదిక పరంపరలో వుంది. కాని ఋషి అసలు పేరు దేవలుడు. బాగా నల్లగా వుండుటచేత అతన్ని అసితు డన్నట్లుగా తోస్తుంది. ఆయన్ని బౌద్ధ పిటకాలుకూడ పేర్కొన్నాయి. మజ్ఝిమ నికాయంలో అశ్వలాయన సూత్రంలో (2-5-3) బుద్ధుడు అసిత దేవలుని ఒక మహా ఋషిగా పేర్కొన్నాడు. దేవలుడు సప్త బ్రాహ్మణ ఋషుల గర్వాన్ని అణచాడు. అప్పుడు వారందరు ఆయనపై కోపించి శపించారు. కాని ఆ శాప ప్రభావం అతని మీద కించిత్తుకూడ పడలేదు. అప్పుడు ఋషులు 'మీరెవ్వరు?' అని ప్రశ్నించారు.

"మీరు అసిత దేవల ఋషి పేరు విన్నారా?" అను సమాధానం వచ్చింది.

"అవును, అర్యా."

"అతణ్ణి నేనే."

అతడు కశ్యప గోత్రజుడు. సోమాన్ని గురించి విశేషంగా రచించిన ఋషి తొమ్మిదవ మండలంలో అతడు 19 సూక్తాలను (6-24) రచించాడు.

తొమ్మిదవ మండలమంతా సోముని కీర్తించు సూక్త సంగ్రహం. ఆ మండలంలోని ఋషులు: (1) విశ్వామిత్ర పుత్ర మధుచ్ఛందుడు. (2) మేధాతిథి (3) కణ్వ అంగిరసుడు, (4) అజీగర్త పుత్ర శునశ్శేపుడు, (5) హిరణ్యస్తూప అంగిరసుడు (6) అసిత దేవలుడు (7) దృఢచ్యుతుడు (8) దృఢచ్యుత పుత్ర ఇధ్మవాహుడు (9) నృమేధ అంగిరసుడు (10) ప్రియమేధ కాణ్వుడు (11) బిందు అంగిరసుడు (12) రహూగణ గోతమపిత (13) శ్యావాశ్వ ఆత్రేయుడు ~~(14) శ్యాత అ...(15)~~ ప్రభువసు అంగిరసుడు (16) బృహస్పతి అంగిరసుడు (17) మేధ్యాతిథి కాణ్వుడు (18) అయాస్య అంగిరసుడు (19) కవిభృగు పుత్రుడు (20) ఉచథ్య అంగిరసుడు (21) అయాస్య అంగిరసుడు (22) అమహీయు అంగిరసుడు (23) యమదగ్ని భార్గవుడు (24) నిధ్రువి కాశ్యపుడు (25) కశ్యప మరీచి పుత్రుడు (26) భృగు వరుణ పుత్రుడు (27) వైఖానసుడు (28) భరద్వాజ బృహస్పతి పుత్రుడు (29) భౌమ ఆత్రేయుడు (30) విశ్వామిత్ర గాధి పుత్రుడు (31) వసిష్ఠ మిత్రావరుణ పుత్రుడు (32) పవిత్ర అంగిరసుడు (33) వత్సప్రీ భలందన పుత్రుడు (34) రేణు విశ్వామిత్ర పుత్రుడు (35) ఋషభ విశ్వామిత్ర పుత్రుడు (36) హరిమంత అంగిరసుడు (37) కక్షీవాన్ దీర్ఘతమ పుత్రుడు (38) వసు భరద్వాజుడు (39) ప్రజాపతి వాక్పుత్రుడు (40) వేన భార్గవుడు (41) అకృష్ణ మాష ఆత్రేయుడు (42) సికతా ఆత్రేయి (43) అజ ఆత్రేయుడు (44) గృత్సమదుడు (45) ఉశనాకావ్యుడు

(46) నోధా గోతమ పుత్రుడు (47) ప్రస్కణ్వ కణ్వ పుత్రుడు (48) ప్రతర్దన దివోదాస పుత్రుడు (49) ఇంద్ర ప్రమతి (50) వృషగణుడు (51) మన్యుడు (52) ఉప మన్యుడు (53) వ్యాఘ్రపాద వాసిష్ఠుడు (54) శక్తి వసిష్ఠ పుత్రుడు (55) కర్ణ శ్రుత్ (56) మృళీకుడు (57) వసుక్రుడు (58) పరాశర శక్తి పుత్రుడు (59) వత్స అంగిరసుడు (60) అంబరీష వృషాగిర పుత్రుడు (61) ఋజిశ్వా భరద్వాజ పుత్రుడు (62) రేభ కాశ్యపుడు (63) అద్రిగుశ్యా వాశ్వ పుత్రుడు (64) యయాతి నహుష పుత్రుడు (65) నహుష మను పుత్రుడు (66) మను సంవరణ పుత్రుడు (67) విశ్వామిత్ర వాక్పుత్రుడు (68) ప్రజాపతి వాక్పుత్రుడు (69) పర్వతకాణ్వుడు (70) శిఖండిసీ కాశ్యపీ (71) నారద కాణ్వుడు (72) అగ్ని చక్షుపుత్రుడు (73) చక్షు మనుపుత్రుడు (74) మను అపపుత్రుడు (75) గౌరవీతిశక్తి పుత్రుడు (76) ఉరు అంగిరసుడు (77) ఊర్ధ్వసద్మా అంగిరసుడు (78) కృతయశా అంగిరసుడు (79) ధిష్ణ్య ఈశ్వర పుత్రుడు (80) త్ర్యరుణుడు (81) త్రసదస్యుడు (82) ఋణంచయుడు (83) అనానత పరుచ్ఛేప పుత్రుడు (84) శిశు అంగిరసుడు.

ఈ 84 ఋషులచేత రచింపబడిన సోమ స్తుతులు తొమ్మిదవ మండలం రూపంలో సంగ్రహింపబడ్డాయి. ఇందు ఒకవైపు భరద్వాజుని కంటె ప్రాచీన ఋషులు కూడ వున్నారు. రెండోవైపు వసిష్ఠుని పుత్రుడు శక్తి. అతని పుత్రుడు పరాశరుడు, గౌరవీతి రచించనవి కూడ వున్నాయి. విశ్వామిత్ర పుత్ర మధుచ్ఛందుని ఋక్కులతో తొమ్మిదవ మండలం ప్రారంభమైంది

6. పితృ దేవతలు మొదలైనవారు : ఆర్యులు యింద్రాది దేవతలనే కాకుండా తమకు ముందున్న పూర్వీకులను, పితరులను పూజించేవారు. వారంతా దేవతల లోకంలో వున్నారని ఆర్యులు విశ్వసించారు కూడ. యమ పుత్ర శంఖుడు కల్పిత నామంగా తోస్తుంది అట్లే వివస్వత్ పుత్ర యముడుకూడ కల్పిత ఋషియే. వీరిరువురు-అంటే తండ్రీ కొడుకులు పితరులను గురించి ఎక్కువగా స్తుతించారు. (10-14)

"అందరికంటె ముందుగా యముడు మన మార్గాన్ని తెలుసుకొన్నాడు. ఈ పచ్చిక బయలును మననుండి ఎవ్వరూ లాక్కోలేరు. మన పితరులు వెళ్ళినచోటుకు, అదే మార్గాన జనం పోతారు. -2

"కవ్యం (పితరులకు వుంచిన పూజా ద్రవ్యం) చేత మాతలి, అంగిరుల చేత (పురోహితులచేత) యముడు, ఋక్వాలు (ఋక్కుల) చేత బృహస్పతి వృద్ధి చెందారు.

దేవతలు ఎవరిని వృద్ధిచేసారో, దేవతలను ఎవరు వృద్ధిచేసారో వారు స్వాహాతోను పితృదేవతలు స్వధాతోను ప్రసన్ను లవుతున్నారు."—3

"ఓ యముడా! అంగిరులతో, పితరులతో నీవు వచ్చి యీ యజ్ఞమందు కూర్చొనుము. కవులు ప్రశస్తమైన మంత్రాలతో నిన్ను ఆహ్వానిస్తున్నారు. ఓ రాజా నీవు యీ హవిస్సుతో సంతృప్తి చెందుము."—4

"మా పూర్వీకులు వెళ్ళిన చోటుకు ఆ ప్రాచీన మార్గాలగుండా వెళ్ళుము. యమ. వరుణులను చూడుము. ఆ యిరువురు రాజులు స్వధాచే (చేసిన పనులు) ప్రసన్నులై వున్నారు."—7

ఓ యముడా! రక్షకులైన, మార్గ రక్షకులైన, మానవులను కాపాడునట్టి నాల్గుకన్నులు కల నీ రెండు కుక్కలను మా పితరుల రక్షణకు యిమ్ము. వీరికి క్షేమాన్ని కల్గిస్తూ రోగ రహితులుగా చేయుము." —11

"పొడవైన ముక్కు కల్గినటువంటి, ప్రాణ భక్షకులైనటువంటి, మిక్కిలి బలం కల్గిన యముని దూతలు ప్రజల వెనుక వెనుక నడుస్తారు. ఆ రెండు దూతలు సూర్యుని దర్శించుటకు యిక్కడ మాకు కళ్యాణప్రదమైన ప్రాణములను ప్రసాదించుగాక." —12

"యముని కొరకు సోమాన్ని పడకట్టుము. యముని కొరకు హవిస్సును హవనం చేయుము. అగ్నిదూత అలంకృతుడై యముని వద్దకు వెళ్ళుతున్నాడు" 13

"యమరాజా కొరకు అతి మధురమగు హవిస్సును హవనం చేయుడు. ప్రాచీన పథకర్తలగు ప్రాచీన ఋషులకు నమస్కారం." 15

యముడను కల్పిత నామధేయుడగు ఋషి తన సూక్తంలో యముని మహిమను కీర్తించాడు. ఆయన కల్పిత పుత్రుడగు శంఖుడు పితృదేవతలను గురించి వర్ణించాడు. (10-15)

"సోమపానం చేయుచున్న ఉత్తమ ఉధ్యమ, సాధారణ పితరులు దయను చూపుదురు గాక. సజ్జనులు, సత్యమెరింగినవారు అయిన పితరులు పిల్చినప్పుడు మాకు రక్షణ నొసంగెదరుగాక" — 1

ముందుగాని, తర్వాతగాని చనిపోయిన పితరులకు. పార్థివలోక మందుగాని, ప్రజల మధ్య యందుగాని కూర్చొన్న పితరులకు నేడు నమస్కారం చేస్తున్నాం"-2

"పితరులారా, ఎర్రని జ్వాల దగ్గర కూర్చొన్న దాతకు ధనం యివ్వండి. పుత్రుని యివ్వండి. అతని గృహమందు ఉల్లాసం కల్గించండి."-7

"మా పూర్వీకులైన పితరులకు వసిష్ఠులు సోమపానం కోరియున్నారు. వారితో పాటు యముడు హవిస్సును పొంది సఖుడగుగాక, సంతుష్టుడగుగాక."-8

"అగ్నిచేత దగ్ధులైనవారు. అదగ్ధులైనవారు, ద్యూలోక మధ్యలో స్వధాచే సంతుష్టులైనారు. ఓ అగ్నీ, ఆ పితరులకు యధాశక్తి ప్రాణంతో కూడిన శరీరం యిమ్ము- 14

ఈ ఋక్కులు ఆర్యులకు పితరులపట్లవున్న నమ్మకాలను తెల్పుతున్నాయి. పితరులకు యమ దేవునితో సంబంధ ముందేదనీ, వారు ఆ దేవుని దయకు పాత్రులనీ ఆర్యులు అనుకొనేవారు. వారు తమ బిడ్డలు యిచ్చే పూజలను అందుకొనుటకు వచ్చేవారని వారు విశ్వసించారు. యమునికి నాల్గు కళ్ళువున్న రెండు కుక్కలు వున్నాయి. అవి పరలోక యాత్రికులకు చాల భయంకరంగా వుండేవి. పొడవు ముక్కులు కల ప్రాణాలను తీసే యముని దూత లిద్దరు కూడ భయంకరంగా వుండేవారు. దేవతలకు స్వాహా రూపంలోవున్న అన్నం ఆధారం. పితరులకు స్వధా (తాను చేసిన పనులు) అనేవి ఆధారములు.

**4. కామ్య కర్మలు :** ఋగ్వేద ఋషులకు, వారి ప్రాచీన వంశీకులకు నిష్కామ కర్మలతో పనిలేదు. "సురులు, నరులు, మునులు స్వార్థ బుద్ధితో ప్రేమిస్తారు" అని తులసీదాసు చెప్పిన యీ వాక్యం మన ప్రాచీన ఋషులకు వర్తిస్తుంది. వారు దేవతల కొరకు యజ్ఞంగాని, హవనంగాని, సోమపానం గాని, చేస్తూ చేయిస్తూ ఆ దేవతలముందు క్రమంగా తమ కోర్కెలను వుంచేవారు. 'దేహిమే దదామితే' (ఇచ్చుకో వాయనం, పుచ్చుకో వాయనం) అన్నదే వారి అభిమతం. బృహస్పతి పుత్రుడగు భరద్వాజుడు అగ్నిని ప్రార్థించాడు. ఆ ఋక్కులను చదివితే ఆర్యుల మనోభావాలు తెలుస్తాయి. (6-1)

"ఓ అగ్నీ నీవు నీ తేజస్సుద్వారా ద్యావ పృథ్వులను కప్పావు. నీవు యశస్సులకంటె యశస్సు కలవాడవు. విజయుడవు, గొప్పశక్తిని, శాశ్వతమైన ధనాన్ని యిస్తూ ప్రకాశించుము. (6-1-11)

"ఓ వసూ (ధనికుడా), మాకు నీవు మానవులవలె ధనం యిమ్ము. మా పుత్రులకు, పౌత్రులకు విరివిగా పశువుల నిమ్ము మొట్టమొదట మేము కోరినటువంటి ఆ భూరి ధనాన్ని, భద్రయశాన్ని మాకు ప్రసాదించుము." (6-1-12)

"ఓ అగ్నిరాజా, నీవలన మాకు అనేక రకాల ధన ధాన్యాలు ప్రాప్తించుగాక ఓ సర్వప్రియుడా, అగ్నీ. నీవు శ్రేష్ఠమైనరాజావు. నీవద్ద చాలా ధనం వుంది." (13)

భరద్వాజుడు తనకు నూరు ఏండ్లు జీవితం ప్రసాదించమని అగ్నిని కోరాడు. (6-8)

"ఓ అగ్నీ, నీవు మావద్దకు సుఖంగా బాధలేని ధన మార్గాల ద్వారా రమ్ము మమ్ము కష్టాలనుండి కాపాడుము. స్తోతలకు. పూరులకు సుఖం ఒసంగుము. మాకు అందమైన పూరవీర సంతానం యిమ్ము. శత శర తులు మేము ఆనంద పూర్వకంగా జీవింతుము గాక." (4)

ఆయన అగ్నిని మరియొకటి కోరాడు. 6—5

"ఓ అగ్నీ, నీ సహాయంచేత మేము అ కోర్కెను పొందెదముగాక. ఓ ధనవంతుడా. మేము వీరులైన సంతానంతో ఐశ్వర్యాన్ని పొందెదంగాక. శక్తియందు అభిలాష కల్గిన మాకు శక్తి లభించుగాక. ఓ అజరుడా, మాకు నీ యువ ప్రతాపం లభించుగాక." 7

ఇంకను ఆయన కోరాడు : ఓ యింద్రుడా, నీవు స్తోతవద్దకు రక్షణ కొరకు రమ్ము. గృహమందును, అరణ్యమందును శత్రువులనుండి కాపాడుము. మేము అందమైన వీరులైన సంతానంతో నూరు శరత్తులు ఆనందపూర్వకంగా జీవించెదము గాక." —6-24-10

వశిష్ఠుడుకూడ అదిత్య దేవతలను స్తుతిస్తూ నూరు సంవత్సరముల జీవితాన్ని కోరాడు. —7-66

"సర్వశ్రేష్ఠుడు, చరాచరములకు పతి, సమస్త ప్రజలకు సమీపవర్తి సూర్యుని బంగారు రధంపై విడుకొని శుభముకొరకు ఏడ్గురు తోబుట్టువులు (ఏడు నదులు) తీసుకొని పోతున్నారు. 15

"అదిగో దేవహితైషి శ్వేతనేత్రం వుదయిస్తూవుంది. మేము అతన్ని నూరు శరత్తులు చూచెదంగాక — మేమునూరు శరత్తులు జీవించెదంగాక" 16

వసిష్ఠుడు మరుత్తులనుకూడ స్తుతించి తన కోర్కెలను సఫలం చేయమన్నాడు. 7—59

"సుగంధం గలవాడు, పుష్టిని యిచ్చువాడు. అయిన త్ర్యంబకుని మేము స్తుతిస్తున్నాం. అతడు నన్ను రేగుపండువలె బంధంనుండి ముక్తుని చేయుగాక. అమృతంనుండి కాదు." 12

వసిష్ఠుడు మరల వరుణుని స్తుతించాడు."—7-88

"దృఢమైన యీ భూములందు నివసించు మా పశువులను వరుణుడు విడిపించుగాక. మేము అదితిని సహాయం చేయమని కోరుతున్నాం. మమ్ములను ఎల్లప్పుడు క్షేమపూర్వకంగా కాపాడుము."—7

విశ్వామిత్రుడు ఒకసారికంటె ఎక్కువ పర్యాయాలు ప్రార్థించాడు. (3-30-22, 3-31-22)

"శీఘ్రగామి, ధనవంతుడు, శ్రేష్ఠుడు, నాయకుడు, శ్రోత, ఉగ్ర శత్రుఘాతకుడు యింద్రుని యీ వచ్చిన యుద్ధమందు రక్షణకై యజ్ఞానికి ఆహ్వానిస్తున్నాను." 10

వామదేవుడు ఇంద్రుని స్తుతించాడు—(4-30)

"ఓ వృత్రహంతా ! నీవు విడువబడిన గ్రుడ్డివానిని, కుంటివానిని కాపాడితివి. నీవు యిచ్చిన ఆ సుఖం అలభ్యమైంది"— 19

దివోదాసు పుత్రుడగు పరుచ్ఛేపుడు పిశాచాలనుండి కాపాడమని ఇంద్రుని ప్రార్థించాడు. (1-133)

"ఓ యింద్రా, అరచేటటువంటి పిశంగ వర్ణంగల పిశాచాన్ని నాశనం చేయుము. రాక్షసుల నంతరిని సంహరించుము.—5

సూర్యా అను పేరుగల స్త్రీ ఋషియో లేక పురుష ఋషియో భార్యను కోరుతూ స్తుతించాడు.- (10-85). "పతి పత్నులారా, మీరిరువురు యిక్కడే వుండండి. విడిపోవద్దు దీర్ఘాయువులు కండు, పుత్ర పౌత్రులతో ఆడుకొంటూ ఆనంద పడుతూ యింటిలోనే వుండండి". 42

5. పూజా ద్రవ్యములు : దేవతలను సంతృప్తి పరచుటకు వ్యవసింధు ఆర్యులవద్ద రెండు చిట్కాలున్నట్లు పైన మేము పేర్కొని యున్నాం. ఒకటి అగ్నిలో హోమం చేయుట. రెండు సోమాన్ని తయారుచేసి చెంబుల్లోను, కడవ

ల్లోను వుంచి దేవతలకు అర్పించుట. హోమ సామాగ్రి అనేక రకాలుగా వుంటుంది. విశ్వామిత్రుని ఋక్కుల ద్వారా మనకు ఎన్నో వస్తువులను గురించి తెలుస్తుంది. 3-28

"ఓ అగ్నీ, నీవు స్తుతుల నందుకొనుటలో ధనికుడవు, సర్వజ్ఞుడవు. మా ప్రాతఃకాల యజ్ఞమందు హవిస్సును (పురోడాశమును) స్వీకరించుము." 1

"ఓ అగ్నీ, పక్వమైన, వరిష్కృతమైన పురోడాశం సిద్ధంగా వుంది. ఓ యువక శ్రేష్ఠుడా, దాన్ని స్వీకరించుము."—2

"ఓ సాహస పుత్రా, నీవు యజ్ఞమందున్నావు. ఓ అగ్నీ, దినాంతమందు హవనం చేయబడ్డ పురోడాశం ఆరగించుము."—3

"ఓ కవీ, సర్వజ్ఞా! మధ్యాహ్నకాల యజ్ఞంలో పురోడాశం ఆరగించుము. ఓ అగ్నీ, యజ్ఞమందు ధీరవంతులు నీ సౌభాగ్యాన్ని నష్టపర్చలేరు."—4

"ఓ సాహస పుత్ర అగ్నీ, తృతీయ సవనమందు సిద్ధముచేయబడిన పురోడాశం స్వీకరించుము. ఓ అవినాశీ, రత్నయుక్తుడు జాగరూకుడు అయిన సోముని స్తుతిద్వారా అమరదేవుల వద్దకు తీసుకుపొమ్ము."—5

"ఓ అగ్నీ, నీవు వర్ధమానుడవు. సర్వజ్ఞుడవు. దినాంతమందు హోమం చేయబడ్డ పురోడాశం స్వీకరించుము —6

దేవతల కొరకు హోమం, సోమపాన క్రియలు మూడు వేళలందు జరిగేవి. వాటిని మూడు సవనము లనేవారు. ఉదయం జరిగేదాన్ని ప్రాతః సవనమనీ, మధ్యాహ్నం జరిగేదాన్ని మధ్యందిన సవనమనీ, సాయంకాలం జరిగేదాన్ని తృతీయ సవనం లేక సాయం సవనమనీ అనేవారు. విశ్వామిత్రుడు పై సూక్తంలో మూడు సవనములను పేర్కొన్నారు. అనంతర కాలంలో పురోడాశాన్ని పాలలో వండిన బియ్యపు పాయసం అన్నారు. కాని సప్తసింధు ఆర్యులు బియ్యం గురించి ఎక్కడా చెప్పలేదు. దీని అర్థం సప్తసింధులో బియ్యం లేదనికాదు. మొహింజెదారో, హరప్పా నివాసులు బియ్యం తినేవారు. ఈ విషయం అక్కడి త్రవ్వకాలవల్ల తెలుస్తూవుంది కాని నేటి పంజాబీయుల మాదిరిగానే మూడు వేల సంవత్సరాలకు పూర్వమున్న ఆర్యులు కూడ బియ్యాన్ని వుపేక్ష భావంతో చూసే వారనిపిస్తుంది.

యవలు, పాలు కలిపి తయారు చేసిన హవిస్సును విశ్వామిత్రుడు పేర్కొన్నాడు.—3-42.

"ఓ యింద్రా, నీవు మా కోర్కెలను నెరవేర్చువాడవు. నీవు వచ్చి యీ గవాశిరం, యవాశిరం త్రాగుము."–7

"ఓ యింద్రుడా, సోమం త్రాగుటకు నిన్ను మా యింటికి ఆహ్వానిస్తున్నాను. ఈ సోమం నీ హృదయాన్ని ప్రసన్నం చేయుగాత."–8

"ఓ ఇంద్రుడా, కుశికులమగు మేము నీ రక్షణకోరి వడకట్టిన సోమం త్రాగ వలసిందిగా సనాతనుడవగు నిన్ను ఆహ్వానిస్తున్నాం "–9

పాలలో వండినదాన్ని ఆశిరమనేవారు. యవల పాయసాన్ని యవాశిరమనీ, ఆవు పాలతో మాత్రమే వండినదాన్ని గవాశిరమనీ అన్నారు. ఇవి పురోడాశంలోని రకాలు.

విశ్వామిత్రుడు మరికొన్ని హవిస్సులను పేర్కొన్నాడు. 3-52

"ఓ ఇంద్రుడా, ఉదయమందు వేయించిన గింజలుగల కరంభం (పిండి)తో కూడినటువంటిన్నీ, అపూపము (రొట్టె) కల్గినటువంటిన్నీ, ఉక్త సహితమైనటు వంటిన్నీ సోమాన్ని స్వీకరించుము." – 1

"ఓ ఇంద్రుడా, వండిన పురోడాశం సేవించుము. తినుము. ఈ హవ్యం నీకుగాను వడ్డించడమైంది." – 2

"మా పురోడాశం తినుము. వధువును వరుడు స్వీకరించిన చందమున నీవు మా స్తుతులను స్వీకరించుము."–3

"ఓ ఇంద్రుడా, నీవు సనాతన ప్రసిద్ధుడవు. ప్రాతః సవనమందు మా పురో డాశం సేవించుము. నీ క్షమత మహత్తరమైంది." – 4

"ఓ యింద్రా యిక్కడ మధ్యాహ్న సవనమందు వేయించిన గింజలు (ధానా). సుందరమైన పురోడాశం నీకు రుచించుగాక. శీఘ్రగాములగు వృషభములవలె గాయక స్తోతలు స్తుతులద్వారా నిన్ను స్తుతిస్తున్నారు." – 5

"బహుస్తుతులు కలవాడు, తృతీయ సవనమందు మా ధానాను, ఆహుతి యివ్వ బడిన పురోడాశాన్ని భక్షించుము. ఓ కవీ, మేము తత్పరులమై స్తుతుల ద్వారా నిన్ను సేవిస్తూ ప్రార్థిస్తున్నాం." – 6

"ఆకు పచ్చని అశ్వములు కల పూషనుడా, నీ కొరకు కరంభం, ధానా తెస్తున్నాం. ఓ శూరుడా, విద్వాంసుడా, వృత్రహంతా, మరుత్తులతో గణ సమే తంగా అపూపం తినుము. సోమాన్ని త్రాగుము." – 7

ఇందు వేయించబడిన యవలగింజలు, వేయించిన యవలను పిండి తయారు చేసిన కరంభం (పిండి). యవల రొట్టె, సోమ రసం దేవతల పూజాద్రవ్యంగా తెలుపబడింది.

సోమం త్రాగవలసిందిగా ఇంద్రుని ప్రార్థిస్తూ విశ్వామిత్రుడు మళ్ళీ చెప్తున్నాడు. 3-53

"ఓ యింద్రుడా, ఆ సోమాన్ని త్రాగి వెళ్ళుము. నీ భార్య కళ్యాణి, నీ గృహం రమణీయమైంది. అక్కడ నీ పెద్ద రథముంది. అది దక్షిణతో గుర్రాలను విడచు స్థలం." – 6

వామదేవగౌతముడు ఇంద్ర పూజను గురించి చెప్పాడు – 4-32

"మేము వేయి గుర్రాలను, నూరు (ఖార్యముల) సోమాన్ని యివ్వండని యింద్రుని అడుగుతున్నాం." – 17

వెనుకటి కాలంలో అనేక మణుగుల బరువును ఖారి అనేవారు. పాళీ భాషలో కొలగారం కేకాదు, జోలిని కూడా ఖారి అనేవారు. ఇక్కడ వామదేవుడు నూరు సంచులను లేక నూరు మోపుల సోమాన్ని అడిగివుండవచ్చు.

సుతంభర ఋషి స్తుతివలన (5-14) (స్రువయందు) నెయ్యి తీసుకొని ఋషులు అగ్నిలో వేసేవారని తెలుస్తుంది.

"హవ్యం వహించుటకొరకు ఆ అగ్ని దేవుని సదా నేయి కారుచున్న స్రువలతో పూజిస్తున్నాం." 3

## 2. ప శు బ లి

అన్నం సోమాన్నేకాదు. పశువులనుకూడ దేవతలకు హవనం చేసేవారు. వీత హవ్య పుత్ర అరుణఋషి యజ్ఞ పశువుల కొన్నిటి పేర్లను పేర్కొన్నాడు.(10-91)

"అందు గుర్రాలు, వృషభాలు, ఆవులు, గొర్రెలు హవనం చేయబడుతున్నాయి. జలమును త్రాగుచున్నటువంటి, సోముని వీపుమీదుంచుకొన్న విధాత అగ్నికొరకు నేను హృదయ పూర్వకంగా సుందరమైన స్తుతులు చేస్తున్నాను."– 14

ఓ అగ్నీ, స్రువయందు నేయివలె, చెంబుయందు సోమం మాదిరి నీ నోటియందు హవిస్సు హవనం చేయబడింది. నీవు మాకు అన్న సమేతంగా ధనాన్ని, సుకీర్తులైన సంతాన సహితంగా గొప్ప యశస్సును ప్రసాదించుము"— 15

వసుక్ర ఐంద్ర ఋషి ఇంద్రుని కొరకు ఆబోతును, బలిసిన గొర్రెను వండిన సంగతి చెప్పాడు. 10-27

ఇంద్రుడంటున్నాడు : ఓ భక్తుడా, సోమ యజ్ఞంచేయు యజమానికి ధన మొసంగుట నా స్వభావం. ఎవడు హవ్యంకాని వస్తువు యిస్తున్నాడో, సత్యాన్ని నాశనం చేస్తున్నాడో, పాపియో, దొంగయో అట్టివానిని నేనే నాశనం చేస్తున్నాను"-1

ఋషి బదులు పలుకుతున్నారు— శారీరకంగా బలిసిన ఆదేవ భక్తులకు వ్యతిరేకంగా నేను యుద్ధానికి బయలుదేరి నప్పుడు నీ కొరకు బలిసిన గొర్రెను వండుతాను. అమావాస్యనాడు ఘాటైన సోమాన్ని త్రాగిస్తాను."- 2

ఆ ఋషియే యింకా చెప్పుచున్నాడు. (10-27)

"బలిసిన గొర్రెను వండినారు. జూద స్థలమందు పాచికలు విసిరివేయబడ్డాయి. రెండు పెద్ద ధనస్సులను తీసికొని అతడు పవిత్రుడై వెదకుచు జలంలో తిరుగుచున్నాడు "- 17

దీర్ఘతమ ఋషి మంచి వాసనతో వుడుకుచున్న గుర్రం సంగతి చెప్పుచున్నాడు. (10-162)

"ఉడుకుచున్న గుర్రాన్ని చూసినవారు "మంచి వాసన వస్తూవుంది. దేవతలకు అర్పించండి" అని అంటున్నవారు, గుర్రపు మాంసాన్ని తినుచున్నవారు వీరి సంకల్పం మాకు సహాయం చేయుగాక." 12

"మాంసం వండే ఉఖాను (కుండను) చూస్తున్నారు. రసాన్ని వేసే పాత్రలున్నాయి. పాత్రల వేడిని కాపాడే మూకుళ్ళు వున్నాయి. సూనా (పశువును వరుకుటకు వుంచిన పీట)పై అశ్వాన్ని అలంకరిస్తున్నారు.

ఆవులు, గుర్రాలు, గొర్రెలేకాదు, మేక మాంసాన్ని కూడ దేవతలకు అర్పించే వారని వేరుగా తెలుప పనిలేదు.

6. మంత్ర తంత్రాలు : ఋషులు దేవతలను హవిస్సుతో, సోమంతో ప్రసన్నుల గావించి ప్రియమైన వస్తువులను కోరుతూ అప్రియమైన వాటిని తొలగించమని ప్రార్థిస్తూ వుండేవారు. ఇంతేకాదు వారు మంత్ర తంత్రాలద్వారా కూడ తమకు కల్గే అరిష్టాలను నివారణ చేసుకొనుటకు ప్రయత్నం చేసేవారు. అయితే వేదకాలంలో తర్వాత వున్నంతగా వీనికి అంత ప్రభావంలేదు. ఆర్య స్త్రీలకు మంత్ర తంత్రాలంటే ఎక్కువ నమ్మకం వుండేది. వారు ఇందులకుగాను మూలికలను, చెట్ల వేళ్ళను

ఉపయోగించేవారు. ఇంద్రాణి అను పేరుతో ఒక కల్పిత స్త్రీ ఋషి సవతినుండి కాపాడవలసిందిగా యిట్లు చెప్పింది. (10-145)

"అత్యంత శక్తిగల ఈ వనస్పతి ఔషధాన్ని త్రవ్వుచున్నాను. దీనిచేత సవతిని బాధించగలను, భర్తను బాగా పొందగలను"—1

"ఓ ఉత్తాన పర్ణీ, దేవప్రియా, శక్తిదాయినీ, సుభగా, నీవు నా సవతిని పార ద్రోలుము, భర్తను కేవలం నా వానిగా చేయుము"—2

"ఓ ఉత్తరా (ఉత్తమ ఓషధీ)! నేను ఉత్తమురాలు కావాలి. సర్వోత్తమురాలు అవ్వాలి. నా సవతి వుందికదా. ఆమె నాకంటె హీనాతి హీనురాలు అవ్వాలి." 3

"ఆ సవతి పేరు ఎత్తను. ఆమె అంటే నాకు సరిపడదు. నేను సవతిని చాల దూరం పంపుతాను" 4

"ఓ ఔషధీ, నేను పరాక్రమం కలదానిని. నీవుకూడ మిక్కిలి పరాక్రమం కలదానివి. మన మిద్దరం శక్తివంతులమై నా సవతిని ఓడించాలి." 5

ఈ మంత్ర తంత్రాలు ఋగ్వేదంలో పదవ మండలంలోని కడపటి భాగము లందున్నవి. అధర్వవేదమందు మంత్ర తంత్రాలు, మంత్రముల ప్రయోగం ఎక్కువగా చెప్పబడింది.

7. పరలోకం : సప్తసింధు ఆర్యులు పునర్జన్మను విశ్వసించినట్లు తెలుపు వర్ణనలు ఋగ్వేదంలో ఎక్కడా కానరావు. చనిపోయిన తర్వాత చేసుకొన్న కర్మలనుబట్టి యితర లోకాలకు మృతులైనవారు వెళ్తారను నమ్మకం వారికి వుంది. యమలోకం, స్వర్గలోకం-యీ రెండు పరలోకాల సంగతి మనకు తెలుస్తుంది.

1. యమలోకం : ఈ యమలోకం గురించి మేము యమదేవతా ప్రకరణంలో తెల్పియున్నాం. ఆర్యులు యమలోకాన్ని గూర్చి యిట్లు చెప్పారు. (10-14-12)

యమలోకానికి మన ప్రాచీన పితరులు వెళ్ళారు. యమలోకానికి పోవు మార్గంలో వుండే నాల్గు కండ్లుకల భయంకరమైన వర్ణని కుక్కల సంగతికూడ అదే ప్రకరణంలో తెల్పియున్నాం.

2. స్వర్గం : కక్షీవాన్ ఋషి దేవభక్తులు దేవులవద్దకు వెళ్ళే సంగతి తెల్పారు. [1-125]

"దేవులను తృప్తిపర్చువారు దేవులున్నచోటుకు వెళ్ళుతారు. నాక [స్వర్గ] పీఠమును ఆశ్రయించి వుంటారు." అతనికి సింహ జంమును, నేతిని అర్పిస్తారు. ఈ దక్షిణ అతనికెల్లప్పుడు తృప్తిని కల్గిస్తుంది. 5

కశ్యప మరీచి ఋషి స్వర్గాన్ని సదా జ్యోతివంతమనీ, సుఖవంతమనీ, అమృతలోకమనీ వర్ణించారు [9-113-7-11]

అక్కడ ఆనందం, మోద ప్రమోదా లుండునని కూడచెప్పారు.

ఋగ్వేదమందు వర్ణించబడిన ధర్మకర్మలు, దేవతలు, పూజాద్రవ్యాలు స్వర్గ, పరలోకాలు గురించి సంక్షిప్తంగా యిందు చెప్పబడింది.

—•—

# పదహారవ అధ్యాయం

# జ్ఞాన - విజ్ఞానాలు

ఋగ్వేద ఆర్యులు తామ్రయుగం చివర భాగంలో వున్నారు. వ్యవసాయం కూడ వారికి జీవనాధారం. బట్టలునేయుట మొదలగు ఆనాటి శిల్ప విద్యలగూర్చి మేము ఇదివరలో తెల్పివున్నాం. వారికి ఆ విద్యలన్నీ తెలుసును.

## 1. వ్య వ సా యం

1. నాగలి కర్రు : ఆర్యులు వ్యవసాయాన్ని గురించి మేము ఇదివరలో వివరించివున్నాం. వారు నాగలిని వుపయోగించేవారని బుధహొమ్యుడు కూడా తెల్పాడు. [10-101]

"సీరా [నాగలి] ను దున్నుము, కాడిని సరిచేయుము. ఇక్కడ సిద్ధం చేయ బడిన పొలంలో విత్తనాలు నాటుము. మా స్తుతులతో పొలం సస్యశ్యామలంగా వుండుగాక. పండిన సస్యముల వద్దకు కొడవళ్ళు చేరుగాక." — 3

"దేవుల మతంకై ధీరులగు కవులు నాగలిని జోడించి కాడిని కట్టు తున్నారు." — 4

"మోటను తయారుచేయుము. మోకును వుంచుము. బాగా తడిపే తరుగని జలమున్న పెద్దబావి నీటితో మేము తడుపుతాము." — 5

"అన్నానికి కారణభూతమైన మోట, చక్కని మోకు, సుందరమైన పేద్యానికి అనువైన అక్షయ జలముకల బావి ద్వారా నేను పొలం తడుపుతున్నాను." — 6

"అశ్వాలను తృప్తిపర్చుము. మేలును పొందుము. క్షేమంగా పోవు రథాన్ని తయారుచేయుము. కొయ్యమోటతో రాతి చక్రాలపై నుండి పడపోతగుర్ధ కప్పి యున్న కుండను మంచినీటికై వింపుము." 7

వామదేవుడు 4-19 సూక్తంలో నాగలిని పేర్కొన్నాడు.

"ఇంద్రుడు వృత్రునిచంపి ప్రథమ వుషస్సులను, శరత్తులను, అర్ధగించబడిన సింధువులను విముక్తం చేశాడు. వలువై పుల సిద్ధం చేయబడి కట్టబడి వున్న సీరా భూమిపై ప్రవహించుటకు విముక్తం చేశాడు." 8

ఇక్కడ సీరా నదిగా చెప్పబడింది. నదిని, వాగులని వాటి ఆకారాన్నిబట్టి సీరాగా చెప్పారు.

2. నుయ్యి : పంజాబు వంటి ప్రదేశంలో అకాలంలో కూడ వ్యవసాయానికీ, మనుష్యులు, పశువులు త్రాగటానికి నేటి మాదిరిగానే బావులు అవసరమై వుండేవి. బావులు రెండు రకాలు-సహజములు, అప్రాకృతములు (త్రవ్వి తీసినవి). ఈ విషయం వసిష్ఠుని సూక్తం ద్వారా మనకు తెలుస్తుంది (7-49). "ఆకాశ జలము, త్రవ్వగా వచ్చిన జలము. లేక సహజమైన జలము. శుచి పవిత్రమైన సముద్రంకు పోవు జలమునకు అధిష్ఠాత్రులైన జల దేవతలు యిక్కడ మమ్ములను రక్షించుగాక." 2

భరద్వాజుడు కూడ నుయ్యిని గురించి చెప్పాడు. (6-54) "గోవులకు, అశ్వాలకు నష్టం కలుగకుండ వుండుగాక. వాటిని ఎవ్వరినీ కొట్టకుండా వుండురుగాక. అవి బావుల్లోను, గోతుల్లోను పడకుండ వుండుగాక. ఎటువంటి హాని లేకుండా అవి గోశాలకు తిర్గి వచ్చుగాక."-7

గృత్సమదుడు కూడ నుయ్యిని పేర్కొన్నాడు. (2-16)

"నీవు శత్రు నాశకుడవు. యుద్ధమందు నావవలె మేము మీ వద్దకు వస్తున్నాం. సవనమందు మంత్రాలతో పాటు వస్తున్నాం. మా యీ మంత్రాన్ని బాగా తెలుసుకోవలెను. మేము యింద్రుని ధనంతో బావి వలె తడుపుతాం.—7

3. కుల్య (కాలువ) : అనంతర కాలంలోనూ, నేడు కూడ చిన్నా, పెద్ద కాలువలను కుల్య అంటారు. కాని ఆ కాలంలో కుల్య అర్థం కూలము లేక తటముకలది. నదికి, కాలువకు ఆ పేరు వుండేది. కృష్ణ ఆంగిరసుడు 10-43 సూక్తంలో యిట్లు చెప్పాడు.

జలం సింధువైపుకు ప్రవహించునట్లు, కుల్య హ్రదం వైపుకు పారునట్లు సోమం యింద్రునివైపుకు ప్రవహించుగాక. దివ్య దాతద్వారా పంపబడిన వృష్టిజలం యవలను వృద్ధిచేస్తున్నట్లు యజ్ఞశాల యందు బ్రాహ్మణులు దీని యొక్క తేజస్సును వృద్ధి చేస్తున్నారు. 7

భౌమ అత్రేయుడు కూడ కుల్యను పేర్కొన్నాడు. (5-83)

"ఓవర్షన్యమా ! నీమహత్తర కోశం మేఘాన్ని ఎత్తితడుపుము. అర్థగించబడిన కుల్య తూర్పు వైపుకు ప్రవహించుగాక, నేతితో (జలంతో) ఆకాశాన్ని, భూమిని తడుపుము. ఆవులకు అందమైన జలాశయాలుండుగాక." 8

## 2. వాస్తు

ఆర్యులు నగరవాసులుకారు. సప్తసింధు నగరాలను గురించికూడా తెలియుట లేదు. కాని సింధు ఉపత్యకావాసులు మొహెంజెదారో, హరప్పావంటి చక్కగా కట్టిన, జనసమ్మర్దమైన పట్టణాల్లో వుండేవా రను విషయం మనకు తెలుసు. వైదిక ఆర్యులు కేవలం దేశదిమ్మరులు, పశుపాలకులు కారు; రైతులుకూడ. వారు తమ పశువుల సౌకర్యాన్ని చూచుకొని గ్రామాల్లో వుండేవారు. వారిగ్రామాల్లో ఇళ్ళు, శాలలు, గుడిసెలతోపాటు వేయి స్తంభాల మిద్దెలు, మేడలుకూడ వుండేవి. హర్మ్యాన్ని తర్వాత రాజప్రసాదమన్నారు. కాని వసిష్ఠుడు చెప్పిన సూక్తంబట్టి అట్లుకాదని తోస్తుంది. (7-56)

"మరుత్‌గణాలు గుర్రంవలె అందమైన నడక కల్గినవారు. ఉత్సవాన్ని చూసే మనుష్యులవలె అందంగా వున్నారు. వారు హర్మ్యంలోనున్న శిశువుల వలె పరిశుభ్రంగాను, క్రీడలందు ఆసక్తికల కోడెదూడవలె జలం ధరించి వున్నారు." 16

శ్రుత విద ఆత్రేయుడు సహస్ర స్థూణములుకల గృహాలను పేర్కొన్నాడు. (5-62-6)

"ఓ మిత్రా వరుణులారా! యజ్ఞమందు దానశీలుడైన యజమాని అన్నాన్ని రక్షించండి. కోపగించకుండా మీ ఇరువురు వేయి స్తంభాల గృహమును ధరించండి."

## 3. కాలం

ఋగ్వేదంలో ఏడు రోజులు పేర్కొనబడలేదు. పన్నెండు రాసులను మాత్రం గ్రీకులతో సంబంధం కల్గిన పిమ్మట మనం తీసుకొన్నాం. నేడుకూడ రైతులు సౌరమాసంయొక్క అవసరాన్ని అనుభవంలో చూస్తున్నారు. కాని వర్షాకాలాన్ని బహు పురాతన కాలంలో మాదిరిగా నక్షత్రాలనుబట్టి లెక్కిస్తున్నారు. ఆర్ద్రనుండి హస్తవరకు వున్న కాలాన్ని వానాకాలంగా గుర్తిస్తున్నారు. ఆ ప్రకారమే పంటలను వేస్తున్నారు. ఆర్యులకు నెలలు తెలుసును.

1. మాసాలు : శునః శేప వైశ్వామిత్రుడు (అజీగర్త పుత్రుడు) పన్నెండు నెలలను పేర్కొన్నాడు. (1-25)

"వేదమాసో ధృతవ్రతో ద్వాదశ ప్రజావతః ।
వేదాయ ఉపజాయతే ॥ 8

"వ్రతధారియగు వరుణుడు ప్రజలు కల పన్నెండు మాసాలను ఎరుగును. అధిక మాసాన్ని కూడ అతడు ఎరుగును."

2. ఋతువులు : కణ్వపుత్ర ప్రగాథుని సూక్తం (8-52) ద్వారా ఆ కాలంలో కొన్ని ఋతువులు కూడ ఆర్యులు ఎరుగుదురన్న విషయం తెలుస్తుంది.

"ఓ యింద్రుడా, నీవు యజ్ఞఋతువులు కల్గి ప్రకాశిస్తున్నావు. ఓ శూరుడా, మేము నిన్ను ఋక్కులతో స్తుతిస్తున్నాం. నీవలన మేము విజయుల మవుతాం.

భరద్వాజుడు శరత్తు, హేమంత ఋతువులను పేర్కొన్నాడు. 6-24

అతన్ని శరత్తులు కాని, మాసాలుకాని వృద్ధుని చేయలేవు. దినములు యింద్రుని కృశి పచేయలేవు. వృద్ధుని యీ శరీరం స్తోమములతోను, ఉక్థలతోను ప్రశంసించబడి వృద్ధిచెందుగాక."—7

"ఓ యింద్రుడా, యుద్ధమందు స్తోతను రక్షించుటకు ప్రయత్నించుము. దాపు నుండిగాని దూరంనుండిగాని కల్గు భయంనుండి అతన్ని రక్షించుము. గృహమందును, అరణ్యమందును శత్రువుల బారినుండి అతన్ని కాపాడుము. మేము సుందర వీర పుత్రులతో నూరు హేమంతములు ఆనందంతో తులతూగెదంగాక"—10

ఆర్యులు సప్తసింధులోకి వసంత జ్ఞానాన్ని తమ వెంటకొని తెచ్చారు. భారత దేశానికి వెలుపల వున్న ఆర్య పరివారానికి చెందిన రష్యనులు వసంతమును వ్యస్నా, శరత్తును ఓసెన్, హేమంతమును జిమ్ అన్నారు. ఇక్కడ ఉచ్చారణ భేదం మాత్రమే వుంది. ఈ ప్రకారంగా యీ మూడు ఋతువులను సప్తసింధులో పూర్వం వలె వ్యవహరిస్తూ వుండేవారు. నారాయణ ఋషి వసంతం, గ్రీష్మం, శరత్తులను పేర్కొన్నాడు. (10-90)

"దేవులు పురుషరూపంతోవున్న హవిస్సుతో యజ్ఞం చేసినప్పుడు దాని నెయ్యి వసంతమయ్యేను. చిదుగులు గ్రీష్మం, హవిస్సు శరత్తు అయ్యేను"— 6,

కల్పితఋషి యక్ష్మనాశన ప్రజాపతి కూడ ఋతువులను గూర్చి చెప్పారు. (10-161)

"వృద్ధిచెందుతున్న నూరు శరత్తులు, నూరు హేమంతాలు, నూరు వసంతాలు నీవు జీవించుము. ఇంద్రాగ్ని సవితా బృహస్పతులు శతాయు రూపమైన హవిస్సుతో ఋతనికి మరల శతాయువు నొసంగుగాక."—4

ఏడాదిని మొదట్లో సంవత్సర మనేవారు. తర్వాత వచ్చిన వర్షశబ్దం వ
కాలమును బట్టి వచ్చింది. కీర్తి తను ఉచథ్య పుత్రుడు "స్వైజన్మ డగు అగ్ని మూ
రకాల అన్నం (సోమం, నెయ్యి, పురోడాశం) భుజిస్తున్నాడు. అతడ
భుజించిన అన్నం మరల సంవత్సరంలో వృద్ధి చెందుతుంది. అభీష్ట ప్రదమై
అగ్ని ఒక జిహ్వతో వృద్ధిచెందుతూ, రెండవదానితో యితరములను తొలగిం
వనాన్ని నాశనం చేస్తాడు." అని చెప్పాడు.

# 3. నక్షత్రాలు

ఆర్యులకు నక్షత్రాల గురించి తెలుసు.

"సూర్యాయా వహతుః ప్రాగాత్
సవితా యమ వా సృజత్।
మఘాసు హన్యన్తే గో వోऽర్జున్యోః
పర్యుహ్యతే" 10-85-13 సూర్యాఋషి.

"సవిత ఎవరి కిచ్చెనో అతడు సూర్య. పెళ్ళివారికి మున్ముందు వెళ్ళాడు. మఘా నక్షత్రమందు పెళ్ళి విందుకు ఎద్దులు చంపబడ్డాయి. పూర్వా, ఉత్తరా ఫాల్గుణీ నక్షత్రములందు ఆమె వివాహం జరిగింది."

# 4. తరాజు, కొలత

తూకానికి తరాజు లేదు. ఈనాడు హిమాలయంలోను, తమిళనాడులోను సేరు, మానిక, పడి మొదలైనవి వుపయోగిస్తున్నట్లుగా ఆర్యులు తూకానికి గాను ప్రత్యేక ఆకారంగల పాత్రలను వుపయోగించేవారు. ఖారి, ద్రోణం అతి పురాతనమైన కొలతలు, వామదేవుడు ఖారీని పేర్కొన్నాడు. (4-32)

"మేము రథానికి కట్టే వేయి గుర్రాలను, నూరు ఖారీల సోమాన్ని యింద్రుని అడుగుతున్నాం." 17

ద్రోణం గురించి బుధసౌమ్యుని ఋక్కును యింతకు ముందు వుదహరించి వున్నాం. (10-101-7) ఈ రెండును భారీ కొలతలు. వీటికంటే చిన్నతూకపు కొలతలు కూడ వుండ వచ్చును.

కొలతలో అంగుళాన్ని నారాయణ ఋషి పేర్కొన్నాడు. (10-90)

"వేయి తలలు కల్గిన, వేయి కళ్ళు కల్గిన, వేయి పాదాలు కల్గిన ఆ పురుషుడు భూమిని నలువైపుల నుండి ఆవరించి పది అంగుళముల కంటె అధికుడై యున్నాడు "-1

అంగుళానికి యోజనానికి మధ్య హస్త ధనుస్సు కొలతలు ఆ కాలంలో వుండి వుండవచ్చును. కక్షీవానుడు యోజనాన్ని పేర్కొన్నాడు. 1-128

"ఉషస్సు నేడు ఎల్లో రేపుకూడ వరుణుని విశాల గృహాన్ని సేవిస్తున్నది. దోష రహితమైన ఒక్కొక్క ఉషస్సు శీఘ్రంగా మూడు యోజనాలు పోతుంది."-8

10-88-20 ఋక్కులో కూడ 'యోజన' వుల్లేఖించబడింది

# 5. సంఖ్యలు

ఋగ్వేదంలో సంఖ్యలు అయుతం (పదివేలు)తో సమాప్తం చేయబడింది. ఆ పైన పది, నూరు, వేయి చేర్చి సంఖ్య విలువను పెంచటమైంది. ఈ క్రింది విధంగా ఋక్కులందు సంఖ్యలు పేర్కొన బడినవి.

ఒకటి, అర్ధ, ఉభయ, (6-30)

"పరాక్రమం కొరకు అతడు మరింత వృద్ధి అయ్యెను. అతడు జరారహితుడై ఒక ధనాన్ని యిస్తున్నాడు. ఇంద్రుడు మహత్తులో భూమ్యాకాశములకంటె గొప్ప వాడు. ఆ ఉభయులు ద్యౌ పృథ్వులు అతనిలో సగంతు (అర్ధకు) సమానం."-1

రెండు, యిరువది : భరద్వాజుడు 6-27-8లో యీ సంఖ్యలను పేర్కొన్నాడు.

"ఓ అగ్నీ, ధనవంతుడు, పార్థివసమ్రాట్టు అయిన చాయమాన పుత్ర అభ్యావర్తి నాకు వధువుల సమేతంగా రెండు రథాశ్వాలను, పది ఆవులను యిచ్చాడు. అతని దక్షిణ యితరుల కంటె గొప్పది."

ఒకటి, రెండు : బృహస్పతి పుత్రశంయుడు 6—45—5 లో వీటిని పేర్కొన్నాడు.

"ఓ వృత్రహంతా, నీవు మావలె వున్న ఒకరికి, యిద్దరికి రక్షకుడవు."

ప్రథమ : వసిష్ఠుడు (7-44-14)

"వేగంగా పరుగెత్తు గుర్రాల్లో దధిక్రం ప్రథమం. అది రథాలకు ముందు వుంటుంది." (దధిక్రత్ యింద్రునివాహనం)

మూడు, నాల్గు, ఏడు, తొమ్మిది, పది : గృత్సమదుడు (2-18-1)

"అప్పుడు నూతనంగా తెల్లవారింది. నాల్గు యిరుసులు, మూడు కొరడాలు ఏడు లగాములు వున్న నవీన రథాన్ని కట్టారు. పది తెడ్లుకల మనుష్యులున్నటువంటి హితకరమైన ఆ రథం యజ్ఞములతో, స్తుతులతో వేగాన్ని అందుకొంది."

ప్రథమ, ద్వితీయ, తృతీయ : గృత్సమదుడు (2-18-2)

"ఆ యజ్ఞం ప్రథమ, ద్వితీయ, తృతీయ సవనములకు సరిపోయింది. అది మానవునికి శుభదాయకమైంది."

నాలుగు : ప్రతిరథుడు (5-47-4) "నల్గురు ఋత్విజులు శుభం కోరుతూ హవిస్సును పట్టుకొంటున్నారు. పది దిక్కులు గర్భస్థమైన సూర్యుని ప్రేరేపిస్తున్నాయి. మూడు రకాలైన అతని శ్రేష్ఠ కిరణాలు యిప్పుడే ఆకాశం చివరివరకు చరిస్తున్నాయి.

ఐదు : వసిష్ఠుడు (7-15-2) "యువకుడు, కవి, గృహపతి అయినవాడు ప్రతి యింటిలోను పంచగవ్యాల ముందు కూర్చొంటాడు. (3-27-19)

విశ్వామిత్రుడు "ఓ శతక్రతూ, ఇంద్రా! పంచగవ్యాల్లో నీ యింద్రత్వ మున్నందున వారిని నీ వాళ్ళనుకొంటున్నాను."

అరువది, వేయి : వసిష్ఠుడు (7-18-14) గోవులను దోపిడి చేయాలను కోర్కెగల అరువది వందల వేల అరువది ఆరు అను, ద్రుహ్యు వీరులు హతులై నిద్రపోతున్నారు. భక్తుల కొరకు యివన్నీ యింద్రుడు చేసిన పరాక్రమ కృత్యాలు."

ఏడు : భరద్వాజుడు (6-74-1) "ఓ సోమ రుద్రులారా, మీరు అసురబల మును వహించండి. మా కోరికలు శీఘ్రంగా మీకు ప్రాప్తించుగాక. ఇంటింటా మీరు ఏడు రత్నాలను వుంచుతూ మా ద్విపాద చతుష్పాద జీవులకు మేలు చేకూర్చండి. శీఘ్

ఎనిమిది : హిరణ్యస్తూపుడు (1-35-8) "అతడు పృథ్వియొక్క ఎనిమిది దిక్కులను, మూడు మరుస్థలాలను, ఏడు నదులను ప్రకాశింపచేశాడు. బంగారు కనులు కల సవితృడు దాతలకు ఉత్తమ రత్నాలను తీసుకొని వచ్చాడు."

తొమ్మిది, తొంబది : వసిష్ఠుడు (7-19-5) "ఓ వజ్రహస్తా, నీకు శీఘ్రకాలంలో తొంబది తొమ్మిది పురాలను ధ్వంసం చేయగల శక్తివుంది. ఉండుటకు నూరవ పురాన్ని వుంచావు. వృత్రుని, నముచిని సంహరించావు."

పది : గృత్సమదుడు (2-18-1) "పదికెెడ్లు కల్గిన నావ"

పదకొండు : సూర్యా (10-85-45) "వర్షము విచ్చు ఓ ఇంద్రా, ఈమెను సుపుత్రవతిగాను, సౌభాగ్యవతిగాను చేయుము. ఈమెకు పది పుత్రుల నిమ్ము. భర్తను పదునొకటవ వానిగా చేయుము."

పన్నెండు : వామదేవుడు 4-33-7 "పన్నెండు నక్షత్రాల్లో అగోపనీయ సూర్యుని ఆతిధ్యంలో ఋభులు సంతోషంగా వుంటున్నారు. క్షేత్రములకు సుఖం చేకూర్చుతూ, సింధువులను ప్రవహింపచేస్తూ, మరు భూమిలో వనస్పతులను, వల్లానికి జలం తీసుకుపోతున్నారు."

పదునాలుగు-ఏడు : సగ్రిమైరూపుడు (10-114-7) "ఈ రధానికి యింకా పదునాల్గు మహిమలున్నాయి. ఏడ్గురు వీరులు దీన్ని స్తుతులద్వారా ముందుకు తీసుకుపోతున్నారు. ఏ మార్గానవెళ్ళి వదకట్టిన సోమాన్ని త్రాగుతున్నారో; ఆ మార్గం ఎవరు చెప్పుతారు."

పదునైదు : సగ్రిమైరూపుడు (10-114-8) "వేల రకాల్లో పదనైదు ఉక్తులున్నవి. ఆకాశం, పృథ్వీ వున్నంతవరకు యివి వ్యాపించి వున్నాయి. వానికి వేలాది మహిమలు కలవు. ఋక్కు వ్యాపించినంతవరకు వాణి వుంది."

పదునెనిమిది : గృత్సమదుడు (2-18-4) "ఓ యింద్రుడా, ఆహ్వానింపబడిన నీవు రెండు, నాల్గు, ఆరు, ఎనిమిది, పది గుర్రాలతో సోమపానం కొరకు రమ్ము. ఓ సుయజ్ఞుడా, ఈ సోమం వడకట్ట బడివుంది. దీన్ని పాడుచేయకు" 20, 30, 40, 50, 60, 70, 80, 90 గృత్సమదుడు- (2-18-5-6) "ఓ యింద్రుడా, సుందరమైన రథం కల్గిన, ఉత్తమమైన వడక కల్గిన 20, 30, 40, 50, 60, 70, గుర్రాలను కట్టుకొని సోమపానం కొరకు రమ్ము."

"80, 90, 100 గుర్రాలను కట్టుకొని రమ్ము. ఓ యింద్రుడా, మత్తుకొరకు ఈ సోమం నీ కొరకు పాత్రలందు వుంచబడింది."

1000, 10,000 : సోభరి (8-21-18) "సరస్వతీ తీరమందున్న చిత్ర రాజు యితర రాజుల కంటె గొప్పవాడు. వర్షన్యం వృష్టి ద్వారా వ్యాపించినట్లు అతడు వేయి, పదివేల గోవులను దానంగా యిస్తున్నాడు."

పై సంఖ్యలను చూచినచో అంకు దశోత్తర, ఏకాదశ, ద్వాదశ మొదలగు క్రమం కూడ అనుసరించినట్లు తెలుస్తుంది. దశక సంఖ్య సప్తసింధు ఆర్యులకు తెలుసు. కాని కొంతకు గాని, తూకానికిగాని వారు తమకంటె పూర్వమున్న సింధు నాగరికుల పద్ధతిని అనుసరించారు. ఈ కారణం చేతనే కొలతకుగాని, తూకానికిగాని నాలుగు, పదునారు మొదలగు క్రమం అనంతర కాలంలో స్వీకరించారు.

—•—

# పదిహేడవ అధ్యాయం

# ఆర్యమహిళలు

ఋగ్వేదాన్నిబట్టి సప్తసింధు ఆర్యస్త్రీల స్థితి అనంతర కాలంలో వున్నంత అధ్వాన్నంగా లేదని చెప్పవలసి వుంటుంది. నాడు ఆర్యులు సామంతవాద వ్యవస్థలో వున్నమాట నిజం. ఆ వ్యవస్థలో పితృస్వామిక వ్యవస్థలోవున్న అధికారాలు సులభంకావు. శుద్ధగణ వ్యవస్థలో స్త్రీలు ఆయుధాలు తీసికొని యుద్ధం చేయ కల్గే వారు. క్రీ॥ పూ॥ ఆరవ శతాబ్దంలో మధ్య ఆసియాలో శకులందు యిట్లాగే వుండేది. అక్కడ ద్రిమ్మరులగు స్త్రీలు ఎన్నో పర్యాయాలు ఆయుధాలు చేపట్టారు. కాని స్త్రీలు యుద్ధం చేయుటను ఆర్యులు తప్పుగా భావించేవారు. శంబరునియొక్క పార్వతేయులు గణ వ్యవస్థలో వున్నారు. దివోదాసుతో జరిగే జీవన్మరణ పోరాటంలో పురుషుల వలె స్త్రీలుకూడా పాల్గొనుట వారికి సహజమే. కాని ఆర్యఋషులు 'అబల ఏమి చేస్తుందిలే' అంటూ ఎగతాళి చేశారు, అది వెనుకటి అధ్యాయంలో వివరించి వున్నాం. ఈ విధంగా ఆర్యస్త్రీలు బాహాటంగా యుద్ధంలో పాల్గొనే అవకాశం సప్తసింధులో లేదు. దీనికి భిన్నంగా అడపాదడపా ఆర్యస్త్రీలు ఆయుధాలు చేపట్టారనేది వేరే విషయం.

యుద్ధం తర్వాత పేర్కొనవలసిన మహత్తర విషయం ఋక్కులను రచించుట, ఋక్కులను రచించిన పురుషులను ఋషులని, స్త్రీలను ఋషికలనీ అన్నారు. ఋషికల సంఖ్య ఋగ్వేదంలో రెండు డజనులకంటె తక్కువలేదు. కాని పరిశీలించిన పిమ్మట వారిలో చాలమంది మానవులు కాదనీ, కల్పితమనీ తోస్తుంది. ఘోషా, విశ్వవారాలను మాత్రం చారిత్రక ఋషులుగా విశ్వసిస్తున్నారు. ఋషికల పేరుతో ఋగ్వేదంలో సంగ్రహించబడిన ఋక్కులను రచించినవారు రచయిత్రులు అని చెప్పుట కష్టం. అయితే యీ ఋక్కులవలన ఆర్యస్త్రీల జీవితాన్ని గురించిన అనేక విషయాలు తప్పక తెలుస్తాయి. ఈ కల్పిత అకల్పిత, ఋషికల సూక్తాలు కొన్ని దిగువ యివ్వబడ్డాయి.

1. అదితి : ఋగ్వేదంలోని పదవ మండలంలోని 72 వ సూక్తం బృహస్పతి లేక అదితి రచించినట్లు చెప్పుతారు. దీనిలో అదితి వచ్చింది కాబట్టి

విహంగా దీన్ని రచించింది అదితి అన్నారు. అదితిని (ద్యౌ) దక్షపుత్రిక అన్నారు. దక్షుని (సూర్యుని) కూడ అదితి పుత్రు డన్నారు.

"ఉత్తాన పదం (వృక్షం) నుండి భూమి పుట్టింది. భూమి నుండి దిక్కులు పుట్టాయి. అదితి నుండి దక్షుడు, దక్షుని నుండి అదితి పుట్టారు."4 "ఓ దక్షుడా, నీ కుమార్తె అయిన అదితి దేవులను కన్నది. తర్వాత మహా అమృత బంధువులు (అమరులు) పుట్టారు."—5

అదితి తన శరీరం నుండి పుట్టిన ఎనమండుగురు పుత్రుల్లోంచి ఏడుగురిని వెంటబెట్టుకొని దేవతల వద్దకు వెళ్ళింది. కాని మార్తాండుని అందరికంటె పైన స్థాపించింది.

మిత్ర, వరుణ, దాత, అర్యమా, అంశ, భగ, వివస్వాన్, ఆదిత్య- వీరు అదితి పుత్రులు. ఈ సూక్తమందు దివ్య అదితి (ద్యౌ) వర్ణించబడింది. ఆమె వ్రాసిందు ఋషిక కాదు.

2. ఇంద్రమాతలు : ఇంద్రమాతల సూక్తం కూడ (10-15-3) యిటువంటి కల్పితమైన పేరుతోనే వుంది. ఇందు ఇంద్రుని పుట్టుక, వీరత్వం వర్ణించబడింది. అసలు వ్రాసిన ఋషి పేరు తెలియకపోవుటచేత ఇంద్రుని కన్నటు వంటి ఇంద్రమాతలను యీ సూక్తానికి రచయిత్రులుగా అంగీకరించారు. ఇందున్న కొన్ని మంత్రాలను చదవండి.

"కర్మరతులైన ఇంద్రమాతలు ఇంద్రుడు పుట్టినప్పుడు సువీర్యాన్ని గ్రహిస్తూ దగ్గరకు వచ్చారు "—1

"ఓ యింద్రా, నీవు విక్రమంతోను. ఓజోబలంతోను పుట్టితివి. ఓ వీరుడా, నీవు శక్తి వంతుడవు." 2

"ఓ యింద్రా, నీవు నీ రెండు చేతుల్లో వజ్రాన్ని ఓజస్సుచే తీక్షణపరుస్తూ సూర్యునితోపాటు ధరించావు."—4

3. ఇంద్రాణి : ఇదికూడ కల్పితమైన పేరే, 10-145. ఈ ఋక్కులందు ఎక్కడాకూడ యింద్రాణి పేరు రాలేదు. స్త్రీ సవతికి భయపడుట సహజం. సవతిని బాధించుటకు యిందు మూలికలను వుపయోగించుట వర్ణించబడ్డది. ఈ విషయాన్ని మేము మంత్ర తంత్ర ప్రకరణంలో వివరించి వున్నాం. ఇంద్రాణి రచించిన (10-86) సూక్తంకూడ వుంది. అందు యింద్రాణి తేజస్సు తప్పక మనకు కన్పటుతుంది. ఇంటిలో వృషాకపి (అగ్ని)కి అధిక గౌరవముండుటను ఇంద్రాణి

సహించలేకపోయింది. కావున ఆమె యింద్రునిపై కోపగించుకొంటుంది. ఇంద్రుడే అగ్నియందు ఆజ్యం వేస్తూ ప్రారంభించాడు.

"అక్కడ ప్రజలు సోమాన్ని వడకట్టుట మానివేశారు. వారు యింద్రుని దేవునిగా అనుకోలేదు. మత్తునేత తృప్తులైన వారియందు నా సఖుడైన వృషాకపి వున్న చోటున ఇంద్రుడు అందరికంటె ఉత్తముడు." 1

ఇంద్రాణి : "ఓ యింద్రా, నీవు విచలితుడవై వృషాకపివద్దకు పరుగిడు తున్నావు. ఇతర చోటుకు పోవుటలేదు." 2

"నిన్ను యీ బంగారు వర్ణంకల వృషాకపి ఏమి మాయ చేశాడో, మరి నీవు అతనికి పుష్టిని కల్గించు ధనాన్ని యిస్తున్నావు." 3

"ఓ యింద్రా, ఏయీ ప్రియ వృషాకపిని నీవు రక్షిస్తున్నావో, అతని చెవిని వరాహాన్ని కొరకు కుక్కకాటు వేయుగాక." 4

"నా కొరకుగాను శుభ్రం చేయబడి సిద్ధంగా వుంచబడిన ప్రియ వస్తువును వృషాకపి దూషితం కావించాడు. అతని శిరస్సు ఖండించుము. ఇట్టి దుష్కర్మునికి సుఖం కల్గకుండా పోవుగాక." 5

ఇంద్రుడు : "అందమైన బాహువులు కల్గిన, చక్కని వ్రేళ్ళుకల్గిన, దీర్ఘమైన కురులు కల్గిన, లావైన తొడలు కల్గిన ఓ వీరపత్ని యింద్రాణీ, నీవు వృషాకపిపై ఎందుకు కోపగించుచున్నావు" 8

ఇంద్రాణి- "ఈ దుష్టుడైన వృషాకపి నన్ను అవీరమాత అని అనుకొంటు న్నాడు. కాని నేను వీరమాతను, ఇంద్రుని పత్నిని. నా సఖులు మరుత్తులు."-9

"హోమ కాలమందుగాని, యుద్ధ సమయమందుగాని స్త్రీ అక్కడకు ముందుగా వెళ్ళుతుంది. సత్యవిధాత, వీరపుత్రులను కన్న ఇంద్రపత్ని పూజ జరుగుతుంది." - 10

ఇంద్రుడు - ఈ మహిళలందు ఇంద్రాణి సౌభాగ్యవతి యని నేను విన్నాను. ఇతరులవలె ఈమె భర్త వృద్ధావ్యంచే మరణించదు."-11

"ఓ యింద్రాణీ, నా ప్రియమిత్రుడైన వృషాకపి లేకుండా నాకు సంతృప్తి లేదు. అతని ద్వారా ప్రాప్తమైన హవిస్సు దేవతలవద్దకు పోతుంది." - 12

ఇంద్రాణి - "ఓ వృషాకపిపత్నీ, నీవు ధనవతివి. సుపుత్రవతివి. మంచి వధువై వున్నావు. ఇంద్రుడు నీ ప్రియమైన ఎద్దుల హవిస్సును భక్షిస్తాడు" - 13

ఇంద్రుడు : "భక్తులు నాకొరకు 35 ఎద్దులను వండారు. వాటిని తిని నేను బలిశాను. నా రెండు కుక్షులను భక్తులు నింపుతారు." 14

"ఓ వృషాకపీ, మరుభూమి, నరుకుటకు తగిన వనాలు ఎన్నో యోజనాలు (విస్తరించి) వున్నాయి. కాబట్టి దగ్గరవున్న అగృహములకు రమ్ము," 20

వృషాకపి అగ్ని. అగ్నిముఖంద్వారానే ఇంద్రుడు హవిస్సు గ్రహిస్తాడు. కాబట్టి అతడు వృషాకపిని తనకు ప్రియమిత్రునిగా భావించితే ఏమీ ఆశ్చర్యంలేదు. ఈ కారణంచేత ఇంద్రాణికి వృషాకపిపై కోపం కల్గింది. దేవతల్లో కూడ కుటుంబ కలహం ఎంతగా వుండేదో చూడండి.

4. ఊర్వశి : ఊర్వశి, అప్సర, ఆమెను పురూరవుడు ప్రేమించాడు. నేడు పంజాబులో హీరా-రాంఝూ, సోహనీ-మహీవాలుని ప్రేమ కథలు ప్రచారంలో వున్నట్లే నాడు సప్తసింధుగో అదే రీతి ఊర్వశీ-పురూరవుల ప్రేమకథ వాడుకలో వుంది. వారు మానవజాతికి చెందిన ప్రియుడు, ప్రియురాలు అయివుండవచ్చు. కాని వారిని మానవునిగా, దేవకన్యగా చిత్రించడం జరిగింది. ఋగ్వేదంలోని యీ ప్రేమ కథానికా సూక్తాన్ని (10-95) ఊర్వశీ పురూరవులు రచించినట్లుగా చెప్పుతారు. దీన్నిబట్టి యీ సూక్తం రచించిన అసలు రచయిత పేరు మరుగున పడినట్లు తెలుస్తుంది. తన్ను విడిచిపోవు ఊర్వశిని పురూరవుడు ఎంతో బ్రతిమి లాడుతాడు. ఆమెను ఘోర (చండిక) అంటాడు. కాని ఊర్వశి అతడు చెప్పిన దేమీ వినిపించు కోదలచలేదు. పైగా ఆమె "స్త్రీలలో ప్రేమ వుండదు. వారి హృదయాలు తోడేళ్ళ హృదయాల వంటివి" అనికూడ అనేస్తుంది (10-95-15). 17వ ఋక్కులో వసిష్ఠుని పేరు వచ్చింది. దీన్నిబట్టి వసిష్ఠుడే యీ ఋక్కులకు కర్త యను సందేహం కల్గుతూ వుంది. (10-95-17)

"అంతరిక్షాన్ని నింపే, లోకాలను కొలిచే ఊర్వశిని వసిష్ఠుడనైన నేను ప్రార్థిస్తున్నాను. సుకృతుడు దాత అయిన పురూరవుడు నీవద్ద నుండుగాక. నా హృదయం తపిస్తూవుంది. తిరిగిరమ్ము."

ఋగ్వేదంలో వుత్తమ కావ్యములని చెప్పుకొను సూక్తాల్లో యీ సూక్తం కూడ ఒకటి. ఈ సూక్తాన్ని మేము యిదివరలో పొందుపరచి వున్నాం.

5. కక్షీవానుని పుత్రి ఘోష : అశ్వినీ కుమారులిద్దరినీ స్తుతిస్తూ ఘోష రెండు సూక్తాలను రచించింది. (10-39-40). ఆమె మొదటి సూక్తంలో వేర్వేరు వ్యక్తులకు అశ్వినీ కుమారులు చేసిన మేలును వర్ణించింది. తుగ్ర సంతాన

శ్యావాసుడు (10-39-5). విమదుడు, శున్ద్యుడు, పురమిత్రుడు, వద్రిమతి (7), పేదు (10), శంయుడు (13) భృగుకు (14) వీరంతరు వుపకారం పొందినట్లు పేర్కొనబడింది. చక్కని రచనతో ఘోష ఏ ఋషితోనైనా పోటీ చేయగలదు. ఆమె యిట్లు చెప్పింది. (10-39).

"ఓ అశ్వినీ కుమారులారా, మీచే చక్కగా నిర్మితమైన రథం పృథ్వి అంతా తిరుగుతుంది. హవిస్సు నొసంగు యజమానులు ప్రతిదినం, ప్రతిరాత్రి, ప్రతి ఉషస్సునందు మీ రథాన్ని ఆహ్వానిస్తారు. నీ తండ్రి యొక్క అందమైన పేరును పిల్చినట్లుగ మీ పేరునుకూడ మేము నిత్యం ఆహ్వానిస్తున్నాం." 1

"ఓ అశ్విని కుమారులారా! భృగులు రథం నిర్మించునట్లు నేను మీ కొరకు యీ స్తోత్రం రచించాను. భర్తకొరకు వధువును అలంకరించినట్లుగ నేను నిత్యం పుత్ర పౌత్రులను ధరించెదను అన్నట్లు దీన్ని అలంకరించాను" 14

రెండవ సూక్తంలో (10-40) ఘోష కుత్సుని (6) భుజ్యుని, వశుని, శింజారుని, ఉశనుని (7), కృశుని, శయుని, (8), పేర్కొంది. ఘోష రాజ కుమార్తె. ఈ సంగతి 10-40 ఋక్కుల వలన తెలుస్తుంది.

"ఓ అశ్వినీ కుమారులారా, రాజకుమారి, ప్రసిద్ధి అగు ఘోష మీతో మాట్లాడుతూ వుంది." ఓ నేతలారా, రేయింబవళ్ళు ఆమెవద్ద వుండుటకు అశ్వాలు కలిగిన రథం కలిగిన సమర్థవంతుడైన భర్తను వెదకుటలో ఆమెకు సహాయం చేయండి" అని ఆమె మిమ్ములను అడుగుతూ వుంది" 6

అశ్వినీ కుమారులకు తన కోర్కెను తెల్పి ఘోష వరం అడుగుతూవుంది.

"యువకుడు యువతి ఇంటిలో ఎట్లు వుంటాడో నాకు తెలియదు. మీరే ఆ యువకునికి తెల్పండి. భార్యయందు ప్రేమ కలవాడును, పరాక్రమం కలవాడును, యువకుడు అయినవాని యింటిలోకి నేను వెళ్ళాలను కొంటున్నాను. ఓ అశ్వినీ కుమారులారా, నా యీ కోర్కెను నెరవేర్చండి,"—11

సప్తసింధులోని ఆర్యకన్యల కుండే కోరిక ఘోషా సూక్తంద్వారా తెలుస్తుంది. ఆరోగ్యవంతుడైన, ప్రియమైన భర్తను పొందుట వారి జీవిత లక్ష్యమై వుంది. ఘోషాపుత్ర కక్షీవాన్ దీర్ఘతమా పుత్రుడు ఒక గొప్ప ఋషి. ఆయన ఋక్కులు ఋగ్వేదంలోని మొదటి మండలంలోని పది సూక్తములందున్నవి కక్షీవానుడు రాజు అన్నటు ఎక్కడా పేర్కొనబడలేదు. ఘోష ఎవరిని పెండ్లాడిందో అతని

పేరుకూడ తెలియదు. ఆమెను పుత్రుడగు సుహస్తుని తల్లి పేరచే గుర్తించు కొంటు న్నాం. పుత్రుడుకూడా తల్లి మాదిరిగా అశ్వినీ కుమారుల విద్వరిని ప్రార్థించాడు. (10-41-1-3) ఘోష చిరకాలం తండ్రి యింటిలోనే కన్యగా ఉండి పోయింది. (1-117-7).

6. జుహూ : ఈ పేరుకూడా కల్పితంగానే తోస్తుంది. 10వ మండలంలో జుహూ సూక్తం ఒకటి ఉంది. (10-109) అనంతర కాలములో జుహూను బ్రహ్మ వాదిని అని అన్నారు. కాని యిందు ఆమె బ్రహ్మన్ని గురించి ఏమీ చెప్పలేదు. విశ్వదేవులను గురించి మాత్రమే స్తుతించారు. ఆమె బ్రహ్మచారిని మాత్రం పేర్కొంది. ఈ సూక్తాన్ని గురించి యిట్లు చెప్పబడుతూ వుంది. జుహూ భర్త బృహస్పతి. అతడు ఏదో కారణంచేత ఆమెను వదిలేశాడు. అతనికి నచ్చచెప్పి దేవులు అతన్ని దారికి తీసుకువచ్చుటలో కృతకృత్యులయ్యారు. ఈమె రచించిన కొన్ని ఋక్కుల ద్వారా నష్టసింధు ఆర్యుల దాంపత్య జీవితాన్ని గురించి తెలుస్తుంది. (10-109)

"ఆ పూర్వజులు-సూర్యుడు, వాయువు, అనంతజలం, ప్రజ్వలిత ఉగ్రాగ్ని, సుఖదాయకమైన ఋతోత్పన్న జలదేవతలు బ్రాహ్మణులకు విరుద్ధమైన పాపాన్ని గురించి చెప్పారు." 1

"సోమరాజు తొలుత మోహించి తర్వాత బృహస్పతికి బ్రహ్మపత్నిని యిచ్చారు. మిత్రావరుణులు ఆమెను అనుసరించారు. హోత అగు అగ్ని చేయి పట్టుకొని ఆమెను తీసుకొని వచ్చారు." 2

"ఈమె బ్రహ్మపత్ని. ఈమె దేహాన్ని చేతితో గ్రహించాలని" అందరూ అన్నారు. క్షత్రియునిచేత రక్షితమగు రాష్ట్రింవలె ఈమెకూడ పంపబడిన దూతతో సంపర్కం చేయలేదు." 3

"బ్రాహ్మణుని భీమపత్నిని తీసుకొని రావలసింది. ఆమె పరమమైన వ్యోమ మందు దుష్ట వ్యవస్థను స్థాపిస్తున్నది." అని ప్రాచీన దేవులు, తపస్సుచేస్తున్న ఆ ఏడ్గురు ఋషులు చెప్పారు." 4

"పత్ని లేకుండా బ్రహ్మచారిగా తిరుగుచున్న బృహస్పతి దేవతలకు అంగ మైనాడు. సోమునిద్వారా కొని రాబడిన పత్నియగు జుహూను దేవులవలె బృహస్పతి పొందాడు." 5

"దేవులు మరల ఆమెను బృహస్పతి కిచ్చారు. మళ్ళీ మానవులు యిచ్చారు. రాజులు యీ విషయాన్ని సత్యమంటూ బ్రహ్మపత్నిని మళ్ళీ ప్రదానం చేశారు." 6

ఋక్కులకు సంబంధించినంతవరకు జుహూ అగ్నిదేవతకు పత్నిగా తోస్తుంది. సప్తసింధులోని ఆర్య పురుషులు తమతమ భార్యలతో యిట్లే తగవులాడుచు మళ్ళీ యిదే విధంగా కలుసుకొనివుంటూ వుండవచ్చును.

7. దక్షిణ : ఈ పేరుకూడా కల్పితమే. దక్షిణను ప్రజాపతి పుత్రి అన్నారు. ఈమె సూక్తమందు (10-107) దాన దక్షిణల మహిమ కీర్తించబడింది.

"మఘవా (ధనవంతుడు) సూర్యుని మహా తేజస్సు ఆవిర్భవించింది. ఆతేజస్సు జీవులందరిని అంధకారం నుండి విముక్తం చేసింది. పితరులచే యీయబడిన గొప్ప జ్యోతి వచ్చింది. దక్షిణయొక్క విశాలమైన రెక్క కనబడింది"-1

"దానం చేసినవారు ఉన్నతమైన ద్యౌ లోకానికి వెళ్తారు అశ్వాలను దానం చేసినవారు సూర్యునితోపాటు వుంటారు. బంగారాన్ని యిచ్చినవారు అమరత్వాన్ని పొందుతారు. వస్త్రాలను యిచ్చినవారు సోముని చేరి ఆయుస్సును పొందుతారు." 2.

"దేవతల పూజ కల్గిన దక్షిణ దివ్యమూర్తి, ఆ దేవతలు లోభిని సంతృప్తి పర్చజాలరు. తప్పులకు భయపడి దక్షిణ నొసంగు చాలమంది తృప్తిపడతారు."—3

"దాతను ముందుగా పిలుస్తారు. దాత శ్రేష్ఠమైన గ్రామణి అవుతాడు. ఎవడు మొదట దక్షిణ యిస్తాడో, అతన్ని గణముల నృపతిగా స్వీకరిస్తాను." 5

"యజ్ఞకర్తలు, సామగాయకులు, ఉక్థలు చెప్పువారు అతన్ని ఋషి, అతన్ని బ్రహ్మ అంటారు. ఎవడు మొదట యిస్తాడో, అతడు శుక్రుని (అగ్ని) మూడు శరీరాలను తెలుసుకొంటాడు." 6

"దక్షిణ అశ్వాన్ని, దక్షిణ గోవుని యిస్తుంది. దక్షిణ వెండిని, బంగారాన్ని యిస్తుంది. మనకు ఆత్మ అయిన అన్నాన్ని దక్షిణ యిస్తుంది. ఇది తెలుసుకొని మానవుడు దక్షిణను కవచంగా చేసుకొంటాడు." 7

"అన్నదానం చేసినవాడు మృతుడు కాడు, దరిద్రుడవ్వడు, క్లేశాన్ని పొందడు. అన్నదాత బాధపడడు. ఈ భువనం నంతటినీ, స్వర్గాన్ని— అన్నిటినీ దక్షిణ వారికి యిస్తుంది." 8

"అన్నదాతలు అందరికంటె ముందు మంచి నివాసం పొందుతారు. అన్నదాతలు సువస్త్రయగు భార్యను పొందుతారు. అన్నదాతలు అంతరిక పేయమగు

మరను హొందుతారు. ఆహ్వానించకుండా ఆక్రమణ చేయువారిని భోజులు (అన్న దాతలు) జయిస్తారు " 9

"అన్నదాత కొరకు ప్రజలు వేగంగా పరుగెత్తు అశ్వాలను వుంచుతారు. దాతకొరకు అందమైన కన్య వుంది. అన్నదాత యొక్క యీ గృహం పుష్కరిణి వలె, దేవ విమానంవలె అద్భుతంగా పరిష్కృతమై వుంటుంది." 10

దాన మహిమ ఆర్యుల్లో ఎక్కువగా వుంది. అతిథులకు భోజన మొసంగుటలో వారు చాల ఉదారులు. సంపత్తి వున్న ప్రతి ఆర్యుడు తన యింటిని దేవ విమానంవలె, పుష్కరిణి మాదిరి కనబడవలె ఎనుకొనేవాడు.

8. నివావరి లేక సిక్తా : వీరిని అత్రిగోత్రికులైన ఋషి కలంటున్నారు. కాని యివికూడా కల్పిత నామములే మూలమును వ్రాసినవారి పేర్లు తెలియవు. నివావరి తన ఋక్కుల్లో (9-86) సోమ మహిమను కీర్తించింది.

"విచక్షణుడు. నూరు ధారలు కలవాడు, ద్యోపతి అయిన సోముడు ధ్వని చేస్తూ కలశంలోకి వస్తున్నాడు. వసుష వర్ణంతో. క్రోత్కాల నొసంగు అతడు పింధు మేష ముల రోమాలతో వడకట్టబడుచు మిత్రుల యింటిలో కూర్చుంటున్నాడు." 11

"స్తుతించబడుచు మేష రోమాలందు వడకట్టబడుచు, తరంగితుడైన సోముడు పక్షివలె వెళుతున్నాడు. ఓ కవీ, యింద్రా, నీ కర్మచేత ద్యో, పృథ్వీలకు మధ్య సోముడు శుచియై స్తుతులతో పవిత్రుడవుతున్నాడు." 13

"ద్యోను చుంబించుతున్న, అంతరిక్షాన్ని పూరించుతున్న భువనములందు అర్పించబడిన యజ్ఞద్రావిని ధరించి యజనీయ స్వర్గజాత సోముడు మేఘుని ద్వారా వచ్చి తన ప్రాచీన పితరుడైన యింద్రుని పేరిస్తున్నాడు. 14

ఈ సూక్తం రచించినది స్త్రీ యని చెప్పుటకు ఏ విశేషం కావరాదు.

9. యమీవైవస్వతి : ఇది కూడ కల్పిత నామమే. వివస్వాన్ పుత్రి ఎవరో యమి. ఆమె తన అన్నయైన యముని ప్రేమించదలచింది. ఈ విషయమే యమ, యమీ సంవాద రూపంలో యిక్కడ తెలుపబడింది. (10-10)

యమి అంటుంది- విశాల సముద్రాన్ని చేరిన యీ స్థానమందు సఖినై నిన్ను సఖునిగా కోరుతున్నాను. విధాత ఎక్కువగా ధ్యానించి భూమిపైన తండ్రి సంతానం వుంచాడు. 1

యముడు సమాధానంచెప్పాడు- నేను సఖుడనై యీ సఖ్యతను కోరను, ఎందుకంటే నీవు నా సోదరివి. ఇందుకు పనికిరావు. విశాల ఆకాశాన్ని ధరించు పరమ దేవుల వీరమహాపుత్రులు నలువైపుల నుంచి మనలను చూస్తున్నారు. 2

యమి : ఇది మానవులకు ఉచితం కాకపోయినా ఆ అమరులు దీన్ని కోరుతున్నారు. నా విషయంలో నీవు మనస్సు వుంచుము. మనకు జన్మించే పుత్రుని కనుటకు నా శరీర మందు ప్రవేశించుము." 3

యముడు :- మనం పూర్వమెప్పుడు యిటువంటిది చేయలేదు. సత్యవాదులమైన మనం అబద్ధం ఎట్లు ఆడగలం ? జల గంధర్వులు, జలయోష (స్త్రీ) అదే మన పరమ సంబంధం, అదే మన బంధుత్వం. 4

యమి : యమునిపట్ల యమి అయిన నాకు కోరికవుంది. ఒక స్థానమందు జంటగా విద్రించుటకుగాను వచ్చాను. భర్తకొరకు భార్యవలె నేను నా శరీరాన్ని బహిరంగ పరుస్తాను. రథంయొక్క పెద్ద చక్రంవలె మన మిద్దరం ప్రేమించుకొందాం. 7

యముడు : భగినులు అభగిను లయ్యే కాలం ముందు తప్పక వస్తుంది. మరియొక వృషభం యొక్క బాహువును ఆలింగనం చేసుకొనుము. ఓ సుభగా, నేను కాకుండా మరియొకనిని పతిగా చేసుకొనుము. 10

యమి : అన్న వుండగా చెల్లెలు అనాథ అయితే ఆ సోదరుడు ఎందుకు ? దుఃఖపడే ఆ చెల్లెలు ఎందుకు ? కామమునకు లోనై నేను యిదంతా చెప్పుతున్నాను. నీ శరీరంతో నా శరీరాన్ని తృప్తి పరచుము. 11

యముడు - నేను శరీరంతో నీ శరీరాన్ని ముట్టుకోను చెల్లెలితో సంపర్కాన్ని పాపమన్నారు నాకు భిన్నమైన వానితో నీవు ఆనందించు ఓ సుభగా, నీ సోదరుడు ఇట్లు ఆచరించ తలచుట లేదు. 12

యమి - ఓ యముడా, నేను నీ మనస్సును, హృదయాన్ని అర్థం చేసుకొనలేక వున్నాను. వృక్షాన్ని తీగవలె, లేక తాడువలె కలసి మరొక స్త్రీ నిన్ను కౌగలించు కొంటుంది. 13.

యముడు - ఓ యమీ, అన్యుని కోరుము. మరొకడు నిన్ను చెట్టును తీగవలె ఆలింగనం చేసుకొనుగాక. అతని మనస్సును నీవు కోరితే లేక అతడు నిన్ను కోరితే మీకు మంగళకరమైన సంబంధం కల్గుగాక. 14

యమ - యమీల యీ వృక్తుల ద్వారా రెండు తరుణ హృదయాల ప్రేమాలాపం ప్రకటితమవుతూ వుంది. ఇంకా ఆర్యుల్లో అన్నా చెల్లెళ్ల వివాహం

విషిద్ధంగా వున్న సంగతికూడ తెలుస్తుంది. ఇక్ష్వాకు వంటి వున్నత వంశంలో కనీసం ఆపత్కాలంలో అన్నాచెల్లెలు వివాహం వున్నట్లు బుద్ధవచనములందు చెప్ప బడింది. ఇక్ష్వాకుని నల్గురు పుత్రులు చెల్లెండ్రను వివాహమాడి తమ కులాన్ని కాపాడుకొన్నారు. తర్వాత అది శాక్యవంశంగా ప్రసిద్ధికెక్కింది. ఇక్ష్వాకుని దాసీ పుత్రుడు తర్వాత ఋషి కృష్ణునిగా పేరొంది కూడ తన నవతిచెల్లెలని వివాహమూ డారు. (దీర్ఘ నికాయము, అశ్వలాయన సూత్రం). జాతక కథల్లో సీతారాముల వివాహంకూడ చెల్లెలు అన్న వివాహంగా చెప్పబడుతూ వుంది. (దశరథ జాతకకథ). అత్యంత ప్రాచీనకాలంలో అన్నాచెల్లెళ్ళ వివాహాలు జరిగేవని తెలుస్తుంది. థాయిలాండు రాజవంశంలో యిప్పటికీ యీ ఆచారముంది. ఈరానులోని సాసానీ రాజ వంశంలో కూడ యీ ఆచారం కన్పట్టుతుంది. ఈజిప్టులోని ఫరో వంశీకులు కూడ రక్తాన్ని పవిత్రంగా వుంచుకొనుటకు యిట్లే చేసేవారు. యమ-యమీల యీ సంవాదం వలన సప్తసింధులోని ఆర్యులు యీ ఆచారాన్ని మంచిదిగా అంగీకరించ లేదని తెలుస్తుంది.

యమీ వైవస్వతి రచించిన మరియొక సూక్తం (10-154) వుంది. సూక్తం యొక్క భాష చాల నవీనంగా వుంది. ఇందు ప్రేతను గురించి చెప్పబడింది.

"ఎవరి పితరుల కొరకో సోమం వడకట్టబడివుంది. ఒకరు ఘృతాన్ని సేవిస్తు న్నారు. ఓ దేవాపీ (ప్రేతా), ఎవరికొరకు మధువు ప్రవహిస్తూవుందో, వారి వద్దకు నీవు వెళ్ళుము." 1

"తపస్సుచే దుర్ధర్షులైనవారివద్దకు, తపస్సుచే స్వర్గం పోయినవారివద్దకు, గొప్ప తపస్సు చేసినవారి వద్దకు - ఓ దేవాపీ (ప్రేతమా) నీవు వెళ్ళుము." 2

"ఎవరు యుద్ధమందు పోరాడుదురో, ఏ వీరులు అక్కడ శరీరం విడుస్తారో, ఎవరు సహస్రాది దక్షిణలు యిస్తారో, ఓ దేవాపీ, నీవు వారివద్దకు పొమ్ము." 3

వైదిక ఆర్యులు యముని మృత్యుదేవతగా భావించి పితరులు వారివద్దకు వెళ్ళె దరని నమ్మేవారు. ఆ యముని గురించి, మృత్యువుని గురించి యమి చెప్పిన యీ సూక్తంలో తెలుపబడింది.

10. రాత్రి : భారద్వాజి రాత్రి కూడ కల్పిత ఋషికమే. (10-127) సూక్తంలో రాత్రి వర్ణించబడింది. మరొక పరంపరనుబట్టి విశ్వామిత్ర వంశ స్థాప కుడగు సోభరిపుత్ర కుశికుడు యీ సూక్తాన్ని రచించెనని అంటున్నారు. గాయత్రీ ఛందస్సులోనుండుటచేత యివి గానం చేయుటకు వీలైన ఋక్కులు.

"రాత్రిదేవి నలువైపులనుండి వచ్చి ప్రకటితమైంది. ఆమె నక్షత్రాలచే సౌందర్యం అంతటినీ ధరించింది." 1

"రాత్రిదేవి వచ్చేటప్పుడు తన సోదరియైన ఉషస్సును ప్రతిష్ఠించింది. ఆమె తమస్సును తొలగించింది." 3

"గ్రామం నద్దుమణిగింది. బాటసార్లు ఆగిపోయారు. పక్షులు విశ్రాంతిగా వున్నాయి. వేటాడు డేగలు కూడా సంచరించుట లేదు." 5

"మాకు నలువైపుల నల్లని అంధకారం కన్పడుచున్నది. అది స్పష్టంగా అవస్థితమైవుంది. ఓ ఉషస్సా, నీవు ఋణం మాదిరి రాత్రిని తొలగించుము." 7

లోపాముద్ర : వసిష్ఠుని సోదరుడైన అగస్త్యుని భార్య లోపాముద్ర పతి వియోగం భరించలేని లోపాముద్ర అగస్త్యునితో జరిపిన సంవాదం యీ సూక్తమందున్నది (1-179).

11 లోపాముద్ర—మొదటి సంవత్సరాల్లో రేయింబవళ్ళు వృద్ధాప్యమును కొనితెచ్చు ఉషస్సులను నేను సహిస్తూ వచ్చాను. ముసలితనం శరీర సౌందర్యాన్ని కూడ పాడుచేస్తుంది. భర్త భార్య వద్దకు ఎట్లు పోగలడు ? 1

"ప్రాచీనులైన సత్యపాలకులు దేవతలతో నిజం పలికేవారు. వారు అంతమును కోరుకొనేవారు. కాని ఆ అంతం వారికి రాలేదు. 2

అగస్త్యుడు—దేవతలు మమ్ము రక్షిస్తున్నారని మేము అలసిపోలేదు. మేము అన్ని భోగాలను అనుభవిస్తున్నాం. మనం యిరువురం సరిగ్గా ప్రయత్నిస్తే, యిక్కడ మన కనేక సుఖాలు లభిస్తాయి. 3

కామాన్ని నేను నిరోధించాను. కాని అది ఎక్కడనుంచో ఉత్పన్నమవుతూ వుంది. లోపాముద్ర పతితో సంగమిస్తూ వుంది. నిట్టూర్పులతో వ్యాకులత చెంది ఆమె ఆ ధీరుని ముద్దిడుచున్నది. 4

12. వసుక్రపత్ని : ఇంద్రుని పుత్రుడగు వసుక్రుని భార్య పేరుతో (10-28) సూక్తముంది. అందు వసుక్రపత్ని యింద్రుని మధ్య జరిగిన మాటలు వున్నాయి. వసుక్రపత్ని అంటూ వుంది :

"ఇతర దేవతలందరు వచ్చారు. కాని నా మామరాలేదు. ఆయన వస్తే అతడు వేయించిన గింజలను తిని సోమాన్ని త్రాగేవాడు. బాగా తిని మళ్ళీ తన యింటికి వెళ్ళేవాడు." 1

వసుక్రుడు యీ సూక్తాన్ని రచించినట్లు చెప్పుతారు. ఇంద్రుడే కాదు, సప్త సింధులోని ఆర్యులకు కూడ ప్రేమించిన యవలను తినుట. సోమపానం చేయుట వారియిష్టం. 'యదన్నం పురుషోహ్యత్తి తదన్నం తస్యదేవతా' (ఏ భోజనాన్ని మానవుడు తింటాడో, అతని దేవతకూడ ఆ భోజనమే చేస్తాడు)

13. వాక్కు : అంభృణ ఋషి కుమార్తె- వాక్కు కూడ కల్పిత నామమే. ఇందు వాగ్దేవి మహిమ వర్ణించబడింది. (10-125).

"రుద్రులతోను, వసువులతోను, ఆదిత్యులతోను, దేవత లందరితోను నేను ఆలోచిసాను. నేను మిత్రావరుణ లిద్దరిని ధరిస్తున్నాను. నేను ఇంద్రాగ్నులను, అశ్వినీ కుమారు లిరువురిని ధరిస్తున్నాను." 1

"దేవతలచేతను, మానవులచేతను సేవించబడు యీ మాటను నేనే చెపుతున్నాను. నే నెవరిని కోరుదునో, అతన్ని ఉగ్రునిగా, బ్రహ్మగా, ఋషిగా, సుమేధునిగా చేస్తాను." 5

14. వివృహా : కశ్యపగోత్రి యైన యీ ఋషిక కూడ కల్పితమే. ఈమె యక్ష్మరోగ నివారణకు కొన్ని మంత్ర తంత్రాలు చెప్పింది. వాటిని మేము రోగ ప్రకరణంలో వివరించి వున్నాం. (10-163-1,2)

15. విశ్పల : ఈమె ఋషిక కాదు. కాని ఈమెకు అశ్వినీ కుమారులు ఉపకారం చేసినట్లు చెప్పబడుతూ వుంది (1-18'-1).

"ఓ మహీపులారా అశ్వినీ కుమారుల యొక్క తృప్తిని కలిగించు మంగళదాయక మగు రథం వచ్చింది. వారు సుకర్ములు, శుచివ్రతులు, ద్యావి బిడ్డలు. వారు విశ్పలకు మేలు చేశారు"— ఇట్లు నా మనస్సుకు అనిపిస్తూవుంది."

16. విశ్వవార : ఘోష వంటిది ఈమెకూడ. ఈమెను చారిత్రక మహిళగా గుర్తిస్తున్నారు. ఈమెది అత్రిగోత్రం. ఈమె తన సూక్తంలో (5-28) త్రిష్టుప్, అనుష్టుప్, గాయత్రీ ఛందస్సులందు అగ్ని మహిమను కీర్తిస్తూ తన పేరు కూడ చెప్పుకుంది.

"ప్రజ్వలితాగ్ని ద్యౌలోకమందు కిరణాలను ప్రసరింప చేస్తున్నది. ఉషస్సుకు ఎదుటగా విస్తృతమై శోభిల్లుచున్నది. హవి సమేతంగా, స్రుచాను తీసుకొని నమస్కార పురస్సరంగా దేవులను పూజిస్తూ విశ్వవార తూర్పు దిక్కునకు పోవుచున్నది." 1

"ఓ అగ్నీ, మహా సౌభాగ్యమునకై నీ జ్వాలలు వుత్తమంగా పెంచుగాక. నీవు శత్రువులను నాశనం చేయుము. దాంపత్య సంబంధాన్ని నీవు వియమబద్ధం చేయుము. శత్రుత్వం వహించువారి తేజస్సును నష్టపర్చుము." 3

17. శచి : పౌలోమి శచి కూడ కల్పిత నామం. పురాణాల ద్వారా ఇంద్రుని భార్యపేరు శచి. ఆమె అసుర పులోముని పుత్రిక అని మనకు తెలుసు. (10-159) ఈ సూక్తంలో సంతృప్తిచెందిన, శక్తివంతమైన మహిళ ఒకర్తె అభిమానంతో తన స్థితిని వర్ణిస్తూవుంది.

"నా భాగ్యోదయమా అన్నట్లు అదిగో సూర్యుడు వుదయించాడు. నేను సవతులను ఓడించాను. భర్తను వశపర్చుకొన్నాను." 1

"నేను కేతువుని (జెండాను). నేను మస్తకాన్ని. నేను తీవ్రంగా, అందంగా మాట్లాడుతాను. భర్త నా యిష్టానుసారం నడుస్తాడు." 2

"నా పుత్రుడు శత్రునాశకుడు. నా కుమార్తె సుందరి. నేను బాగా గెలుస్తాను. భర్తదగ్గర నన్నుగురించి మంచిగా చెప్పుకొంటారు." 3

18. శశ్వతి : అంగిరాగోత్రి అయిన యీ ఋషిక కూడ కల్పితంగా తోస్తుంది. ఈమె పేరుతో ఒక మంత్రముంది (8-1-34) అందు అశ్లీల రతిని గురించి చెప్పబడింది.

19. శిఖండినీ కాశ్యపి : ఇదికూడ కల్పితనామమే. ఈమె సూక్తాన్ని (9-104) కశ్యప పుత్రుడగు పర్వతుడును, నారదుడును రచించినట్లు చెప్పుతారు. ఈ సూక్తమందు సోముని మహిమ చెప్పబడింది. అందు విశేష మేమీ లేదు.

20. శ్రద్ధా కామాయని : ఇదికూడ కల్పిత నామమే. ఈ సూక్తమందు శ్రద్ధ మహిమ కీర్తించబడింది. (10-151)

"శ్రద్ధవలన అగ్ని ప్రజ్వరిల్లుతూ వుంది. శ్రద్ధవలన హవిస్సు హోమం చేయబడుతూవుంది. ఐశ్వర్య శిఖరంపై వుండే శ్రద్ధను గురించి నేను వాణి ద్వారా తెల్పుతున్నాను." - 1

"ఓ శ్రద్ధా, దాతకు ప్రియం చేకూర్చుము. ఓ శ్రద్ధా, దానం చేయ దలంచు వానికి ప్రియం చేకూర్చుము. అన్నం నొసంగు అన్నదాతకు ప్రియం చేకూర్చుము. యజ్ఞం చేయువారికి నేను చెప్పింది చేయుము." 2

"దేవతలు శత్రువులపట్ల శత్రుత్వాన్ని చూపినట్లు నేను చెప్పిన విధముగ అన్నదాతలపట్ల, యజ్ఞదాతలపట్ల శ్రద్ధవహించుము." 3

21. సరమ : సరమను దేవతల కుక్క అనుకొంటారు. సప్తసింధుల యొక్క సిగ్గులేని దోపిడిని గురించిన కోర్కెను సరమ పణులముందు ఎట్లు వెల్లడించిందో, మేము యిదివరలో వివరించి వున్నాం. (10-108)

22. సార్పరాజ్ఞి : ఇది కూడ కల్పిత నామమే. ఈమె సూక్తాన్ని కక్షీవానుని పుత్రుడైన శబర ఋషి రచించినట్లుకూడ చెప్పుతారు. ఈ సూక్తమందు ఆవు వర్ణించబడింది.

"సుఖదాయకమైన గాలి ఆవుల వద్ద వీచుగాక. అవి బలకరమైన వనస్పతులను మేయు గాక. శక్తి నిచ్చు నీటిని ఎక్కువగా త్రాగుగాక. ఓ రుద్రా, కాళ్ళు కల్గిన ఆవులకై నీవు సుఖకరమైన ఆహారం సిద్ధము చేయుము." 1.

"ఏ గోవులు తమ శరీరాన్ని దేవులకు యిచ్చునో, ఏ గోవుల రూపముల నన్నిటినీ సోముడు ఎరిగియున్నాడో, ఏ గోవులు సంతానవతులై మమ్ములను పాలతో పరిపూర్ణం చేయునో, అట్టి గోవులను గోష్ఠముకు తెమ్ము." 3

23. సిక్తా : ఈ పేరు కూడ కల్పితమే. నివావరితోపాటు ఈమె రచించిన ఋక్కులు లభించాయి. (9-86-11-20) ఆ ఋక్కులు సోముని గురించి వర్ణించాయి. నివావరి ప్రకరణంలో ఋక్కుల అనువాద మిచ్చియున్నాము.

24. సుదేవి : ఒక ఋక్కులో (1-112-19) సుదాసు పట్టపు రాణియైన సుదేవి పేర్కొనబడింది.

యాభిః పత్నీర్విమదాయ న్యూహథు రాఘవాయాభిరరుణీర శిక్షతం ।
యాభిః సుదాస ఊహథుః సుదేవ్యం తాభిరూషు ఊతిభిరశ్వినా గతం॥

"ఓ అశ్విద్వయులారా, మీరు ఏ సహాయముల ద్వారా విమదునికై భార్యను తెచ్చారో, ఎఱ్ఱని ఆవులను ప్రదానం చేశారో, సుదాసుకు సుదేవిని తెచ్చారో ఆ సహాయముల ద్వారా మీరు రండు "—కుత్స ఆంగిరసుడు.

25. సూర్య : ఈ పేరు కూడ కల్పితమే. ఈమెను సూర్యుని భార్య లేక పత్నిగా చెప్పుతున్నారు. కల్పితమైన పేరుతోనైనా సంగ్రహించబడిన యీ సూక్తం (10-85)లో ఆర్య పత్నిని గురించిన అనేక విషయాలు వచ్చాయి. ఈ సూక్తంలోని మంత్రాలను నేడుకూడ వివాహ సమయంలో చదువుతారు. సూర్య తన ఋక్కుల్లో యిట్లు చెప్పింది —

సత్యే నో త్తభితా భూమిః సూర్యేణో త్తభితా ద్యౌః ।
ఋతే నాదిత్యా స్తిష్ఠన్తి దివిసోమో అధిశ్రితాం ॥ 1
సోమేనాదిత్యాబలినః సోమేన పృథ్వీమహీ ।
అధోనక్షత్రాణా మేషాముపస్థే సోమ అహిత ః ॥ 2
రైభ్యాసీదమదేయీ నారాశంసీన్యోచనీ ।
సూర్యాయా భద్రమిద్వాసో గాథయైతి పరిష్కృతం ॥ 6
చిత్తిరా ఉపవర్హణం చక్షురా అభ్యంజనం ।
ద్యౌర్భూమికోశ ఆసీద్యదయాత్ సూర్యాపతిం ॥ 7
స్తోమా ఆసన్ ప్రతిధయః కురీరం ఛంద ఓపశః ।
సూర్యాయా అశ్వినావరాగ్ని రాసీత్ పురోగవః ॥ 8
సోమో వధూయురభవ దశ్వినా స్తాముభావరా ।
సూర్యాంయత్ పత్యేశం స న్తీం మనసాసవితా దదాత్ ॥ 9
మనో అస్యా అనఆసీద్ ద్యౌరాసీదుతాఛదిః ।
శుక్రావనడ్ వాహావాస్తాం యదయాత్ సూర్యాగృహం ॥ 10
శుచీతే చక్రేయాత్యావ్యానో అక్ష ఆహతః ।
నోమనస్మయం సూర్యారోహత్ ప్రయతీ పతిం ॥ 12
సూర్యాయావహతుః ప్రాగాత్ సవితాయ మవాసృజత్ ।
అఘాసు హన్య న్తే గావోఽర్జున్యోః పర్యుహ్యాతే ॥ 13
సుకింశుకం శల్మలిం విశ్వరూపం హిరణ్యవర్ణం సువృతం సుచక్రం।
అరోహ సూర్యే అమృతస్యలోకం స్యోనం పత్యేవహతుం కృణుష్వ॥ 20
ఉదీష్వాతః పతివతీహ్యేషా విశ్వావసుం నమసాగీర్భిరీళే ।
అన్యామిచ్ఛ పి తృషదం వ్యక్తాం సతేభాగో జనుషాతస్యవిద్ధి ॥ 21
సుమంగలీరియం వధూరిమాంసమేత పశ్యతి ।
సౌభాగ్యమ స్యైదత్వా యాథా స్తం విపరేతన ॥ 23
ఇహైవ స్తం మావియౌష్టం విశ్వమాయుర్ వ్యశ్నుతం ।
క్రీళన్తౌ పుత్రైర్నప్తృ భిర్మోదమానౌ స్వేగృహే॥ 42
ఇమాంత్వ మింద్రమీఢ్వః సుపుత్రాం సుభగాం కృణు ।
దశాస్యాం పుత్రనాధేహి పతిమేకా దశం కృధి॥ 45
సమ్రాజ్ఞీ శ్వశురే భవ సమ్రాజ్ఞీశ్వశ్ర్వాం భవ ।
ననాందరి సమ్రాజ్ఞీభవ సమ్రాజ్ఞీ అధిదేవృషు ॥ 46

"సత్యం వలన భూమి నిల్చి వుంది. సత్యం వలన ద్యౌ నిల్చివుంది. సత్యం వలన దేవ, ఆదిత్యులు ద్యౌయందు నిల్చి వున్నారు. ద్యౌయందు సోముడు ఆశ్రయం పొందివున్నాడు." 1

"సోమునికంటె ఆదిత్యుడు బలీయుడు. సోమునికంటె పృథ్వి మహత్తర మైంది. ఈ నక్షత్రములవద్ద సోముడు వుంచబడ్డాడు." 2

"రైభి (ఋక్కులు) అనుదేయి (వధువుతో దానముగ యివ్వబడు సఖి) నారా శంసీ (ఋక్కులు) వధువు దాసిలు. సూర్యధరించిన శ్రేష్ఠ వస్త్రం గాథచే పరి ష్కృతమైంది." 6

"సూర్య పతి వద్దకు వెళ్ళినప్పుడు చింతనం దిండు, చక్షువు అంజనం, ద్యౌ పృథ్వీలు కోశములై వున్నాయి. 7

"స్తోమములు యిరుసులు. కురీర ఛందస్సు ఆమె శిరోభూషణం, అశ్వినీ కుమారులు సూర్య వరులు, అగ్ని నేత." 8

"సోముడు పెండ్లి కూతురును కోరుచున్నాడు. అశ్విద్వయం వరులు, పతిని కోరుచున్న సూర్యను సవిత్రుడు తన మనసారా అశ్వినికుమారులకు యిచ్చాడు." 9

"సూర్య భర్త యింటికి వెళ్ళినప్పుడు మనస్సు యీమెకు శకటం, ద్యౌ కప్పు రెండు శుక్రములు రథానికి రెండు ఎడ్లు." 10

"వెళ్ళునప్పుడు యిరుసువందున్న ఆకులు శుభ్రంగా వున్నాయి. భర్తవద్దకు వెళ్ళే సూర్య మనోమయ రథంపై ఎక్కింది" 12

"సవిత్రుడు ఎవ్వనికి ప్రదానం చేశాడో ఆతడు సూర్యయొక్క పెళ్ళివారికి ముందుగా వెళ్ళాడు. మఘా నక్షత్రమందు ఎడ్లు చంపబడ్డాయి. పూర్వా - ఉత్తరా ఫాల్గుణులందు ఆమె పెండ్లి జరిగింది" 13

"ఓ సూర్యా, నానా రూపములు కల బంగారు వర్ణంతో, బాగా కప్పబడిన, సుందర కింశుకి, శాల్మలీ చక్రములుకల రథంపైన ఎక్కుము, వెళ్ళి భర్తను సుఖమయు అమృత లోకానికి వెళ్ళుటకై తయారు చేయుము." 20

"విశ్వావసు (వసులందరిని)ను నమస్కార పూర్వకవాణితో ప్రార్థిస్తున్నాము. మీరు యిక్కడనుండి లేవండి. ఈమె భర్తకలది. మీరు తండ్రి యింట కూర్చొని యున్న మరియొక తెలివికల కన్యను కోరండి. మీ కొరకు జన్మించిన అట్టి కన్యను వెదకుడు." 21

"ఈమె సుమంగళియైన వధువు. వచ్చి ఈమెను చూడండి. ఈమెకు సౌభాగ్యమును ప్రసాదించి మీరు మీమీ గృహములకు పొండు." 28

"మీ భార్యాభర్త లిరువురు యిక్కడే వుండండి. విడిపోవద్దు పూర్ణాయుస్సును పొందండి. పుత్రపౌత్రులతో ఆడుకొంటూ మీ యింటిలో ఆనందసోలికల మాగండి." 42

"ఓ యింద్రా, నీవు యీ వధువును సుపుత్రవతిగా, సౌభాగ్యవతిగా చేయుము. ఈమెకు పది పుత్రులను ప్రసాదించుము. వమనొకండవ వానిగా ఈమె భర్తను చేయుము" 45.

"ఓ వధూ, నీవు మామకు సమ్రాజ్ఞివై, అత్తకు సమ్రాజ్ఞివై, ఆడుబిడ్డకు సమ్రాజ్ఞివై, మరదులకు సమ్రాజ్ఞివై వుందువుగాక" 46.

ఋగ్వేదంలోని ఋషికల సంఖ్య రెండు డజనులు వున్నప్పటికీ వారిలో చారిత్రక ఋషికలు మాత్రం ఘోష, విశ్వవారలు. "నాడు స్త్రీలకు తగినంత స్థాన ముండేది. కాని పురుషులతో సమానంగా లేదు." అని ఋక్కుల వలన తెలుస్తుంది. ఆడబిడ్డపైన, మరిదిపైన, అత్తమామలపైన పెత్తనం చేయాలను కోరిక స్త్రీకి వుండేది. ఆమె తలనొప్పికి బలవత్తర కారణం నదతి.

—•—

# పదునెనిమిదవ అధ్యాయం

# భాష - కావ్యం

## 1. భాష

శౌనకుని పట్టిక ననుసరించి ఋగ్వేదంలో 10, 414 మంత్రాలు, 1,53,826 శబ్దాలు, 4,32,000 అక్షరాలు వున్నాయి. ఋక్కుల సంఖ్యను లెక్కించగా అవి 40 467 వున్నాయి. ఋగ్వేదాన్ని రెండు రకాలుగా విభజించారు : (1) మొదటి దానియందు మండలం. సూక్తం. ఋక్కుల (మంత్రం) క్రమం వుంది. ఋగ్వేదంలో 10 మండలాలు 1,017 సూక్తాలు, 10,414 మంత్రాలు వున్నాయి. (2) రెండవ దానియందు ఋగ్వేదంలో 8 అష్టకాలు, 64 అధ్యాయాలు, 1,017 సూక్తాలున్నాయి. మండలం; అనువాకం, వర్గమునుబట్టి లెక్కిస్తే ఋగ్వేదంలో 10 మండలాలు, 85 అనువాకాలు, 2,008 వర్గాలు (బాలఖిల్యాని 16 సూక్తాలను విడచిపెట్టి) వున్నాయి. మండలం. సూక్తం, ఋక్కుల క్రమం యీనాడు అన్నిటి కంటె ఎక్కువ ప్రచారంలో వుంది.

విభిన్నమైన మండలముల భాషను చూస్తే అన్నింటి భాష సమానంగా లేదని తెలుస్తుంది. ఋగ్వేద ఆర్యులు ఈరానీయులు. శకస్లావులు వున్న హిందూ-ఐరోపీయ వంశానికి చెందినవారు. ఈ కాలను శతమ్ కాల అంటారు. శతమ్ కాలంలోని ఏ జాతీ 'ట' వర్గాన్ని వుచ్చరించలేదు. కావున సప్తసింధులోకి వచ్చిన ఆర్యులు 'ట' వర్గమును (మూర్ధన్య వర్ణమును) పలుక కలిగేవారు కాదనుట నిశ్చితం. ఋగ్వేదంలో ఆదియందు 'ట' వర్గీయాక్షరమున్న ఏ శబ్దమూ లేక పోయి నప్పటికీ మూర్ధన్య వర్ణముల ప్రయోగం అవశ్యం లభిస్తుంది. ఈ 'ట' వర్గము ఎప్పటి నుండి ఆర్యుల్లో వాడుకలోకి వచ్చింది? సప్తసింధులోని ప్రాచీన జాతితో గాఢ సంబంధం చేతనే ఉచ్చారణలో యీ మార్పు వచ్చినదనుట నిశ్చయం. ద్రావిడ భాషల్లోని ట వర్గం యొక్క ప్రాచుర్యం ఉత్తర భారతీయుల చెవులకు యీనాడు కూడ బాధాకరంగా వుంటుంది. సప్తసింధులోకి ఆర్యులు ప్రవేశించిన మూడు వందల సంవత్సరాల పిమ్మట ఋగ్వేద మహర్షులు జన్మించారు. వారు

ట వర్గమును పల్కే వారవి చెప్పుట మంభం కాదు. ఎందుకంటే శతాబ్దాల వరకు ఋక్కులు లిపి బద్ధం చేయబడక కంఠస్థం చేయబడి వున్నాయి. మూల పాలీ త్రిపిటకాలు (బుద్ధుని సూక్తులు) మాగదీ- కోసలీ భాష యందున్నాయి. అందు ల, శ అక్షరాలు ఎక్కువగాను, ర, స అక్షరాలు చాలవరకు లేనట్లుగా వుంది. కాని నేటి పాలీ త్రిపిటకంలో మాగధీ భాష యొక్క యీ విశేషాక్షరాలను విషేధించినట్లు వుంది. 'శ' ప్రయోగం బొత్తుగా లేదు ఈ మార్పుకి కారణ ముంది. శతాబ్దాల వరకు బుద్ధుని సూక్తులు మాగధీ భాషీయుల్లో లేకుండా పశ్చిమ భాషా భాషీయుల్లో ముఖ్యంగా లాట్- గుజరాతుల నుండి వెళ్ళిన ఉప వివేకుల కంఠంలో వున్నాయి. అందుచేతనే యీ మార్పు జరిగింది. కాబట్టి ఋక్కుల రచనకు, అవి లిపిబద్ధం అయిన కాలానికి మధ్యలో అక్షరములందు మార్పు జరిగి వుండదు అని మనం చెప్పలేం. వైదిక భాషా ప్రకాండ విద్వాంసుడు డాక్టరు బటే కృష్ణఘోష్ ఋగ్వే దాక్షరముల, వాని వుచ్చారణ గురించి సూక్ష్మ వివేచన చేశారు. ఆర్యుల భాషలో మూర్ధన్య వర్ణముల ప్రచారం వారు భారతదేశానికి వచ్చిన పిమ్మటనే జరిగింది. డా॥ ఘోషు 'ర' కంటె 'ల' యొక్క ప్రాచుర్యత, ఆర్యులు భారతదేశంలో తూర్పుకు సాగిన ప్రభావం అంటారు. కాని స్లావు భాషల్లో కూడ 'ర' కు బదులుగా 'ల' ప్రయోగం అధికంగా వుంది. కాబట్టి 'ర' కు బదులుగా 'ల' ప్రాచుర్యానికి సంబంధించిన ప్రశ్న వరకు అది శతమ్ వంశానికి చెందిన యితర శాఖల్లో కూడ కానవస్తుంది, అని మనం అంగీకరించవలసి వుంటుంది.

భాషా ప్రశ్నకు సంబంధించినంతవరకు ఋగ్వేదంలోని తొమ్మిది మండలముల భాష ఒకే మాదిరిగా వుంది: పదవ మండలం భాషలో అవశ్యం మార్పువుంది, అను నిర్ణయానికి డా॥ ఘోషు వచ్చారు. (The Vedic Age pp 33-40) పదవ మండలంలో కూడ ఎన్నో ఋక్కులు, ఎన్నో సూక్తముల భాష ప్రాచీనంగా అగపడుతుంది. ఇంతేకాదు, యితర మండలాల్లో ఎన్నిటి భాషో నవీనంగా తోస్తుంది. అయినప్పటికీ మొదటి తొమ్మిది మండలాల భాష పురాతనమైంది అని అంగీకరించుటకు బహుశా ఏ ఆక్షేపణ వుండరాదు. ఈ తొమ్మిది మండలాల్లో కూడ ఋషుల కాల క్రమాన్ని చూచినట్లయితే మొదట భరద్వాజ మండలం (ఆరవ మండలం) తర్వాత వసిష్ఠ మండలం (ఏడవది), విశ్వామిత్ర మండలం (మూడవది), వామ దేవ మండలం (నాల్గవది) వస్తాయి. ఈ భాషాభేదం భరద్వాజుని యొక్కయు, (6- -1,2) రక్షోహా యొక్కయు ఋక్కులను (10-162-1-2) పోలిస్తే తెలియ గలదు.

త్వం హ్యగ్నే ప్రథమో మనోతాస్యాధియో అభవో దస్మహోతా ।
త్వం సీం వృషన్నకృ ర్దుష్టరీతు సహో విశ్వస్మై సహసే సహధ్యై॥ 1

"ఓ అగ్నీ, నీవు యీ బుద్ధికి ప్రథమ మనన కర్తవు. అద్భుతమైన హోతవు. ఓ వీరుడా! నీవు మాలో దుర్ధర్షమైన బలము వంతటినీ పుత్పన్నం చేయుము. దానిచే మేము శత్రుల నందరినీ ఓడించగలం." 1

అధాహోతా న్యసీదో యజీయానిళ స్పద ఇషయన్నీడ్యః సన్ ।
తం త్వా నరః ప్రథమం దేవయంతో మహోరాయే
చియంతో అనుగ్మన్ ॥ 2

"ఓ స్తుతి యోగ్యహోతా, పూజనీయుడవై నీవు పూజ్యస్థానముందు అన్న మిస్తూ విరాజిల్లుము. నిన్ను ప్రధానమైన దేవునిగా అనుకొంటూ మహా ధనమును కోరుతూ మానవులు నిన్ను అనుగమిస్తారు." 2

(భరద్వాజుడు (6-1-1-2)

బ్రహ్మణాగ్నిః సంవిదానో రక్షోహా బాధతామితః ।
అమీవాయస్తే గర్భం దుర్నామా యోనిమాశయే॥ 1

"రాక్షసాంతకుడైన అగ్ని మా బ్రహ్మతో (ఋక్కు, స్తుతితో) ఏక మవుగాక. ఇక్కడనుండి నీ గర్భరోగాన్ని యోనిస్థానమందున్న రోగాన్ని అతడు తొలగించు గాక." 1

యస్తే గర్భమమీవా దుర్ణామా యోనిమాశయే ।
అగ్నిష్టం బ్రహ్మణా సహ నిష్క్రవ్యా దమనీనశత్॥ 2

"నీ గర్భమందున్న రోగాన్ని, యోనిస్థానమందున్న రోగాన్ని బ్రహ్మతో పాటు (మంత్రంతోపాటు) అగ్ని దాన్ని ఆమాంసభక్షణగా చేసి నాశనం చేయుగాక." 2 రక్షోహా బ్రహ్మపుత్ర (10-162-1,2)

ఋగ్వేదభాష అత్యంత పురాతనమైంది. తార్కుయుగీన వ్యవస్థ భాష. పాలి. ప్రాకృతం, అపభ్రంశం, మరియు మన భాషలు ఆధునిక కాలంలోకి ప్రవేశించినంతగా వైదికభాష అంతగా వికాసాన్ని చేరుకోలేదు. ఈ ప్రకారంగా వైదిక భాషను అపరిచితమైన, దురూహ్యామైన శబ్దములు కల భాషగా చెప్పుతారు. కాని భాష యొక్క ప్రకృతికి సంబంధించినంతవరకు అది సరళంగా వుంటాలి. ఎన్నో విషయాల్లో అది సరళమైంది కూడ. ఆ భాషను మనం పాణినీ సంస్కృతాన్ని

ఆధారం చేసుకొని చదవా లనుకొంటున్నాం కాబట్టి ప్రతి పాణినీయ నియమునకు వున్న అపవాదం (మినహాయింపు)ల సంఖ్యను చూచి వైదిక భాషా ప్రకృతి అత్యంత క్లిష్టమైన దనుకొంటున్నాం. కాని వేదభాషను వైదిక ఉదాహరణములతో అనగా వైదిక పాఠమూలాల సహాయంతో అధ్యయనం చేస్తే ఆ భాష తప్పక సరళంగా తోస్తుంది. భాష ఎక్కువ సరళం అనుటకు అర్థం సందిగ్ధ మనుటకూడ వుంది. చైనాభాష ప్రపంచభాషల్లో మిక్కిలి సరళమైంది. ఇక్కడ దాని లిపిని గురించి చెప్పటలేదు. ఆ లిపి నిశ్చయంగా చాల కఠినమైంది. చైనా భాషయొక్క పూర్తి వ్యాకరణాన్ని వ్రాయుటకు బహుశా 5/6 పేజీలుకూడ అవసరముండదు. కాని యిందుచేత ఆ భాషకు సందేహాస్పదమైన విషయాలు కూడ వుండుటకు అవకాశముంది. క్రియలందు వచనం, కాలం, పురుషలు అంటూ లేవు. మాట్లాడు నప్పుడు స్వరముల ఆరోహ, అవరోహములబట్టి సందిగ్ధాన్ని అసందిగ్ధం చేసుకొనుటకు ప్రయత్నం జరుగుతూవుంది. వైదిక కాలంలో ఒకే క్రియయొక్క కాలాన్ని నిశ్చయించకుండా పాఠకుడు ప్రకరణాన్నిబట్టి అర్థం చేసుకొనవలసిన ఆగత్యం కల్గించబడు తుండేది. "భవతి" అర్థంవున్న "వుండుగాక" రెండూను, వైదికభాషలో యిటువంటి అనిశ్చిత అపవాద పూర్ణక్రియ పదాలను "లేట్‌లకారంలో" చేర్చారు. ఈ విధంగా వైదికభాష కాఠిన్యాన్ని కాదనలేము. కాని సంస్కృతం ద్వారా కాకుండా ఋక్కులద్వారా వచ్చిన వ్యాకరణాన్ని. దాని ప్రయోగాలద్వారా నేర్పినట్లయితే ఈ భాష అంత కఠినంగా తోచదు.

శబ్దములకు సంబంధించినంతవరకు ఋగ్వేదంలోని ఎన్నో శబ్దాలు వేరే అర్థంలో ప్రయోగింప బడుతున్నాయి. కారు శబ్దమున్నది. పనిచేయు వానిని కారు అనాలి. కాని ఋగ్వేదంలో కవిని కారు అంటారు. అతడు ఋక్కులను రచిస్తాడు (చేస్తాడు.). ఈ విధమైన యితర శబ్దములుకూడ ఋగ్వేదంలో వున్నాయి.

సంధి నియమాలను ఋగ్వేదంలో పాటించలేదు. అచ్చు తర్వాత అచ్చు వచ్చినప్పటికి దాన్ని అట్లాగే వుంచారు.

## 2. ఛందస్సు

ఋక్కుయొక్క అర్థం పద్యం. ఋగ్వేదమంతా పద్యబద్ధం. ఏడు ఛందములు ప్రసిద్ధములు. కాని ఛందముల సంఖ్య యింకా ఎక్కువగావుంది. యజ్ఞఋషి ఋక్కుల్లో (10-130-4-5) గాయత్రి, ఉష్ణిక్ అనుష్టుప్, బృహతి, విరాట్, త్రిష్టుప్

జగతి— యీ ఏడు ఛందములు పేర్కొన బడ్డాయి. ఇవే మూల ఛందములుకూడ. గానముకొరకు గాయత్రి ఛందం అన్నిటికంటె ప్రచారంలోవుంది. అని మేము యిది వరలో తెల్పియున్నాం సోమపానం చేసేటప్పుడు ప్రతియొకని కంఠం విప్పుకొంటుంది, నేడుకూడ మద్యం త్రాగేటప్పుడు మనమీ విషయాన్ని చూస్తూనే వున్నాం. ఋగ్వేదంలోని తొమ్మిదవ మండలం సోమ మండలం. అందు నూటికిపైగా ఋషులు సోమ గుణాలను గానంచేశారు. ఈ మండలంలోని ఋక్కులు చాలా వరకు గాయత్రి ఛందంలో వున్నాయి. గాయత్రి ఛందం గానాన్ని గాయత్రి సోమ మంటారు.

ఋగ్వేదంలో 10,414 మంత్రాల్లోని ఛందములు :

| | | |
|---|---|---|
| 1. | గాయత్రి | 2,467 |
| 2. | ఉష్ణిక్ | 341 |
| 3. | అనుష్టుప్ | 855 |
| 4. | బృహతి | 181 |
| 5. | త్రిష్టుప్ | 4,253 |
| 6. | పంక్తి | 312 |
| 7. | జగతి | 1,348 |
| 8. | అతిజగతి | 17 |
| 9. | శాక్వరి | 19 |
| 10. | అతిశాక్వరి | 9 |
| 11. | అష్టి | 6 |
| 12. | అత్యష్టి | 84 |
| 13. | ధృతి | 2 |
| 14. | అతి ధృతి | 1 |
| 15. | ఏకపాదం కలవి | 6 |
| 16. | రెండు పాదాలు కలవి | 17 |
| 17. | ప్రగాథ బార్హత | 194 |
| 18. | కకుభ | 55 |
| 19. | మహా బార్హత | 257 |

దీన్నిబట్టి 300 కంటె ఎక్కువ వ్యాఖ్యాలు వచ్చిన ఛందములు గాయత్రి, ఉష్ణిక్, అనుష్టుప్, పంక్తి, త్రిష్టుప్, జగతి. వీటిలో కూడ అన్నిటికంటే ఎక్కువ ఉపయోగింపబడిన ఛందం త్రిష్టుప్, తర్వాత గాయత్రి మూడవది జగతి. నాల్గవది అనుష్టుప్. తర్వాత సంస్కృతంలో అనుష్టుప్ ఎక్కువగా వాడబడింది. గాయత్రిని గానం చేయుటకు అంతిమ చరణాన్ని మరొకసారి అనాలి. అప్పుడది కూడ అనుష్టుప్ అవుతుంది. ఈ రెంటిని ఏకం చేసినప్పుడు అనుష్టుపుల సంఖ్య 3322 అవుతుంది.

# 3. రచన

1. వాణి : పద్య రచనను వాణి అన్నారు. వసిష్ఠుడు 7-31లో చెప్పాడు

ఇంద్రం వాణీరను త్తమన్యు మేవస్త్రా రాజానందధిరే సహధ్యై హర్యశ్వాయ బర్హయా సమాపీన్—12

శత్రువులను అణచుటకు "వాణి అప్రతిహతమైన క్రోధంకల ఇంద్రుని శాశ్వతంగా రాజును చేసింది. ఇంద్రుని కొరకు శక్తులను వృద్ధిచేయండి."

2. సూక్తం : వసిష్ఠుడు సూక్తాన్ని కూడ పేర్కొన్నాడు (7-29-3)

కాతే అస్త్యరజ్ కృతి సూక్తైః కదా నూనంతే మఘవన్ దాశేమ ।
విశ్వామ తరాతత నేత్వాయూధామ ఇంద్రశృణవో హవేమా ॥

"ఓ మఘవన్, మేము సూక్తములద్వారా నిన్ను స్తుతించునప్పుడు నీకెంత తృప్తి కల్గుతుంది? నీ కొరకు మేము స్తుతుల నన్నిటినీ రచిస్తున్నాం. ఓ యింద్రా, [illegible]ను వినండి."

[illegible]మరుత్తులారా! యీ సూక్తాన్ని స్వీకరించండి" (7-58-6)

3. శ్లోకం : శ్లోకం కూడ ఋగ్వేదములో పేర్కొనబడింది. కాని కీని అర్థం పుణ్య శ్లోకంలో వున్నదే. అనగా శ్లోకమంటే అర్థం ప్రశంస, కీర్తి. కణ్వుడు (1-38-14) చెప్పాడు.

"మిమీహి శ్లోకమాస్యే పర్జన్య ఇవ తతనః
గాయ గాయ త్రముక్థ్యం"
"నోటితో శ్లోకం రచించి మేంఘవలె
విస్తరించుము, గాయత్ర గానాన్ని గానం చేయుము."

4. సామం : గీతికను సామ మన్నారు. ఋగ్వేదంలోని అనేక ఋక్కులను గానంతో సంగ్రహించారు. ఈ సంగ్రహాన్ని సామ వేదమన్నారు. సామవేద మంత్రాలలోను ఋగ్వేదంలోని మంత్రములు మారకుండా తక్కువే. కుత్సఋషి సామంతో విశ్వదేవుల స్తుతిని పేర్కొంటూ చెప్పాడు. (1-107- )

ఉపనో దేవా అవసాగమన్ త్వంగిరసాం సామభిః
స్తూయ మానాః ॥
"సామముల ద్వారా స్తుతించబడిన దేవులు
రక్షణలతో మా వద్దకు వచ్చెదరు గాక."
గృత్సమద ఋషి త్రిష్టుప్. గాయత్రీ సామం గూర్చి ఉల్లేఖించాడు. (2-43-1)

"ఋతువులందు పక్షులవలె శకిపైన కవులు స్తోత్రములు చేస్తున్నారు. సామ గాయకులు గాయత్రమును, త్రైష్టుభమును రెండు వాణుల్లోను గానం చేస్తూ ఆనందింప చేస్తున్నారు." కణ్వ గోత్రికుడగు కుసీది ఋషి చెప్పాడు.

"ఓ ఇంద్రా, గేయమాన సామం వినుము. నీ స్తుతి గానం చేస్తున్నాం. నీవు మాపై కృపతో అన్నాన్ని ప్రసాదించుము." (8-70-5)

5. స్తోమం : స్తుతిని, సోమమును ఆ కాలంలో స్తోమం అనేవారు. కుత్స అంగిరసుడు ఇంద్రుని, అగ్నిని స్తుతిస్తూ అన్నాడు.

"ఓ ఇంద్రాగ్నులారా, మీరు అల్లునికంటెను, బావమరది కంటెను కూడ ఎక్కువగా ఇచ్చేవారని విన్నాం. కావున సోమప్రదాన సమయంలో నేను మీ కొరకు నూతన స్తోమమును రచిస్తున్నాను." (1-109-2)

# 4. కావ్యం

దానసూక్తం (8-33-1-18)ను పురూరవ- ఊర్వశీ సూక్తం (10-95) చూచినచో ఋగ్వేద ఆర్యుల్లో మనోహర కవితా శైలి వున్నట్లు తెలుస్తుంది. కాని ఋక్కులను కవితా దృష్టితో సురక్షితంగా వుంచలేరు. దేవతలను ...గా చేయుటయే ఆ ఋక్కుల ప్రయోజనం. ఆ కాలంలో మధుర జానపద వీర గాథలు (పవాడాలు జానపథాలు,) వాడుకలో వుండుట సంభవమే. ఆనాడు ఎంతగానో ఆదరించేవారు కూడ.

ఉపమ : కవిత్వాన్ని అలంకరించుటలో ఋషులు అలంకారములను కూడ వుపయోగించారు. అలంకారాల్లో అన్నిటి కంటె ఎక్కువగా ఉపమాలంకారాన్ని వుపయోగించినట్లుగా కన్పడుతూ వుంది. అందులకు 'ఇవ' లేక అదే అర్థంలో 'న'ను ఎక్కువగా వుపయోగించారు. గృత్సమదుడు ఒక సూక్తంలో ప్రతి పంక్తి లోను ఈ ప్రయోగం ఒకటికంటే ఎక్కువ పర్యాయాలు చేశాడు. (2-39-1,8)

"అశ్వినీ కుమారులారా, రాతివలె శత్రువును బాధించండి. గ్రద్దవలె విధితో కూడిన వృక్షాన్ని పొందండి బ్రహ్మవలె యజ్ఞమందు ఉక్థలు గానంచేయు వారుందుగాక, దూతవలె అనేకులకు ఆహ్వానింపతగిన వారగుగాక."

ఈ సూక్తమందు యింకా ఉపమానాలున్నాయి. రథి, అజ (మేక), స్త్రీ, దంపతి, కొమ్ము, ఖురము (గిట్టలు) చక్రవాకము, నావ, యిరుసు, నాభి, ఉపధి, ప్రధి, కాలు కర్వాణము, వర్మము, వాత (గాలి) నది, చేయి, పాదము, ఓష్ఠము స్తనము, నాసిక, కర్ణము, పృథ్వీ, శానము, అద్దము. ఇన్ని ఉపమాలు ఏడు త్రిష్టుప ఋక్కులందు వుపయోగించబడ్డాయి. అన్నిటికి "ఇవ" వుపయోగించి చివరకు ఋషి యిట్లు అన్నాడు — (2-39-8)

'ఓ అశ్వినీ కుమారులారా, గృత్సమదుడు మిమ్ములను అభినందిస్తూ మంత్రాలను స్తోమాలను రచించాడు. ఓ నరులారా, వాటిని స్వీకరిస్తూ మావద్దకు రండి. యజ్ఞమందు సుందరమైన వీర్యవంతులమై మేము అధికంగా చెప్పెదము గాక."

వాజంభర పుత్రుడు సప్తి క్రియ యొక్క ఉపమాను "ఇవ"తో యిచ్చాడు (10-79-6)

"ఓ బంగారు వర్ణంగల అగ్నీ, నీవు దేవులపై కోపగించితివా ఏమిటి? ... యిక నిన్ను అడుగుతున్నాను. అవును కత్తి ముక్కలు ముక్కలు చేసి కోస్తున్నట్లు నీవును అడుతూ పాడుతూ చిన్నా భిన్నం చేస్తావు."

విశ్వామిత్రుడు తన సుందర కావ్యమైన నదీ సూక్తంలో (3-33) వ్యాస నదులకు ఉపమాను 'ఇవ' పదం చేర్చి అశ్వ, గౌ, రథీ, వత్స, యోష (తల్లి), మర్యక (వరుడు)లతో ప్రయోగించాడు. 'న'తోకూడ వున్న వుపమాలు ఋగ్వేదంలో వున్నా ఈ ప్రయోగం తర్వాతలేదు. 'న' "లేదు", "కాదు" అను అర్థంలో కూడ గంలో వున్నందున సందిగ్ధ మేర్పడు చున్నందున ఉపమార్థంలో 'న' ప్రవదిలేశారు. భరద్వాజుడు అన్నాడు—

"ఓ అగ్నీ నీవు దీప్తిమంతుడవు. నీ ఉజ్వల ధూమం విస్తృత ద్యులోకమందు ప్రసారితమై వుంది. ఓ పావకుడా, కృపాయుడవై నీ కాంతితో సూర్యునివలె (సూరోన) ప్రకాశిస్తున్నావు." (8-'-8)

"ప్రజలందు నీవు పూజ్యుడవు, మాకు ప్రియమైన అతిథివి, పురమందు వృద్ధునివలె ప్రసన్నుడవై, (సూనుర్న) సూనువి (శిశువు)వలె పోషింప బడుదువు గాక."....7

"ఓ అగ్నీ, నీవు మర్దనతో ద్రోణమందు ప్రకాశిస్తున్నావు. అశ్వంవలె కార్యకర్తవు. అన్నిచోట్లకు పోవు వాయువువలె స్వయంగా పోగలవాడవు. గుర్రము వలె (అశ్వోన) వక్రంగాపోవు శిశువై వున్నావు." 8

తర్వాత సూక్తంలో (8-3 4-8) భరద్వాజుడు 'న' తో కూడిన ఉపమాను అశ్వ ద్రవి, వరకు. అయస్సు వక్షి, రేభ, ద్యౌ, ఘృణ, విద్యుత్, ఋభుంతో చెప్పాడు.

## 5. కవులు

వసిష్ఠుని కొన్ని కావ్యమయ ఋగ్వేద సూక్తుల పరిచయం మీకు మేము యిదివరలో యిచ్చాం. వసిష్ఠుడు ఒక సూక్తంలో (7-75) తిషస్సును చాల అందంగా వర్ణించాడు

అవో దివిజా ఋతేనా విష్కృణ్వానా మహిమాన మాగాత్ ।
అవద్రుహ స్తమ ఆవరజుష్ట మంగిరస్తమా పథ్యా అజీగః ॥ 1
వితేత్యేభా నవో దర్శతా యాశ్చిత్రా ఉషసో అమృతాన ఆగుః ।
జనయుంతో దేవ్యాని ప్రకాన్యా పృణన్తో అంతరిక్షా వ్యస్థుః ॥ 3
విషాప్యాయు జానా పరాకాత్ పంచక్షితీః పరిసద్యో జిగాతి ।
అభివశ్యన్తీవ యునాజనానాం దివోదుహితా భువనస్యపత్నీ ॥ 4
వాజినీవతీ సూర్యస్య యోషా చిత్రామఘారాయ ఈదేవసూనాం ।
ఋషిష్టుతా జరయన్తీ మఘోన్యుషా ఉచ్ఛతి వహ్నిభిర్గుణానా ॥ 5
ప్రతి ద్యుతా నామరుషాసో అశ్వాశ్చిత్రా అదృశ్రమ్నుషసం వహన్తః ।
యాతిశుభ్రా విశ్వపిశారథేన దధాతి రత్నం విధతేజనాయ ॥ 6
సత్యానత్యేభిర్మహతీ మహద్భిర్దేవీ దేవే భిర్యజతా యజత్రైః ।
రుజద్దృళ్హాని దదుస్రియాణాం ప్రతిగావఉషసంవావశన్త॥ 7

నూగోమద్వీరవద్దేహి రత్నము అశ్వావత్ పురుభోజో అస్మే ।
మానోబర్హిః పురుషతానిదే కర్యాయం పాత స్వస్తిభిః సదానః ॥ 8

"ద్యౌపుత్రి ఉషస్సు ప్రకాశించింది. ఆమె సత్యంతో తన మహిమను ప్రకటిస్తూవచ్చింది తమస్సును తొలగించింది. జీవుల శ్రేష్ఠతమ మార్గాన్ని ప్రకాశింప చేసింది." 1

"ఉషస్సుయొక్క దర్శనీయ, విచిత్ర, అమృత కిరణాలు వచ్చాయి. ఆమె దివ్యకర్మల ఉత్పన్నం చేస్తూ అంతరిక్షాన్ని నింపుతూ విస్తివుంది." 3

"అదిగదిగో ద్యౌపుత్రి ఉషస్సు, భువనరక్షిక, గణముల జ్ఞానాన్ని ప్రకాశింప చేస్తూ శీఘ్రమే పంచగణాల వలపై పులకు చేరుతూవుంది." 4

"సూర్యుని భార్య ఉషస్సు అన్నము కలది. విచిత్రమైంది. ధనవంతురాలు. ధనంకొరకు వసువుల (ధనమును) కాసిస్తూవుంది. జరను (ముసలి తనాన్ని) జీర్ణం చేస్తూ, ఋషుల ప్రశంసలను అందుకొంటూ, ఋత్విజుల స్తుతులను స్వీకరిస్తూ ఉషస్సు ప్రకాశిస్తూవుంది." 5

"ప్రకాశించుచున్న ఉషస్సును మోయుచున్న విచిత్రాశ్వములు కన్పట్టుతూ వున్నాయి. శుభ్రవర్ణంతో, నానా రూపాలతో ఆమె రథంపై పోతూవుంది. ఆమెను పేపించువారలకు రత్నములిస్తూ వుంది." - 6

"ఉషస్సు సత్యములతో సత్యమై, గొప్పవారితో గొప్పదై, దేవులతో దేవియై, పూజ్యులతో పూజనీయయై, దృఢమైన దుర్గములను భేదిస్తూ, గోవులను మేపుతూ వుంది. గోవులు ఉషస్సు కొరకు రంకె వేస్తున్నాయి." —7

"ఓ ఉషస్సా. మాకు నీవు గోవులతో పాటు, వీరులతో పాటు రత్నాలను యిమ్ము. అశ్వాలతోపాటు బహు భోగాలిమ్ము. పురుషుల ఎదుట మా యజ్ఞాన్ని నిందించకు. నీవు ఎల్లప్పుడూ మాకు ఆరోగ్యం యిస్తూ రక్షించుము."—8

2. విశ్వామిత్రుడు : విశ్వామిత్రుడు కూడా అనేక సూక్తములను ఉషస్సును ప్రశంసిస్తూ వ్రాశాడు వాటిలో ఒక సూక్తంలోని ఋక్కులను యిక్కడ పొందుపరుస్తున్నాం :

ఉషోవాజేన వాజిని ప్రచేతాః స్తోమంజుషస్వ గృణతో మఘోని।
పురాణీదేవి యువతిః పురంధి రనువ్రతం చరసి విశ్వవారే॥-1

ఉషో దేవ్యమర్త్యా విభాహి చంద్రరథా సూనృతా ఈరయన్తీ।
ఆత్వావహన్తు సుయమాసో అశ్వా హిరణ్యవర్ణాం పృథుపాజసో యే॥-2
ఉషః ప్రతీచీ భువనాని విశ్వోర్ధ్వా తిష్ఠస్యమృతస్య కేతుః।
సమానమర్థం చరణీయమానా చక్రమివ నవ్యస్యావ వృత్స్వ॥-3

"ఓ ఉషస్సా, నీవు ధనికురాలవు. శక్తివలన శక్తిమతివి, జ్ఞానివి, స్తుతికర్త స్తోమమును (స్తుతిని) గ్రహించుము. ఓ దేవీ, నీవు ప్రాచీన యువతివి. బహు బుద్ధి మంతురాలవు, అందరకు వరణీయవు. నీవు అనువ్రతవు" 1

"ఓ ఉషస్సా. నీవు అమరదేవివి. బంగారు రథం కలదానివి. నీవు మధుర వాణిని ప్రేరేపిస్తున్నావు. బంగారు వర్ణంకల విన్నా సుశిక్షితములైన, బహు బలీయములైన అశ్వములు మోయుగాక." 2

"ఓ ఉషస్సా, నీవు భువనము లన్నిటి పైనా అమృత ధ్వజంగా నిల్చి వున్నావు. ఓ నవీనా, నీవు రథంపై చరిస్తూ చక్రంవలె మాటి మాటికి తిరుగుము." 3

3. వామదేవుడు : ప్రధానమైన ఋషులందరూ ఉషా మహిమ కీర్తించగా వామదేవుడు వెనుకబడి ఎట్లా వుంటాడు? ఆయన యిట్లు చెప్పాడు- (4-51).

ఇదముత్యత్ పురుతమం పురస్తా జ్జ్యోతి స్తమసో
వయునా వదస్థాత్ ।
నూనం దివో దుహితరో విభాతీర్గాతుం
కృణ వన్నుష సోజనాయా ॥

"చీకటి మధ్యనుండి అదిగదిగో తూర్పు దిక్కున శక్తివంతమైన అతి విశాలమైన జ్యోతి లేచింది. నిశ్చయంగా గమనుల హితమును చేకూరుస్తూ ద్యౌ దుహితలు ఉషస్సులు ప్రకాశిస్తున్నాయి."

"యజ్ఞములందు యూపములవలె తూర్పు దిక్కున అమృతమైన ఉషస్సులు బయలుదేరి వున్నాయి. బాధించే చీకటి ద్వారాన్ని తెరుస్తూ ఆ వుషస్సు దీప్తమై పవిత్రమై ప్రకాశిస్తూవుంది." -2

"ఓ ధనవతీ, అంధకారాన్ని పారద్రోలు, ఉషస్సులు భోజన దానంకొరకు, అన్నదానం కొరకు అన్నదాతలను ప్రేరేపిస్తున్నాయి. పణులు అంధకారమందు మేల్కొనకుండా. స్పృహలేకుండా నిద్రింతురుగాక." -3

"ఓ ఉషాదేవతలారా, మీరు నిద్రించుచున్న ద్విపాద, చతుష్పాద ప్రాణులను మేల్కొల్పుతూ సత్యంతో కట్టబడిన అశ్వాలతో క్రమంగా భువనముల వలువైపుల వెళ్ళుతూ వున్నారు." -5

"ఋషులు ఏ వుషస్సుకొరకు విధానాలు చేసెనో, ఆ వుషస్సు ఎక్కడః అది ఎంత పురాతనమైంది? శుభ్ర వుషస్సులు శుభంగా విచరిస్తూన్నప్పుడు ఆమె ఎన్నడూ పురాతనంగాను, ఒకే మాదిరిగాను గుర్తించబడదు." 6

మళ్ళీ మరియొక సూక్తంలో (4-52) వామదేవుడు సర్వప్రియమైన గాయత్రీ ఛందంలో ఉషస్సును గానం చేశారు.

ప్రతిష్యా సూనరీ జనీవ్యుఛ్ఛన్తీ పరిస్వసుః । దివో అదర్శిదుహితా॥ -1
అశ్వేవ చిత్రారుషీమాతా గవామృతావరీ । సఖా భూదశ్వినోరుషాః॥ -2
ఉత సఖాస్యశ్వినోరుత మాతా గవామసి । ఉతోషో వస్వ ఈశిషే॥ 3
యావ యద్ ద్వేషసస్త్వాచికిత్విత్ సూనృతావరి । ప్రతిస్తోమైరభూత్స్మహి॥-4
ప్రతిభద్రా అదృక్షతగవాంసర్గాన రశ్మయః । ఓషా అప్రా ఉరుజ్రయః । -5
ఆవ వృషే విభావరి వ్యాసర్జ్యోతిషా తమః । ఉషో అనుస్వధామవ ॥ -6

"అంధకార నాశిని, ద్యౌదుహిత, హర్షదాయిని, సునాయిక, ప్రశంసిత ఉషస్సు రాత్రిని తొలగిస్తూ కన్పిస్తూవుంది." -1

"గుర్రంవలె విచిత్రమైన, ఎర్రని గో (కిరణముల)మాత, తేజస్వి ఉషస్సు అశ్వద్వయమునకు సఖి అయింది." -2

"ఓ ఉషస్సా. నీవు అశ్వద్వయానికి సఖివి లేక గోవులకు (కిరణములకు) మాతవు లేక ధనమునకు అధీశ్వరివి." -3

మధురభాషిణీయైన నీవు శత్రువులను పారద్రోలుము, జ్ఞానం యిమ్ము, మేము స్తోత్రముల ద్వారా నిన్ను కలుసుకొనుటకు మేల్కొనుచున్నాం." -4

"అపులమంద వలె ఆమె భద్రకిరణాలు కన్పడ్డాయి. ఉషస్సు తన విస్తృత మైన తేజస్సుతో విశ్వాన్ని నింపింది" -5

"ఓ విభావరీ, నీవు నీ వెలుగుద్వారా చీకటిని పోగొట్టావు. ఓ ఉషస్సా, అన్నాదులను రక్షించుము." -6

"ఓ ఉషా, నీవు నీ కిరణములతో ద్యౌని, విశాలమైన, ప్రియమైన అంత రిక్షాన్ని ప్రసరింపచేయుము. నీవు నీ ఉజ్వల కిరణాలతో వ్యాపిస్తున్నావు." -7

ఊర్వశీ పురూరవుల సూక్తం ఋగ్వేదంలో లఘు సుందర ఖండ కావ్యం. దాన్ని మేము యిదివరలో ఉదాహరించి వున్నాం.

ఋషులు తమ కృతులను కావ్యమనేవారు అని వామదేవుని (10-55) సూక్తం వలన తెలుస్తుంది. ఈ సూక్తం రచించిన ఋషి వామదేవపుత్ర బృహదుక్థ అని చెప్పుచున్నప్పటికీ బృహద్ ఉక్థ వామదేవుని మానససంతానం కావచ్చును. అతడు యింద్రుని ప్రశంసిస్తూ యిట్లు చెప్పాడు - "యుద్ధమందు అనేక యువ శత్రువు లున్నప్పటికీ వారు ఎవరి భయంచేత పారిపోయారో, అతడు శ్వేత కేశుడయ్యాడు. నిన్న జీవించినవాడు నేడు మరణించాడు. దేవతల మహత్వ పూర్ణ కావ్యాన్ని చూడండి." -5

4. భౌముడు : అత్రి సంతానం భౌముడు పర్జన్యుని స్తుతించిన సూక్తంకూడ చాల సుందరమైంది. (5-83)

"ఈ వాణులతో పర్జన్య శక్తిని ప్రశంసించుము. నమస్కరించి పర్జన్యుని స్తుతించుము, జలమును వర్షించు, దానశీలుడైన, గర్జించు మేఘం ఓషధులందు వీర్యం పొందుతుంది." 1

"ఆ పర్జన్యం వృక్షాలను నాశనం చేస్తుంది. రాక్షసులను హతమారుస్తుంది. మహావధచే భువనముల నన్నిటినీ భయపెడుతూ వుంది. వృష్టిదాయక పర్జన్యం అంటే నిరపరాధులు సైతం పారిపోతారు. ఎందుచేతననగా పర్జన్యం వురుముతూ దుష్టులను సంహరిస్తుంది."

"రథికుడు గుర్రాలను కొరడాతో తోలనట్లు పర్జన్యం తన వానదూతలను వృద్ధి పరుస్తూ వర్షాన్ని ప్రేరేపిస్తూ వుంది. పర్జన్యం ఆకాశాన్ని వర్షంతో నింపునపుడు దూరం నుండి సింహ గర్జనతో లేస్తుంది." -3

ప్రవాతా వాన్తి పతయన్తి విద్యుత ఉదోషధీర్జిహతే
పిన్వతే స్వః।
ఇరావిశ్వస్మై భువనాయజాయతే యత పర్జన్యః
పృథివీం రేతసావతి॥ -4

"గాలి వేగంగా వీస్తూవుంది. పిడుగులు పడుతున్నాయి. ఓషధులు మొలకెత్తు తున్నాయి. ఆకాశం నిండిపోతూవుంది. ప్రాణులందరికీ పృథ్వి శక్తివంతమవుతూ వుంది. పర్జన్యం పృథ్వికి తన కార్యంచే సహాయపడుతూవుంది." -4

"ఎవ్వని కర్మచేత పృథ్వి నమ్రమగుచున్నదో, ఎవ్వని కర్మచేత గిట్టలుగల పశువులు పోషింపబడుచున్నవో, ఎవ్వని వ్రతంచేత ఓషధులు నానా రూపంతో వున్నవో, ఆ పర్జన్యం మాకు మహా సుఖాన్ని ప్రసాదించుగాక." -5

"ఓ మరుత్తులారా, ద్యౌనుండి మాకు వృష్టినివ్వండి. వర్షమునిచ్చు అశ్వ (మేఘ) ధారలను వర్షించండి, ఓ పర్జన్యమా, గర్జనతో దగ్గరకు రమ్ము. మాకు తండ్రివైన నీవు మాకు వర్షమునిమ్ము." -6

"ఉరుము, గర్జించుము, గర్భం ధరించుము, జలంతో నున్న రథంతో తిరుగుము. (తోలు)సంచిని లాగి, కట్టు విప్పుము. వృష్టినే మిట్టపల్లాలు సమానమవుతాయి." -7

"మహాకోశమైన మేఘాన్ని పైనుంచి క్రిందకు తదుపుము. బంధనం నుండి విడుదలైన నదులు తూర్పుకు ప్రవహించాలి. నీటితో ఆకాశాన్ని, భూమిని తడిపి వేయుము. ఆవులకు అందమైన జలాశయాలుండుగాక." -8

ఋగ్వేదంలో అక్కడక్కడ సుందరమైన కావ్యముల వెలుగు కన్పడుతూ వుంది. దీన్నిబట్టి ఋగ్వేద ఆర్యులు కవిత్వాన్ని ప్రేమించేవారని తెలుస్తుంది. వారి మనస్సులను రంజింప చేయుటకు సుందరమైన కవితలు అల్లబడేవి. వాటిని పాడే విధానం సామగానం వలన తెలియగలదు. ఇంతకంటేకూడ మన జానపద గేయాలతో ముఖ్యంగా హిమాలయంలోని దాని వెనుకబడ్డజాతుల పల్లెపదాలతో పోల్చి అధ్యయనం చేస్తే మనం వాస్తవానికి చాల దగ్గరకు రాగలం. పల్లెపదముల వాక్య రచన శాశ్వతంగా వుండకపోయినప్పటికీ వాని లయ గాని, బాణీ గాని శతాబ్దాలవరకు సహస్రాబ్దాల వరకు నిల్చివుంటాయి. కాబట్టి మనదేశంలోని, ఎన్నో పాశ్చాత్య దేశాల్లోని ఆధునిక పల్లెపాటలను సామగానంతో పోల్చినట్లయితే సప్తసింధు ఆర్యులు గానం చేసిన పద్ధతిని తెలుసుకొనగల్గుతాం.

సమాప్తం

# రాహుల్ సాంకృత్యాయన్

ప్రముఖ హిందీ పండితుడు. మార్క్సిస్టు సింద్ధాంతం దృష్ట్యా, పాచ్య, పాశ్చాత్య తత్వ శాస్త్రాలను, శోధించి అసంఖ్యాకమైనరచనలు, వ్యాసాలు వ్రాశారు.

వారు రాసిన వోల్గా నుంచి గంగ వరకు, దివోదాసు, సింహసేనాపతి వంటి [illegible]లు ఆంధ్రులకు సుపరిచితాలు.

ఋగ్వేదం మనదేశంలో తామ్రయుగంలో రచించబడిన గ్రంథం. అంతకు [illegible]రప్పా, మొహంజదారో నాగరికత ఉండేది.

గణవ్యవస్థలో జీవించిన ఆర్యులను, ఏకతాబద్ధ సామంత వ్యవస్థలో నియంత్రించిన 'సుదాసు' కాలంలో ఈ 'రుక్కులు, రచించబడ్డాయి. ఆనాడు ఆర్యులు భారతదేశంలోనే కాక, వెలుపలకూడా ఉన్నారు.

వేదాలను, పారశీకుల అవేస్తాను పోల్చుకొని అధ్యయనం చేస్తే, ఈ [illegible]ములకూ [illegible] సంబంధం కనిపిస్తుంది.

[illegible] రుక్కుల ఆధారంగా నాటి రాజకీయ, సామాజిక, సాంస్కృతిక జీవనాన్ని పునర్నిర్మించటానికి చేసిన మహాప్రయత్నం ఈ గ్రంథం.

ఇక చదవండి.